# పీ ఠి క

"అంచితమైన నీకవిత నారసి యంకితమొంద భూపతుల్
వంచలఁ జేరుకొన్న, బహుభంగుల లేమి కలంచుచున్న ని
ర్వంచితబుద్ధితో "రఘువరా! కృతిఁగొమ్మ"ని భక్తితో సమ
ర్పించిన ధన్యు నిన్నెద స్మరించి తరించెదఁ బోతరాట్కవీ"

ఈ చతుర్థస్కంధము పూర్తిగఁ బోతరాజకృతమని గద్యము వలనఁ దెలియును. కాని యిందలి ధ్రువోపాఖ్యానము దక్కిన ఘట్టముల వలె నంత రసవంతముగ లేదు. కొలఁదిగ స్వారస్యములు, యతిప్రాసముల నియమచ్యుతి, శకటరేఫ రేఫమైత్రి, ధారాలోపము గానవచ్చుటచే నాగయాదులలో నెవరేని చ్యుతసంస్కారములు గావించిరేమొ యని తోఁచుచున్నది. కవితాధారయు, దక్షాధ్వరధ్వంసకథ, పృథుచక్రవర్తి చరిత్రము పురంజనోపాఖ్యానమువలె మనోజ్ఞముగ నడువ లేదు. విజ్ఞుల విషయమునఁ జర్చించిన సత్యము బయల్పడును.

స్వాయంభువమనుపుత్రీవంశవర్ణన సందర్భమునను, కర్దమప్రజాపతి సంతతివర్ణన సందర్భమునను దక్షాధ్వరకథయు ధ్రువోపాఖ్యానము, పృథుచరిత్రము పురంజనాదుల చరిత్రము లిందుఁ బ్రసక్తములైనవి. ఆయా సందర్భములలో ఈశ్వరస్తుతియు, శ్రీమన్నారాయణస్తుతియు, యాగాదికర్మములప్రసక్తియుఁ, బృథుచక్రవర్తికృత వైరాగ్యజ్ఞానోపదేశములు ప్రాచీనబర్హికి నారదర్షి జ్ఞానోపదేశము గావించుటయు మనోజ్ఞముగ నిందుఁ బొందుపఱుపఁబడినవి. పురంజనోపాఖ్యానము వేదాంత తత్త్వములనుపదేశించు విచిత్రాఖ్యాయిక మూలములోని స్వారస్యము, కవితాచమత్కృతి, మనోహరములగు భావములు యథావిధముగఁ దెలిఁగించుచుఁ బోతనభక్తియు నీశ్వరస్తుతియుఁ గథాంశమునఁగల వర్ణనాంశములు పెంచి తనకవితాపాటవమును బ్రకటించినాఁడు. వీరభద్రావతారకథయుఁ బృథుచరిత్రము పురంజనోపాఖ్యానము కావ్య గౌరవమునకు అర్హమగు ప్రశస్తకథాభాగములు.

భృగుమహర్షి శివభక్తుల దూషించుభాగము దక్షప్రజాపతి ఈశ్వరనింద గావించుటయుఁ గేవలము మూలానుసారములు. ఇవి పోతన స్వతంత్రించి గావించిన రచనములని సమకాలికులు తలంచి యుందురు. కావుననే భాగవతమున నీశ్వరనిందయొనర్చిన పాపముఁ బోఁగొట్టుకొనుటకు పోతరాజు వీరభద్రవిజయము రచించినట్లు తెలుపుటకు ఈ క్రింది పద్యము నందుఁ బొందుపఱిచి మతావేశము నెవరో వెల్లడించిరి.

"భాగవతప్రబంధ మతిభాసురతన్ రచియించి దక్షకృ
ద్యాగకథావిధానమున నల్పవచస్కుఁడనైతిఁ దన్నిమి
త్తాగమవక్రదోషపరిహారతకై యజనైకశైవశా
స్త్రాగమవీరభద్ర విజయంబు రచించెదఁ బ్రజ్ఞపెంపునన్."

నిజమువిచారించిన వీరభద్రవిజయము పోతరాజు బాల్యమున రచించిన కృతి. అందలి కృత్యాదియే యీ యంశము నిర్ణయించుచున్నది. ప్రమాణము లవసరములేదు.

వీరభద్రవిజయము రచించునాఁటికిఁ బోతరాజు మహాసౌశ్వర్యుఁడగు ఇవటూరి సోమనారాధ్యులవారి పాదపద్మారాధకుఁడు. ఆయనయే బోధించినట్లు వీరభద్రవిజయము రచింపుమనెను. ఈ సందర్భములను విరోధముగ బోతరాజు భాగవతము రచించుటలోఁ భావించిన యీశ్వరనిందాదోషపరిహారమునకు వీరభద్రవిజయము రచించినట్లు కల్పనముగాభావించి పైపద్యము సంధించేర్పుట శోచనీయము. మూలమున శివాగమింద యీ క్రిందివిధముగాఁ గలదు.

"అయంతు లోకపాలానాం యశోఘ్నో నిరపత్రపః
సద్భిరాచరితః పంథాయేన స్తబ్ధేన దూషితః
ఏష మే శిష్యతాం ప్రాప్తో యన్మే దుహితు రగ్రహీత్
పాణిం విప్రాగ్నిముఖత స్సావిత్ర్యా ఇవ సాధువత్
గృహీత్వా మృగశాబాక్ష్యాః పాణిం మర్కటలోచనః
ప్రత్యుత్థానాభివాదార్హే వాచా ప్యకృత నోచితం
లుప్తక్రియాయాశుచయే మానినే భిన్నచేతసే
అనిచ్ఛన్న ప్యదాం బాలాం శూద్రా యేవోశతీం గిరం
ప్రేతావాసేషు ఘోరేషు ప్రేతై ర్భూతగణై ర్వృతః
అట త్యున్మత్తవ న్నగ్నో వ్యుప్తకేశో నదన్ రుదన్
చితాభస్మకృతస్నానః ప్రేతస్ర జ్నస్థిభూషణః
శివాపదేశో హ్యశివో మత్తో మత్తజనప్రియః
పతిః ప్రమథభూతానాంతమోమాత్రాత్మకాత్మనాం
తస్మై దున్మదనాథాయ నష్టశౌచాయ దుర్హృదే
దత్తా బత మయా సాధ్వీ చోదనా త్పరమేష్ఠినః"

—చతుర్థస్కంధము అధ్యాయము ౨

ఈ శ్లోకముల భావమే మూలాతిక్రమణములేక యుండు42, 43, 44 పద్యములలోఁ చేర్కొనఁబడినది. ఇట్లే భృగుశాపసందర్భమునఁ గూడ నీక్రిందిశ్లోకములను బోతరాజు తెనిఁగించినాఁడు.

"భవవ్రతధరా యేచ యేచ తాన్ సమనువ్రతాః
పాషండిన స్తే భవేయు స్సచ్ఛాస్త్రపరిపంథినః
నష్టశౌచా మూఢధియో జటాభస్మాస్థిధారిణః
విశంతు శివదీక్షాయాం యత్రదైవం సురాసవం

బ్రహ్మచ బ్రాహ్మణాంశ్చైవ యద్యూయంపరినిందథ
సేతుం విదారణం పుంసామతః పాషండ మాశ్రితాః
ఏష ఏవహి లోకానాం శివః పంథా స్సనాతనః
యం పూర్వే చానుసంతస్థు ర్యత్ప్రమాణం జనార్దనః”

ఈ శ్లోకముల భావము 50, 51 వ పద్యములలోఁగలదు. దీనిచేఁబోతరాజు ఈశ్వరనిందఁ గావింపలేదనియు దూగదృష్టిలేనివారిదోషము పోతనయెడ నారోపించి “వక్తృదోషపాతకము” నాతనికంటఁ గట్టిరనియుఁ బ్రాజ్ఞులు గ్రహింపఁ గలరు. ప్రసక్తానుప్రసక్తిగ నందందు శివప్రాధాన్యము గలుపుభాగములు ప్రకృతిభాగమునందేగాక భాగవతమునందంతటఁ గలవు. కాన “భాగవతప్రబంధ” మనుపద్యము వీరభద్రవిజయమునుండి పరిహరింపఁ దగినది. కొన్ని వ్రాఁతప్రతులలో నీపద్యములేకుంటయు భాగవతమునకంటె వీరభద్రవిజయము ముందు రచింపఁబడియుంటయుఁ జూడ సర్వథా ఈపద్య మసరిగ్రాహ్యము.

పోతరాజు ఆంధ్రీకరణమునఁగూడ అందవేసిన చేయి. మూలములోని స్వారస్యము జానుతెనుఁగులో స్వతంత్రరచనమువలె నలవరించుటలో నీతఁ డద్వితీయప్రతిభాశాలి—చూడుఁడు.

శ్లో॥ అత స్తవోత్పన్న మిదం కళేబరం
న ధారయిష్యే శితికంఠగర్హిణః
జగ్ధస్య మోహా ద్ధి విశుద్ధ మంధసో
జుగుప్సిత స్యోద్గిరణం హి చక్షతే. ౧౮

మ. జనుఁ డజ్ఞానమునం ధరించిన జుగుప్సంబైన యన్నంబు న
య్యన వెళ్ళించి పవిత్రుఁడై నగతి దుష్టాత్ముండవై యీశ్వరుగ
ఘను నిందించిన నీతనూభవయనంగా నోర్వనీహేయభా
జనమైనట్టి శరీరము ఁ విడిచి భాస్వచ్ఛుద్ధి వాటించెదన్.

శ్లో॥ గోత్రం త్వదీయం భగవాన్ వృషధ్వజో
దాక్షాయణీత్యాహ యదా సుదుర్మనాః
వ్యపేతనర్మస్మిత మాశు తద్ధ్యహం
వ్యుత్స్రక్ష్య ఏతత్కుణపం త్వదంగజం. ౨౩

చ. వరవృష కేతనుండు భగవంతుఁడు నైన శివుండు నన్ను సా
దరపరిహాసవాక్యముల దక్షతనూభవయంచుఁ బిల్వ నేఁ
బురపురఁబొరలుచున్ ముదముఁబొందక నర్మవచస్మితంబులన్
దొరఁగుదు నీతనూజ ననుదుఃఖముకంటెను జచ్చు టొప్పగున్.

శ్లో॥ కర్ణౌ పిధాయ నిరయా ద్య దకల్ప ఈశే
ధర్మా వితర్య స్పృణిభి ర్నృభి రస్యమానే
ఛింద్యాత్ ప్రసహ్య రుశతీ మసతీం ప్రభు శ్చే
జ్జిహ్వా మసూ నపి తతో విసృజే త్స ధర్మః ౧౭

చ. నెలకొను ధర్మపాలన వినిర్మలభర్గుఁ దిరస్కరించు న
క్కలుషునిజిహ్వ గోయఁదగుఁ గాకటు సేయఁగ నోపఁడేనిఁ దాఁ
బొలియుట యొప్పు రెంటికిఁ బ్రభుత్వము సాలమిఁ గర్ణరంధ్రముల్
బలువుగ మూసికొంచుఁ జనఁబోడి యటందురు ధర్మవర్తనుల్.

శ్లో॥ కింవా శివాఖ్య మశివం న విదు స్త్వద న్యే
బ్రహ్మాదయ స్తమవకీర్య జటా శ్శ్మశానే
తన్మాల్యభస్మనృకపా ల్యవస త్పిశాచై
ర్యే మూర్ధభి ర్దధతి తచ్చరణావసృష్టమ్.

చ. పరఁగఁ జితాస్థిభస్మనృకపాల జటాధరుఁడుం బరేత భూ
చరుఁడు పిశాచయుక్తుఁడని శర్వ నమంగళుఁగాఁ దలంప రె
వ్వరు నొకఁడీవు దక్క మఱి వాక్పతిముఖ్యులు నమ్మహాత్ము న
చ్చరణ సరోజ రేణువులు సమ్మతిఁ దాల్తురు మస్తకంబులన్. 89

పోతనామాత్యుని యాంధ్రీకరణము మూలమునకుఁ జేరువన్నె యున్నయుక్తిస్వము లేక యెంత సరళముగ స్వతంత్రరచనమువలె నింపునింపుగనున్నదో తెలియుటకు నుదాహృత పద్యములు చాలును. మూలమునందలి కథాంశములకు ననుకూలముగ రచింపఁబడిన వర్ణనములలోఁ బోతనామాత్యుని స్వాతంత్ర్యభావములు గ్రహింపవచ్చును. యాగశాలా వర్ణనము (62 వ పద్యము) వీరభద్రవర్ణనము (107 వ పద్యము) శంకరుని ప్రళయస్వరూప వర్ణనము (116 వ పద్యము) కైలాసవర్ణనము (133 వ పద్యము) సరోవరవర్ణనము (689వ పద్యము) సంస్కృతవిభక్త్యంతపద్యములు (702, 703, 704 పద్యములు) ఈ స్కంధమున రసవత్తరములగు స్వతంత్రరచనములలోఁ గొన్ని: ఇందలి పురంజనోపాఖ్యానము అద్వితీయమగు తత్త్వకావ్యము. అనన్యసాధ్యమగు దీని యాంధ్రీకరణము పోతనకే తగినది. సరసకవితాధురీణుఁడును రమణీయ రచనా సంపన్నుఁడును నగు పోతనామాత్యుని కవిత్వము "రసికభావవిదులు" స్వయముగా గ్రహించి యానందింపఁ దగినదే గాని ప్రత్యేకించి తెలుపఁదగినది కాదు. ఈశ్వరప్రతిపాద్యమగు యజ్ఞయాగాది కర్మ నిరసనము, వేనుని నాస్తికత్వము, ధర్మస్థాపకులగు ఋషుల రాజ్యరక్షణ కౌశలము, పృథూపదిష్టమగు తత్త్వవివరణము మున్నగు నంశములతో నీ స్కంధము ఆస్తికులకుఁ బ్రత్యేకాదరణీయముగ నున్నది. ఇంతతో నీ స్కంధప్రశంస ముగించెదము.

రాబోవు సంపుటములలో నైదవస్కంధము బొప్పరాజు గంగన కృతము. ఆఱవ స్కంధము ఏర్చూరి సింగనకృతము. హరిభట్టు షష్ఠస్కంధముగూడఁ బ్రచురించుటయును బాఠాంతరములతో షష్ఠస్కంధమునకుఁ గ్రొత్తవన్నెలు గూర్చుటయును బ్రకాశకులు ప్రయత్నించుచున్నారు. వీరియత్నము సఫలమగుఁగాక.

పోతనామాత్యుని పటము ఊహాజన్యము. ఊర్ధ్వపుండ్రములతోఁ దులసీమాలికలతోఁ బరమవైష్ణవునిగఁ బోతనను జిత్రింపరాదని విమర్శకులు అధిక్షేపించిరి. సంపాదకులు ప్రత్యుత్తరమునొసంగిరి. ఐనను మాయభిప్రాయము నిటఁజెప్పుట ప్రకృతము గాకపోదు. పోతరాజు తండ్రి శైవశాస్త్రమతము గన్నవాఁడు. తల్లి లక్కాంబ. "సదాశివానుకంపానయవాగ్భవాని" అన్నతిప్పన ఈశ్వరసేవాధీనుఁడు. పోతనగంగాతీరమునఁ జేసినది మహేశ్వరధ్యానము. గ్రంథాంతస్కంధములలోఁ బరమేశ్వర భక్తుఁడనని చెప్పుకొన్నాఁడు. వీరభద్రవిజయము రచించిన బాల్యావస్థలో ఇవటూరి సోమనారాధ్యుల శిష్యుఁడు. దీనిచేఁ బరమశైవుఁడని విమర్శకుల వాదసారము.

పోతరాజు తండ్రి తల్లి అగ్రజుఁడు శైవమతాభిమానులు. బాల్యమునఁ బోతనయు శైవధర్మానుసారియె. తెలుగునాటి నియోగులలోఁ దఱుచుగ నామధారణము గలదు. పదునేను పదియాఱవ శతాబ్దములలో ఆంధ్రదేశమున వైష్ణవమతము విజృంభించినది. భోగినీదండకము కతన పోతరాజును గౌరవించిన సర్వజ్ఞసింగభూపాలుఁడు వైష్ణవసాంప్రదాయ సంపన్నుఁడు. శివకేశవుల యెడ సమానభక్తిప్రపత్తులుగల పోతరాజు భాగవత రచనారంభమునుండి వైష్ణవమతాభిమానిగ మాఱెననుటకుఁ గృత్యాది, షష్ఠ్యంతములు, ఆశ్వాసాంతములు తార్కాణగాఁగలవు. ఉద్భటారాధ్యచరిత్రము రచించిననాఁడు శైవుఁడనిపించుకొన్న తెనాలి రామలింగకవి పాండురంగమాహాత్మ్యము రచించునాఁటికిఁ బరమ వైష్ణవుఁడై రామకృష్ణుఁడైనాఁడు. ఇటుల పోతనయు వైష్ణవధర్మ మనుసరించి భాగవత రచనము నాఁటినుండి ఊర్ధ్వపుండ్రధారిగ మాఱి యుండనోపు ననుటలోఁ బ్రమాద ముండఁజాలదు. పోతనకవి పూర్వులలో వైష్ణవనామములు గలవారలు లేరని విమర్శకులనిరిగాని కేసన, మాచమ, అన్నయ్య, లక్కమాంబ, అనునవి వైష్ణవనామములె. కేశవశబ్దభవము కేసన, మహాలక్ష్మీశబ్దభవము మాచమ, లక్ష్మీశబ్దభవము లక్కమ. ఇంతకుఁ బోతరాజు శైవుఁడనని చెప్పుకొనలేదు. భాగవతము నందలి ప్రార్థనాదికములు వైష్ణవమతాభిమానియనుటకుఁ దగియున్నవి. గద్యములోని పరమేశ్వరపదము పరమపురుష వాచకము. "రాఘవేశ్వరచారిత్రము నెందఱెన్నిగతులన్ వర్ణించినన్ గ్రాలదే" అని కంకంటి పాపరాజు చెప్పినట్లు పోతనామాత్యుని దివ్యస్వరూపము ఊహాజన్యమైనపుడు పైసందర్భములంబట్టి వైష్ణవ మతానుసారముగఁ జిత్రించినను ప్రమాదమున వీలుపడదు. పాఠకులు పోతరాజునెడఁ గలభక్తిప్రపత్తుల ననుసరించియు నాతని రచనాసాంప్రదాయముల ననుసరించియు నేకభావోన్ముఖులైనచో నీ వివాదమున కిఁకఁదావుండదు.

చిత్రపటములతో, ఇంపైనముద్రణముతో, పవిత్రగ్రంథమగు నాంధ్రభాగవతమును స్వల్పక్రయమునకుఁ ఈ యుద్ధసమయమందు కాగితము కొఱవైన రోజులలో ఎక్కువవ్యయప్రయాసలకోర్చి ఈ సద్గ్రంథమును ద్వితీయముద్రణము పాఠకలోకమునకు నందించుచున్న శ్రీయుత దావులూరి కోటిసూర్యప్రకాశరావుగారి యత్నము ప్రశంసాపాత్రము.

భాషాసేవకులు

హనుమకొండ  **శేషాద్రి రమణకవులు**

శతావధానులు

# చతుర్థస్కంధ విషయసూచిక


| | పుట సంఖ్య |
|---|---|
| కర్దమప్రజాపతిసంతతిని దెలుపుట | 3 |
| దక్షప్రజాపతిసంతతిని దెలియఁజేయుట | 7 |
| ఈశ్వరునకును దక్షప్రజాపతికిని విరోధము సంభవించుట | 10 |
| దక్షప్రజాపతియజ్ఞమునకు దాక్షాయణి పోవుట | 15 |
| శివుండు వీరభద్రునిచే దక్షయజ్ఞంబు ధ్వంసంబు సేయించుట | 26 |
| దేవతలు వీరభద్రాదులచేఁ బరాజితులై బ్రహ్మతో విన్నవించుట | 30 |
| బ్రహ్మాదులు దక్షిణామూర్తిరూపుండగు శివుని స్తుతియించుట | 33 |
| శివుండు బ్రహ్మాదులచేఁ బ్రార్థితుండై దక్షాదుల ననుగ్రహించుట | 37 |
| దక్షాధ్వరంబునకు వచ్చిన నారాయణుని దక్షాదులు నుతించుట | 40 |
| ధ్రువోపాఖ్యానము | 50 |
| ధ్రువుండు నారదోపదేశంబువడసి తపంబు సేయుట | 53 |
| సాక్షాత్కరించిన భగవంతుని ధ్రువుండు స్తుతియించుట | 62 |
| ధ్రువుండు మరలఁ దనపురంబునకు వచ్చుట | 68 |
| ధ్రువుండు కుబేరానుచరులైన గుహ్యకులతో యుద్ధము సేయుట | 78 |
| అంగపుత్రుండగు వేనునిచరిత్రము | 89 |
| పృథుచక్రవర్తి గోరూపిణియగు భూమివలన నోషధులఁ బిదుకుట | 105 |
| పృథుచక్రవర్తియశ్వమేధంబున నింద్రుం డశ్వము నపహరించుట | 113 |
| నారాయణుండు పృథుచక్రవర్తి ననుగ్రహించుట | 118 |
| పృథుచక్రవర్తి సభాసదులకు సద్ధర్మములను పదేశించి బ్రాహ్మణప్రశంస సేయుట | 125 |
| పృథుచక్రవర్తి యొద్దకు సనకాదు లరుదెంచుట | 133 |
| పృథుచక్రవర్తి జ్ఞానవైరాగ్యవంతుండై ముక్తినొందుట | 142 |
| రుద్రుండు ప్రచేతసులకు యోగాదేశమను స్తోత్రముం దెల్పుట | 152 |
| నారదుండు ప్రాచీనబర్హికి జ్ఞానమార్గమును దెలియఁజేయుట | 162 |
| పురంజనోపాఖ్యానము | 163 |
| ప్రచేతసుల తపంబునకు భగవంతుండు మెచ్చి వరంబులిచ్చుట | 196 |

శ్రీరస్తు

శ్రీరామచన్ద్రాయ పరబ్రహ్మణే నమః

శ్రీమదాంధ్ర

# భాగవతము

## చతుర్థస్కంధము





విలసితధరణీతన
యావదనసరోజవాస ♦ రాధిప సితరా
జీవదళనయన నిఖిలధ
రాపరనుత సుగుణధామ ♦ రాఘవరామా. 1

వ. మహనీయ గుణగరిష్ఠు లగు నమ్మునిశ్రేష్ఠులకు నఖిల పురాణ
వ్యాఖ్యానవైఖరీసమేతుండైన సూతుం డిట్లనియె నట్లు ప్రాయోప
విష్టుండైన పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె. 2

సీ. జననాథ విను విదు♦రునకును మైత్రేయ
మునినాథచంద్రుఁ డి♦ట్లనియె మరల
స్వాయంభువున కర్థి ♦ శతరూపవలనను
గూఁతుల మువ్వు రా♦కూతి దేవ
హూతి ప్రసూతులు ♦ నొనరఁ బ్రియవ్రతో
త్తానపాదులు నను ♦ తనయయుగము
జనియింప నం దగ్ర♦సంభవ యైన యా
కూతిని సుమహిత♦భ్రాతృమతిని

తే. దనకు సంతానవిస్తారా♦ర్థంబుగాఁగఁ
బుత్రికాధర్మ మొంది యా♦స్వాయంభువుండు
బ్రకటమూర్తి రుచిప్రజా♦పతికి నిచ్చె
మనువు ముదమొంది శతరూప ♦ యనుమతింప. 3

వ. అట్లు వివాహంబైన రుచిప్రజాపతి బ్రహ్మవర్చస్వియుఁ, బరిపూర్ణ గుణుండును గావునఁ జిత్తైకాగ్రతం జేసి యాకూతియందు శ్రీవిష్ణుండు యజ్ఞరూపధరుండగు పురుషుండుగను జగదీశ్వరి యగు నాదిలక్ష్మి యమ్మహాత్మునకు నిత్యానపాయిని గావునఁ దదంశంబున దక్షిణ యను కన్యకారత్నంబుగను మిథునంబు సంభవించె. అందు స్వాయంభువుండు సంతుష్టాంతరంగుండగుచుఁ బుత్రికాపుత్రుండును విశద తేజోధనుండును శ్రీవిష్ణుమూర్తిరూపుండును నగు యజ్ఞునిఁ దన గృహంబునకుఁ దెచ్చి యునిచె. రుచియు దక్షిణ యను కన్యకాలలామంబును దనయొద్దన నిలిపె. అంత సకలమంత్రాధిదేవత యగు శ్రీ యజ్ఞుండు దనుఁ బతిఁగాఁ గోరెడు దక్షిణ యను కన్యకం బరిణయంబయ్యె. వార లాదిమిథునంబు గావున నది నిస్పృహంబు గాకుండ నని చెప్పి మైత్రేయుండు వెండియు నిట్లనియె. 4

క. ధీమహిత యంత వారల
యామాఖ్యులు గలుగు దేవ♦తావళి గడఁకన్
వేమఱు నభినందించుచు
నా మిథునమువలనఁ బుట్టె ♦ నతిబలయుతమై. 5

వ. వారు తోషుండును బ్రతోషుండును సంతోషుండును భద్రుండును శాంతియు నిడస్పతియు నిధ్మండును గవియు విభుండును వహ్నియు సుదేవుండును రోచనుండును నను పన్నిద్దఱు సంభవించిరి వారలు స్వాయంభువాంతరంబునం దుషితు లను దేవగణంబులై వెలసిరి. మఱియు మరీచిప్రముఖులైన మునీశ్వరులును, యజ్ఞుండును, దేవేంద్రుండును, మహాతేజస్సంపన్నులయిన ప్రియవ్రతోత్తానపాదులునుం గలిగి పుత్రపౌత్ర[1]నప్తృవంశంబులచే వ్యాప్తంబయి యా మన్వంత

1 నప్తృ = మునిమనుమఁడు.

రంబు పాలితంబగుచు వర్తిల్లె మనువు ద్వితీయపుత్రియైన దేవహూతిం గర్దమునకిచ్చి తద్వంశవిస్తారంబు గావించెనని మున్న యెఱింగించితి వెండియు నమ్మనువు మూఁడవ [1]చూలైన ప్రసూతి యను కన్యకను బ్రహ్మపుత్రుండగు దక్షప్రజాపతికి నిచ్చె. నా దక్షునకుఁ బ్రసూతివలన నుదయించిన ప్రజాపరంపరలచేత ముల్లోకంబులు విస్తృతంబులయ్యె. మఱియుఁ గర్దమపుత్రికా సముదయంబు బ్రహ్మర్షి భార్య లగుటం జేసి వారివలనం గలిగిన సంతాన పరంపరల వివరించెద. 6

—♦ కర్దమప్రజాపతిసంతతిని దెలుపుట ♦—

సీ. ఘనుఁడౌ మరీచికిఁ ♦ గర్దమాత్మజ యగు
కళ యను నంగన♦వలనఁ గశ్య
పుం డను కొడుకును ♦ బూర్ణిమ యను నాఁడు
బిడ్డయుఁ బుట్టిరి ♦ పేర్చి వారి
వలనఁ బుట్టిన ప్రజా♦వళి పరంపరలచే
భువనంబు లెల్ల నా♦పూర్ణ మగుచు
జరగెను బూర్ణిమ ♦ జన్మాంతరంబున
హరిపద [2]ప్రక్షాళి♦తాంబువులను
తే. గంగ యను పేరఁ బుట్టిన ♦ కన్య దేవ
కుల్య యనుదాని నొక్కతెఁ ♦ గూఁతు నఖిల
[3]విష్టపవ్యాపకుం డగు ♦ విరజుఁ డనెడి
తనయు నొక్కనిఁ గాంచె మో♦దంబుతోడ. 7
క. అనఘుం డత్రిమహాముని
యనసూయాదేవివలన ♦ నజహరి[4]పురసూ
దనులకళాంశంబుల నం
దనులను మువ్వురను గాంచెఁ ♦ దద్దయుఁ బ్రీతిన్. 8
క. అనవుడు విదురుఁడు మైత్రే
యునిఁ గనుగొని పలికె మునిజ♦నోత్తమ జగతిన్

---

1 చూలు = సంతానము. 2 ప్రక్షాళితాంబువులు = కడుగఁబడిన నీళ్లు. 3 విష్టపము = లోకము. 4 పురసూదనుఁడు = శివుఁడు.

జననస్థితిలయకారణు
లన వెలసిన పద్మగర్భ♦హరిహరు లెలమిన్. 9

క. ఏమినిమిత్తం బత్రిమ
హామునిమందిరమునందు ♦ ననసూయకు న
ద్దామగుణు లుదయ మైరన
నా మైత్రేయుండు వలికె ♦ నవ్విదురునితోన్. 10

సీ. సుచరిత్ర విను విధి♦చోదితుం డై యత్రి
దప మాచరింపఁ గాం♦తాసమేతుఁ
డయి ఋక్షనామకు♦లాద్రితటంబున
ఘుమఘుమారావసం♦కులవిలోల
[1]కల్లోలజాలసం♦కలితనిర్వింధ్యాన
దీజలపరిపుష్ట♦రాజిత ప్ర
సూన గుచ్ఛస్వచ్ఛ ♦ మానితాశోక [2]ప
లాశ కాంతారస్థ♦లమున కేలని

తే. నరిగి యచ్చట [3]నిర్ద్వంద్వుఁ♦డగుచుఁ బ్రాణ
నియమమున నేకపదమున ♦ నిలిచి గాలిఁ
దివుటఁ గ్రోలి కృశీభూత♦దేహుఁడగుచుఁ
దపముఁ గావించె దివ్యవ♦త్సరశతంబు. 11

వ. ఇట్లతి ఘోరం బైన తపంబు సేయుచుఁ దనచిత్తంబున. 12

క. ఏవిభుఁడు జగదధీశ్వరుఁ
డా విభు శరణంబు సొత్తు ♦ నతఁ డాత్మసమం
బై వెలసిన సంతతిని ద
యావరమతి నిచ్చుఁగాక ♦ యని తలఁచు నెడన్. 13

చ. మునుకొని యత్తపోధనుని ♦ మూర్ధజమైన [4]తపఃకృశానుచే
తను ద్రిజగంబులుం గరఁగి ♦ తప్తము లైనను జూచి పంకజా
సన మురశాసన త్రిపుర♦శాసను లచ్చటి కేఁగి రప్సరో
జనసురసిద్ధసాధ్యముని♦సన్నుతభూరియశోభిరాములై. 14

---

1 కల్లోలజాల = తరంగసమూహము, 2 పలాశ = మోదుగుచెట్లు.
3 నిర్ద్వంద్వుఁడు=సుఖదుఃఖములు లేనివాఁడు, 4 తపఃకృశానుఁడు=తపోగ్ని.

వ. అట్లు మునీంద్రు నాశ్రమంబు డాయం జను నవసరంబున. 15

చ. అనఘతపోభిరాముఁడగు ♦ నత్రిమునీంద్రుఁడు గాంచెఁ దప్తకాం
చనఘనచంద్రికారుచిర♦చారుశరీరుల హంస[1]నాగసూ
దనవృషభేంద్రవాహుల సు♦దారకమండలు చక్రశూలసా
ధనుల విరించి విష్ణు పుర♦దాహుల వాక్కమలాంబికేశులన్. 16

వ. మఱియు గృపావలోకసమందహాససుందరవదనారవిందంబులు గల మహాత్ముల సందర్శించి యమందానందకందళిత హృదయారవిందుం డై సాష్టాంగదండప్రణామంబు లాచరించి నిటలతటఘటిత [3]కర పుటుండై దుర్నిరీక్షంబైన తత్తేజోవిశేషంబు చేతఁ జూడం జాలక ముకుళితనేత్రుండై తత్ప్రదాయత్తచిత్తుండగుచు సర్వలోకగరిష్ఠంబు లైన మృదుమధురగంభీర భాషణంబుల నిట్లని స్తుతియించె. 17

సీ. ప్రతికల్పమందు స♦ర్వ ప్రపంచోద్భవ
స్థితి వినాశంబులఁ ♦ జేయునట్టి
మహితమాయాగుణ♦మయ దేహములఁ బొల్చు
నజ వాసుదేవ శి♦వాభిధాన
ములు గల్గు మీపాద♦జలజాతములకు నే
నతిభ[2]క్తి వందనం ♦ బాచరింతు
నఖిలచేతనమాన♦సాగమ్య మున నొప్పు
మూర్తులు గల్గు మీ ♦ మువ్వురందుఁ

తే. బరఁగ నాచేతఁ బిలువంగఁ♦బడినధీరుఁ
డెవ్వఁ డే నొక్కరినిఁ బిల్వ ♦ నిపుడు మీరు
మువ్వు రేతెంచుటకు నాదు♦బుద్ధి విస్మ
యంబు గదిరెడిఁ జెప్పరే ♦ యనఘులార. 18

వ. అదియునుంగాక సంతానార్థంబు నానావిధపూజలు గావించి నా చిత్తంబున ధరియించిన మహాత్ముం డొక్కరుండ యునిన నమ్మువ్వురు విబుధశ్రేష్ఠులు నతనిం గనుంగొని సుధామధురంబు లయిన వాక్యం బుల నిట్లనిరి. 19

---

1 నాగసూదన = గరుత్మంతుఁడు. 2 పురదాహుఁడు = శివుఁడు. 3 కర. పుటము = దోసిలి.

క. విను మేము ముగుర మయ్యును
ననుపమమతిఁ దలఁప నేక • మై యుందుము నీ
మనమందు నేమి గోరితి
వనయము నాకోర్కి సఫల • మయ్యెడుఁ జుమీ. 20

క. మా మువ్వుర యంశంబుల
ధీమంతులు సుతులు పుట్టి • త్రిభువనములలో
నీ మంగళగుణకీర్తిన్
శ్రీమహితము సేయఁగలరు • సిద్ధము సుమ్మా. 21

క. అని మునిచంద్రుఁడు దన మన
మునఁ గామించినవరంబు • బుధవరులు ముదం
బున నొసఁగి యతనిచేఁ బూ
జనములఁ బరితృప్తు లగుచుఁ • జనిరి యథేచ్ఛన్. 22

ఉ. ఆ సుచరిత్రదంపతు లు • దంచితలీలఁ గనుంగొనంగ స
బ్జాసనునంశమందు నమృ • తాంశుఁడు విష్ణుకళన్ సుయోగవి
ద్యా[1]సుభగుండు దత్తుఁడుఁ బు • రాంతకభూరికళాంశమందు దు
ర్వాసుఁడునై జనించి రన • వద్యపవిత్రచరిత్రు లిమ్ములన్. 23

క. అంగిరసుఁ డనెడు మునికిఁ గు
లాంగన యగు శ్రద్ధయందు • నంచితసౌంద
ర్యాంగులు గూఁతులు నలువురు
మంగళవతు లుదయ మైరి • మాన్యచరిత్రా. 24

క. వారు సినీవాలి యనఁగు
హూరాకానుమతు లనఁగ • నొప్పిరి మఱియుం
గోర సుతయుగము గలిగెను
స్వారోచిషమనువువేళ • శస్త్రఖ్యాతిన్. 25

వ. వార లెవ్వ రనిన భగవంతుండగు నుచథ్యుండును బ్రహ్మనిష్ఠుండగు బృహస్పతియు ననం బ్రసిద్ధి వహించిరి పులస్త్యుండు హవిర్భుక్కను నిజభార్యయందు నగస్త్యునిం బుట్టించె నా యగస్త్యుండు జన్మాంతరంబున జఠరాగ్నిరూపం బై ప్రవర్తించె వెండియు నాపులస్త్యుండు

1 సుభగుఁడు=మనోహరుఁడు,

విశ్రవసునిం గలిగించె నా విశ్రవసునకు నిలబిల యను భార్యవలనం గుబేరుండును గైకసియనుదానివలన రావణకుంభకర్ణ విభీషణులునుం బుట్టిరి. పులహునకు గతి యను భార్యవలనఁ గర్మశ్రేష్ఠుండును వరీయాంసుండును సహిష్ణుండును నను మువ్వురు గొడుకులు జనియించిరి. మఱియుఁ గ్రతువునకుఁ గ్రియ యను భార్యయందు బ్రహ్మతేజంబున జ్వలించుచున్న షష్టిసహస్రసంఖ్యలు గల వాలఖిల్యులను మహాత్ములు గలిగిరి. వసిష్ఠుం డూర్జ యను భార్యయందు చిత్రకేతుండును సురోచియు విరజుండును మిత్రుండును నుల్బణుండును వసుభృద్యానుండును ద్యుమంతుండును నను సప్తఋషులను [1]భార్యాంతరంబున శక్తిప్రముఖపుత్రులనుం బుట్టించె. నథర్వుం డనువానికిఁ జిత్తి యను భార్యయందు ధృతవ్రతుండు నశ్వశిరస్కుండు నయిన దధ్యంచుండు పుట్టె. మహాత్ముండగు భృగువు ఖ్యాతి యను పత్నియందు ధాతయు విధాతయు నను పుత్రద్వయంబును భగవత్పరాయణ యగు శ్రీ యను కన్యకం బుట్టించె. నా ధాతృవిధాతృలు మేరు ననువానికూఁతు లయిన యాయతి నియతులను భార్యలవలన మృకండు ప్రాణు లను కొడుకులం బుట్టించి రందు మృకండునకు మార్కండేయుండును బ్రాణునకు వేదశిరుండను మునియుం బుట్టిరి. భృగునకు నుశన యను కన్యయందుఁ గవి యనువాఁడు పుట్టె. నిట్లు కర్దమదుహిత లయిన కన్యకానవకంబువలనఁ గలిగిన సంతానపరంపరలచేత సమస్తలోకంబులుఁ బరిపూర్ణంబులయ్యె. నట్టి సద్యఃపాపహారంబును శ్రేష్ఠతమంబును నైన కర్దమదౌహిత్రసంతాన ప్రకారంబు శ్రద్ధాగరిష్ఠచిత్తుండ వగు నీకుం జెప్పితి. నింక దక్షప్రజాపతి వంశం బెఱింగింతు వినుము. 26

— దక్షప్రజాపతిసంతతిని దెలియఁజేయుట —

క. వనజజునివలన భవమం
దిన యా దక్షప్రజాపతికి మనునిజనం
దనయగు ప్రసూతిసతియం
దనఘా! పదియాఱ్వు రుదయ మందిరి కన్యల్. 27

---

1 భార్యాంతరము = వేఱొకభార్య.

వ. ఇట్లావిర్భవించిన కన్యకలందు శ్రద్ధయు మైత్రియు దయయు శాంతియుఁ దుష్టియుఁ బుష్టియుఁ గ్రియయు నున్నతియు బుద్ధియు మేధయుఁ దితిక్షయు హ్రీయు మూర్తియు నను నామంబులుగల పదుమువ్వురను ధర్మరాజున కిచ్చెఁ. నొక్క కన్యక నగ్నిదేవునకును నొక్కతెం బితృదేవతలకును నొక్కతె జన్మమరణాది[1]నివర్తకుం డగు నభవునకుం బెండ్లి సేసె. నంత నా ధర్ముని పత్నులయందు శ్రద్ధవలన శ్రుతంబును మైత్రివలనఁ బ్రసాదంబును దయవలన నభయంబును శాంతివలన సుఖంబును దుష్టివలన ముదంబును బుష్టివలన స్మయంబును గ్రియవలన యోగంబును నున్నతివలన దర్పంబును బుద్ధివలన నర్థంబును మేధవలన స్మృతియుఁ దితిక్షవలన క్షేమంబును హ్రీవలనఁ [2]బ్రశ్రయంబును మూర్తివలన సకలకల్యాణగుణోత్పత్తిస్థానభూతులగు నరనారాయణు లను ఋషు లిద్దఱును సంభవించిరి. వారల జన్మకాలంబున. 28

సీ. గంధవాహుండు మంద♦గతి ననుకూలుఁడై
వీచె నద్దిక్కులు ♦ విశదమయ్యె
నఖిలలోకంబులు ♦ నానందమును బొందెఁ
దుములమై దేవదుం♦దుభులు మ్రోసెఁ
గరమొప్ప జలధుల ♦ కలఁక లడంగెను
మించినగతిఁ బ్రవ♦హించె నదులు
గంధర్వకిన్నర ♦ గానముల్ వీతెంచె
నప్సరోజనములా[3]♦స్యములు సెలఁగె
తే. సురలు గురియించి రందంద ♦ విరులవాన
మునిజనంబులు సంతోష♦మునఁ జెలంగి
వినుతులొనరించి రవ్వేళ ♦ విశ్వమెల్లఁ
బరమమంగళమై యొప్పె ♦ భవ్యచరిత. 29

వ. ఆ సమయంబున బ్రహ్మాదిదేవత లమ్మహాత్ములకడకుఁ జనుదెంచి యిట్లని స్తుతియించిరి. 30

---

1 నివర్తకుఁడు = మాన్పువాఁడు, 2 ప్రశ్రయము = అనునయము, 3 లాస్యము = నాట్యము.

సీ. గగనస్థలిం దోచు ♦ [1] గంధర్వనగరాది
రూపభేదములట్లు ♦ రూఢి మెఱసి
యే యాత్మయెందేని ♦ నేపారు మాయచే
నీ విశ్వ మిటు రచి♦యింపఁబడియె
నట్టి యాత్మపరికా♦ర్థమై మునిరూప
ముల ధర్మగృహమునఁ ♦ బుట్టినట్టి
పరమపురుష నీకుఁ ♦ ♦ బ్రణమిల్లెద మదియుఁ
గాక యీ సృష్టి దు♦ష్కర్మవృత్తి
తే. జరగనీకుండుకొఱకునై ♦ సత్త్వగుణము
చే సృజించిన మ మ్మిట్లు ♦ శ్రీనివాస
మైన సరసీరుహప్రభ ♦ నవహసించు
నీ కృపాలోకనంబుల ♦ నెమ్మిఁ జూడు. 31
క. అని యిట్లు దేవగణములు
వినుతింపఁ గృపాకటాక్ష ♦ వీక్షణములఁ జేఁ
గని వారు గంధమాదన
మున కేఁగిరి తండ్రి ముదము ♦ ముప్పిరిగొనఁగన్ 32
క. ధరణీభర ముడుపుట కా
నరనారాయణులు భువి జ♦నన మనయము నొం
దరె యర్జున కృష్ణాఖ్యలఁ
గురుయదువంశముల సత్త్వ♦గుణయుతు లగుచున్. 33
వ. మఱియు నగ్నిదేవునకు దక్షపుత్రియైన స్వాహాదేవి యను భార్య యందు హుతభోజను లగు పావకుండును బవమానుండును శుచియు నను ముగ్గురు గొడుకులు గలిగిరి. వారివలనం బంచచత్వారింశత్సంఖ్యలం గల యగ్నులు ఉత్పన్నంబులయ్యె. నిట్లు పితృపితామహ యుక్తంబుగా నేకోనపంచాశత్సంఖ్యలుగల యగ్నులు బ్రహ్మవాదులచే యజ్ఞకర్మంబులం దగ్నిదేవతాకంబులైన యిష్టులు దత్తన్నామంబులచేతఁ జేయంబడుచుండు. నా యగ్ను లెవ్వరనిన నగ్ని

1 గంధర్వనగరము = మేఘముల యాకృతులు.

ష్వాత్తులు బర్హిషదులు సౌమ్యులు పితలు నాజ్యపులు సాగ్నులు నిరగ్నులు నన నేడుదెఱంగులై యుండురు. దాక్షాయణి యగు స్వధ యను ధర్మపత్నియందు వారలవలన వయునయు ధారిణియు నను నిద్దఱుకన్య లుదయించి జ్ఞానవిజ్ఞానపారగ లగుచు బ్రహ్మవాదినులయి పరఁగిరి; వెండియు. 34

—♦ ఈశ్వరునకు దక్ష ప్రజాపతికిని విరోధము సంభవించుట ♦—

సీ. దక్షప్రజాపతి♦తనయ యా భవుని భా
ర్య యనఁగాఁ దగు సతి ♦ యను లతాంగి
సతతంబుఁ బతిభక్తి ♦ సలుపుచుండియుఁ దనూ
జాత లాభము నందఁ ♦ జాలదయ్యె
భర్గుని దెసఁ జాలఁ ♦ బ్రతికూలుఁడగు నట్టి
తమతండ్రి మీఁది రో♦షమునఁ జేసి
వల నేది తా ముగ్ధ♦వలె నిజయోగ మా
ర్గంబున నాత్మ దే♦హంబు విడిచె

తే. నని మునీంద్రుఁడు వినిపింప ♦ నమ్మహాత్ముఁ
డైన విదురుండు మనమున ♦ నద్భుతంబు
గదురఁ దక్షకథ విన నేడ్క ♦ గడలుకొనఁగ
మునివరేణ్యునిఁ జూచి యి♦ట్లనియె మఱియు. 35

సీ. చతురాత్మ! [1]దుహితృవ♦త్సలుఁడైన దక్షుండు
దనకూఁతు సతి ననా♦దరముచేసి
యనయంబు నఖిలచ♦రాచరగురుఁడు ని
ర్వైరుండు శాంతవి♦గ్రహుఁడు ఘనుఁడు
జగముల కెల్లను ♦ జర్చింప దేవుండు
నంచితాత్మారాముఁ ♦ డలఘుమూర్తి
శీలవంతులలోన ♦ శ్రేష్ఠుండు నగునట్టి
భవునందు విద్వేష♦పడుట కేమి

1 దుహితృ వత్సలుడు = బిడ్డపై ప్రేమగలవాఁడు.

తే. కారణము సతి దా నేమి♦కారణమున
విడువరానట్టి ప్రాణముల్ ♦ విడిచె మఱియు
[1]శ్వశుర జామాతృవిద్వేష ♦ సరణి నాకుఁ
దెలియ నానతి యిమ్ము సు♦ధీవిధేయ. 36

క. అని యడిగిన నవ్విదురునిఁ
గనుఁగొని మైత్రేయుఁ డనియెఁ ♦ గౌతుక మొప్పన్
విను మనఘ తొల్లి బ్రహ్మలు
జనసుతముగఁ జేయునట్టి ♦ [2]సత్రముఁ జూడన్. 37

చ. సరసిజగర్భయోగిజన♦సర్వసుపర్వ మునీంద్ర [3]హవ్యభు
క్సురనుఋషిప్రజాపతులు ♦ భక్తిమెయిం జనుదెంచి యుండ న
త్తరణిసమాన తేజుఁడగు ♦ దక్షుఁడు వచ్చినఁ ద[4]త్సదస్యు లా
దరమున లేచి రప్పుడు పి♦తామహభర్గులు దక్క నందఱున్. 38

క. చనుదెంచిన యా దక్షుఁడు,వనజజునకు మ్రొక్కి భక్తి♦వశులై సభ్యుల్
దనకిచ్చిన పూజలు గైకొని యుచ్చాసనమునందుఁ♦గూర్చుండె తగన్.

తే. తన్నుఁ బొడగని సభ్యు లం♦దఱును లేవ
నాసనము దిగనట్టి పు♦రారివలను
గన్నుఁగవలను [5]విస్ఫులిం♦గములు సెదరఁ
జూచి యిట్లను రోషవి♦స్ఫురణ మెఱయ. 40

తే. వినుఁడు మీరలు రోద మాని ♦ విబుధముని హు
తాశనాది సురోత్తము♦లార మోహ
మత్సరోక్తులు గావు నా♦మాట లనుచు
వారి కందఱ కా పుర♦వైరిఁ జూపి. 41

సీ. పరికింప నితఁడు ది♦క్పాలయశోహాని
కరుఁ డీ క్రియాశూన్యు♦పరునిచేతఁ

---

1 శ్వశుర జామాతృ = మామ అల్లుఁడు 2 సత్రము = యజ్ఞము 3 హవ్యభుక్ = అగ్ని 4 సదస్యులు = సభ్యులు 5 విస్ఫులింగములు = అగ్నికణములు.

గర వొప్ప సజ్జనా♦చరితమార్గము దూఁపి
తం బయ్యె నన్న[1] గ♦తత్రపుండు
మహితసావిత్రీస♦మాననను సాధ్వి న
న్మత్తనూజను [2]మృగ♦శాబనేత్రి
సకలభూమీసుర♦జనసమక్షమున మ
ర్కటలోచనుఁడు గర♦గ్రహణ మిట్లు
తే. జేసి తా శిష్యభావంబుఁ ♦ జెందు టాత్మఁ
దలఁచి [3]ప్రత్యుద్గమాభివం♦దనము లేమి
నడపకుండిన మానినీ ♦ నన్నుఁ గన్న
నోరిమాటకుఁ దన కేమి ♦ గోరనాయె. 42

సీ. అనయంబు లుప్తక్రి♦యాకలాపుఁడు. మాన
హీనుఁడు మర్యాద ♦ లేనివాఁడు
మత్తప్రచారుఁ డు♦న్మత్త ప్రియుఁడు దిగం
బరుఁడు భూతప్రేత♦పరివృతుండు
తామస ప్రమథభూ♦తములకు నాథుండు
భూతిలిప్తుం [4]డస్థి ♦ భూషణుండు
నష్టశౌచుండు ను♦న్మదనాథుఁడును దుష్ట
హృదయుఁ డుగ్రుఁడును [5]బ♦రేతభూని
తే. కేతనుఁడు వితతస్రస్త♦కేశుఁ డశుచి
యయిన యితనికి శివనాముఁ ♦ డను ప్రవాద
మెటులు గలిగె నశివుఁడగు ♦ నితని నెఱిఁగి
యెఱిఁగి వేదంబు శూద్రున ♦ కిచ్చినటులు. 43

వ. ఇతనికి నన్మత్తనూజను విధిప్రేరితుండనై యిచ్చితి. 44

క. అని యిట్టులు ప్రతికూలవ
చనములు దక్షుండు వలికి ♦ శపియింతును శ

1 గతత్రపుఁడు = సిగ్గులేనివాఁడు 2 మృగశాబనేత్రి = లేడిపిల్ల కనులవంటి కనులు గలది 3 ప్రత్యుద్గమ = ఎదుర్కొనుట 4 అస్థి = ఎముకలు 5 పరేతభూనికేతనుఁడు = శ్మశానము గృహముగాఁ గల శివుఁడు

ర్వాని సని జలములు గొని కర
మున నిలిపి యిటు లనె రోష•మున నఘాత్ముం. 45

క. ఇతఁ డింద్రోపేంద్రపరీ
వృతుఁడై మఖసమయమున హ•విర్భాగము దే
వతలం గూడఁగ మహితని
యతిఁ బొందక యుండుఁగాక • యని శపియించెన్. 46

వ. ఇట్లు దక్షుండు వల్కిన గర్హిత వాక్యంబులు వినిందితంబు లగుంగాని యాథార్థ్యంబున వాస్తవంబు లగుచు భగవంతుండగు రుద్రునందు నిందితంబులుగాక స్తుతిరూపంబున నొప్పెఁ దదనంతరంబ రుద్రునకు శాపంబిచ్చిన కారణంబున దక్షుండు సదస్యముఖ్యులచే నకృత్యంబని నిషేధింపంబడి ప్రవృద్ధంబయిన క్రోధంబుతోడ నిజనివాసంబునకుం జనియె. నంత గిరిశానుచరాగ్రేసరుండగు నందికేశ్వరుండు దక్షుండు నిటలాక్షుని శపియించిన శాపంబు నతని పల్కిన యనర్హవాక్యంబులును విని కోపారుణితలోచనుండై యిట్లను నీ దక్షుండు మర్త్యశరీరంబు శ్రేష్ఠంబుగాఁ దలఁచి యప్రతిద్రోహియైన భగవంతునందు భేదదర్శియై యపరాధంబుఁ గావించె నిట్టి మూఢాత్ముండు దత్త్వవిముఖుండగు మఱియుం గూటధర్మంబు లయిన నివాసంబుల గ్రామ్యసుఖకాంక్షలం జేసి సక్తుండై యర్థవాదంబు లయిన వేదంబులచేత నష్టమనీషం గలిగి కర్మతంత్రంబు విస్తృతంబు సేయు; వెండియు దేహాదికంబు [1]లుపాదేయంబులుగాఁ దలఁచుచు బుద్ధిచేత నాత్మతత్త్వంబు మఱచి వర్తించుచుఁ బశుప్రాయుండై స్త్రీకాముండు నగు;నిదియునుంగాక దక్షుం డచిరకాలంబున మేషముఖుం డగు నని; మఱియు, 47

మ. అనయంబుం దన మానసంబున నవి•ద్యన్ ముఖ్యతత్త్వంబుగాఁ
గని గౌరీశుఁ దిరస్కరించిన యస•త్కర్మాత్ము నీదక్షు ని
న్ననువర్తించిన వాఁడు సంసరణక•ర్మారంభుఁడై నిచ్చలున్
జననం బందుచుఁ జచ్చుచున్ మరల నో•జం బుట్టుచున్ వర్తిలున్. 48

1 ఉపాదేయము - గ్రహింపదగినది.

వ. అదియునుంగాక యీ హరద్వేషులైన ద్విజులు [1]అర్థవాదబహుళంబులైన వేదవాక్యంబులవలన మధుగంధసమంబైన చిత్తక్షోభంబుచేత విమోహితమనస్కులయి కర్మాసక్తు లగుదురు. మఱియును భక్ష్యాభక్ష్య విచారశూన్యులై దేహాదిపోషణంబుకొఱకు ధరియింపంబడిన విద్యాతపోవ్రతంబులు గలవారలై ధన దేహేంద్రియంబులయందుఁ బ్రీతిం బొంది యాచకులై విహరింతురని నందికేశ్వరుండు బ్రాహ్మణ జనంబుల శపియించిన వచనంబులు విని భృగుమహాముని మరల శపియింపం బూని యిట్లనియె. 49

తే. వసుధ నెవ్వారు ధూర్జటి • వ్రతులు వారు
వారి కనుకూలు రగుదు • రెవ్వారు వారు
నట్టి సచ్ఛాస్త్ర[2] పరిపంథు • లైనవారు
నవనిఁ బాషండు లయ్యెద • రని శపించె. 50

సీ. సకలవర్ణాశ్రమా • చారహేతువు లోక
మునకు మంగళమార్గ • మును సనాత
నముఁ బూర్వము ఋషిసమ్మ • తము జనార్దనమూల
మును నిత్యమును శుద్ధ • మును శివంబు
నార్యపథానుగం • బగు వేదమును విప్ర
గణము నిందించిన • కారణమున
నే శివదీక్షయం • దేని మధ్యమపూజ్యుఁ
డై భూతపతి దైవ • మగుచు నుండు

తే. నందు మీరలు భస్మ జ • టాస్థిధార
ణములఁ దగి మూఢబుద్ధులు • నష్టశౌచు
లై నశింతురు పాషండు • లగుచు ననుచు
శాప మొనరించె నా ద్విజ • సత్తముండు. 51

వ ఇట్లన్యోన్యంబును శాపంబులం బొందియు భగవదనుగ్రహంబు గల

---

(1) అర్థవాదబహుళములు = ఎక్కువగా స్తుతినిందలను జేయునవి,
(2) పరిపంథి = విరోధి,

వారలగుటం జేసి నాశంబు నొందరైరట్టియెడ విమనస్కుం డగుచు ననుచర సమేతుండై భవుండు సనియె నంత. 52

సీ. అనఘాత్మ యే యజ్ఞ♦మందు సర్వశ్రేష్ఠుఁ
డగు హరి సంపూజ్యుఁ♦డై వెలుంగు
నట్టియజ్ఞంబు స♦మ్యగ్విధానమున స
హస్రవత్సరములు ♦ నజుఁ డొనర్చెఁ
గర ముప్ప నమరగం♦గాయమునాసంగ
మావనిఁ గలుగు ప్ర♦యాగయందు
నవభృథస్నానంబు ♦ లతిభక్తిఁ గావించి
గతకల్మషాత్ములై ♦ ఘనత కెక్కి
తే. తగ నిజాశ్రమభూములఁ ♦ దలఁచి వార
లందఱును వేడ్కతోఁ జని ♦ రనుచు విదురు
నకును మైత్రేయుఁ డను ముని♦నాయకుండు
నెఱుఁగ వినిపించి వెండియు ♦ నిట్టు లనియె. 53

—♦ దక్షప్రజాపతి యజ్ఞమునకు దాక్షాయణి పోఁ గోరుట ♦—

వ. అంత శ్వశురుం డగు దక్షునకు జామాత యైనభర్గునకు నన్యోన్య విరోధంబు వెరుఁగుచుండ నతిచిరంబగు కాలంబరిగె నంత దక్షుండు రుద్రవిహీనం బగు యాగంబు లేనిది యైనను శర్వుతోడి పూర్వ విరోధంబునను బరమేష్ఠికృతంబైన సకల ప్రజాపతివిభుత్వగర్వంబు ననుం జేసి బ్రహ్మనిష్ఠులగు నీశ్వరాదుల ధిక్కరించి యరుద్రకంబుగా వాజపేయ[1]సవనంబు గావించి తదనంతరంబ బృహస్పతిసవననామకం బైన మఖంబు సేయ నుపక్రమించిన నచ్చటికిం గ్రమంబున. 54

చ. కర మనురక్తి నమ్మఖముఁ ♦ గన్గొను వేడుక తొంగలింపఁగాఁ
బరమమునిప్రజాపతి[2]సు♦పర్వమహర్షి వరుల్ సభార్యులై
పరువడి వచ్చి యందఱు శు♦భస్థితి దీవన లిచ్చి దక్షుచేఁ
బొరిఁబొరి నచ్చటన్ విహిత♦పూజల నొందిరి సమ్మదంబునన్. 55

(1) సవనము = యజ్ఞము. (2) సుపర్వులు = దేవతలు.

తే. దక్షతనయ సతీదేవి ♦ దవిలి యాత్మ
సదనమున నుండి జనకుని♦సవనమహిమ
గగనచరులు నుతింప నా♦కలకలంబు
విని కుతూహలిని యయి వి♦స్మితిఁ జూడ. 56

వ. అయ్యవసరంబునఁ దదుత్సవదర్శన కుతూహలు లై సర్వ దిక్కుల
వారును జనుచుండి రా సమయంబున. 57

సీ. తనరారు నవరత్న ♦ [1]తాటంకరోచులు
చెక్కుటద్దములతోఁ ♦ జెలిమి సేయ
మహనీయతపనీయ ♦ మయపదకద్యుతు
లంసభాగంబుల ♦ నావరింప
నంచితచీనిచీ♦నాంబరప్రభలతో
[2]మేఖలాకాంతులు ♦ మేలమాడఁ
జంచలసారంగ♦చారువిలోచన
ప్రభలు సద్దిక్కులఁ ♦ బ్రబ్బికొనఁగ

తే. మించువేడుక భర్తృస♦మేత లగుచు
మానితంబుగ దివ్యవి♦మానయాన
లగుచు నాకాశపథమున ♦ నరుగుచున్న
ఖచరగంధర్వకిన్నరాం♦గనలఁ జూచి 58

క. సతి దనపతి యగు నా పశు
పతిఁ జూచి సముత్సుకతను ♦ భాషించి ప్రజా
పతి మీ మామ మఖము సు
వ్రతమతి నొనరించుచున్న♦వాఁడఁట వింటే. 59

క. కావున నయ్యజ్ఞమునకు
నీ విబుధగణంబు లర్థి ♦ నేఁగెద రిదిగో
దేవ! మన మిప్పు డచటికిఁ
బోవలె నను వేడ్క నాకుఁ ♦ బుట్టెడు నభవా! 60

(1) తాటంకములు = కర్ణభూషణములు. (2) మేఖల = ఒడ్డాణము.

క. ఆ యజ్ఞముఁ గనుఁగొనఁగా
నాయనుజలు భక్తిఁ బ్రాణ♦నాథులతోడం
బాయక వత్తురు మనమున
బోయిన నే వారి నచటఁ ♦ బొడగనఁగల్గున్. 61

క. జనకుని మఖమున కర్థిం
జని నీతోఁ బారిబర్హ♦సంజ్ఞకతఁ గడుం
దనరిన భూషణముల గై
కొన వేడ్కఁ జనించె నీశ♦కుజనవినాశా. 62

క. నా తోడను స్నేహముగల
మాతను దత్సోదరీ స♦మాజము ఋషిసం
ఘాతకృతమఖసమంచిత
కేతువుఁ గన వేడ్కఁ [1]గగన♦కేశ జనించెన్. 63

వ. అదియునుం గాక దేవా మహాశ్చర్యకరంబై గుణత్రయాత్మకం బగు ప్రపంచంబు భవదీయ మాయా వినిర్మితంబగుటం జేసి నీకు నాశ్చర్యకరంబుగా దైసను భవదీయతత్త్వం బెఱుంగంజాలక కామినీ స్వభావంబు గలిగి [2]కృపణురాలనై మదీయజన్మభూమిఁ గనుంగొన నిచ్ఛగించితి నని వెండియు నిట్లనియె. 64

చ. ముదమునఁ దన్మఖోద్భవవి♦భూతిఁ గనుంగొన నన్యకామినుల్
పదువులు గట్టి భూషణవి♦భాసితలై నిజనాథయుక్తలై
మదకలహంసపాండురస♦మంచితదివ్యవిమానయానలై
యదె చనుచున్నవారు గను ♦ మభ్రపథంబున నీలకంధరా. 65

క. అనఘా విను లోకంబుల, జనకుని గేహమునఁ గలుగు♦సకలసుఖంబుల్
తనయలు సని సంప్రీతిం, గనుఁగొన కేరీతి నిలుచుఁ♦గాయము లభవా!

క. అనయముఁ బిలువక యుండం, జననను చితమంటి వేని♦ జనకగురుసుహృ
జ్జననాయక గేహములకుఁ, జనుచుందురు పిలువకున్న ♦ సజ్జను లభవా.

వ. అని మఱియు నిట్లనియె. దేవా నా యందుఁ బ్రసన్నుండవై మదీయమనోరథంబుఁ దీర్చ నర్హుండవు సమధికజ్ఞానంబుగల నీచేత

---

1 గగనకేశ = శివా!   2 కృపణురాలు = లోభముగలది.

నేనుభవదీయదేహంబునం దర్ధంబున ధరియింపంబడితి. నట్లగుటను నను గ్రహింపవలయు నని ప్రార్థించిన మందస్మితవదనారవిందుండగుచు జగత్స్రష్టల సమక్షంబున దక్షుండు తన్నాడిన మర్మభేదంబులైన [1]కుహావాక్యసాయకంబులం దలంచుచు నిట్లనియె. 68

సీ. కళ్యాణి నీమాట ♦ గడు నొప్పు బంధువుల్
పిలువకుండినను సం♦ప్రీతిఁ జనుదు
రంటి విదియు నెన్న ♦ నైనను దేహాభి
మానమదమున [2]నస♦హ్యమునను
గడఁగి యారోపిత♦ఘనరోషదృష్టులు
గారేని బోదగుఁ♦ గాని వినుము
వినుతవిద్యాతపో♦విత్తవయోరూప
కులములు సుజనుల♦కును గుణంబు
తే. లివియ కుజనులయెడ దోష♦హేతుకంబు
లై వివేకంబు సెఱుచు మ♦హాత్ములైన
వారిమాహాత్మ్య మాత్మగ♦ర్వమునఁ జేసి
జడులు పొడగానఁజాలరు ♦ జలజనేత్రి. 69
క. విను మట్టి కుటిలు లగు దు,ర్జనులగృహంబులకు బంధు♦సరణినిఁబోవం జనదు వినీతుల కది గడు,ననుచితమైనట్ల యుండు♦నది యెట్లనినన్. 70
ఆ. కుటిలబుద్ధు లయిన♦కుజనుల యిండ్లకు
నార్యు లేఁగ వా ర♦నాదరమున
బొమలు ముడివడంగ ♦ భూరిరోషాత్ములై
చూతు రదియుఁగాక ♦ సుదతి వినుము. 71
చ. సమదరిపుప్రయుక్తపటు♦సాయకజర్జరితాంగుఁడయ్యుఁ దుః
ఖమును దొఱంగి నిద్రఁ గనుఁ♦గాని కృశింపఁడు మానవుండు నో
యుమ విను మిష్టబాంధవదు♦రుక్తులు మర్మము లంటనాఁట జి
త్తమున నహర్నిశంబుఁ బరి♦తాపము నొంది కృశించు నెప్పుడున్. 72

1 కుహాకవాక్యసాయకములన్ = కపటవాక్యము లను బాణములను,
2 అమర్షము = క్రోధము.

క. విను లోకోత్కృష్టుఁడు దక్షునికిఁ దనూభవలలోనఁ • గూరిమిసుతవై
నను నా సంబంధంబున, జనకునిచేఁ బూజవడయఁ • జాలవు తరుణీ. 73

వ. అది యె ట్లతనిచేత భవత్సంబంధంబునం జేసి పూజఁ బడయమికి నతనికి నీకు విరోధంబునకు హేతు వెట్టి దని యంటివేని. 74

మ. నిరహంకారనిరస్తపాపసుజనా • నింద్యోల్లసత్కీర్తిఁ గొం
దఱు కామించి యశక్తులై మనములన్ • [1]దందహ్యమానేంద్రియా
తురులై యూరక మచ్చరింతురు మహా • త్ముం డీశ్వరుండైన యా
హరితో బద్ధవిరోధముం దొడరు దైత్యశ్రేణి చందంబునన్. 75

వ. అదియునుం గాక నీ వతనికిం బ్రత్యుత్థానాభివందనంబులు గావింప కుండుటం జేసి యతండు తిరస్కృతుం డయ్యె నంటివేని లోకంబున జను లన్యోన్యంబును బ్రత్యుత్థానాభివందనంబులు గావింతు రదియు ప్రాజ్ఞు లయినవారు సర్వభూతాంతర్యామి యైన పరమపురుషుండు నిత్యపరిపూర్ణుండు గావునఁ [2]గాయికవ్యాపారం బయుక్తంబని తదుద్దేశంబుగా మనంబునంద నమస్కారాదికంబులు గావింతురు గాని దేహాభిమానంబులు గలుగు పురుషులందుఁ గావింపరు గాన నేనును వాసుదేవశబ్దవాచ్యుండు శుద్ధసత్త్వమయుండు నంతఃకరణంబునందు నావరణవిరహితుండు నయి ప్రకాశించు వాసుదేవునకు నాహృదయంబున నెల్లప్పుడు నమస్కరించుచుండుదు నిట్లనపరాధినైన నన్నుఁ బూర్వంబున బ్రహ్మలు సేయు సత్త్రంబునందు దురుక్తులం జేసి పరాభవించి మద్ద్వేషియైన దక్షుండు భవజ్జనకుండైన నతఁడును దదనువర్తులయిన వారలును జూడఁదగరు కావున మద్వచనాతిక్రమంబునం జేసి యరిగితివేని నచట నీకుఁ బరాభవంబు సంప్రాప్తంబగు; లోకంబున బంధుజనంబువలనఁ బూజ వడయక తిరస్కారంబు వొందుట చచ్చుటయు కాదే? యని పలికి మఱియు సభవుండు పొమ్మని యనుజ్ఞ యిచ్చిన నచ్చట నవమానంబునం జేసి యశుభంబగు ననియు నిచ్చటఁ బొమ్మనక నివారించిన మనోవేదన యగు ననియు మనంబునం దలపోయుచు నూరకుండె నంత. 76

1 దందహ్యమానము = కాల్పఁబడుచున్న, 2 కాయిక = దేహసంబంధమగు.

సీ. సతి సుహృద్దర్శనే♦చ్ఛాప్రతికూల దుః
ఖ స్వాంత యగుచు నం♦గములు వడఁకఁ
నందంద తొరఁగెడు ♦ నశ్రుపూరంబులు
గండభాగంబులఁ ♦ గడలుకొనఁగ
నున్నత స్తనమండ♦లోపరిహారముల్
వేడినిట్టూర్పుల ♦ వెచ్చఁగంద
నతిశోకరోషాకు♦లాత్యంత [1]దోధూయ
మానమై హృదయంబు ♦ మలఁగుచుండ

తే. మఱియుఁ గుపితాత్మయై స్వస♦మానరహితు
నాత్మదేహంబు సగ మిచ్చి ♦ నట్టి [2]భవుని
విడిచి మూఢాత్మ యగుచు న♦ వ్వెలఁది సనియె
జనకుఁ జూచెడు వేడుక ♦ సందడింప. 77

వ. ఇట్లతిశీఘ్రగమనంబున, 78

సీ. మానిని చనుచుండ ♦ మణిమన్మథాదిస
హస్ర సంఖ్యాత రు♦ద్రానుచరులు
యక్షులు నిర్భయు♦లై వృషభేంద్రుని
ము న్నిడికొనుచు స♦మున్మదిత దాల్చి
కందుకాంబుజశారి♦కా తాళవృంతద
ర్పణ ధవళాతప♦త్ర ప్రసూన
మాలికా సౌవర్ణ ♦ మణివిభూషణ ఘన
సార కస్తూరికా ♦ చందనాది

తే. వస్తువులు గొంచు నేఁగి శ♦ర్వాణిఁ గదిసి
శంఖ దుందుభి వేణుని♦స్వనము లొప్ప
మానితంబైన వృషభేంద్ర ♦ యానఁ జేసి
యజ్ఞభూమార్గులై యర్థి ♦ నరిగి యరిగి. 79

వ. ముందట, 80

---

1 దోధూయమాన = కదలింపఁబడుచున్న   2 భవుని = శివుని.

చ. మనమున మోద మందుచు ను♦ మాతరుణీమణి గాంచెఁ జారువ
[1]త్కనకకుశాజినాయసని♦ కాయవినిర్మితపాత్రసీమము
న్ననుపమ వేదఘోషనుమ♦ హాత్పశుబంధనకర్మభూమముఁ
మునివిబుధాభిరామము స♦ముజ్జ్వలహోమము యాగధామమున్.

వ. ఇట్లు గనుంగొని యజ్ఞశాలం బ్రవేశించిన. 82

క. చను దెంచిన యమ్మగువను
జననియు సోదరులుఁ దక్క ♦ సభఁ గల జను లె
ల్లను దక్షువలని భయమున
ననయము నపు డాదరింప♦ రైరి మహాత్మా. 83

క. మఱితల్లియుఁ బినతల్లులుఁ, [2]బరిరంభణ మాచరింపఁ♦బరితోషాశ్రుల్
దొరఁగఁగ డగ్గుత్తికతో, సరసిజముఖి సేమ మరయ♦సతి దానంతన్.

క. జనకుం డవమానించుట,యును సోదరు లర్థిఁ దనకు♦నుచితక్రియఁ జే
సినపూజల నందక శో,భన మరసిన మాఱుమాట♦వలుకక యుండెన్.

వ. ఇట్లు తండ్రిచే నాదగింపంబడనిదై విభుం డైన యీశ్వరునందు నాహ్వానక్రియాశూన్యత్వరూపం బైన తిరస్కారంబును నరుద్రభాగం బైన యజ్ఞంబునుం గనుంగొని, నిజరోషానలంబున లోకంబులు భస్మంబు సేయంబూనిన తెఱంగున నుద్రేకించి రుద్రవిద్వేషియుఁ గ్రతుకర్మాభ్యాసగర్విష్ఠుండు నగు దక్షుని వధియింతు మనుచు లేచిన భూతగణంబుల నివారించి రోషవ్యక్తభాషణంబుల నిట్లనియె, లోకంబున శరీరధారులైన జీవులకుఁ బ్రియాత్మకుండైన యీశ్వరునకుఁ బ్రియాప్రియులును నధికులును లే రట్టి సకలకారణుండును నిర్మత్సరుండును నైన రుద్రునందు నీవు దక్క నెవ్వండు ప్రతికూలం బాచరించు నదియునుంగాక మీముబోఁటివారలు పరులవలని గుణంబులందు దుర్గుణంబులన యాపాదింతురు, మఱియుం గొందరు మధ్యస్థులైనవారలు పరుల దుర్గుణంబులయందు దోషంబుల, నాపాదింపరు, గొందఱు సాధువర్తనంబు గలవారలు పరులదోషంబుల నైన గుణంబులఁగా ననుగ్రహింతురు. మఱియుం గొంద ఱుత్తమోత్త

1 కనక, కుశ, అజిన, అయస = బంగారు, దర్భ, చర్మము, ఇనుము.
2 పరిరంభణము = కౌఁగిలి.

ములు పరులయందు దోషంబుల నాపాదింపక తుచ్ఛగుణంబులు గలిగినను సద్గుణంబులుగాఁ గైకొందురు, అట్టి మహాత్ములయందు నీవు పాపబుద్ధి గల్పించితి వని వెండియు నిట్లనును, మహాత్ములగువారల పాదధూళిచే నిరస్తప్రభావులై [1]జడస్వభావంబుగల దేహంబు నాత్మయని పల్కు కుజనులగువారు మహాత్ముల నిందించుట కార్యంబుగా దదియు వారి కనుచితం బగు నని వెండియు నిట్లనియె. 86

సీ. అనయంబు శివ యను ♦ నక్షరద్వయ మహా
వాక్కునఁ బలుక భా♦వమునఁ దలఁప
సర్వజీవుల పాప ♦ సంఘముల్ సెడు నట్టి
మహితాత్ము నందు స♦మంగళుండ
వగు నీవు విద్వేషి ♦ వగుట కాశ్చర్యంబు
నందెద నినును నీ ♦ వనియుఁ గాక
చర్చింప నెవ్వని♦ చరణపద్మంబుల
సరసి బ్రహ్మానంద ♦ సమ మరంద
తే. మతులభక్తిని దమహృద♦యంబు లనెడి
తుమ్మెదలచేతఁ గ్రోలి సం♦తుష్టచిత్తు
లగుదు రత్యంతవిజ్ఞాను ♦ లట్టి దేవు
నందు ద్రోహంబు సేసితే ♦ మందు నిన్ను. 87

క. మఱియును నమ్మహితాత్ముని
చరణసరోజాతయుగము ♦ సకలజగంబుల్
నెఱిఁ గొలువఁ గోరు కోర్కులు
దరమిడి వర్షించు నతనిఁ ♦ దగునే తెగడన్? 88

చ. పరగఁ [2]జితాస్థిభస్మనృక♦పాల జటాధరుఁడుం బ్రేతభూ
చరుఁడు పిశాచయుక్తుఁడని ♦ శర్వు నమంగళుఁగాఁ దలంప రే
వ్వరు నొకఁడీవు దక్క మఱి ♦ వాక్పతిముఖ్యులు నమ్మహాత్మున
[3]చ్చరణసరోజరేణువులు ♦ సమ్మతిఁ దాల్తురు మస్తకంబులన్. 89

1 జడస్వభావము = కదలికలేనిది. 2 చితాస్థిభస్మనృకపాల జటాధరుఁడు — శ్మశానములోని ఎముకలు, బూది, మనుజునిపుఱ్ఱె, జడలు దాల్చినవాఁడు. 3 చరణ సరోజరేణువులు = పాదపద్మములందలి పరాగము.

చ. నెలకొని ధర్మపాలనవి◆నిర్మలు భర్గు దిరస్కరించు న
క్కలుషని జిహ్వఁ గోయఁ దగుఁ◆గా కటు సేయఁగ నోపఁడేని దాఁ
బోలియుట యొప్పు రెంటికిఁ బ్రభుత్వము సాలమిఁ గర్ణరంధ్రముల్
బలువుగ మూసికొంచుఁ జనఁ◆బాడి యటందురు ధర్మవర్తనుల్. 90

వ. అది గావున. 91

మ. జనుఁ డజ్ఞానమునన్ భుజించిన [1]జుగు◆ప్సం బైన యన్నంబు స
య్యన వెళ్ళించి పవిత్రుఁ డైనగతి దు◆ష్టాత్ముండవై యీశ్వరున్
ఘను నిందించిన నీ తనూభవ యనం◆గా నోర్వ నీ [2]హేయభా
జన మైనట్టి శరీరమున్ విడిచి భా◆స్వచ్ఛుద్ధి వాటిల్లెదన్. 92

వ. అదియునుంగాక దేవతల కాకాశగమనంబును మనుష్యులకు భూతల గమనంబును స్వాభావికంబు లయినట్లు [3]ప్రవృత్తి నివృత్తి లక్షణ కర్మంబులు రాగవైరాగ్యాధికారంబులుగా వేదంబులు విధించుటం జేసి రాగయుక్తులై కర్మతంత్రు లయిన సంసారులకు వైరాగ్య యుక్తులయి యాత్మారాము లయిన యోగిజనులకు విధినిషేధ రూపంబు లయిన వైదిక కర్మంబులు గలుగుటయు లేకుండుటయు నైజంబు లగుటం జేసి స్వధర్మనిష్ఠుండగు వాని నిందింపం జన దా యుభయకర్మశూన్యుండు బ్రహ్మభూతుండయిన సదాశివునిఁ గ్రియా శూన్యుఁడని నిందించుట పాపంబగుఁ దండ్రి! సంకల్ప మాత్రప్రభవంబు లగుటం జేసి మహాయోగిజనసేవ్యంబు లయిన యస్మదీయంబు లగు నణిమాద్యష్టైశ్వర్యంబులు నీకు సంభవింపవు. భవదీయంబు లగు నైశ్వర్యంబులు ధూమమార్గప్రవృత్తులై యాగాన్నభోక్తలైన వారిచేత యజ్ఞశాలయందె చాల నుతింపంబడి యుండుఁ గాన నీ మనంబున నే నధిక సంపన్నుండ ననియుఁ జితాభస్మాస్థిధారణుం డైన రుద్రుండు దరిద్రుం డనియును గర్వింపం జన దని వెండియు నిట్లనియె. 93

---

1 జుగుప్స = రోఁత. 2 హేయభాజనము=రోఁతకునికిపట్టు. 3 ప్రవృత్తి నివృత్తి = సంసారాభిముఖ్యము, విరాగము,

ఉ. నీలగళాపరాధియగు ♦ నీకుఁ దనూభవ నౌట చాలదా
చాలుఁ [1]కుమర్త్య! నీదుతను♦జాత ననంగ మది సిగ్గుపుట్టెడి
న్నేల ధరన్ మహాత్ములకు ♦ నెగ్గొనరించెదవీ వారి జన్మముల్
గాలుపనే తలంప జన♦కా! కుటిలాత్మక! యెన్ని మాఱుఁగన్. 94

చ. వరవృషకేతనుండు భగ♦వంతుఁడు నైన హరుండు నన్ను నా
దరపరిహాసవాక్యముల ♦ దక్షతనూభవ యంచుఁ బిల్వ నేఁ
బురపురఁ బొక్కుచున్ ముదముఁ బొందక [2]నర్మవచఃస్మితంబులం
దొఱఁగుదు నీ తనూజ నను♦దుఃఖముకం బను జన్మ మొప్పగున్. 95

వ. అని యిట్లు యజ్ఞసభామధ్యంబునం బ్రతికూలుం డగు తండ్రి నుద్దే
శించి పలికి కామక్రోధాదిశత్రువిఘాతిని యగు సతీదేవి [3]యుదఙ్ముఖి
యయి జలంబుల నాచమనంబు సేసి శుచిస్మితయై మౌనంబు ధరియించి
జితాసనయై భూమియం దాసీన యగుచు యోగమార్గంబునం జేసి
శరీరత్యాగంబు సేయం దలంచి, 96

సీ. వరుసఁ బ్రాణాపాన♦వాయునిరోధంబు
గావించి వాని నే♦కముగ నాభి
తలమునఁ గూర్చి యం♦తట నుదానము దాఁక
నెగయించి బుద్ధితో ♦ హృదయపద్మ
మున నిల్పి వాని మె♦ల్లన కంఠమార్గము
నను మఱి భ్రూమధ్య♦మున వసింపఁ
జేసి శివాంఘ్రిరా♦జీవచింతనముచే
నాథునిఁ దక్క న♦న్యంబుఁ జూడ

తే. కన్మహాత్ముని యంకపీ♦ఠమ్మునందు
నాదరంబున నుండు దే♦హంబు దక్షు
వలని దోషంబునను విడు♦వంగఁ దలఁచి
తాల్చెఁ దనువున ననిలాగ్ని♦ధారణములు. 97

వ. ఇట్లు ధరించి గతకల్మషంబైన దేహంబు గల సతీదేవి నిజయోగ
సమాధిజనితం బయ్యె వహ్నిచేఁ దత్క్షణంబ దగ్ధ యయ్యె. అంత, 98

1 కుమర్త్యుఁడు = దుష్టుడు, 2 నర్మవచఃస్మితములు = పరిహాసపుమాటలు చిఱునవ్వు. 3 ఉదఙ్ముఖి = ఉత్తరముఖము గలది,

క. అది గనుఁగొని హాహాధ్వని
వొదలఁగ నిట్లనిరి మాన♦వులుఁ [1]త్రిదశులు నీ
మదిరాక్షి యకట దేహము
వదలెఁ గదా దక్షుతోడి♦ వైరముకతనన్. 99

వ. మఱియు నిట్లనిరి. 100

సీ. సకలచరాచర♦జనకుఁ డై నట్టి యీ
దక్షుండు దన కూర్మి♦తనయ మాన
వతి పూజనీయ యీ ♦ సతి దనచే నవ
మానంబు నొంది స♦మక్షమందుఁ
గాయంబుఁ దొఱఁగంగఁ ♦ గనుఁగొనుచున్న వాఁ
డిట్టి దురాత్ముఁ డెం♦దేనిఁ గలఁడె
యనుచుఁ జిత్తంబుల ♦ నాశ్చర్యములఁ బొంది
రదియును గాక యి♦ట్లనిరి యిట్టి

తే. దుష్టచిత్తుండు [2]బ్రహ్మబం♦ధుండు నయిన
యీతఁ డనయంబుఁ దా నపఖ్యాతిఁ బొందు
నిందఁ బడి మీఁద దుర్గతిఁ ♦ జెందుఁగాక
యనుచు జనములు వలుకు న♦య్యవసరమున. 101

క. దేహము విడిచినసతిఁ గని
బాహాబల మొప్ప రుద్ర♦పార్షదులును ద
ద్ద్రోహిం ద్రుంచుటకై యు
త్సాహంబున లేచి రసిగ♦దాపాణులునై.

క. ఆ రవ మపు డీక్షించి మ
హారోషముతోడ భృగుమ♦హాముని క్రతుసం
హారకమారక మగు [3]నభి
చారకహోమం బొనర్చె ♦ సరభసవృత్తిన్. 103

వ. ఇట్లు దక్షిణాగ్నియందు వేల్చిన నందుఁ దపం బొనర్చి సోమలోకం
బున నుండు సహస్రసంఖ్యలు గల ఋభునామధేయు లైన దేవత

1 త్రిదశులు = దేవతలు 2 బ్రహ్మబంధుఁడు = మూర్ఖుఁడు 3 అభిచారక హోమము = మారణహోమము.

లుదయించి బ్రహ్మతేజంబునం జేసి దివ్యవిమానులై యుల్ముకంబులు సాధనంబులుగా ధరియించి రుద్రపార్షదు లయిన ప్రమథగుహ్యక గణంబులం బాఱఁదోలిన వారును బరాజితులై రి. తదనంతరంబ నారదు వలన నభవుండు దండ్రిచే నసత్కృతురా లగుటం జేసి భవాని [1]పంచత్వంబు నొందుటయుం బ్రమథగణంబులు ఋభునామక దేవతలచేఁ బరాజితు లగుటయు విని. 104

శా. ఆద్యుం డుగ్రుడు నీలకంఠుఁ డిభదై ◆ త్యారాతి [2]దష్టోష్ఠుఁడై
[3]మాద్యద్భూరిమృగేంద్రఘోషమున భీ ◆ మప్రక్రియన్ సవ్వచున్
విద్యుద్వహ్నిశిఖాసముచ్చయరుచిన్ ◆ వెల్గొందు [4]చంచజ్జటన్
సద్యఃక్రోధముతోడఁ బుచ్చివయిచెన్ ◆ క్ష్మాచక్రమధ్యంబునన్.

వ. ఇట్లు వెఱికివైచిన రుద్రునిజటయందు. 106

—◆ శివుఁడు వీరభద్రునిచే దక్షయజ్ఞంబు ధ్వంసంబు చేయించుట ◆—

సీ. [5]అభ్రంలిహా[6]దభ్ర ◆ విభ్రమా[7]భ్రభ్రమ
కృన్నీలదీర్ఘ శ ◆ రీర మమరఁ
బ్రజ్వలజ్జ్వలనదీ ◆ ప్తజ్వాలికాజాల
జాజ్వల్యమాన కే ◆ శములు మెఱయఁ
జండ [8]దిగ్వేదండ ◆ శుండాభదోర్దండ
సాహసధృత హేతి ◆ సంఘ మొప్ప
వీక్షణత్రయలోక ◆ వీక్షణద్యుతిలోక
వీక్షణతతి దుర్ని ◆ రీక్షముగను
తే. [9]క్రకచకలితనకరాళదం ◆ ష్ట్రలు వెలుంగ
ఘనకపాలాస్థివనమాలి ◆ కలును దనర
నఖిలలోకభయంకరుఁ ◆ డగుచు వీర
భద్రుఁ డుదయించె మాఱట ◆ రుద్రుఁ డగుచు. 107

తే. వీరభద్రుండు విహతవి ◆ ద్వేషిభద్రుఁ
డగుచుఁ దనవేయిచేతులు ◆ మొగిచి వినయ

---

1 పంచత్వము = మరణము 2 దష్టోష్ఠుఁడు = పెదవి కొఱుకుకొనువాఁడు 3 మాద్యత్ = మదించు 4 చంచజ్జటన్ = ప్రకాశించు జడను 5 అభ్రంలిహ = ఆకాశమంటునట్టి 6 అదభ్ర = కపటములేని 7 అభ్రభ్రమకృత్ = మేఘము అను భ్రాంతిని కలుగఁజేయు 8 దిగ్వేదండశుండా = దిగ్గజముల తొండములు 9 క్రకచ = అంపము

మొసఁగ నే నేమి సేయుదు ♦ నెఱుఁగ నాకు
నానతి మ్మన నతని క ♦ య్యభవుఁ డనియె.
చ. గురుభుజశౌర్య భూరిరణ♦కోవిద మద్భటకోటికెల్ల నీ
వరయ వరూథినీ[1]వరుడ ♦ వై చని యజ్ఞముఁగూడ దక్షునిన్
బరువడిఁ ద్రుంపు మీ వచట ♦ బ్రాహ్మణతేజ మజేయమంటివే
నరిది మదంశసంభవుఁడ♦వై తగు నీకు నసాధ్య మెయ్యెడన్. 109
వ. అని కుపితచిత్తుండై యాజ్ఞాపించిన నట్ల కాక యని. 110
చ. అనఘుఁడు రుద్రుఁ జేరి ముద♦మారఁ బ్రదక్షిణ మాచరించి వీ
డ్కొని యనివార్యవేగమునఁ ♦ గుంభిని గ్రక్కదలన్ ఝళంఝళ
ధ్వని మణినూపురంబులు ప♦దంబుల మ్రోయఁగ భీషణప్రభల్
దనరఁ [2]గృతాంతకాంతక శి♦తస్ఫుటశూలముఁబూని చెచ్చెరన్. 111
చ. సరభసవృత్తి నట్లరుగు♦సైన్యపదాహతపాదధూళిధూ
సరితకుబేరదిక్తటము ♦ సభ్యులు దక్షుఁడుఁ జూచి యెట్టిభీ
కరతమమం చనం దమము ♦ గాదు రజఃపటలం బటంచు ని
వ్వెరపడి పల్కి రాత్మల వి♦వేకవిహీనతఁ బొంది వెండియున్. 112
సీ. ఈ ధూళి వుట్టుట ♦ కెయ్యది హేతువో
విలయసమీరమా ♦ పొలయ దిపుడు
ప్రాచీనబర్హి ధ♦రాపతి మహితోగ్ర
శాసనుఁ డిపుడు రా♦జ్యంబు సేయఁ
జోరసంఘములకో ♦ రా రాదు మఱి గోగ
ణాళిరాకకు సమ♦యంబు గాదు
కావున నిప్పుడు ♦ కల్పావసానంబు
గాఁబోలుఁ గా దటు ♦ గాక యున్న
తే. నిట్టి యౌత్పాతికరజ మెం♦దేనిఁ గలదె
యనుచు మనముల భయమంది ♦ రచటిజనులు
సురలు దక్షుఁడు నంతఁ బ్ర♦సూతిముఖ్యు
లయిన భూసురకాంత లి ♦ ట్లనిరి మఱియు. 113

1 వరూథినీవరుఁడు = సేనానాయకుఁడు 2 కృతాంతకాంతక = యముని అంత మొందించు,

క. తన కూఁతులు చూడఁగ నిజ
తనయను సతి ననపరాధఁ ♦ దగవఱి యి ట్లై
గ్గొనరించిన యా దక్షుని
ఘనపాపవిపాక మిదియుఁ ♦ గాఁదగు ననుచున్. 114

వ. అని వెండియు నిట్లనిరి. కుపితాత్ముండైన దక్షుండు దన కూఁతుతో విరోధంబు సాలక జగత్సంహారకారణుం డయిన రుద్రునిం గ్రోధింపం జేసె. నమ్మహాత్ముం డెంతటివాఁ డన్నం బ్రళయకాలంబున. 115

సీ. సుమహిత [1] నిశితత్రి♦శూలాగ్రసంప్రోత
నిఖిలదిక్కరిరాజ ♦ నివహుఁ డగుచుఁ
జటులోగ్రనిష్ఠుర♦ [2] స్తనితగంభీరాట్ట
హాసనిర్భిన్నాఖి♦లాశుఁ డగుచుఁ
భూరికరాళవి♦స్ఫారదంష్ట్రాహతి
పతితతారాగణ♦ప్రచయుఁ డగుచు
వివిధ [3] హేతివ్రాత♦విపులప్రభాపుంజ
మండితచండదో♦ర్దండుఁ డగుచు

తే. వికటరోషభయంకర♦[4]భ్రుకుటిదుర్ని
రీక్ష్యదుస్సహ తేజోమ♦హిమఁ దనర్చు
ఘన [5]వికీర్ణజటాబంధ♦కలితుఁ డగుచు
నఖిలసంహారకారణుఁ♦డయి నటించు. 116

తే. అట్టి దేవునిఁ ద్రిపురసం♦హారకరుని
జంద్రశేఖరు సద్గుణ♦సాంద్రు నభవు
మనము రోషింపఁజేసిన ♦ మంగళములఁ
బొందవచ్చునె పద్మగ♦ర్భునకు నైన. 117

వ. అని యి వ్విధంబున భయవిహ్వలలోచనలై పలుకుచున్న సమయంబున మహాత్ముండైన దక్షునకు భయావహంబులై సహస్రసంఖ్యాతంబులైన మహోత్పాతంబులు భూనభోంతరంబులఁ గానం

1 నిశితత్రిశూలాగ్రసంప్రోత = వాఁడియగు మూఁడు మొనల బల్లెముచేఁ గ్రుచ్చఁబడిన. 2 స్తనిత = పిడుగు. 3 హేతివ్రాత = ఖడ్గసమూహము. 4 భ్రుకుటీ = కనుబొమ్మలముడి. 5 వికీర్ణజటాబంధకలితుఁడు = చెదరిన జడముడితో నొప్పువాఁడు.

బడుచుండె నా సమయంబున రుద్రానుచరులు నానావిధాయుధంబులు ధరించి కపిల పీతవర్ణంబులు గలిగి వామనాకారులు మకరోదరాననులునై యజ్ఞశాలాప్రదేశంబునం బరువులు పెట్టుచుఁ గదియం జనుదెంచి దక్షాధ్వరవాటంబులు[1] విటతాటంబులు సేయుచుం గొందఱు ప్రాగ్వంశంబును గొందఱు పత్నీశాలయుఁ గొందఱు సదస్యశాలయుఁ గొంద ఱాగ్నీధ్రశాలయుఁ గొందఱు యజమానశాలయుఁ గొందఱు[2]మహానసగృహంబును విధ్వంసంబులు గావించిరి, మఱియుఁ గొందఱు యజ్ఞపాత్రంబుల నగ్నులనుం జెఱిచిరి. వెండియుఁ గొందఱు హోమాగ్ను లార్చిరి. పదంపడి కొందఱు హోమకుండంబులయందు మూత్రంబులు విడిచిరి. కొంద ఱుత్తరవేదికామేఖలలు ద్రెంచిరి. గొందఱు మునుల బాధించిరి. గొందఱు తత్పత్నుల వెఱపించిరి, మఱి కొందఱు దేవతా నిరోధంబుఁ గావించి రంత మణిమంతుండు భృగువును వీరభద్రుండు దక్షునిఁ జండీశుండు పూషుని భగుని నందీశ్వరుండును బట్టి రివ్విధంబున సదస్యదేవర్త్విజ్నికాయంబుల శిలల ఱువ్వియు జానువులఁ బొడిచియు నఱచేతుల నడిచియు గుల్ఫంబులఁ బొడిచియు వివిధబాధలు వఱచిన వారు కాందిశీకులై యెక్కడెక్కడేనిం జనిరి మఱియును.

క. మును దక్షుఁ డభవుఁ బలుకఁగ
గను గీఁటిన భగునిఁ బట్టి ♦ కన్నులు వెకలిం
చెను నందీశ్వరుఁ డచ్చటి
జనములు హాహారవంబు ♦ సందడి గొలుపన్. 119

తే. కుపితుఁడై నాఁడు భవుని ద♦క్షుఁడు శపింపఁ
బరిహసించిన పూషుని ♦ పండ్లు డుల్లఁ
గొట్టి బలభద్రుఁ డా కళిం♦గుని[3]రదంబు
లెలమి డుల్చిన పగిదిఁ జం♦డీశ్వరుండు. 120

క. తగవేది దక్షుఁ డాసభ
నగచాపుఁ దిరస్కరించు♦నాఁ డట శ్మశ్రుల్

1 విటతాటము = తారుమారు, 2 మహానసము = వంటశాల. 3 రదములు = పండ్లు.

నగుచుం జూపుట నా భృగు
పగనై [1] శ్మశ్రువులు వీర♦భద్రుఁడు నెఱికెన్. 121

సీ. అతులదర్పోద్ధతుం♦డై వీరభద్రుండు
గైకొని దక్షు వ♦క్షంబుఁ ద్రొక్కి
ఘనశితధారాసిఁ ♦ గొని మేను వ్రచ్చియు
మంత్రసమన్విత♦మహితశస్త్ర
జాలావినిర్భిన్న ♦ చర్మంబు గల దక్షుఁ
జంపఁగా లేక వి♦స్మయమునొంది
తద్వధోపాయంబు ♦ దనచిత్తమునఁ జూచి
[2] కంఠనిష్పీడన♦గతిఁ దలంచి
తే. మస్తకముఁ దున్మి యంచితా[3]♦మర్షణమున
దక్షిణానలమున వేల్చెఁ ♦ దదనుచరులు
హర్షమును బొంద నచటి బ్రా♦హ్మణజనంబు
లాత్మలను జాల దుఃఖంబు ♦ లందుచుండ. 122

వ. ఇట్లు వీరభద్రుండు దక్షునియాగంబు విధ్వంసంబు గావించి నిజ నివాసంబైన కైలాసంబునకుఁ జనియె న య్యవసరంబున. 123

—♦ దేవతలు వీరభద్రాదులచేఁ బరాజితులై బ్రహ్మతో విన్నవించుట ♦—

చ. హరభటకోటిచేత నిశి♦తాసిగదాకరవాలశూలము
ద్గరముసలాదిసాధనవి♦దారిత జర్జరితాఖిలాంగులై
సురలు భయాకులాత్ము లగు♦చున్ [4]సరసీరుహజాతుఁ జేరి త
చ్చరణసరోరుహంబులకు ♦ సమ్మతిఁ జాఁగిలి మ్రొక్కి నమ్రులై.

క. తము ధూర్జటిసైనికు లగు
ప్రమథులు దయ మాని పెలుచ ♦ బాధించుట స
ర్వముఁ జెప్పి రనుచు మైత్రే
యమునీంద్రుఁడు విదురుతోడ ♦ ననియెన్ మఱియున్. 125

తే. ఇంతయును మున్న మనమున ♦ నెఱిఁగి యున్న
కతన విశ్వాత్మకుండును ♦ గమలలోచ

---

1 శ్మశ్రువులు = గడ్డము, మీసమును. 2 కంఠనిష్పీడనము = గొంతుపిసుకుట
3 అమర్షణము = క్రోధము, 4 సరసీరుహజాతుఁడు=బ్రహ్మ.

నుండు నన నొప్పు నారాయ♦ణుండు నజుఁడుఁ
జూడరారైరి మున్న ద♦క్షునిమఖంబు. 126

వ. అనిచెప్పి సురలిట్లు విన్నవించినఁ జతుర్ముఖుండు వారల కిట్లనియె. 127

క. ఘన తేజోనిధి పురుషుం
డనయంబుఁ గృతాపరాధుఁ ♦ డయినను దా మ
ల్లన ప్రతికారముఁ గావిం
చిన జనులకు లోకమందు ♦ సేమము గలదే. 128

వ. అని మఱియు నిట్లనియె. 129

క. క్రతుభాగార్హుం డగు పశు
పతి నీశ్వరు నభవు శర్వు ♦ భర్గుని [1]దూరీ
కృతయజ్ఞభాగుఁ జేసిన
యతిదోషులు దుష్టమతులు ♦ నగు మీ రింకన్. 130

సీ. పూని యే దేవుని♦బొమముడిమాత్రన
లోకపాలకులును ♦ లోకములును
నాశ మొందుదు రట్టి♦యీశుండు ఘన దురు
క్త్యస్త్రనికాయవి♦ద్ధాంతరంగుఁ
డును బ్రియావిరహితుం♦డును నైన వాఁ డమ్మ
హాత్మునిఁ ద్రిపురసం♦హారకరుని
మఖపునస్సంధాన♦మతి నపేక్షించు మీ
రలు సేరి శుద్ధాంత♦రంగు లగుచు

తే. భక్తినిష్ఠలఁ దత్పాద♦పద్మయుగళ
ఘనపరిగ్రహపూర్వంబు ♦ గాఁగ నతని
శరణ మొందుఁ డతండు ప్ర♦సన్నుఁ డయినఁ
దివిరి మీకోర్కి సిద్ధించు ♦ దివిజులార. 131

వ. అని మఱియు నిట్లనియె నద్దేవుని డాయం జన వెఱతు నని తలంప
కుం డతనిఁ జేరు నుపాయం బెఱింగింపు మంటి రేని నేను నింద్రుండును
మునులును మీరలును మఱియు దేహధారు లెవ్వరేని నమ్మహా
త్ముని రూపంబు నతని బలపరాక్రమంబుల కొలఁదియు నెఱుంగం

1 దూరీకృతయజ్ఞభాగుఁడు = యజ్ఞమునందలి భాగములకు దూరమైనవాఁడు.

జాల మతండు స్వతంత్రుండు గావునఁ దదుపాయం బెఱింగింప నెవ్వఁడు సమర్థుం డగు నయిన నిపుడు భక్తపరాధీనుండును శరణాగత రక్షకుండు నగు నీశునిఁ జేరం బోవుద మని పలికి పద్మసంభవుండును దేవ పితృగణ ప్రజాపతులం గూడి కైలాసాభిముఖుండై చని చని. 132

ఉ. భాసురలీలఁ గాంచిరి సు♦పర్వులు భక్తజనైకమానసో
ల్లాసముఁ గిన్నరీజనవి♦లాసము [1]నిత్యవిభూతిమంగళా
వాసము సిద్ధగుహ్యకని♦వాసము రాజతభూవికాసిఁ గై
లాసముఁ గాంతినిర్జితకు♦లక్షితిభృత్సుమహావిలాసమున్. 133

సీ. [2]ధాతువిచిత్రితో♦దాత్తరత్నప్రభా
సంగతోజ్జ్వలతుంగ♦శృంగములును
గిన్నరగంధర్వ♦కింపురుషాప్సరో
జననిక[3]రాకీర్ణ♦సానువులును
మానిత నిఖిల వై♦మానిక మిథున స
ద్విహారకలిత శుభ ప్ర♦దేశములును
గమనీయ నవమల్లి♦కాసుమనోవల్లి
కా మతల్లి లస♦[4]త్కందరములు

తే. నమర సిద్ధాంగనాశోభి♦తాశ్రమములు
విబుధజనయోగ్య సంపన్న♦వేశములును
గలిగి బహువిధ పుణ్యభో♦గముల నొప్పు
వినుత సుకృతములకు దండ♦ వెండికొండ. 134

వ. అది మఱియును మందార పారిజాత సరళ తమాల సాల తాల తక్కోల కోవిదార శిరీషా[5]ర్జున చూత కదంబ [6]నీప నాగ పున్నాగ చంపక పాటలాశోక వకుళ కుంద కురవక [7]కనకామ్ర [8]శతపత్త్ర కింశు కైలా లవంగ మాలతీ మధూక మల్లికా పనస మాధవీ కుట[9]జోదుంబ రాశ్వత్థ [10]ప్లక్షవట [11]హింగుళ భూర్జ పూగ జంబూ

1 నిత్యవిభూతి = మోక్షము. 2 ధాతు = గైరిక ధాతువులు. 3 అకీర్ణసానువులు = వ్యాపించిన కొండచరియలు. 4 కందరములు = గుహలు. 5 అర్జున = ఏఱుమద్ది. 6 నీప = కడిమి. 7 కనక = ఉమ్మెత్త, సంపెఁగ. 8 శతపత్త్ర = తామర. 9 ఉదుంబర = మేడి. 10 ప్లక్ష = జువ్వి. 11 హింగుళ = ములక.

ఖర్జూరా[1]మ్రాతక ప్రియాళు నారికేళేంగుదీ వేణుకీచక ముఖరతరు శోభితంబును కలకంఠ కాలకంఠ కలవింక రాజకీర మత్తమధుకర నానావిహంగ కోలాహలనినద బధిరీభూతరోదోంతరాళంబును సింహ తరక్షు శల్యగవయ శరభ శాఖామృగ వరాహ వ్యాఘ్రకురుంగరురు మహిష వృకసారంగ ప్రముఖ వన్యసత్త్వసమాశ్రయ విరాజితంబును కదళీషండమండిత కమల కహ్లార కైరవ కలిత పులినతల లలిత కమలాకర విహరమాణ కలహంస కారండవ సారస చక్రవాక బక జలకుక్కుటాది జలవిహంగకుల కూజిత సంకులంబును సలిలకేళీ విహరమాణ సతీరమణీ రమణీయ కుచమండల విలిప్త మృగమద మిళిత హరిచందన గంధ సుగంధిజలపూరిత గంగాతరంగిణీ సమావృతంబును నైన కైలాసపర్వతంబు వొడగని యరవిందసంభవ పురందరాది దేవగణంబు లత్యద్భుతానందంబులం బొంది ముందటం దార హీర హేమమయ విమానసంకులంబును పుణ్యజనమానినీ శోభితంబును నైన యలకాపురంబు గడచి తత్పుర బాహ్య ప్రదేశంబునం దీర్థపాదుండైన పుండరీకాక్షు పాదారవిందరజఃపావనంబును రతికేళీ వ్యాసంగ పరిశ్రమ నివారక సలిల కేళీవిలోల దేవకామినీ[2]పీనవక్షోజ విలిప్త కుంకుమ పంక సంగత పిశంగవర్ణ వారి పూరవిలసితంబును నై సందాలకనందాభిధానంబులు గల నదీద్వితయంబు దాఁటి తత్పురోభాగంబున వనగజ సంఘృష్ట మలయజ పరిమిళిత మలయ పవనాస్వాదన [3]ముహుర్ముహురున్మదితమానస పుణ్యజన కామినీ కదంబంబును వైడూర్య సోపాన సమంచిత కనకోత్పల వాపీ విభాసితంబును గింపురుష సంచారయోగ్యంబును నగు సౌగంధిక వన సమీపంబునందు. 135

—♦ బ్రహ్మాదులు దక్షిణామూర్తిరూపుం డగు నీశ్వరుని స్తుతియించుట. ♦—

సీ. ఉజ్జ్వలం బయి శత♦యోజనంబుల పొడ
వొగిఁ బంచసప్తతి♦యోజనముల

---

1 ఆమ్రాతక=అంబాళపుచెట్టు. 2 పీన వక్షోజ విలిప్త కుంకుమ=ఉబ్బుచనుఁగవ పయిఁబూసిన కుంకుమపూవు. 3 ముహుర్ముహురున్మదిత=మాటిమాటికి కానందించిన.

పటిమను గల్గి యే♦పట్టునం దఱుఁగని
నీడ శోభిల్లు ని♦ర్గీత మగుచుఁ
బర్ణశాఖా సమా♦కీర్ణమై మాణిక్య
ములఁ బోలఁ గల ఫల♦ములఁ దనర్చు
కమనీయ సిద్ధ యో♦గ క్రియామయ మగు
యసఘ[1]ముముక్షుజ♦నాశ్రయమును
తే. భూరిసంసారతాప ని♦వారకమును
నగుచుఁ దరురాజ మనఁగఁ బెం♦పగ్గలించి
భక్తజనులకు నిచ్చలుఁ ♦ బ్రీమద మొసఁగ
వలయుసంపద లంద నా♦వటము వటము. 136
వ. ఆ వృక్షమూలతలంబున. 137
సీ. ఇద్ధ సనందాది ♦ సిద్ధసంసేవితు
శాంతవిగ్రహుని వా♦త్సల్యగుణునిఁ
గమనీయలోకమం♦గళదాయకుని శివు
విశ్వబంధుని జగ♦ద్వినుతయశుని
గుహ్యకసాధ్యర♦క్షోయక్షనాథ కు
బేరసేవితుని దు♦ర్వారబలుని
నుదితవిద్యాతపో♦యోగయుక్తుని బాల
చంద్రభూషణుని ము♦నీంద్రనుతునిఁ
తే. దాపసాభీష్టకరు భస్మ♦దండలింగ
ఘనజటాజినధరుని భ♦క్తప్రసన్ను
వితతసంధ్యాభ్రరుచివిడం♦బితవినూత్న
రక్తవర్ణు సనాతను ♦ బ్రహ్మమయుని. 138
వ. మఱియును. 139
సీ. అంచితవామపా♦దాంభోరుహము [2]దక్షి
ణోరుతలంబున ♦ నొయ్య నునిచి
సవ్యజానువుమీఁద ♦ భవ్యబాహువు సాఁచి
వల్లపలిముం జేత ♦ సలలితాక్ష

1 ముముక్షు = మోక్షవాంఛ గలవారు. 2 దక్షిణోరు = కుడితొడ.

మాలిక ధరియించి ♦ మహనీయతర్క ము
దాృయుక్తుఁ డగుచుఁ జి♦త్తంబులోన
నవ్యయం బయిన బ్ర♦హ్మానందకలిత స
మాధినిష్ఠుఁడు వీత♦మత్సరుండు
తే. యోగపట్టాభిరాముఁడై ♦ యుచితవృత్తి
రోషసంగతిఁ బాసి కూ♦ర్చున్నజముని
యనువునను దర్భరచిత [1]బృ♦స్యాసనమున
నున్న మునిముఖ్యు నంచిత ♦ యోగనిరతు. 140

క. అలఘుని నభవుని యోగీం
ద్రులు వినుచుండఁగ నారద♦మునితోఁ బ్రియ భా
షలు జరపుచున్న రుద్రుని
సలలిత పన్నగ విభూషు ♦ సజ్జనపోషున్. 141

క. కని లోకపాలురును ముని
జనులును సద్భక్తి నతని♦చరణంబులకున్
వినతు లయి రప్పు డబ్జా
సనుఁ గని యయ్యభవుఁ డధిక ♦ సంభ్రమ మొప్పన్. 142

క. అనఘ మహాత్ముం డగు వా
మనుఁ డా కశ్యపున కొగి న♦మస్కారము సే
సినగతి నజునకు నభివం
దన మొగిఁ గావించె హరుఁడు ♦ దద్దయుఁ బ్రీతిన్. 143

తే. అంత రుద్రానువర్తులై ♦ నట్టి సిద్ధ
గణ మహర్షి జనంబులు ♦ గని పయోజ
గర్భునకు మ్రొక్కి రంత నా ♦ కమలభవుఁడు
శర్వుఁ గని పల్కె మందహా♦సంబుతోడ. 144

తే. జగములకు నెల్ల యోనిబీ♦జంబులైన
శక్తిశివకారణుండవై ♦ జగతి నిర్వి
కార బ్రహ్మంబ వగు నిన్నుఁ ♦ గడఁగి ♦ విశ్వ
నాథుఁగా నెఱిఁగెద నామ ♦నమున నభవ. 145

---

1 బృస్యాసనము = వ్రతుల యాసనవిశేషము.

తే. సమత నదిగాక తావకాంశంబు లైన
శక్తిశివరూపములఁ గ్రీడ ♦ సలుపు ¹నూర్ణ
నాభిగతి విశ్వజనన వి♦నాశ వృద్ధి
హేతుభూతుండ వగుచుందు ♦ యీశ రుద్ర. 146

సీ. అనఘ లోకంబుల♦యందు వర్ణాశ్రమ
సేతువు లనఁగఁ బ్ర♦వర్తిల్లినట్టి
బలసి మహాజన ♦ పరిగృహీతంబులై
యఖిలధర్మార్థ దా♦యకము లైన
వేదంబులను మఱి ♦ వృద్ధి నొందించుట
కొఱకు నై నీవ ద♦క్షుని నిమిత్త
మాత్రునిఁ జేసి య♦మ్మఖము గావించితి
వటుగాన శుభమూర్తి ♦ వైన నీవు

తే. గడఁగి జనముల మంగళ♦కర్మ లయిన
వారి ముక్తి సమంగళా♦చారు లయిన
వారి నరకంబు నొందింతు ♦ భూరిమహిమ
భక్తజనపోష రాజిత♦ఫణివిభూష. 147

వ. అట్లగుటం దత్కర్మంబు లొకానొకనికి ²విపర్యాసంబు నొందుటకుఁ గారణం బెయ్యదియో భవదీయరోషంబు హేతు వని తలంచితి నీనిఁ ద్వదీయ పాదారవింద నిహితచిత్తులై సమస్త భూతంబులయందు నినుం గనుంగొనుచు భూతంబుల నాత్మకు వేఱుగాఁ జూడక వర్తించు మహాత్ములయందు సజ్జులైన వారియందుంబోలె రోషంబు దఱుచు వొరయదఁట, నీకుఁ గ్రోధంబు గలదే యని. 148

సీ. మఱి భేదబుద్ధిఁ గ♦ర్మప్రవర్తనముల
మదయుతులయి దుష్ట♦హృదయులగుచుఁ
బరవిభవాసహ్య♦భవమనోవ్యాధులఁ
దగిలి మర్మాత్మభే♦దకము లయిన
బహుదురుక్తులచేతఁ ♦ బరులఁ బీడించుచు
నుండు మూఢులను దై♦వోపహతులఁ

---

1 ఊర్ణనాభి = సాలీఁడు. 2 విపర్యాసము = వ్యత్యాసము.

గాఁ దలపోసి య♦క్కపటచిత్తులకు నీ
    వంటి సత్పురుషుఁ డే♦వలన నైన
తే. హింసఁ గావింప కుండు స♦మిద్ధచరిత
[1] నీలలోహిత మహితగు♦ణాలవాల
లోకపాలనకలిత గం♦గాకలాప
హార జగన్నుతచారిత్ర ♦ యాదియుఁ గాక. 149
సీ. సరవి సమస్త దే♦శములందు నఖిల కా
    లములందుఁ దలఁప దు♦ర్లంఘ్యమహిమఁ
దగు పద్మనాభు మా♦యామోహితాత్మకు
    లై భేదదర్శను ♦ లైనవారి
వలనను ద్రోహంబు ♦ గలిగిన నైనను
    నది దైవకృత మని ♦ యన్యదుఃఖ
ముల కోర్వలేక స♦త్పురుషుండు దయ్యును
    గాని హింసింపఁడు ♦ గాన నీవు
తే. నచ్యుతునిమాయ మోహము ♦ నందకుంటఁ
జేసి సర్వజ్ఞుఁడవు మాయ♦చేత మోహి
తాత్ములై కర్మవర్తను ♦ లయినవారి
వలన ద్రోహంబు గలిగిన ♦ వలయుఁ బ్రోవ. 150

వ. అది గావున యజ్ఞభాగార్హుండ వయిన నీకు సవనభాగంబు సమర్పింపని కతన నీచేత విధ్వస్తంబయి పరిసమాప్తి నొందని దక్షాధ్వరంబు మరల నుద్ధరించి దక్షునిఁ బునర్జీవితుం జేయుము భగుని నేత్రంబులును భృగుముని శ్మశ్రువులును [2]బూషుని దంతంబులును గృప సేయుము భగ్నాంగు లయిన దేవఋత్విఙ్నికాయంబులకు నారోగ్యంబు గావింపు మీ[3]మఖావశిష్టంబు యజ్ఞపరిపూర్తి హేతుభూతంబయిన భవదీయభాగం బగుం గాక. 151

—♦ శివుఁడు బ్రహ్మాదులచేఁ బ్రార్థితుండై దక్షాదుల ననుగ్రహించుట. ♦—

చ. అని చతురాననుండు విన♦యంబున వేఁడిన నిందుమౌళి స
య్యనఁ బరితుష్టిఁ బొంది దర♦హాసము మోమునఁ దొంగలింప ని

1 నీలలోహితుఁడు=శివుఁడు. 2 పూషుఁడు = సూర్యుఁడు. 3 మఖావశిష్టము—యజ్ఞమున మిగిలినది.

ట్టిన హరిమాయచేత సన♦యంబును బొమసు వైన సవాగసే
సిన యపరాధ దోషములు ♦ చిత్తములోఁ గణియింప నెన్నఁడున్.

వ. అట్లయ్యును. 153

క. బలియుర దండించుట దు
ర్బలజనరక్షణము ధర్మ♦పద్ధతి యగుటం
గలుషాత్ముల నపరాధము
కొలఁదిని దండించు చుండుఁ ♦ గొనకొని యేనున్. 154

వ. అని దగ్ధశీర్షుండయిన దక్షుం [1]డజముఖుం డగు భగుండు బర్హిస్సంబంధభాగంబులు గలిగి మిత్రనామధేయ చక్షుస్సునం బొడగాంచు బూషుండు [2]పిష్టభు క్కగుచు యజమాన దంతంబులచే భక్షించు దేవతలు యజ్ఞావశిష్టంబు నా కొసంగుటం జేసి సర్వావయవపూర్ణులై వర్తింతురు ఖండితాంగు లైన ఋత్విగాదిజనంబు లశ్వినీదేవతల బాహులచేతను బూషుని హస్తంబులచేతను లబ్ధబాహుహస్తు లై జీవింతురు భృగువు [3]బస్తశ్మశ్రువులు గలిగి వర్తించు నని శివుండానతిచ్చిన సమస్తభూతంబులు సంతుష్టాంతరంగంబు లై తండ్రి! లెస్సయ్యె నని సాధువాదంబుల నభినందించి రంత నా శంభుని [4]యామంత్రణంబు వడసి సునాసీర ప్రముఖు లగు దేవతలు ఋషులతోడం గూడి రా నజుండును రుద్రునిం బురస్కరించుకొని దక్షాధ్వరవాటంబునకుం జనియె నంత. 155

క. శర్వ నియోగక్రమమున
సర్వావయవములుఁ గలిగి ♦ సన్ముని ఋత్వి
గ్గీర్వాణముఖ్యు లొప్పిరి
పూర్వతనుశ్రీల నార్య♦భూషణ యంతన్. 156

క. విను దక్షు నంత మేషము
ఖునిఁ జేసిన నిద్రమేలు♦కొని లేచిన పో
ల్కిని నిలిచె దక్షుఁ డభవుఁడు
గనుఁగొను చుండంగ నాత్మఁ ♦ గౌతుక మొప్పన్. 157

1 అజముఖుఁడు=మేఁకముఖము గలవాఁడు. 2 పిష్టభుక్కు=పిండితినువాఁడు.
3 బస్త=మేకపోఁతు. 4 ఆమంత్రణము = సెలవుగొనుట.

వ. ఇట్లు లేచి నిలిచి ముందఱ నున్న శివునిం గనుంగొనిన మాత్రన
శరత్కాలంబున సకల్మషం బైన సరస్సునుంబోలెఁ బూర్వరుద్ర
విద్వేష జనితంబు లైన కల్మషంబులం బాసి నిర్మలుండై యభవుని
నుతియింపం దొడంగి మృతిఁ బొందిన సతీతనయాం దలంచి యనురా
[1] గోత్కంఠల బాష్పపూరిత లోచనుండును గద్గద కంఠుండు నై
పలుకం జాలక యెట్టకేలకు దుఃఖంబు సంస్తంభించుకొని ప్రేమాతి
రేక విహ్వలుం డగుచు సర్వేశ్వరుం డగు హరున కిట్లనియె. 158

క. విను నీ కపరాధుఁడ నగు
నను దండించు టిది దండ♦నము గాదు మది
న్నను రక్షించుటగా మన
మునఁ దలఁతును దేవ యభవ♦పురహర రుద్రా! 159

సీ. అనఘాత్మ తగ నీవు ♦ నబ్జనాభుండును
బరికింప బ్రాహ్మణా♦భాసు లయిన
వారలయెడల నే♦వ్వలన నుపేక్షింప
రఁట దృఢవ్రతచర్యు ♦ లైనవారి
యెడ నీ కుపేక్ష యె♦క్కడిది సర్గాదిని
నామ్నాయసంప్రదా♦య ప్రవర్త
నము నెఱింగించుట ♦ కమర విద్యాతపో
వ్రతపరాయణు లైన ♦ బ్రాహ్మణులను

తే. వరుసఁ బుట్టించితివి కాన ♦ వారి నెపుడుఁ
గేల దండంబుఁ బూని గో♦పాలకుండు
బలసి గోవుల రక్షించు♦పగిది నీవు
నరసి రక్షించుచుందుఁ గ♦దయ్య రుద్ర. 160

సీ. తలపోయ నవిదిత ♦ తత్త్వ విజ్ఞానుండ
నైన నాచేత స♦భాంతరమున
నతి [3]దురుక్త్యంబక♦క్షతుఁడ వయ్యును మత్కృ
తాపరాధము హృద♦యంబునందుఁ

1 ఉత్కంఠ = కోరినవస్తువునందలి వేగిరపాటు. 2 సర్గాది=సృష్టికి మొదలు.
3 దురుక్త్యంబకక్షతుఁడు=చెడు మాట లను బాణములచే గాయపరుపఁ బడినవాఁడు.

భవ భవామర ముఖ్యుల ♦ ప్రభలు మాప
నఖిలలోకైకగురుఁడు నా♦రాయణుండు. 163

చ. సలలిత శంఖ చక్ర జల♦జాత గదా శర చాప ఖడ్గ ని
ర్మలరుచులున్ సువర్ణ రుచి♦మన్మణికంకణ ముద్రికా ప్రభా
వలులును దేజరిల్ల భుజ♦వర్గ మనర్గళ కాంతియుక్తమై
విలసిత [1]కర్ణికారపృథి♦వీరుహముం బురుడింపఁ బట్టుగన్. 164

క. సరసోదారసమంచిత
సరహాస విలోకనములఁ ♦ దగ లోకములం
బరితోషము నొందించుచుఁ
బరమోత్సవ మొప్ప విశ్వ♦బంధుం డగుచున్. 165

చ. మఱియును రాజహంసరుచి♦మ[2]ద్భ్రమణీకృత తాలవృంతచా
మరములు వీవఁగా దివిజ♦మానిను లచ్ఛ సుధా మరీచి వి
స్ఫురణ సితాతపత్రరుచి♦పుంజము దిక్కులఁ బిక్కటిల్లఁగాఁ
గరివరదుండు వచ్చె శుభ♦గస్తుతివర్ణ [3]సుపర్ణ యానుఁడై. 166

చ. ఘనరుచి నట్లు వచ్చిన వి♦కారవిదూరు ముకుందుఁ జూచి బో
రన సరవిందనందన పు♦రందర చంద్రకళాధరా[4]మృతా
శనముఖు లర్థి లేచి యతి♦సంభ్రమ మొప్ప 'నమో నమో దయా
వననిధయే' యటంచు నని♦వారణ మ్రొక్కిరి భక్తియుక్తులై. 167

వ. అట్లు కృతప్రణాములై నయనంతరంబ. 168

ఉ. ఆ నలినాయతాక్షుని య♦నంత పరాక్రమ దుర్నిరీక్ష్య తే
జో[5]నిహతస్వదీప్తు లగు♦చున్ నుతి సేయ నశక్తులై భయ
గ్లాని వహించి బాష్పములు ♦ గ్రమ్మఁగ గద్గదకంఠులై తనుల్
మ్రానుపడంగ నవ్విభుని ♦ మన్ననఁ గైకొని యెట్టకేలకున్. 169

వ. నిటలతట ఘటిత కరపుటులై యమ్మహాత్ముని యపారమహిమం
బెఱింగి నుతియింప శక్తులు గాక యుండియుఁ గృతానుగ్రహ విగ్ర

---

1 కర్ణికార పృథివీరుహము=కొండగోఁగుచెట్టు. 2 భ్రమణీకృత తాలవృంత చామరములు=త్రిప్పఁబడు విసనకఱ్ఱలు, వింజామరలు. 3 సుపర్ణయానుఁడు=గరుడ వాహనుఁడు. 4 అమృతాశన ముఖులు=దేవతలు మొదలగువారు. 5 నిహత స్వదీప్తులు=పోఁగొట్టఁబడిన తమకాంతి గలవారు.

మయ్యా మాధవ గోవింద • హరి ముకుంద
చిన్మయాకార నిత్య ల•క్ష్మీవిహార. 171

వ. సదస్యు లిట్లనిరి. 172

సీ. శోకదావాగ్ని శి•ఖాకులితంబు [1]పృ
థుక్లేశఘనదుర్గ • దుర్గమంబు
దండధర క్రూర • [2]కుండలి క్లిష్టంబు
పాపకర్మ వ్యాఘ్ర•పరివృతంబు
గురుసుఖదుఃఖ[3]కా•కోలపూరితగర్త
మగుచు ననాశ్రయ • మైనయట్టి
సంసారమార్గసం•చారులై మృగతృష్ణి
కలఁ బోలువిషయసం•ఘము [4]నహమ్మ

తే. మేతి హేతుక దేహని•కేతనములు
నయి మహాభారవహులైన•యట్టి మూఢ
జనము లేనాఁట మీపదా•బ్జములు గానఁ
జాలువారలు భక్తిప్ర•సన్న దేవ. 173

వ. రుద్రుం డిట్లనియె. 174

చ. వరద నిరీహయోగిజన•వర్గసుపూజిత నీపదాబ్జముల్
నిరతము నంతరంగమున • నిల్పి భవత్పదనుగ్రహాదిక
స్ఫురణఁ దనర్చునన్ను సతి•మూఢు లవిద్యులు మున్నమంగళా
వరణుఁ డటంచుఁ బల్కిన భ•వత్స్మృతి నే గణియింప నచ్యుతా. 175

వ. భృగుం డిట్లనియె. 176

మ. అరవిందోదర తావకీనఘనమా•యామోహితస్వాంతులై
పరమంబైన భవన్మహామహిమముం • బాటించి కానంగ నో
పరు బ్రహ్మాదిశరీరు లజ్ఞులయి యో • పద్మాక్ష భక్తార్తిసం
హరణాలోకన నన్నుఁ గావఁదగు ని•త్యానందసంధాయివై. 177

1 పృథుక్లేశఘనదుర్గ దుర్గమంబు = గొప్పదుఃఖ మను పెద్దదుర్గముచే దాఁట రానిది. 2 కుండలి = పాము. 3 కాకోలపూరిత గర్తము = విషముతో నిండిన గుంట. 4 అహమ్మమేతి ... దేహనికేతనములు = నేను నాయొక్క ... అను దేహమును గృహముగాఁ గలవారు.

వ. బ్రహ్మ యిట్లనియె. 178

సీ. తవిలి పదార్థభే•ద 1గ్రాహకము లైన
చక్షురింద్రియముల • సరణిఁ గాక
గలుగు నీరూపంబు • గడఁగి మాయామయం
బగు 2నసద్వ్యతిరిక్త • మగుచు మాకు
జ్ఞానార్థకారణ • సత్త్వాదిగుణముల
కాశ్రయభూతమై • యలరుచున్న
నిరుపమాకారంబు • నీకు విలక్షణం
బై యుండు ననుచు నే • నాత్మఁ దలఁతు

తే. నిర్వికార నిరంజన • నిష్కళంక
నిరతిశయ 3నిష్క్రియారంభ • నిర్మలాత్మ
విశ్వసంబోధ్య నిరవద్య • వేదవేద్య
పరిమలానంద సంసార•భయవిదూర. 179

వ. ఇంద్రుం డిట్లనియె. 180

మ. దితిసంతానవినాశసాధనసము•ద్దీప్తాష్టబాహాసమ
న్వితమై యోగిమనోనురాగపదమై • వెల్గొందు నీదేహ మా
యత మైనట్టి ప్రపంచముం బలెను మి•థ్యాభూతముం గాదు శా
శ్వతముంగా మదిలోఁ దలంతు హరి దే•వా మిమ్ము సర్వాత్మకా. 181

వ. ఋత్విక్పత్ను లిట్లనిరి. 182

చ. కడఁగి భవత్పదార్చనకుఁ • గా నిటు దక్షునిచే రచింపఁ గాఁ
బడి శితికంఠరోషమున • భస్మము నొంది 4పరేతభూమి యై
చెడి కడుశాంతమేధమునఁ • జెన్నఱి యున్న మఖంబుఁ గావఁ బే
ర్పడ జలజాభ నేత్రములఁ • బావన మై విలసిల్లు సద్వ్రతా. 183

వ. ఋషు లిట్లనిరి. 184

మ. అనఘా మాధవ నీవ మావలన క•ర్మారంభి వై యుండియున్
విను తత్కర్మఫలంబు వొంద వితరుల్ • విశ్వంబునన్ భూతిఁ

---

1 గ్రాహకములు = గ్రహించునవి. 2 అసత్ = అజ్ఞానము. 3 నిష్క్రియారంభ = కార్యారంభము లేనివాఁడా. 4 పరేతభూమి = శ్మశానము.

యోనయంబుల భజియించునిందిర గరం • బర్థి న్నిమ్నుఁ జేరఁ గై
కొన వే మందుము నీ చరిత్రమునకుల • గోవింద పద్మోదరా. 185

వ. సిద్ధు లిట్లనిరి. 186

చ. హరి భవదుఃఖభీషణద•వానలదగ్ధ [1]తృషార్తమన్మనో
ద్విరదము శోభనంబును బ•విత్రము నైన భవత్కథాసుధా
[2]సరిదవగాహనంబునను • సంసృతితాపము వాసి క్రమ్మఱం
దిరుగదు బ్రహ్మముం గనిన • ధీరునిభంగిఁ బయోరుహోదరా.

వ. యజమాని యగు పత్నిసూతి యిట్లనియె. 188

చ. కరచరణాదికాంగములు • గల్గియు మస్తము లేని మొండెముం
బరువడి నొప్పకున్న గతిఁ • బంకజలోచన నీవు లేని య
ధ్వరము [3]ప్రయాజులం గలిగి • తిద్దయు నొప్పకయున్న దీయెడల
హరి యిటు నీదురాక శుభ • మయ్యె రమాధిప మమ్ముఁ గావవే.

వ. లోకపాలకు లిట్లనిరి. 190

సీ. దేవాదిదేవ యీ • దృశ్యరూపం బగు
సుమహిత విశ్వంబుఁ • జూచు ప్రత్య
గాత్మభూతుండ వై •నట్టినీవు నసత్ప్ర
కాశరూపంబు లై • కలుగు మాయ
కేంద్రియంబులచేత • నీశ్వర నీ మాయ
నొందించి [4]పంచభూ•తోపలక్షి
తం బగు దేహవి•ధంబునఁ గానంగ
బడుదువు గాని యే•ర్పడిన శుద్ధ

తే. సత్త్వగుణయుక్త మైన భా•స్వత్స్వరూప
ధరుఁడ వై కానఁబడవుగాఁ • బరమపురుష
యవ్యయానంద గోవింద • యట్లుగాన
నెనయ మా జీవనము లింక • నేమి గలవు. 191

వ. యోగీశ్వరు లిట్లనిరి. 192

---

1 తృషార్తమన్మనోద్విరదము = దప్పిచే బాధపడు నా చిత్తమను ఏనుఁగు. 2 సరిదవగాహనము = ప్రవాహమున స్నానము 3. ప్రయాజులు = గొప్పయజ్ఞమును చేయువారు. 4 పంచభూతోపలక్షితము = పంచభూతములచే గ్రహింపఁబడినది.

వ. గంధర్వు లిట్లనిరి. 200

మ. హర పంకేజభవామరాదులు మరీ♦చ్యాది ప్రజానాథు లో
యరవిందాక్ష రమాహృదీశ భవదీ♦యాంశాంశసంభూతులై
పరగం బావకలీలకై నెగడు నీ ♦ బ్రహ్మాండమున్ దేవ యీ
శ్వర నీ కే మతిభక్తి మ్రొక్కెదము దే♦వా శ్రీశ రక్షింపుమా. 201

వ. విద్యాధరు లిట్లనిరి. 202

సీ. నలినాక్ష విను భవ♦న్మాయావశంబున
దేహంబుఁ దాల్చి త♦ద్దేహమందు
నాత్మ నహమ్మమే♦త్యభిమానమును బొంది
పుత్రి జాయా గృహ ♦ క్షేత్ర బంధు
ధన పశుముఖవస్తు♦తతుల సంయోగవి
యోగ దుఃఖంబున ♦ నొందుచుండు
ధృతివిహీనుఁడు నస♦ద్విషయా[1]తిలాలసుఁ
డతిదుష్టమతియు నై ♦ సృక్కువాఁడు

తే. దవిలి భవదీయ గుణ సత్క♦థావిలోలుఁ
డయ్యె నేనియు నాత్మమో♦హంబువలనఁ
బాసి వర్తించు విజ్ఞాన ♦ పరత గలిగి
చిరదయాకార యిందిరా ♦ చిత్తచోర. 203

వ. బ్రాహ్మణజనంబు లిట్లనిరి దేవా యీ క్రతువును హవ్యంబును
నగ్నియు మంత్రంబులును సమిద్దర్భపాత్రంబులును సదస్యులును
ఋత్విక్కులును దంపతులును దేవతలును నగ్నిహోత్రంబులును
స్వధయు సోమంబును నాజ్యంబును బశువును నీవ నీవు దొల్లి వేద
మయ సూకరాకారంబు ధరియించి దంష్ట్రాదండంబున వారణేంద్రంబు
నళినంబు ధరియించు చందంబున రసాతలగత యైనభూమి నెత్తితి
వట్టి యోగిజనస్తుత్యుండవును యజ్ఞక్రతురూపకుండవును నైన
నీవు పరిభ్రష్ట కర్ములమై కాంక్షించు మాకుం బ్రసన్నుండ వగుము
భవదీయ నామకీర్తనంబుల సకల యజ్ఞ విఘ్నంబులు నాశంబు
నొందు నట్టి నీకు నమస్కరింతుము. 204

---

1 అతిలాలసుఁడు=మిగుల ఆసక్తిగలవాఁడు.

క. అని తన్ను సకలజనములు
వినుతించిన హరి భవుండు ♦ విఘ్నముగావిం
చిన యాదక్షునియజ్ఞము
ఘనముగఁ జెల్లించెఁ గొఱఁత ♦ గాకుండంగన్. 205

క. సకలాత్ముఁడు దా నగుటను
సకలహవిర్భోక్త యయ్యు ♦ జలజాక్షుండుం
బ్రకటస్వభావమున న
య్యకలంకుఁడు తృప్తిఁ బొంది ♦ యనె దక్షునితోన్. 206

వ. అనఘా నేనును బ్రహ్మయు శివుండు నీజగంబులకుఁ గారణ భూతులము. అందు నీశ్వరుఁడును [1]ద్రష్టయు స్వయంప్రకాశుండు నైన నేను గుణమయం బయిన యాత్మీయమాయం బ్రవేశించి జననవృద్ధి విలయంబులకు హేతుభూతంబు లగు తత్త్రిక్రియోచితంబు లయిన బ్రహ్మరుద్రాది నామభేదంబుల నొందుచుండుదు; నట్టి యద్వితీయ బ్రహ్మరూపకుండ నైన నాయందు నజభవాదులను భూతగణంబులను మూఢుండగువాఁడు వేఱుగాఁ జూచు; మనుజుండు శరీరంబునకుఁ గరచరణాదులు వేఱుగాఁ దలంపని చందంబున మద్భక్తుం డగువాఁడు నాయందు భూతజాలంబు భిన్నంబుగాఁ దలంపండు కావున మామువ్వురయందు నెవ్వాఁడు వేఱు సేయకుండు వాఁడు కృతార్థుం డని యానతిచ్చిన దక్షుండును. 207

క. విను విష్ణుదేవతాకం, బనఁగాఁ ద్రికపాలకలిత ♦ మగునాయాగం
బునఁ దగ నవ్విష్ణునిపద, వనజంబులు పూజసేసి ♦ వారని భక్తిన్.

వ. మఱియును. 209

సీ. అంగప్రధానక ♦ యాగంబులను జేసి
యమరుల రుద్రుని ♦ నర్థిఁ బూజ
సేసి విశిష్టేష్ట ♦ శిష్టభాగమున ను
దవసాన కర్మంబుఁ ♦ దవిలి తీర్చి
దాను ఋత్విక్కులుఁ ♦ [2]దగ సోమపులఁ గూడి
యవభృథస్నానంబు ♦ లాచరించి

1 ద్రష్ట = చూచువాఁడు. 2 సోమపులు = సోమయాజులు.

కడకఁ [1]సవాప్తసకల♦ఫలకాముఁడై
తనరుదక్షునిఁ ♦ జూచి ధర్మబుద్ధి
తే. గలిగి సుఖవృత్తి జీవింతుఁ ♦ గాక యనుచుఁ
బలికె దివిజులు మునులును ♦ బ్రాహ్మణులును
జనిరి నిజమందిరముల కా ♦ జలజనయన
భవులు వేంచేసి రాత్మీయ♦భవనములకు. 210

వ. అంత దాక్షాయణి యయిన సతీదేవి పూర్వ కళేబరంబు విడిచి హిమవంతునకు మేనకయందు జనియించి విలయ కాలంబునం బ్రసుప్తం బయినశక్తి సృష్టికాలంబున నీశ్వరుని బొందు చందంబునఁ బూర్వదయితుండగు రుద్రుని వరియించెనని దక్షాధ్వరధ్వంసకుండగు రుద్రుని చరిత్రంబు బృహస్పతి శిష్యుండైన యుద్ధవునకు నెఱిం గించె నతండు నాకుం జెప్పె నేను నీకుం జెప్పితి నని మైత్రేయుండు వెండియు విదురున కిట్లనియె. 211

క. ఈ యాఖ్యానముఁ జదివిన
శ్రీయుతులకు వినినయట్టి ♦ ధీరుల కైశ్వ
ర్యాయుఃకీర్తులు గలుగును
బాయును దురితములు దొలఁగు ♦ [2]భవబంధంబుల్. 212

వ. అని వెండియు నిట్లనియె. 213

క. విను సనకాదులు నారదుఁ
డును హంసుఁడు నరుణియు ఋభుఁ♦డు యతియుఁ గమలా
సనజులు నైష్ఠికు లనికే
తను లగుటం జాగవయ్యెఁ ♦ దద్వంశంబుల్. 214

వ. మఱియు నధర్మునకు మృష యను భార్యయందు దంభుండును మాయ యను నంగనయుం బుట్టి రధర్మసంతానం బగు వారిరువు రును మిథునం బైన వారిని సంతానహీనుం డగు నిరృతి గైకొనియె. వారలకు లోభుండును నికృతి యను సతియునుం గలిగి మిథునం బైరి. ఆ మిథునంబునకుఁ గ్రోధుండు హింస యను నంగనయుం బుట్టి

1 అవాప్తసకల...కాముఁడు = పొందఁబడిన సర్వ...వాంఛలు గలవాఁడు.
2 భవబంధము = సంసార (పాప) బంధము.

మిథునం బైరి. ఆ మిథునంబునకుఁ గలియు దురుక్తి యను నంగనయుఁ జన్మించి దాంపత్యంబు గయికొని యా దంపతులకు భయ మృత్యువు లను మిథునంబు గలిగె. దానివలన యాతనయు నిరయంబును బుట్టిరి. వీరలు సంసారహేతు వగు నధర్మతరుశాఖలుగా నెఱుఁగుము. వీని శ్రేయస్కాముం డగు జనుం [1]డీషన్మాత్రంబు నను వర్తింపఁ జనదు. ఇవ్విధంబున మ్రతిసర్గంబును సంగ్రహంబున నెఱింగించితి నిప్పుణ్య కథ నెవ్వండేని ముమ్మాఱు వినిన నతండు మానసికకలుష నిష్పాపుఁ డగు నని చెప్పి మఱియు నిట్లనియె. 215

—◆ ధ్రువోపాఖ్యానము ◆—

క. విను నిఖిలభువనసరిపా
లనమునకై చంద్రధరకళాకలితుం డౌ
వనజజునకు స్వాయంభువ
మను వపు డుదయించెఁ గీర్తిమంతుం డనఘా. 216

తే. రూఢి నమ్మనువునకు శతరూపవలన
భూనుతు లగు ప్రియవ్రతోత్తానపాదు
లనఁగ నిద్దఱు పుత్రులై రందులోనఁ
భవ్యచారిత్రుఁ డుత్తానపాదునకును. 217

క. వినుము సునీతియు సురుచియు
ననుభార్యలు గలరు వారియందును ధ్రువునిం
గనిన సునీతియు నప్రియ
యును సురుచియుఁ బ్రియయు నగుచు నున్న యెడనె. 218

సీ. ఒకనాఁడు సుఖలీల ◆ నుత్తానపాదుండు
మఱిఁ బ్రియురాలైన ◆ సురుచి గన్న
కొడుకు నుత్తముఁ దన ◆ తొడలపై నిడికొని
[2]యుపలాలనము సేయు ◆ చున్న వేళ
నర్థిఁ [3]దదారోహణాపేక్షితుం డైన
ధ్రువుని గనుంగొని ◆ తివుట సొద

1 ఈషన్మాత్రము = కొంచెము. 2 ఉపలాలనము = బుజ్జగింపు. 3 తదారోహణాపేక్షితుఁడు = ఆ తొడను ఎక్కఁ గోరికగలవాఁడు.

రింపకుండుటకు గ♦ర్వించి యా సురుచియు
సవతిబిడ్డం డైన ♦ ధ్రువుని జూచి

తే. తండ్రితోడ నెక్కవేడుక ♦ దగిలెనేనిఁ
బూని నాగర్భమున నాఁడె ♦ పుట్ట కన్య
గర్భమునఁ బుట్టి కోరెనఁ ♦ గలదె నేఁడు
జనకుతోడ నెక్కభాగ్యంబు ♦ సవతికొడుక. 219

క. అది గాన నీ వధోక్షజు
పదపద్మము లాశ్రయింపు ♦ పాయక హరి నా
యుదరమునఁ బుట్టఁజేయును
వదలక యట్లయిన ముదము ♦ వఱలెడి నీకున్. 220

క. అని యీ రీతి ససహ్యవ
చనములు పినతల్లి యపుడు ♦ జనకుఁడు వినఁగాఁ
దను నాడినదుర్భాషా
ఘనశరములు మనము నాఁటి ♦ [1]కాఱియ వెట్టన్. 221

క. తాను స[illegible] చేసిన
జనకునికడఁ బాసి దుఃఖ♦జలనిధిలోనన్
మునుఁగుచును దండతాడిత
ఘనభుజగముఁబోలె రోష♦కలితుం డగుచున్. 222

క. ఘనరోదనంబు సేయుచుఁ
గనుఁగవలను శోకబాష్ప♦కణములు దొరఁగన్
జననికడ కేగుటయు నిజ
తనయుని గని యా సునీతి ♦ తద్దయుఁ బ్రేమన్. 223

వ. తొడలపై నిడికొని. 224

క. కర మనురక్తిని మోము ని
విరి తద్వృత్తాంత మెల్ల ♦ వెలఁదులు నంతః
పురవాసులుఁ జెప్పిన విని
పఱపుగ నిట్టూర్పు లెసఁగ ♦ బాష్పాకులయై. 225

1 కాఱియవెట్టు = బాధపెట్టు.

తే. సవతి యాడినమాటలు ♦ సారెఁ దలఁచి
కొనుమఁ బేర్చినదుఃఖాగ్నిఁ ♦ గుంగుచుండె
[1]దావపావకశిఖలచేఁ ♦ దగిలి కాంతి
వితతి గందిన [2]మాధవీ♦లతిక వోలె. 226

వ. అంత నా సునీతి బాలునిం జూచి తండ్రీ దుఃఖింపకు మని యిట్లనియె.

క. అనఘా యీ దుఃఖమునకుఁ
బని లే దన్యులను నేలయు ♦ బలవంతంబై
తనపూర్వజన్మదుష్కృత
ఘనకర్మము వెంట నంటఁ♦గా నెవ్వలనన్. 228

వ. కావున. 229

క. పెనిమిటిచేతను బెండ్లా
మని కాదు [3]నికృష్టదాసి ♦ యనియును బిలువన్
గను జాలని దుర్భగురా
లనఁ గల నా కుక్షి నుదయ♦మందిన కతనన్. 230

క. నిను నాడిన యా సురుచివ
చనములు సత్యంబు లగును ♦ సర్వేశ్వరుఁ డం
డనఁ గల హరిచరణంబులు
గను జననియంక మెక్కఁ♦గాఁ దలఁచితేనిన్. 231

వ. కావునం బినతల్లి యైన యాసురుచియాదేశంబున సర్వేశ్వరు నారా
ధింపు మని వెండియు నిట్లనియె. 232

సీ. పరికింప నీ విశ్వ♦పరిపాలనమున కై
యర్థి [4]గుణవ్యక్తుఁ ♦ డై నయట్టి
నారాయణునిపాద♦నలినముల్ సేవించి
తగ బ్రహ్మ బ్రహ్మప♦దంబు నొందె
ఘనుఁడు మీతాత యా ♦ మనువు సర్వాంతర
యామిత్వ మగు నేక ♦ మైనదృష్టిఁ

1 దావపావకశిఖలు = కార్చిచ్చుమంటలు. 2 మాధవీలతిక = [illegible]
3 నికృష్టదాసి = నీచదాసి. 4 గుణవ్యక్తుఁడు = త్రిగుణములచే గోచరించువాఁడు.

జేసి యోగముల యజించి తా [1]భౌమసు
ఖములను దివ్యసుఖముల మోక్ష
తే. సుఖములను బొందె నట్టియచ్యుతుని బరుని
వితతయోగీంద్రనికర[2]సంవేష్ట్యమాణ
చరణసరసిజయుగళు శశ్వత్ప్రకాశు
భక్తవత్సలు విశ్వసంపాద్యు హరిని. 233

వ. మఱియును. 234

క. కరరాజీవగృహీతాంబురుహాయు నరవిందగర్భముఖగీర్వాణుల్
పరికింపం గల లక్ష్మీతరుణీమణిచేత వెదకందగు పరమేశున్. 235

— ధ్రువుండు నారదోపదేశంబు వడసి తపంబుఁ జేయుట —

వ. నిజధర్మపరిశోభితంబైన యేకాగ్రచిత్తంబున నిలిచి సేవింపు మమ్మహాత్మునకంటె నీదుఃఖం బపనయించువాఁ డన్యుం డొక్కరుండు గలండే యని పలికినఁ బరమార్థప్రాప్తి హేతుకంబులైన తల్లివాక్యంబులు విని తన్నుఁ దాన నియమించుకొని పురంబు వెడలిచనునవసరంబున నారదుండు తద్వృత్తాంతం బెఱింగి యచ్చటికిం జనుదెంచి యతని చిత్తంబు దెలిసి పాపనాశకరం బైన తన కరతలంబు నా ధ్రువుని శిరంబునం బెట్టి మానభంగంబునకు సహింపని క్షత్త్రియుల ప్రభావం బద్భుతంబుగదా బాలకుఁడయ్యు బినతల్లియాడిన దురుక్తులు చిత్తంబునం బెట్టి చనుచున్నవాఁ డని మనంబున నాశ్చర్యంబు నొంది యో బాలక సకలసంపత్సమృద్ధం బగు మందిరంబు దెగడి యొంటి నెందు నేగెదవు స్వజనకృతం బగు నవమానంబుచే నిను సంతప్తుంగాఁ దలంచెద ననిన ధ్రువుం డి ట్లనియె. [3]సపత్నీమాతృవాగిషుక్షతం బగు వ్రణంబు భగవద్ధ్యానయోగరసాయనంబున మాపుకొందు ననిన విని ధ్రువునికి నారదుం డిట్లనియె. 236

క. విను పుత్రక బాలుఁడవై
యనయంబును గ్రీడలందు నాసక్తమనం

1 భౌమసుఖములు = భూలోకమునకు సంబంధించిన సౌఖ్యములు. 2 సంవేష్ట్యమాణ = ఆవరింపఁబడు. 3 సపత్నీమాతృవాగిషుక్షతము = సవతితల్లిమాట లను బాణములచే గాయపడినది.

నీచేత వినంబడె నట్టియును బరభయంకరం బగు క్షాత్త్రధర్మంబు నొందిన యవినీతుండ నగు నేను సురుచిదురుక్తు లను బాణంబులవలన వినిర్భిన్న హృదయుండ నగుట మదీయచిత్తంబున శాంతి నిలువదు కావునఁ ద్రిభువనోత్కృష్టంబు [1]ననన్యాధిష్ఠితంబు నగు పదంబును బొంద నిశ్చయించిన నాకు సాధుమార్గంబు నెఱింగింపుము. నీవు భగవంతుండగు నజుని యూరువువలన జనించి వీణావాదనకుశలుండవై జగద్ధితార్థంబు సూర్యుండునుంబోలె వర్తింతు వనిన విని. 241

క. నారదుఁ డిట్లను నసఘు కు
మారక విను నిన్ను మోక్ష ♦ మార్గంబునకుఁ
బ్రేరేచినవాఁ డిప్పుడు
ధీరజనోత్తముఁడు వాసు ♦ దేవుం డగుటన్. 242

వ. నీవు నమ్మహాత్ముని నజస్రధ్యానప్రవణచిత్తుండవై భజియింపుము.

క. పురుషుండు దవిలి చతుర్విధ
పురుషార్థశ్రేయ మాత్మఁ ♦ బొందెద ననినన్
ధరఁ దత్ప్రాప్తికి హేతువు
హరిపదయుగళంబు దక్క ♦ నన్యము గలదే. 244

వ. కావున. 245

క. వరయమునానదితటమునఁ
హరిసాన్నిధ్యంబు శుచియు ♦ నతిపుణ్యము నై
పరఁగిన మధువనమునకును
సరసగుణా చనుము మేలు ♦ సమకుఱు నచటన్. 246

క. ఆ యమునాతటినీశుభ
తోయములం గ్రుంకి నిష్ఠ ♦ తో నచ్చట నా
రాయణునకును నమస్కృతు
[2]లాయతమతిఁ జేసి సేయు ♦ యమనియమములన్. 247

వ. మఱియు బాలుండ వగుటం జేసి వేదాధ్యయనాద్యుచిత కర్మానర్హుండ వయ్యు నుచితంబు లగు కుశాజినంబులం జేసి స్వస్తిక పద్మముఖాసనంబులం గల్పించుకొని త్రివృత్ప్రాణాయామంబులచేతం

1 అనన్యాధిష్ఠితము = ఇతరులు ఎక్కనిది. 2 ఆయతమతి = విశాల హృదయము.

ప్రాణేంద్రియమనోబలంబు లను జాంతవదోషంబులఁ బ్రక్షాళించి
స్థిరం బయిన చిత్తంబున. 248

సీ. ఆశ్రితసత్ప్రసా•దాభిముఖుండును
స్నిగ్ధప్రసన్నాన•నేక్షణుండు
సురుచిరనాసుండు • సుభ్రూయుగుండును
సుకపోలతలుఁడును • సుందరుండు
హరినీలసంశోభి•తాంగుండుఁ దరుణుండు
నరుణావలోకనో•ష్ఠాధరుండుఁ
గరుణాసముద్రుండుఁ • బురుషార్థనిధియును
బ్రణతాశ్రయుండు శో•భనకరుండు

తే. లలిత శ్రీవత్సలక్షణ•లక్షితుండు
సర్వలోకశరణ్యుండు • సర్వసాక్షి
పురుషలక్షణయుక్తుండుఁ • బుణ్యశాలి
[1]యసితమేఘనిభశ్యాముఁ • డవ్యయుండు. 249

వ. మఱియును. 250

సీ. హారకిరీటకే•యూరకంకణఘన
భూషణుం డాశ్రిత•పోషణుండు
లాలితకాంచీక•లాపశోభితకటి
మండలుం డంచిత•కుండలుండు
మహనీయకౌస్తుభ•మణియుక్తమున [2]గ్రై
వేయకుం డానంద•దాయకుండు
సలలితఘనశంఖ•చక్రగదాపద్మ
హస్తుండు భువనప్ర•శస్తుఁ డజుఁడు

తే. కమ్రసౌరభవనమాలి•కాధరుండు
హతవిమోహుండు నవ్యపీ•తాంబరుండు
లలితకాంచననూపురా•లంకృతుండు
నిరతిశయసద్గుణుండు దర్శ•నీయతముఁడు. 251

1 అసితమేఘనిభశ్యాముఁడు = నల్లని మేఘమువంటి శ్యామవర్ణముగలవాఁడు. 2 గ్రైవేయము = హారము.

క. సరసమనోలోచన ము
ష్కరుఁడును హృత్పద్మకర్ణి ♦ కానివసితవి
స్ఫురదురునఖమణిశోభిత
చరణ సరోజాతుఁ డతుల ♦ శాంతుఁడు ఘనుఁడున్. 252

వ. అయిన పురుషోత్తముఁ బూజించుచు హృదయగతుండును సానురాగ విలోకనుండును వరదశ్రేష్ఠుండును నగు నారాయణు నేకాగ్ర చిత్తంబునం బరమనివృత్తిమార్గంబున ధ్యానంబు సేయుచు ధ్యాతుం డైన పురుషోత్తముని దివ్యమంగళ స్వరూపంబు చిత్తంబునం దగిలిన మరల మగుడ నేరదు. అదియునుం గాక యేమంత్రంబేని సప్తవాస రంబులు పఠియించిన [1]ఖేచరులం గనుంగొను సామర్థ్యంబు గలుగు నట్టి ప్రణవ యుక్తంబగు ద్వాదశాక్షరకలితంబును దేశకాలవిభాగ వేదియును బుధానుష్ఠితంబు నయిన (ఓం నమో భగవతే వాసు దేవాయ యనెడి) వాసుదేవ మంత్రంబునం జేసి. 253

సీ. [2]దూర్వాంకురంబుల ♦ దూర్వాంకురశ్యాము
జలజంబులను జారు ♦ జలజనయను
దులసీదళంబులఁ ♦ దులసికాదాముని
మాల్యంబులను సునై ♦ ర్మల్యచరితుఁ
బత్రంబులను బత్రి ♦ పత్రునిఁ గందవన్య
మూలంబులను నాది ♦ మూలఘనుని
నంచితభూర్జత్వ ♦ గాదినిర్మిత వివి
ధాంబరంబులను బీ ♦ తాంబరధరుఁ

తే. దనరు భక్తిని [3]మృచ్ఛిలా ♦ దారు రచిత
రూపములయందుఁ గాని ని ♦ రూఢమైన
సలిలములయందుఁ గాని సు ♦ స్థలములందుఁ
గాని పూజింప వలయు న ♦ క్కమలనాభు. 254

క. ధృతచిత్తుఁడు శాంతుండు ని
యతపరిభాషణుఁడు సుమహి ♦ తాచారుఁడు వ

1 ఖేచరులు = దేవతలు. 2 దూర్వాంకురములు = గఱికమొలకలు.
3 మృచ్ఛిలాదారురచిత = మట్టితో, ఱాతితో, కర్రతో, కట్టెతోఁ జేయఁబడిన.

ర్ణిత హరిమంగళగుణుఁడును
మితవన్యాశనుఁడు నగుచు ♦ మెలఁగుచు మఱియున్. 255

వ. ఉత్తమ శ్లోకుండగు పుండరీకాక్షుండు నిజమాయాస్వేచ్ఛావతార చరితంబులచేత నచింత్యంబుగా నెద్ది సేయు నద్ది హృదయగతంబుగా ధ్యానంబు సేయందగు. మఱియుం గార్యబుద్ధిం జేసి చేయంబడు పూజావిశేషంబులు వాసుదేవమంత్రంబున సర్వేశ్వరునికి సమర్పింప వలయునిట్లు మనోవాక్కాయ కర్మంబులచేతమనోగతంబగునట్లుగా భక్తియుక్తంబులయిన పూజలచేతఁ బూజింపఁబడి సర్వేశ్వరుండు మాయాభిభూతులుగాక సేవించు పురుషులకు ధర్మాది పురుషార్థంబులలోన నభిమతార్థంబునిచ్చు విరక్తుండగువాఁడు నిరంతర భావంబయిన భక్తియోగంబునం జేసి మోక్షంబుకొఱకు భజియించునని చెప్పిన విని ధ్రువుండు నారదునకుం బ్రదక్షిణ పూర్వకంబుగా నమస్కరించి మహర్షిజనసేవ్యంబై సకలసిద్ధుల నొసంగుచు భగవత్పాద సరోజాలంకృతం బయిన మధువనంబునకుం జనియె నంత.

తే. పద్మభవసూనుఁ డుత్తాన ♦ పాదు కడకు
నరిగి యారాజుచే వివి ♦ ధార్చనముల
నంది సంప్రీతుఁడై యున్న ♦ తాసనమున
నెలమిఁ గూర్చుండి యాతని ♦ [1]వలను సూచి. 257

వ. ఇట్లనియె. 258

క. భూనాయక నీవిపుడా, [2]మ్లానాస్యుఁడవగుచుఁ జాల♦మదిలోఁజింతం
బూనుట కేమి కతంబన, నానారదుతోడనాతఁ♦డనియెన్ మరలన్.

క. మునివర వివేకశాలియు
ననఘుఁడు నైదేండ్లబాలుఁ ♦ డస్మత్ప్రియనం
దనుఁ డదయుఁడనగు నాచే
తను బరిభవమొంది చనియెఁ ♦ దల్లియుఁ దానున్. 260

మ. చని యుగ్రాటవిఁజొచ్చి యచ్చటఁ[3] బరి♦శ్రాంతుండు క్షుత్పీడితుం
డును నామ్లాన ముఖాంబుజుండు ననఘుం♦డున్ బాలకుండైన మ

1 వలను = దిక్కు 2 ఆమ్లానాస్యుఁడు = వాడినమోము గలవాఁడు 3 పరిశ్రాంతుఁడు = బడలినవాఁడు.

త్తనయున్ ఘోర [1]వృకాహిభల్లముఖస♦త్త్వశ్రేణి నిర్జించెనో
యని దుఃఖించెద నాదుచిత్తమున నా♦ర్యస్తుత్య యిట్లాటకున్. 261

తే. అట్టి యుత్తమబాలు నా♦యంకపీఠ
మందుఁ గూర్చుండనీక ని♦రాకరించి
యంగనాసక్తచిత్తుండ♦నైనయట్టి
నాదు [2]దౌరాత్మ్య మిది ముని♦నాథచంద్ర. 262

ఉ. నా విని నారదుండు నర♦నాథున కిట్లను నీకుమారుఁ డా
దేవకిరీటరత్నరుచి♦దీపితపాదసరోజుఁడైన రా
జీవదళాక్షురక్షితుఁ డ♦శేషజగజ్జనకీర్తనీయకీ
ర్తివిభవప్రశస్తసుచ♦రిత్రుఁడు వానికి దుఃఖమేటికిన్. 263

ఉ. కావున నమ్మహాత్ముఁడు సు♦కర్మముచేత సమస్తలోకపా
లావళి కందరాని సము♦దంచితనిత్యపదంబునన్ బ్రభు
శ్రీ విలసిల్లఁ జెందుఁ దుల♦సీదళదాము భజించి యాజగ
త్పావనుఁడైన నీసుతుప్ర♦భావ మెఱుంగవు నీవు భూవరా. 264

వ. అదియునుంగాక. 265

క. నీకీర్తియు జగములయం, [3]దాకల్పమునొందఁజేయు♦నంచితగుణర
త్నాకరుఁ డిట కేతెంచును,శోకింపకుమతనిఁగూర్చి♦సుభగచరిత్రా.

క. అని నారదుండు పలికిన
విని మనమున విశ్వసించి♦విభుఁడును బ్రియనం
దనుఁ జింతించుచు నాదర
మునఁ జూడండయ్యె రాజ్య♦మును బూజ్యముగన్ 267

వ. అంత నక్కడ నాధ్రువుండు. 268

క. చని ముందటఁ గనుఁగొనె మధు
వనమును మునిదేవయోగి♦వర్ణితగుణపా
వనమును దుర్భరజలదప
వనమును నిఖిలైకపుణ్య♦వరభవనంబున్. 269

---

1 వృకాహిభల్లముఖ = తోడేలు పాము ఎలుగుబంటి మొదలగు. 2 దౌరాత్మ్యము = చెడుబుద్ధి. 3 ఆకల్పము = కల్పపర్యంతము.

వ. అట్లు గని డాయంజని యమునానదిం గృతస్నానుండై నియతుండును సమాహితచిత్తుండును నై సర్వేశ్వరుని ధ్యానంబు సేయుచుం బ్రతి త్రిరాత్రాంతంబునం గృత[1]కపిత్థబదరీఫలపారణుండును నగుచు దేహస్థితి ననుసరించి యిటుల నొక్కమాసంబు హరిం బూజించి, యంతనుండి యాఱేసిదినంబుల కొక్కపరి కృతజీర్ణతృణపర్ణాహారుం డగుచు రెండవమాసంబున విష్ణుసమారాధనంబు చేసి, యంతనుండి నవరాత్రంబుల కొకమా ఉదకభక్షణంబు సేయుచు మూఁడవ మాసంబున మాధవు నర్చించి, యంతనుండి ద్వాదశదినంబులకొక మాఱు వాయుభక్షణుండగుచు [2]జితశ్వాసుండై నాలవమాసంబునం బుండరీకాక్షుని భజియించి యంతనుండి మనంబున నల్లాడక నిరుచ్ఛ్వాసుండై యేకపదంబున నిలిచి పరమాత్మం జింతించుచు నచేతనంబైన [3]స్థాణువుం బోలె నైదవ మాసంబును జరిపె నంత. 270

సీ. సకల భూతేంద్రియా ♦ శ్రయమగుహృదయంబు
నందు విషయములఁ ♦ జెందనీక
మహదాదితత్త్వస ♦ మాజమ్ములకును నా
ధారభూతమును ♦ బ్రధానపూరు
షేశ్వరుండైనట్టి ♦ శాశ్వతబ్రహ్మంబుఁ
దనదైన హృదయప ♦ ద్మమున నిలిపి
హరిరూపమునకంటె ♦ నన్యంబు నెఱుఁగక
చిత్తమవ్విభునందుఁ ♦ జేర్చియున్న

తే. కతన ముల్లోకములు సాలఁ ♦ గంపమొందె
వెండియును జేర్చి యయ్యర్భ ♦ కుండు ధరణి
నొక్కపాదంబు మోపి ని ♦ ల్చున్న వేళఁ
బేర్చి యబ్బాలు [4]నంగుష్ఠ ♦ వడఁ జేసి. 271

తే. వసుమతీతల మర్థము ♦ వంగఁజొచ్చె
భూరిమదదుర్నివారణ ♦ వారణేంద్ర

1 కపిత్థబదరీ = వెలఁగ రేఁగుపండ్లు. 2 జితశ్వాసుఁడు = ఊర్పు మానినవాఁడు
3 స్థాణువు = చెట్టుబోదె. 4 అంగుష్ఠపీడ = బొటనవ్రేలి ఒత్తిడి.

మెడమఁ గుడి నొరగఁగ నడు ♦ గడుగునకును
జలన మొందెను జలనిధిఁ ♦ [1]గలముఁబోలె. 272

చ. అతఁడు ననన్యదృష్టిని జ ♦ రాచర దేహిశరీరధారణా
స్థితి గలయీశునందుఁ దన♦జీవితముం ఘటియింపఁ జేసి యే
కతఁ గనఁ ద[2]న్నిరోధమునఁ ♦ గైకొని కంపము నొందె నీశ్వరుం
డతఁడు చలింప నిజ్జగము ♦ లన్నియుఁ జంచల మయ్యె భూవరా.

క. [3]ఆలోకభయంకర మగు, నాలోకమహావిపద్ద♦శాలోకనులై
యాలోకపాలు రందఱు, నాలోకశరణ్యుఁ గాన♦నరిగిరి భీతిన్. 274

వ. అట్లరిగి నారాయణునుద్దేశించి కృతప్రణాము లై కరంబులు ముకు
ళించికొని యిట్లనిరి. 275

చ. హరి పరమాత్మ కేశవ చ ♦ రాచరభూతశరీరధారి వై
పరఁగుదు నీవు నిట్టులుగఁ ♦ బ్రాణనిరోధ మెఱుంగ మొందు ముం
దిరవుగ దేవదేవ జగ♦దీశ్వర సర్వశరణ్య నీపదాం
బురుహము లర్థిమై శరణు ♦ వొందెద మార్తి హరించి కావవే.

వ. అని దేవతలు విన్నవించిన నీశ్వరుండు వారల కిట్లనియె నుత్తాన
పాదుం డనువానితనయుండు విశ్వరూపుఁడ నయిననాయందుఁ దన
చిత్తం బైక్యంబుసేసి తపంబు గావించుచుండ దానంజేసి భవదీయ
ప్రాణనిరోధం బయ్యె నట్టి [4]దురత్యయంబైన తపంబు నివర్తింపం
జేసెద వెఱవక మీమీనివాసంబులకుం జనుం డని యానతిచ్చిన
నాదేవతలు నిర్భయాత్ము లై యీశ్వరునకుం బ్రణామంబు లాచ
రించి [5]త్రివిష్టపంబునకుం జనిరి తదనంతరంబ. 277

సీ. హరి యీశ్వరుండు వి ♦ హంగకులేశ్వర
యానుఁడై నిజభృత్యుఁ ♦ డైనధ్రువునిఁ
గనుఁగొను వేడుక ♦ జనియింప నా మధు
వనమున కప్పుడు ♦ సని ధ్రువుండు
పరువడి యోగవి ♦ పాకతీవ్రం బైన
బుద్ధిచే నిజమనోం ♦ బురుహముకుళ

1 కలము = ఓడ. 2 నిరోధము = అడ్డగింపు. 3 ఆలోకభయంకరము = చూచుటకు భయముగలిగించునది. 4 దురత్యయము = చేటులేనిది. 5 త్రివిష్టపము = స్వర్గము.

మందుఁ [1]దటిత్ప్రభా ♦ యతమూర్తి యటఁ దిరో
ధానంబునను బొంది ♦ తత్క్షణంబ

తే. తనపురోభాగమందు ని ♦ ల్చినను బూర్వ
[2]సమధికజ్ఞాననయనగో ♦ చరసమగ్ర
మూర్తిఁ గనుఁగొని సంభ్రమ ♦ మునను సమ్మ
దాశ్రువులు రాలఁ బులకీకృ ♦ తాంగుఁ డగుచు. 278

—♦ సాక్షాత్కరించిన భగవంతుని ధ్రువుండు స్తుతించుట ♦—

తే. నయనముల విభుమూర్తిఁ బా ♦ నంబుసేయు
పగిదిఁ దనముఖమునను జుం ♦ బనము సేయు
లీలఁ దగ భుజములను నా ♦ లింగనంబు
సేయుగతి దండవన్నమ ♦ స్కృతు లొనర్చె. 279

వ. ఇట్లు దండప్రణామంబు లాచరించి కృతాంజలియై స్తోత్రంబుసేయ నిశ్చయించి స్తుతిక్రియాకరణ సమర్థుండు గాక యున్న ధ్రువునకును సమస్తభూతంబులకు నంతర్యామియైన యీశ్వరుండాతనితలం పెఱింగి వేదమయం బయినతనశంఖంబుచేత నబ్బాలునికపోలతలం బంటిన జీవేశ్వరనిర్ణయజ్ఞుండును భక్తిభావనిష్ఠుండునునగు ధ్రువుండు నిఖిలలోకవిఖ్యాతకీర్తిగలయీశ్వరుని భగవత్ప్రతిపాదితంబులగుచు వేదాత్మకంబు లైన తనవాక్కుల నిట్లని స్తుతియించె దేవా నిఖిలశక్తిధరుండవు నంతఃప్రవిష్టుండవు నైన నీవు లీనంబు లైన మదీయ వాక్యంబులం బ్రాణేంద్రియంబులం గరచరణశ్రవణత్వగాదులను జిచ్ఛక్తిచేఁ గృపంజేసి జీవింపం జేసిన భగవంతుండవును బరమపురుషుండవును నైన నీకు నమస్కరింతు నీ వొకరుండ వయ్యు మహాదాద్యం బైన యీయశేషవిశ్వంబు మాయాఖ్యం బయిన యాత్మీయశక్తిచేతం గల్పించి యందుం బ్రవేశించి యింద్రియంబులందు వసించుచుఁ దత్తద్దేవతారూపంబులచే నానా ప్రకారంబుల [3]దారువులం దున్న వహ్నిచందంబునం బ్రకాశింతు వదియునుం గాక.

1 తటిత్ప్రభాయత = మెఱుపువంటికాంతిగల విశాలమైన. 2 సమధికజ్ఞాననయన = గొప్పదగు జ్ఞానమను కనులకు. 3 దారువులు = కట్టెలు.

చ. వరమతి నార్తబాంధవ భ♦వద్ఘన [1]బోధసమేతుఁడై భవ
చ్చరణముఁ బొందినట్టి విధి♦సర్గము సుప్తజనుండు బోధమం
దరయఁగఁ జూచురీతిఁ గను♦నట్టిముముక్షుశరణ్యమైననీ
చరణములం గృతజ్ఞుఁ డగు♦సజ్జనుఁ డెట్లు దలంపకుండెడున్. 281

సీ. మహితాత్మ మఱి జన్మ♦మరణప్రణాశన
హేతుభూతుండవు ♦ నిద్ధకల్ప
తరువవు నగునిన్నుఁ ♦ దగ నెవ్వరే నేమి
పూని నీమాయావి♦మోహితాత్మ
లగుచు ధర్మార్థకా♦మాదులకొఱకుఁ దా
మర్చించుచును ద్రిగుణాభమైన
దేహోపభోగ్యమై ♦ దీపించుసుఖముల
నెనయంగ మదిలోన ♦ నెంతు రట్టి

తే. విషయసంబంధజన్యమై ♦ వెలయుసుఖము
వారికి నిరయమందును ♦ వఱలు దేవ
భూరిసంసారతాపని♦వారగుణక
థామృతాపూర్ణ యీశ మా♦ధవ ముకుంద. 282

మ. అరవిందోదర తావకీనచరణ ♦ ధ్యానానురాగోల్లస
చ్చరితాకర్ణనజాతభూరిసుఖముల్ ♦ [2]స్వానందక బ్రహ్మమం
దరయన్ లేవఁట [3]దండభృద్భటవిమా♦నాకీర్ణులై కూలునా
సురలోకస్థులఁ జెప్ప నేల సుజన♦స్తోమైకచింతామణీ. 283

చ. హరి భజనీయమార్గనియ ♦ తాత్మకులై భవదీయమూర్తిపై
వరలినభక్తియుక్తు లగు♦వారలసంగతిఁ గల్గఁజేయు స
త్పురుషసుసంగతిన్ వ్యసన ♦ దుస్తరసాగర మప్రయత్నతన్
సరసతభవత్కథామృతర♦సంబున మత్తుఁడనై తరించెదన్. 284

చ. నిరతముఁ దావకీనభజ♦నీయపదాబ్జసుగంధలబ్ధి నె
వ్వరిమది పొందఁగాఁ గలుగు♦వారలు తత్ప్రియమర్త్యదేహముం

1 బోధసమేతుఁడు = జ్ఞానయుక్తుఁడు. 2 స్వానందక బ్రహ్మము = నిర్గుణబ్రహ్మము. 3 దండభృద్భట విమానాకీర్ణులు = యమకింకరుల బంట్లచే నావరింపఁబడినవారు.

గరము; తదీయదారసుత ♦ కామసుహృద్గృహబంధువర్గమున్
మఱతురు విశ్వతోముఖ ర♦మాహృదయేశ ముకుంద మాధవా.

సీ॥ పరమాత్మ మర్త్యసు ♦ పర్వతిర్యఙ్మృగ
[1]దితిజ సరీసృప ♦ ద్విజగణాది
సంవ్యాప్తమును ♦ సద సద్విశేషంబును
గై కొని మహదాది ♦ కారణంబు
నైన విరాడ్విగ్ర♦హంబు నే నెఱుఁగుదుఁ
గాని తక్కిన సుమం♦గళము నైన
సంతత సుమహితై ♦శ్వర్య రూపంబును
భూరిశబ్దాదివ్యా♦పారశూన్య

తే. మైన బ్రహ్మస్వరూప మే ♦ నాత్మ నెఱుఁగఁ
బ్రవిమలాకార సంసార ♦ భయవిదూర
పరమముని గేయ సంతత ♦ భాగధేయ
నలిననేత్ర రమాలల♦నాకళత్ర. 286

సీ. సర్వేశ కల్పాంత♦సమయంబునందు నీ
యఖిల ప్రపంచంబు ♦ నాహరించి
యనయంబు శేషస♦హాయుండవై శేష
పర్యంక తలమునఁ ♦ బవ్వళించి
యోగనిద్రారతి ♦ నుండి నాభీసింధు
జస్వర్ణలోకకం♦జాతగర్భ
మందుఁ జతుర్ముఖు ♦ నమరఁ బుట్టించుచు
రుచి నొప్పు బ్రహ్మస్వరూపి వైన

తే. నీకు మ్రొక్కెద నత్యంత ♦ నియమ మొప్ప
భవ్యచారిత్ర పంకజ♦పత్త్రనేత్ర
చిరశుభాకార నిత్యలక్ష్మీవిహార
యవ్యయానంద గోవింద ♦ హరి ముకుంద. 287

వ. అట్లు యోగనిద్రాపరవశుండ వయ్యును జీవులకంటె నత్యంత విల
క్షణుండవై యుండుదు వది యెట్లనిన బుద్ధ్యవస్థాభేదంబున నఖండితం

1 దితిజ = రాక్షసులు.

బయిన స్వశక్తిం జేసి చూచులోకపాల నిమిత్తంబు యజ్ఞాధిష్ఠాతవు గావున నీవు నిత్యముక్తుండవును బరిశుద్ధుండవును సర్వజ్ఞుండవును నాత్మవును గూటస్థుండవును నాదిపురుషుండవును భగవంతుండవును గుణత్రయాధీశ్వరుండవును నైన వర్తింతువు భాగ్యహీనుండైన జీవునియందు నీగుణంబులు గలుగ వేసర్వేశ్వరునం దేమి విరుద్ధగతులై వివిధశక్తియుక్తంబులైన యవిద్యాదు లానుపూర్వ్యంబునం జేసి ప్రలీనంబులగుచుండు నట్టి విశ్వకారణంబు నేకంబు ననంతంబు నాద్యంబు నానందమాత్రంబు నవికారంబును నగు బ్రహ్మంబునకును నమస్కరించెద మఱియు దేవా నీవ సర్వవిధ ఫలంబని చింతించు [1]నిష్కాములయినవారికి రాజ్యాది కామితంబులలోనం బరమార్థంబయిన ఫలంబు సర్వార్థరూపుండవైన భవదీయపాదపద్మసేవనంబ యిట్లు నిశ్చితంబయ్యెను సకాములైన దీనులను గోవు [2]వత్సంబును స్తన్యపానంబు సేయించుచు [3]వృకాదిభయంబువలన రక్షించుచుండుం బునం గామప్రదుండవై సంసారభయంబువలనం బాపుదు వని యిట్లు సత్యసంకల్పుండును సుజ్ఞానియు నయిన ధ్రువునిచేత వినుతింపంబడి భృత్యానురక్తుండైన భగవంతుండు సంతుష్టాంతరంగుండై యిట్లనియె. 288

క. ధీరవ్రత రాజన్యక, మారక నీహృదయమందు ♦ మసలిన కార్యం
బారూఢిగా నెఱుంగుదు, నారయ నదివొందరాని ♦ దైనను నిత్తున్.

వ. అది యెట్టిదనిన నెందేని మేధియందుఁ [4]బరిభ్రామ్యమాణగోచక్రంబునుంబోలె గ్రహనక్షత్రతారాగణజ్యోతిశ్చక్రంబు నక్షత్రరూపంబు లయిన ధర్మాగ్నికశ్యపశక్రులును సప్తర్షులును దారకాసమేతులై ప్రదక్షిణంబు దిరుగుచుండును రట్టి దురాపంబును [5]ననన్యాధిష్ఠితంబును లోకత్రయప్రళయకాలంబునందు [6]నశ్వరంబుగాక ప్రకాశమానంబును నయిన ధ్రువక్షితి యను పదంబు ముందట నిరువది

1 నిష్కాములు = కోరికలేనివారు. 2 వత్సము = లేగ. 3 వృకాదిభయము = తోడేళ్ళు మొదలగువానివలని భయము. 4 పరిభ్రామ్యమాణ గోచక్రము = తిరుగుచున్న భూచక్రము. 5 అనన్యాధిష్ఠితము = ఇతరు లెక్కనిది. 6 నశ్వరము = నాశముకలది.

యాఱువేలేండ్లు ననం బ్రాపింతువు తత్పద ప్రాప్తిపర్యంతంబు భవదీయజనకుండు వనవాసగతుండైనం దద్రాజ్యంబు పూజ్యంబుగా ధర్మమార్గంబున జితేంద్రియుండవై చేయుదువు భవదనుజుండగు నుత్తముండు [1]మృగయార్థంబు వనంబునకుం జని మృతుం డగుఁ డ[2]దన్వేషణార్థంబు తదాహిత చిత్తయై తన్మాతయు వనంబునకుం జని యందు దావదహననిమగ్న యగు నెండియు. 290

సీ. అనఘాత్మ మఱి నీవు ♦ యజ్ఞరూపుం డనఁ
దగు నన్ను సంపూర్ణ ♦ దక్షిణంబు
లగుమఖంబుల చేత ♦ నర్చించి సత్యంబు
లగు నిహసౌఖ్యంబు ♦ లనుభవించి
యంత్యకాలమున న ♦ న్నాత్మఁ దలంచుచు
మఱి సర్వలోకన ♦ మస్కృతమును
మహిఁ [3]బునరావృత్తి ♦ రహితంబు సప్తర్షి
మండలోన్నత మగు ♦ మామకీన

తే. పదము దగఁ బొందఁగల వని ♦ పరమపురుషుఁ
డతని యభిలషితార్థంబు ♦ లర్థి నిచ్చి
యతఁడు గనుఁగొను చుండంగ ♦ నాత్మపురికి
గరుడగమనుఁడు వేంచేసెఁ ♦ గౌతుకమున. 291

తే. అంత ధ్రువుఁడును బంకేరు ♦ హాక్షుపాద
కమలసేవోపపాదిత ♦ ఘనమనోర
థములఁ దనరియుఁ దనదు చి ♦ త్తంబులోనఁ
దుష్టిఁ బొందక చనియె వి ♦ శిష్టచరిత. 292

క. అని మైత్రేయుఁడు ధ్రువుఁ డ
ట్లనయము హరిచేఁ గృతార్థుఁ ♦ డైన విధం బె
ల్లను వినిపించిన విదురుఁడు
విని మునివరుఁ జూచి పలికె ♦ వినయం బెసఁగన్. 293

క. మునినాయక విను కాముక
జనదుష్ప్రాపంబు విష్ణు ♦ చరణాంబురుహా

1 మృగయార్థము = వేటకొఱకు. 2 అన్వేషణార్థము = వెదకుటకొఱకు.
3 పునరావృత్తి = పునర్జన్మము.

ర్చన మునిజనసంప్రాప్యము
నననఁ గలపంకేరుహాక్షు నవ్యయపదమున్. 294

వ. పెక్కుజన్మంబులం గాని పొందరానిపదంబు దా నొక్కజన్మంబుననే పొందియుం దనమనంబున [1]నప్రాప్తమనోరథుండ నని పురుషార్థవేది యైన ధ్రువుం డెట్లు దలంచె నని న మైత్రేయుం డిట్లనియె. 295

తే. అనఘ పినతల్లి దన్నుఁ బలికినదురుక్తి
[2]బాణవిద్ధాత్ముఁ డగుచుఁ దద్భాషణములు
చిత్తమందుఁ దలంచుటఁ జేసి ముక్తి
గోరమికి నాత్మలో వగఁ గుందుచుండె. 296

వ. అంత నాధ్రువుండు. 297

చ. అనఘ జితేంద్రియుల్ సుమహితాత్ములునైన సనందనాదు లెం
దనయ మనేకజన్మసముపార్జిత యోగసమాధిఁ జేసి యె
వ్వని చరణారవిందములు వారనిభక్తి నెఱుంగుచుందు రా
ఘనుఁ బరమేశు నీశు నవికారు నమేయు నజేయు నాద్యునిన్.

వ. ఏను షణ్మాసంబులు భజియించి తత్పాదపద్మచ్ఛాయం బ్రాపించియు భేదదర్శనుండనైతి నక్కటా యిట్టిభాగ్యహీనుండనైన యేను భవనాశకుం డైన యతనిం బొడగనియు నశ్వరంబులైన కామ్యంబు లడిగితి నిట్టిదౌరాత్మ్యం బెందేనిం గలదే తమపదంబులకంటె నున్నతపదంబునం బొందుదునో యని సహింపంజాలని యీ దేవతలచేత మదీయమతి కలుషితం బయ్యెంగాక నాఁడు నారదుం డాడినమాట తథ్యం బయ్యె నతనివాక్యంబు లంగీకరింపక యే నసత్తముండనై స్వప్నావస్థలను బొందినవాఁడు దైవికం బైనమాయం జెంది భిన్నదర్శనుండగుచందంబున నద్వితీయుండ నైనను భ్రాత యనుశత్రువుచేఁ బ్రాప్తంబైన దుఃఖంబు నొంది జగదాత్మకుండును సుప్రసాదుండును భవనాశకుండును నైన యీశ్వరు నారాధించి తత్ప్రసాదంబు వడసియు నాయుర్విహీనుండైన రోగికిం బ్రయోగించు సాధనంబుం బోలె నిరర్థకంబులై నశ్వరంబులైన యీ కామితంబులు గోరితి నని వెండియు. 299

1 అప్రాప్తమనోరథుఁడు = కోరికల పొందనివాఁడు. 2. బాణవిద్ధాత్ముఁడు = బాణములచే చీల్పఁబడిన మనస్సుగలవాఁడు.

మ. ధనహీనుండు నృపాలుఁ జేరి మిగులన్ ♦ ధాటీక ఫలీకార మి
మ్మని యర్థించినరీతి ముక్తిఫలదుం ♦ డైనట్టి పంకేజలో
చనుఁడే చాలఁ బ్రసన్నుఁ డైన నతనిన్ ♦ సాంసారికం బర్థిఁ గో
రిననావంటివిమూఢమానసులు ధా♦త్రిన్ గల్గిరే యెవ్వరున్. 300

—♦ ధ్రువుండు మరలి తనపురంబునకు వచ్చుట ♦—

సీ. అని యిట్లు చింతించె నని మైత్రేయుఁడా
ముని విదురునకు ని♦ట్లనియె నంఘ్రి
కమనీయహరిపాద ♦ కమలరజోభిసం
స్కృత శరీరుఁడును [1]యా♦దృచ్ఛికముగ
సంప్రాప్త మగుదాన ♦ సంతుష్టచిత్తుఁడై
వెలుఁగుచు నుండఁ బో♦వంటివాఁడు
దగ భగవత్పాద ♦ దాస్యంబు దక్కంగ
నితర పదార్థంబు ♦ లెఱుఁగఁ డగుచు

తే. మఱచియును గోర నొల్లఁడు ♦ మనుచరిత్ర
తవిలి యిట్లు హరి[2]ప్రసా♦దంబు నొంది
మరలి వచ్చుచు నున్నకు♦మారు వార్తఁ
జారుచే విని యుత్తాన♦చరణుఁ డపుడు. 301

వ. మనమ్మున ని ట్లని తలంచె. 302

క. చచ్చినవారలు క్రమ్మఱ, వచ్చుట గలదే కాక యిట్టి♦వార్తలు గలవే
నిచ్చలు నమంగళుఁడనగు, నిచ్చట మఱి నాకు శుభము♦ లేల ఘటించున్.

క. అని విశ్వసింపకుండియు, మనమున నానారదుఁడు కు♦మారుఁడు వేగం
బున రాఁగలఁడనుచును బలికిన పలుకులు దలఁచి నమ్మి♦ కృతకృత్యుం డై.

క. తనసుతు నిరాక చెప్పిన
ఘనునకు ధనములును మౌ♦క్తికప్రహారములున్
మన మలర నిచ్చి తనయునిఁ
గనుఁగొను సంతోషమాత్మఁ ♦ గడలుకొనంగన్. 305

సీ. వలను మీఱిన సైంధ♦వంబులఁ బూన్చిన
కనకరథంబు[3]ను♦త్కంఠ నెక్కి

---

1 యాదృచ్ఛికము = ఆకస్మికము. 2 ప్రసాదము = అనుగ్రహము.
3 ఉత్కంఠ = ఆతురత.

బ్రాహ్మణ కులవృద్ధ ♦ బంధుజనామాత్య
పరివృతుం డగుచు వి ♦ స్ఫురణ మెఱసి
బ్రహ్మనిర్ఘోష తూ ♦ ర్యస్వనశంఖ కా
హళవేణురవము లం ♦ దందఁ జెలఁగ
శిబిక లెక్కియు విభూ ♦ షితు లై సుప్రీతి సు
రుచు లుత్తముండు నా ♦ రూఢి నడువ
తే. గరిమ దీపింప నతిశీఘ్ర ♦ గమన మొప్ప
నాత్మనగరంబు వెలువడి ♦ యరుగుచుండి
బలసి నగరోపవనసమీ ♦ పంబునందు
వచ్చు ధ్రువుఁ గని మేదినీ ♦ శ్వరుఁడు సంత. 306
చ. అరదము డిగ్గి ప్రేమ దొలఁ ♦ కాడ ససంభ్రముఁ డై రమామనో
హరుచరణారవిందయుగ ♦ ళార్చన [1]నిర్దళితాఖిలాఘు నీ
శ్వరకరుణావలోకన సు ♦ జాతసమగ్ర మనోరథున్ సుతుం
గర మనురక్తిఁ డాసి పుల ♦ కల్ నసలొత్తఁ బ్రమోదితాత్ముఁడై.
తే. బిగియఁ గౌఁగిటఁ జేర్చి నె ♦ మ్మొగము నివిరి
శిరము మూర్కొని [2]చుబుకంబు ♦ సేతఁ బుణికి
యవ్యయానందబాష్పధా ♦ రాభిషిక్తుఁ
జేసి.యాశీర్వదింప నా ♦ చిరయశుండు. 308
క. జనకుని యాశీర్వచనము, లనయముఁ గైకొని ప్రమోది ♦ యైతత్పదముల్
దనఫాలతలము సోఁకఁగ, వినతులు గావించి భక్తి ♦ విహ్వలుఁ డగుచున్.
తే. అంత నా సజ్జనాగ్రణి ♦ యైన ధ్రువుఁడు
దల్లులకు భక్తి వినతులు ♦ దగ నొనర్చి
సురుచి ప్రొక్కిన యర్భకుఁ ♦ జూచి యెత్తి
నగుమొగంబున నాలింగ ♦ నంబు చేసి. 310
సీ. కరమొప్ప నానంద ♦ గద్గదస్వరమున
జీవింపుమనుచు నా ♦ శీర్వదించె
భగవంతుఁ డెవ్వని ♦ పై మైత్రి వాటించు
సత్కృపానిరతిఁ బ్ర ♦ సన్నుఁ డగుచు

1 నిర్దళితాఖిలాఘున్ = పోఁగొట్టఁబడిన సమస్తపాపములు కలవానిని.
2 చుబుకము = గడ్డము.

వతనికిఁ దమయంత ♦ ననుకూలమై యుండు
సర్వభూతంబులు ♦ సమతఁ బేర్చి
మహిఁ దలపోయ ని ♦ మ్నప్రదేశములకు
ననయంబు చేరుతో ♦ యములపగిదిఁ
తే. గాన ఘను నమ్మహాత్ముని ♦ గారవించె
సురుచి పూర్వంబు దలఁపక ♦ సుజనచరిత
విష్ణుభక్తులు ధరను ప ♦ విత్రు లగుట
వారి కలుగరు ధరణి నె ♦ వ్వారు పగయు. 311

వ. కావున నుత్తముండును ధ్రువుండును బ్రేమవిహ్వలు లగుచు [1]నన్యో
న్యాలింగితులై పులకాంకురాలంకృతశరీరులై యానందబాష్పంబుల
నొప్పి రంత సునీతియుఁ దనప్రాణంబులకంటెం బ్రియుండైన సుతు
[2]నుపగూహనంబు సేసి తదవయవస్పర్శనంబుచేత నానందంబు నొంది
విగతశోకయయ్యె నప్పుడు సంతోషబాష్పధారాసిక్తంబులై చనుఁ
బాలునుం గురిసె నంత. 312

సీ. ఉన్నతసంతోష ♦ ముప్పతిల్లఁగఁ బౌర
జనములు ధ్రువుతల్లి ♦ నెనయఁ జూచి
తొడరిన భవదీయ ♦ దుఃఖనాశకుఁడైన
యిట్టితనూజుఁ డెం ♦ దేనిఁ బెద్ద
కాలంబు క్రిందటఁ ♦ గడఁగి నష్టుండైన
వాఁ డిప్డు నీభాగ్య ♦ వశముచేతఁ
[3]బ్రతిలబ్ధుఁ డయ్యెను ♦ నితఁడు భూమండల
మెల్లను రక్షించు ♦ నిద్ధమహిమఁ
తే. గమలలోచనుఁ జింతించు ♦ ఘనులు లోక
దుర్జయంబైనయట్టి మృ ♦ త్యువును గెల్తు
రట్టి ప్రణతార్తిహరుఁడైన ♦ యబ్జనాభుఁ
డర్థి నీచేతఁ బూజితుం ♦ డగుట నిజము. 313

వ. అని ప్రశంసించి రట్లు పౌరజనంబులచేత [4]నుపలాల్యమానుండును

1 అన్యోన్యాలింగితులు = ఒక్కరినొకరు కౌఁగిలించుకొనినవారు.
2 ఉపగూహనము = కౌఁగిలింపు. 3 ప్రతిలబ్ధుఁడు = మరల లభించినవాఁడు.
4 ఉపలాల్యమానుఁడు = బుజ్జగింపఁబడినవాఁడు.

సంస్తూయమానుండును నగుచు నుత్తానపాదుం డుత్తమసమేతం
బుగా ధ్రువుని గజారూఢునిం జేసి ప్రహృష్టాంతరంగుం డగుచుఁ
బురాభిముఖుండై చనుదెంచె. 314

సీ. స్వర్ణ [1]పరిచ్ఛద ♦ స్వచ్ఛకుడ్యద్వార
లాలితగోపురా♦[2]ట్టాలకంబు
ఫలపుష్పమంజరీ ♦ కలిత రంభాస్తంభ
[3]పూగపోతాదివి♦భూషితంబు
ఘనసారకస్తూరి♦కాగంధజలబంధు
[4]రాసిక్తవిపణిమార్గాంచితంబు
మానితనవరత్న♦మయరంగవల్లీవి
రాజిత ప్రతిగృహ ♦ ప్రాంగణంబు

తే. శుభనదీజలకుంభసం♦శోభితంబు
తండులస్వర్ణలాజాక్ష♦త ప్రసూన
ఫల భరవ్రాతకలిత వి♦భ్రాజితంబు
నగుచు సర్వతోలంకృత ♦ మైనపురము. 315

వ. ప్రవేశించి రాజమార్గంబునఁ జనుదెంచునప్పుడు. 316

మ. హరిమధ్యల్ పురకామినీతతులు సౌ♦ధాగ్రంబులందుండి భా
స్వరసిద్ధార్థఫలా[5]క్షతప్రసవదూ♦ర్వావ్రాతదధ్యంబువుల్
కరవల్లీమణిహేమకంకణఝణ♦త్కారంబుశోభిల్లఁ జ
ల్లిరి యాభాగవతోత్తమోత్తమునిపై ♦లీలాప్రమేయంబుగన్. 317

వ. ఇట్లు వాత్సల్యంబునం జల్లుచు సత్యవాక్యంబుల దీవించుచుసువర్ణ
పాత్రరచిత మణిదీపనీరాజనంబుల నివాళింపంబౌరజానపదమిత్రా
మాత్యబంధుజనపరివృతుండై చనుదెంచి. 318

సీ. కాంచనమయ మర♦కతకుడ్య మణిజాల
సంశ్రయ రాజిత ♦ సౌధములను

1 పరిచ్ఛద = కప్పుడువస్త్రము. 2 అట్టాలకంబు = కోటబురుజు. 3 పూగపోత = పోఁకమొక్కలు. 4 ఆసిక్త విపణిమార్గ = అంతట చల్లఁబడిన అంగడివీథి. 5 అక్షతప్రసవదూర్వావ్రాతదధ్యఁబువుల్ = అక్షతలు, పూలు, గఱిక, పెరుగు, జలము.

వర [1]సుధా ఫేనపాం ♦ డుర రుక్మపరికరో
దాత్త పరిచ్ఛద ♦ తల్పములను
సురతరుశోభిత ♦ శుకపిక మిథునాళి
గాన విభాసితో ♦ ద్యానములను
సుమహితవైడూర్య ♦ సోపాన విమలశో
భితజలపూర్ణ [2] వా ♦ పీచయముల

తే॥ వికచకహ్లారదరదర ♦ వింద కైర
వప్రదీపిత బక చక్ర ♦ వాక రాజ
హంస [3]సారస కారండ ♦ వాదిజల వి
హంగనినదాభిరామ ప ♦ ద్మాకరములు. 319

వ. మరియును. 320

తే. చారుబహువిధవస్తు వి ♦ స్తార మొప్ప
నంగనాయుక్త మగుచుఁ బెం ♦ పగ్గలించి
యర్థిఁ దనరారుజనకుగృ ♦ హంబు సొచ్చె
నెలమిఁ ద్రిదివంబు సొచ్చు దే ♦ వేంద్రుపగిది. 321

వ. ఇట్లు ప్రవేశించిన రాజర్షియైన యుత్తానపాదుండు సుతునియాశ్చర్యకరంబైన ప్రభావంబు వినియుఁ జూచియు మనంబున విస్మయంబు నొంది ప్రజానురక్తుండును ప్రజాసమ్మతుండును నవయౌవనపరిపూర్ణుండును నైన ధ్రువునిరాజ్యాభిషిక్తుంజేసివృద్ధవయస్కుండైన తన్నుఁ దాన యెఱింగి యాత్మగతిఁ బొందనిశ్చయించి విరక్తుండై వనంబునకుం జనియె నంత నా ధ్రువుండు శింశుమారు ప్రజాపతి కూఁతురైన భ్రమి యనుదాని వివాహంబై దానివలనఁ గల్ప వత్సరు లను నిద్దఱుగొడుకులం బడసి వెండియు వాయుపుత్రియైన యిల యనుభార్యయందు నుత్కలనాముండైన కొడుకునతిమనోహర యైన కన్యారత్నంబునుం గనియె నంతఁ దద్భ్రాత యైన యుత్తముండు వివాహంబు లేకుండి మృగయార్థంబు వనంబున కరిగి హిమవంతంబున యక్షునిచేత హతుండయ్యె నతనితల్లియుఁ

1 సుధాఫేనపాండురరుక్మ = అమృతమువలె నురుగువలె తెల్లగనున్న బంగారు. 2 వాపి = దిగుడుబావి. 3 సారస = బెగురుపక్షి.

దద్దుఃఖంబున వనంబున కేఁగి యందు [1]గహనదహనంబున మృతిం బొందె ధ్రువుండు భ్రాతృమరణంబు విని కోపామర్ష వ్యాకులిత చిత్తుండై జైత్రంబగు రథం బెక్కి యుత్తరాభిముఖుండై చని [2]హిమవద్ద్రోణియందు భూతగణసేవితంబును గుహ్యకసంకులంబును నైన యలకాపురంబు పొడగని. 322

—♦ ధ్రువుండు కుబేరానుచరులైన గుహ్యకులతో యుద్ధము చేయుట ♦—

మ. ఘనశౌర్యోన్నతితోడ సర్వ[3]కకుబా ♦ కాశంబులందుం బ్రతి
ధ్వను లోలిన్ నిగుడంగ శంఖము మహో ♦ ద్యల్లీలఁ బూరింపఁ ద
న్నినదంబున్ విని యక్షకాంతలు భయా ♦ న్వీతాత్మలై రుగ్రసా
ధనులై యక్షభటుల్ పురిన్ వెడలి రు ♦ త్సాహంబు సంధిల్లఁగన్.

వ. ఇట్లు వెడలి యా ధ్రువునిం దాఁకిన. 324

చ. కరము మహారథుండు భుజ ♦ గర్వ పరాక్రమశాలియున్ ధను
ర్ధరుఁడును శూరుఁడౌ ధ్రువుఁడు ♦ దన్ను నెదిర్చినయక్షకోటిఁ జె
చ్చెరఁ బదుమూఁడువేల నొక ♦ చీరికిఁ గైకొన కొక్కపెట్ట భీ
కరముగ మూఁడుమూఁడు [4]శిత ♦ కాండము లందఁగ గ్రువ్వ నేసినన్.

ఉ. వారు లలాటముల్ వగిలి ♦ వారక సోలియుఁ దేఱి యమ్మహో
దారు పరాక్రమ ప్రకట ♦ ధైర్యముఁ దక్కరలాఘవంబుఁ బ
ల్మాఱు నుతించుచుం గుపిత ♦ మానసులై పదతాడిత ప్రదు
ష్టోరగ కోటివోలెఁ జటు ♦ లోగ్ర భయంకర రోషమూర్తులై.

ఉ. ఆరథికోత్తముం దొడరి ♦ యందఱు నొక్కటఁ జుట్టుముట్టి పెం
పారఁగ బాణషట్కముల ♦ నంగములం బగులంగ నేసి వి
స్ఫారగదా శర [5]క్షురిక ♦ పట్టిస తోమర శూల ఖడ్గముల్
సారథియుక్తుఁడైన రథి ♦ సత్తముపైఁ గురియించి రేఁపునన్. 327

వ. అట్లు గురియించిన నతండు. 328

క. పెంపఱి యుండెను ధారా, సంపాతచ్ఛన్నమైన ♦ శైలముభంగిన్
గుంపులుగొని యాకసమునఁ, గంపించుచు నపుడు సిద్ధ ♦ గణములు వరుసన్.

---

1 గహనదహనము = కారుచిచ్చు. 2 హిమవద్ద్రోణి = మంచుకొండ. 3 కకుప్ = దిక్కు. 4. శితకాండము = వాఁడిబాణము. 5 క్షురిక, పట్టిస, తోమర = చురియ, అడ్డకత్తి, చిల్లకోల.

క. హాహాకారము లెసఁగఁగ
నోహో యీరీతి [1]ధ్రువప ♦ యోరుహహితుఁ డు
త్సాహము సెడి యిటు దైత్యస
మూహార్ణవమందు నేఁడు ♦ మునిఁగెనె యకటా. 330

వ. అని చింతించు సమయంబున. 331

క. తా మాతని గెలిచితి మని
యా [2]మనుజాశనులు వలుక ♦ నట నీహార
స్తోమము సమయించు మహో
ద్దాముం డగు సూర్యుఁ బోలి ♦ దద్దయుఁ దోఁచెన్. 332

వ. అట్లు దోఁచిన. 333

మ. అరిదుఃఖావహమైన కార్ముకము గా ♦ ర్యస్ఫూర్తితోఁ దాల్చి భీ
కర బాణావళిఁ బింజపింజ గఱవం ♦ గా నేసి ఝంఝానిలం
బురు మేఘావళిఁ బాఱఁదోలుగతి న ♦ య్యుగ్రాహవప్రారంబం
ధురశస్త్రావళి రూపుమాపె [3]విలస ♦ ద్దోర్లీల సంధిల్లఁగన్. 334

చ. మఱియుపుడమ్మహాత్ముఁడస ♦ మానబలంబున నుగ్రబాణముల్
గఱకఱిఁ దాఁక నేసి భుజ ♦ గర్వ మెలర్ప విరోధిమర్మముల్
పఱియలు సేసి యంగములు ♦ భంగము నొందఁగఁ జేసె [4]వ్రేల్మిడిన్
గిఱికొని పర్వతంబుల నొ ♦ గిం దెగఁగొట్టు సురేంద్రుకైవడిన్. 335

వ. అయ్యవసరంబున. 336

చ. అలఘుచరిత్రుఁ డమ్మనుకు ♦ లాగ్రణిచే విశలాంగులైన వా
రల సకిరీటకుండలవి ♦ రాజితమస్తకకోటిచే సము
జ్జ్వలమణికంకణాంగదల ♦ సద్భుజవర్గముచేత సంగర
స్థల మతిరమ్యమై తనరె ♦ సంచితవీరమనోహరాకృతిన్. 337

వ. అంత హత శేషులు. 338

క. పరబలుఁ డగు మనుమనుమని
[5]శరసంఛిన్నాంగు లగుచు ♦ సమరవిముఖులై

---

1 ధ్రువపయోరుహహితుఁడు = ధ్రువుఁడను సూర్యుఁడు. 2 మనుజాశనులు = రాక్షసులు. 3. విలసద్దోర్లీల = ప్రకాశించు భుజవిలాసము. 4 వ్రేల్మిడి = చిటికె 5 శరసంఛిన్నాంగులు = బాణములచే తెగిన మేనులు గలవారు.

హరిరాజముఁ గని పఱచెడు
కరిబృందముఁబోలెఁ జనిరి ♦ కళవళపడుచున్. 339

క. అప్పుడు రాక్షసమాయలు
గప్పిన ధ్రువుఁ డసురవరుల ♦ కార్యం బెఱుఁగం
[1]జొప్పడక వారిఁ బొడగన
దెప్పర మగుటయును సార ♦ థిం గని యంతన్. 340

క. తలపోయఁగ భువి [2]మాయా
వులకృత్యం బెఱుఁగ నెవరు ♦ వోలుదు రనుచుం
బలుకుచుఁ దత్పురిఁ జొరఁగాఁ
దలఁపఁగ నది గానరాక ♦ తద్దయు మానెన్. 341

వ. అట్లు పురంబున కరుగుట మాని చిత్రరథుండైన యాధ్రువుండు సప్రయత్నుండయ్యును బరప్రతియోగ శంకితుండై యుండెనయ్యెడ మహాజలధి ఘోషంబు ననుకరించు శబ్దంబు వినంబడె నంత సకల దిక్తటంబుల వాయుజనితంబయిన రజఃపటలంబు దోఁచెఁదత్క్షణంబ యాకాశంబున[3]విస్ఫురత్తటిత్ప్రభాకలిత గర్జారవ యుక్త మేఘంబులమోఘంబులై భయంకరాకారంబులై తోఁచెనంత. 342

మ. అనయంబున్ ధ్రువుమీఁద దైత్యకృతమా ♦ యాజాల మక్లేచి బో
రన [4]మస్తిష్క పురీష మూత్ర పల దు ♦ ర్గంధాస్థి [5]మేదశ్శరా
సనని స్త్రింశ శరాసితో మరగదా ♦ చక్రత్రిశూలాది సా
ధనభూభృద్భుజగావళిం గురిసె ను ♦ ద్దండ క్రియాలోలతన్. 343

వ. మఱియు మత్తగజ సింహ వ్యాఘ్ర సమూహంబులును నూర్మి భయంకరంబై సర్వతఃప్లవనం బయిన సముద్రంబును గానంబడియె వెండియుం గల్పాంతంబునందుంబోలె భీషణంబైన మహా [6]హ్రాదంబునుం దోఁచె నివ్విధంబున నానావిధంబులు ననేకంబులు నవిరళ భయంకరంబులు నయిన యసుర మాయలు క్రూరప్రవర్తను గుల యక్షులచేత [7]సృజ్యమానంబులై యడరెనా సమయంబున. 344

1 చొప్పడక = పోలుగాక 2 మాయావులు = మోసగాండ్రు 3 విస్ఫురత్ తటిత్ = ప్రకాశించు మెఱుపు 4 మస్తిష్క = మెదడు. 5. మేదః = క్రొవ్వు 6 హ్రాదము = ధ్వని. 7 సృజ్యమానములు = సృజింపఁబడుచున్నవి.

క. అనయంబును నయ్యక్షుల
ఘనమాయ నెఱింగి మునిని ♦ కాయము వడఁకన్
మనుమనుమని మను మను మని
మనమునఁ దలఁచుచును దత్స ♦ మత్తంబునకున్. 345

వ. చనుదెంచి యిట్లనిరి. 346

సీ. అనఘాత్మలోకు లె ♦ వ్వనిదివ్యనామంబు
సమత నాకర్ణించి ♦ సంస్మరించి
దుస్తరంబైన మృ ♦ త్యువునైన సుఖవృత్తి
జడిపింతు రట్టి యీ ♦ శ్వరుఁడు పరుఁడు
భగవంతుఁడును [1]శార్ఙ్గ ♦ పాణియు భక్తిజ
నార్తిహరుం డగు ♦ నట్టివిభుఁడు
భవదీయవిమతులఁ ♦ బరిమార్చుఁ గాకని
పలికిన మునులసం ♦ భాషణములు

తే. విని కృతాచమనుఁ డయి మా ♦ విభునిపాద
కమలముఁ దలంచి రిపుభయం ♦ కరమహోగ్ర
కలితనారాయణాస్త్రంబుఁ ♦ గార్ముకమునఁ
బూనఁ దడవఁ దదీయసం ♦ ధానమునను. 347

తే. కడఁగి గుహ్యకమాయాంధ ♦ కార మపుడు
వెరవుసెడి దవ్వదవ్వుల ♦ విరిసిపోయె
విమల మైనవివేకోద ♦ యమునఁ జేసి
సమయురాగాదికంబుల ♦ సరణి నంత. 348

మ. వరనారాయణదేవతాస్త్రభవదు ♦ ర్వారప్రభా [2]హేమపుం
ఖరుచిస్ఫారమరాళరాజసితప ♦ క్షక్రూరధారాపత
చ్ఛర సాహస్రము లోలి భీషణ విప ♦ క్షశ్రేణిపై వ్రాలె భీ
కరరావంబునఁ గానఁ జొచ్చు [3]శిఖిసం ♦ ఘాతంబుచందంబునన్.

వ. ఇట్లు వ్రాలిన.

చ. ఖరనిశిత ప్రదీప్తఘన ♦ కాండపరంపరవృష్టిచేఁ బొరిం
బొరి వికలాంగులై యడరి ♦ పుణ్యజనుల్ పృథుహేతిపాణులై

1 శార్ఙ్గము = విష్ణునివిల్లు 2 హేమపుంఖ = బంగారుపిడి 3 శిఖి = అగ్ని.

గరుడునిఁ జూచి భూరిభుజ ♦ గ ప్రకరంబు లెదిర్చి పేర్చి చె
చ్చెర నడతెంచు చందమునఁ ♦ జిత్రరథుల్ బలు పూని తాఁకినన్.

ఉ. వారలఁ జండ తీవ్రశర ♦ వర్గము చేత [1] నికృత్తపాదజం
ఘోరు శిరోధరాంబక శి ♦ ఖోదర కర్ణులఁ జేసి యోగి [2] పం
కేరుహమిత్ర మండల స ♦ కృద్భిద నెట్టిపదంబుఁ జెందు నా
భూరిపదంబునం బెలుచఁ ♦ బొందఁగఁ బంపె భుజావిజృంభియై. 352

వ. ఇవ్విధంబున నాచిత్రరథుండగు ధ్రువుని చేత [3] నిహన్యమానులును నిరపరాధులును నయిన గుహ్యకులం జూచి యతనికిఁ బితామహుండైన స్వాయంభువుండు ఋషిగణపరివృతుండై చనుదెంచి ధ్రువునిం జూచి యిట్లనియె వత్సా నిరపరాధులైన యీపుణ్యజనుల నెట్టిరోషంబున వధియించితి వట్టి నిరయహేతువైన రోషంబు సాలు భ్రాతృవత్సల భ్రాతృవధాభితప్తుండవై కావించు నీయత్నం బుడుగు మని. 353

క. అనఘా మనుకులమున కిది, యనుచితకర్మంబ యొకని ♦ కై పెక్కండ్రి
ట్లని మొనఁ ద్రుంగిరి యిది నీ, కనయంబును వలవదుడుగు ♦ మయ్య కుమారా.

వ. అదియునుంగాక దేహాభిమానంబునం బశుప్రాయులై హింస గావించుట హృషీకేశానువర్తు లయిన సాధువులకుం దగదు నీవు సర్వభూతంబుల నాత్మభావంబునఁ దలఁచి సర్వభూతావాసుండును దురారాధ్యుండును నైన విష్ణుని పదంబులఁ బూజించి తత్పరమపదంబును బొందితి వట్టి భగవంతుని హృదయంబున ననుధ్యాతుండవు భాగవతుల చిత్తంబులకును సమ్మతుండవు మఱియు సాధువర్తనుండవన నొప్పు నీ వీపాపకర్మం బెట్లు సేయ సమకట్టితి వేపురుషుండైన నేమి మహాత్ములయందుఁ [4] దితిక్షయు సములయందు మైత్రియు హీనులయందుఁ గృపయు నితరంబులగు సమస్తజంతువులయందు సమత్వంబును గలిగి వర్తించు వానియందు సర్వాత్మకుండైన భగవంతుండు ప్రసన్నుండగు నతండు ప్రసన్నుండయిన వాఁడు ప్రకృతిగుణంబులం బాసి లింగశరీరభంగంబు గావించి బ్రహ్మానందంబునుం బొందు నది

---

1 నికృత్త = చీల్చఁబడిన 2 పంకేరుహమిత్రమండలసకృద్భిదన్ = సూర్యమండలమును, ఒకమాఱు భేదించుటచేత 3 నిహన్యమానులు = చంపఁబడుచున్నవారు. 4 తితిక్ష = ఓర్పు.

యయ్యునుం గాక కార్యకారణసంఘాతరూపం బగుచున్న విశ్వం బీశ్వరునందు
[1]నయస్కాంత సన్నిధానంబు గలిగినలోహంబు చందంబున వర్తించు
నందున నీశ్వరుండు నిమిత్తమాత్రంబు గాం బరిభ్రమించు నట్టి యీశ్వ
రునిమాయాగుణవ్యతికరంబున నారబ్ధంబు లైనపంచభూతంబులచేత
[2]యోషిత్పురుష[3]వ్యవాయంబువలన యోషిత్పురుషాదిరూపసంభూతి
యగు నిట్టివిధంబునం దత్సర్గంబుం దత్స్థానంబుం దల్లయంబు నగుచు
నుండు నిట్లు దుర్విభావ్యం బైన కాలశక్తిం జేసి గుణక్షోభంబున విభజ్య
మానవీర్యుండు ననంతుండు ననాదియు నై జనంబులచేత జనంబులం బుట్టిం
చుచుండుటం జేసి యాదికరుండును మృత్యుహేతువు లగుజనంబుల
లయంబు నొందించుచుంటం జేసి యంతకరుండును ననాదియగుటం జేసి
యవ్యయుండును నైన భగవంతుండు జగత్కారణుం డగుం గావున
నీసృష్టిపాలనవిలయంబులకుం గర్తగాని వానివశుండున్న దానిం జేయు
చుండు నిట్లు మృత్యురూపుండును బహుండును ననువర్తియు నైన
యీశ్వరునికి స్వపక్షపరపక్షంబులు లేవు కర్మాధీనంబు లయినభూత
సంఘంబులు రజంబులు మహావాయువు ననుసరించుచాడ్పున నస్వ
తంత్రంబు లగుచు నతని ననువర్తించు నీశ్వరుండును జంతుచయాయు
[4]రుపచయాపచయకరణంబులం దస్పృష్టుండును నగు జీవుండు
కర్మబద్ధుం డగుటం జేసి కర్మంబు వానికి నాయురుపచయాపచయం
బులం జేయుచుండు మఱియు సర్వజగత్కర్మసాక్షి యగు సర్వేశ్వ
రుని. 355

క. కొందఱు స్వభావ మందురు, కొందఱు కర్మం బటందురు ♦ కొందఱు కాలం
బందురు కొందఱు దైవం, బందురు కొందఱు గాము ♦ మునీంద్ర మహాత్మా

వ. ఇట్టు లవ్యక్తరూపుండును నప్రమేయుండును నానాశక్త్యుదయహేతు
భూతుండు నైన భగవంతుండు సేయు కార్యంబులు బ్రహ్మరుద్రాదు
లెఱుంగరంట యతని తత్త్వంబు నెవ్వ రెఱుంగ నోపుదు రది గావునం
బుత్రా యిట్లుత్పత్తిస్థితిలయంబులకు దైవంబు కారణం బై యుండ
నీధనదానుచరులు భవదీయభ్రాతృహంత లగుదురే భూతాత్మ

---

1 అయస్కాంతము=సూదంటురాయి. 2 యోషిత్=స్త్రీ 3 వ్యవాయము=సంభోగము. 4 ఉపచయము=వృద్ధి, అపచయము=హాని.

కుండు భూతేశుండు భూతభావనుండు సర్వేశ్వరుండుఁ బరావరుండు నగునీశుండమాయాయుక్తుండై స్వశక్తిచేసృష్టిస్థితిలయంబులం జేయు నయిన నహంకారంబునం జేసి గుణకర్మంబులచే నస్పృశ్యుండగుచు వర్తించునదియునుంగాక యీప్రజాపతులు విశ్వసృణ్ణామంబులనియంత్రితులై ముకుఁద్రాళ్లు వెట్టినపశువులుంబోలె నెవ్వని యాజ్ఞాధీనకృత్యులై వర్తింతు రట్టి దుష్టజన మృత్యువునుసుజనామృతస్వరూపుండును సర్వాత్మకుండును జగత్పరాయణుండును నైనయీశ్వరుని సర్వప్రకారంబుల శరణంబుఁబొందు మదియునుంగాక. 357

సీ. అనఘాత్మ నీవు పం ♦ చాబ్దవయస్కుండ
వై పినతల్లి ని ♦ న్నాడినట్టి
మాటల [1]నిర్భిన్న ♦ మర్మండ వగుచును
జనయిత్రి దిగనాడి ♦ వనము కేఁగి
తప మాచరించి య ♦ చ్చపుభక్తి నీశ్వరుఁ
బూజించి మహితవి ♦ భూతి మెఱసి
రమణఁ ద్రిలోకో త్తరం ♦ బైనపదమును
బొందితి వదిగాన ♦ భూరిభేద

తే. రూపమైన ప్రపంచంబు ♦ రూఢినేను
హాత్మనందుఁ [2]బ్రతీతమై ♦ యలరు నట్టి
యగుణుఁ డద్వితీయుండును ♦ నక్షరుండు
నైనయీశ్వరుఁ బరమాత్మ ♦ ననుదినంబు. 358

౹. కైకొని శుద్ధంబు ♦ గతమత్సరంబును
నమలంబు నగుహృద ♦ యంబునందు
సొలవ కన్వేషించు ♦ చును బ్రత్యగాత్ముండు
భగవంతుఁడును బర ♦ బ్రహ్మమయుఁడు
నానందమాత్రుండు ♦ నవ్యయుఁ డుపపన్న
సకలశక్తియుతుండు ♦ సగుణుఁ డజుఁడు
నయిన సర్వేశ్వరు ♦ నం దుత్తమంబైన
సద్భక్తిఁ జేయుచు ♦ సమత నొప్పి

1 నిర్భిన్నమర్మ్ముఁడు = చీల్పఁబడిన ఆయువుపట్టుగలవాఁడు. 2 ప్రతీతము = ౹ఱుఁక, ప్రసిద్ధి.

తే. రూఢి సోహమస్మి మేతి ప్ర ♦ రూఢ మగుచు
ఘనత కెక్కినవిద్య యను ♦ [1]గ్రంథి నీవు
ద్రెంచి వైచితి కావున ♦ ధీవరేణ్య
సర్వశుభహాని యైనరో ♦ షంబు వలదు. 359

క. వినురోషహృదయు చేతను, ననయము లోకము నశించు ♦ నౌషధములచే
ఘనరోగము లుపశమించిన, యనువున నదిగా నరోష ♦ మడఁపు మహాత్మా.

తే. అనఘ నీదు సహోదర ♦ హంతలనుచుఁ
బెనఁచి యీపుణ్యజనులఁ జం ♦ పితి కడంగి
పరఁగ నిదియె సదాశివ ♦ భ్రాతయైన
యర్థవిభునకు నపరాధ ♦ మయ్యెఁ గాన. 361

క. నతినుతులచేత నీవిపు, డతనిఁ బ్రసన్నునిఁగఁ జేయు ♦ మని మనువు దయా
మతిఁ జెప్పి ధ్రువుని చే సత్, కృతుఁడై నయ మొప్పఁ జనియె ♦ ఋషియుక్తుండై.

వ. అంత. 363

తే. యక్షచారణసిద్ధ వి ♦ ద్యాధరాది
జనగణస్తూయమానుఁడై ♦ ధనదుఁ డంతఁ
బుణ్యజన [2]వైశసనివృత్తు ♦ భూరిరోష
రహితుఁడైనట్టి ధ్రువునిఁ జే ♦ రంగవచ్చె. 364

సీ. చనుదెంచి వెసఁ గృతాం ♦ జలియైన ధ్రువుఁ జూచి
తివుట నిట్లనియె క్ష ♦ త్రియకుమార
తగ భవదీయ పి ♦ తామహాదేశంబు
నను [3]దుస్త్యజంబైన ♦ ఘనవిరోధ
ముడిగితి వటు గాన ♦ నోసరంగ నిపుడు నీ
యందుఁ బ్రసన్నుండ ♦ నైతి భూత
జననలయంబుల ♦ కనయంబుఁ గాలంబె
కర్తయై వర్తించుఁ ♦ గాన యుష్మ

తే. దనుజుఁ జంపినవార లీ ♦ యక్షవరులు
గారు తలపోయ నీయక్ష ♦ గణము నిట్లు

---

1 గ్రంథి = ముడి. 2 వైశసనివృత్తుఁడు = హింసనుండి విరమించినవాఁడు
3 దుస్త్యజము = విడువరానిది.

నెఱి వధించిన వాఁడవు ♦ నీవు గావు
వినుతగుణశీల మాటలు ♦ వేయు నేల. 365

వ. అదియునుంగాక యేబుద్ధిం జేసి కర్మసంబంధిదుఃఖాదికంబులు దేహాత్మానుసంధానంబునం జేసి సంభవించు నట్టియహంత్వ మ్మను నపార్థజ్ఞానంబు స్వప్నమునుంబోలెఁ బురుషునకుం దోఁచునది గావున సర్వభూతాత్మవిగ్రహుండును నధోక్షజుండును భవచ్ఛేదకుండును భజనీయ పాదారవిందుండును ననంతామేయశక్తియుక్తుండును గుణమయి యగు నాత్మమాయచే విరహితుండును నైన యీశ్వరుని సేవింపుము నీకు భద్రం బయ్యెడు భవదీయ మనోగతంబైన వరంబుఁ గోరుము నీ వంబుజనాభ పాదారవింద సేవనంబుఁ జిరంబుగఁ జేయుదువని యెఱుంగుదు ననిన రాజరాజుచేత నట్లు మహామతియు భాగవతోత్తముండు నైన ధ్రువుండు ప్రేరేపింపంబడి యే హరిస్మరణంబుచేత నప్రయత్నంబున దురత్యయంబైన యజ్ఞానంబుఁ దరియింతు రట్టి హరిస్మరణం బచలితం బగున ట్లొసంగు మనియడిగిన నట్లకాకయని యంగీకరించి యంతం గుబేరుండు సంప్రీతచిత్తుండయి ధ్రువునికి శ్రీహరిస్మరణం బట్ల యనుగ్రహించి యంతర్ధానంబు నొందె నంత ధ్రువుండు యక్షకిన్నర కింపురుష గణసంస్తూయమాన వైభవుం డగుచు నాత్మీయపురంబునకు మరలి చనుదెంచి. 366

సీ. గణుతింప భూరిద♦క్షిణలచేఁ గడునొప్పు
యజ్ఞముల్ సేయ న♦య్యజ్ఞవిభుఁడు
ద్రవ్య క్రియా దేవ♦తా ఫలరూప స
త్కర్మఫల ప్రదా♦త యయి యొప్పు
పురుషోత్తముని నర్థిఁ ♦ బూజించి మఱియు న
ర్వోపాధివర్జితుఁ ♦ డుత్తముండు
సర్వాత్మకుఁడు నగు ♦ జలజాక్షునందుఁ దీ
వ్రంబై ప్రవాహ రూ♦పంబునైన

తే. భక్తి నలుపుచు నఖిల ప్ర♦పంచమందు
నలరఁ దనయందునున్న మ♦హాత్ము హరినిఁ

జిదచిదానందమయునిల ♦ క్ష్మీవరుఁ బరము
నీశ్వ రేశ్వరుఁ బొడగనె ♦ సిద్ధచరిత. 367

వ. ఇట్లు సుశీల సంపన్నుండును బ్రహ్మణ్యుండును ధర్మసేతురక్షకుండును దీనవత్సలుండును నయి యవని పాలించు ధ్రువుండు దన్నుఁ బ్రజలు దండ్రియని తలంప నిరువదియాఱువేలేండ్లు భోగంబులచేతం బుణ్యక్షయంబును నభోగంబులైన యాగాదులచేత నశుభక్షయంబునుం జేయుచు బహుకాలంబు దనుకఁ ద్రివర్గసాధనంబుగా రాజ్యంబు సేసి కొడుకునకుఁ బట్టంబు గట్టి యచలితేంద్రియుండై యవిద్యారచిత స్వప్నగంధర్వనగరోపమం బయిన దేహాదికం బగు విశ్వంబు భగవన్మాయారచితంబనియాత్మం దలంచుచు వెండియు. 368

చ. మనునిభుఁడంత భృత్యజన ♦ మంత్రి పురోహిత బంధుమిత్ర నం
దన పశు విత్త రత్న వని♦తాగృహరమ్యవిహారశైలవా
రినిధిపరీతభూతల హ♦రి ద్వీపముఖ్యపదార్థజాలముల్
ఘనమతిచే ననిత్యములు ♦ గాఁ దలపోసి విరక్తచిత్తుఁడై. 369

సీ. పురము వెల్వడి చని ♦ పుణ్యభూబదరికా
ఘనవిశాలానదీ ♦ కలితమంగ
ళాంబుపూరంబుల ♦ ననురక్తిమైఁ గ్రుంకి
కమనీయపరిశుద్ధ ♦ కరణుఁ డగుచుఁ
బద్మాసనస్థుఁడై ♦ పవనుని బంధించి
నెలకొని ముకుళిత ♦ నేత్రుఁడగుచు
హరిరూపవైభవ ♦ ధ్యానంబు సేయుచు
భగవంతు నచ్యుతుఁ ♦ బద్మనేత్రు

తే. నందు సతతంబు నిశ్చల ♦ మైనయట్టి
భక్తిఁ బ్రవహింపఁజేయుచుఁ ♦ బరమమోద
బాష్పధారాభిషిక్తుండు ♦ భవ్యయశుఁడుఁ
బులకితాంగుండు నగుచు ని ♦ మ్ములఁ దనర్చి. 370

వ. మఱియు విగత క్లేశుండును ముక్తలింగుండును నై ధ్రువుండు తన్నుఁ దా మఱచి యుండు సమయంబున దశదిక్కుల నుద్యద్రాకానిశానాయకుండునుం బోలె వెలింగించుచు నాకాశంబుననుండి యొక్క

విమానంబు ననుదేర నందు దేవశ్రేష్ఠులును జతుర్భుజులును రక్తాంబుజేక్షణులును శ్యామవర్ణులును గదాధరులునుసువాసులును గిరీట హారాంగద కుండల ధరులును గౌమార వయస్కులును నుత్తమశ్లోకకింకరులు నయినవారల నిద్దఱంగని సంభ్రమంబున లేచి మధుసూదను నామంబులు సంస్మరించుచువారల భగవత్కింకరులంగాఁ దలంచి దండప్రణామంబు లాచరించినం గృష్ణపాదారవింద [1] విన్యస్త చిత్తుండుఁ గృతాంజలియు [2] వినమిత కంధరుండు నైన ధ్రువునిం గనుంగొని పుష్కరనాభ భక్తు లైన సునంద నందులు ప్రీతియుక్తులై మందస్మితులగుచు నిట్లనిరి. 371

ఉ. ఓనృప నీకు భద్రమగు ♦ నొప్పగుచున్న మదీయ వాక్యముల్
వీనులయందుఁ జొన్పుము వి ♦ వేకముతో నయిదేండ్లనాఁడు మే
ధానిధివై యొనర్చినయు ♦ దాత్తతపోవ్రతనిష్ఠచేతఁ దే
జోనయశాలివైన మధు ♦ సూదను దృప్తి వహింపజేయవే. 372

ఆ. అట్టి శార్ఙ్గపాణి ♦ యఖిల జగద్భర్త
దేవ దేవుఁ డతుల ♦ దివ్యమూర్తి
మమ్ముఁ బనుప మేము ♦ మాధవపదమున
కర్థి నిన్నుఁ గొనుచు ♦ నరుగుటకును. 373

వ. వచ్చితిమి యేపదంబు నేని సూరిజనంబులు సర్వోత్తమంబనిపొందుదురు దేనిఁ జంద్ర దివాకర గ్రహనక్షత్ర తారాగణంబులు ప్రదక్షిణంబుగాఁదిరుగుచుండు మఱియునీదుపితరులచేతనునన్యులచేతను ననధిష్ఠితంబును జగద్వంద్యంబునుభక్తజనాతిదుర్లభంబునునయిన విష్ణుపదంబుం బొందుదువు రమ్మిదె విమానశ్రేష్ఠం బుత్తమశ్లోకజనమౌళిమణియైన శ్రీహరి వుత్తెంచె దీని నెక్కనర్హుండవనిన నురుక్రమప్రియుండయిన ధ్రువుండు తన్మధుర వాక్యంబులు విని కృతాభిషేకుండయియచ్చటిమునులకుఁబ్రణమిల్లితదాశీర్వాదంబులు గైకొని విమానంబునకుంబ్రదక్షిణార్చనంబులుగావించిహరిపార్షదు

1 విన్యస్తచిత్తుఁడు=ఉంచఁబడిన మనస్సుగలవాఁడు. 2 వినమితకంధరుఁడు=వంచిన మెడగలవాఁడు.

లైన సునందనందులకు వందనం బాచరించి భగవద్రూపవిన్యస్తచక్షు రంతఃకరణాదికుం డగుచు విమానాధిరోహణంబు గావించుటకు [1]హిరణ్మయరూపంబు ధరియించె నప్పుడు. 374

క. సురదుందుభిపణవానక, మురజాదులు మ్రోగె నెగి గుల ♦ ముసురు గురిసెఁ గి
న్నరగంధర్వుల పాటలు, భరితములై చెలఁగె నప్పుడు ♦ భవ్యచరిత్రా.

వ. అట్టిసమయంబున ధ్రువుండు దుర్గమంబగు త్రివిష్టపంబునకు నేఁగువాఁడగుచు దీనయగు జననిం దిగనాడి యెట్లుపోవుదునని చింతించువానిం బార్షదు లవలోకించి యగ్రభాగంబున విమానారూఢయై పోవుచున్న జననిం జూపిన సంతుష్టాంతరంగుం డగుచు. 376

క. జననిసునీతిని మును కనుఁ,గొని యవలవిమానమెక్కి ♦ కొనకొని విబుధుల్
దనమీఁదఁ బుష్పవర్షములనయముఁ గురియింప నప్పుడు ♦ హర్షము తోడన్

క. చని చని వెస గ్రహమండల
మును త్రైలోక్యంబు సప్త ♦ మునిమండలమున్
ఘనుఁ డు[2]త్తరించి యవ్వలఁ
దనరెడు హరిపదము నొందెఁ ♦ దద్దయుఁ బ్రీతిన్. 378

వ. అది మఱియు నిజకాంతిచేతం ద్రిలోకంబులం బ్రకాశింపం జేయుచు నిర్దయాగమ్యంబును శాంతులు సమదర్శనులు శుద్ధులు సర్వభూతానురంజనులు నచ్యుతభక్తబాంధవులు నయిన భద్రాచారులకు సుగమ్యంబును నయి గంభీరవేగంబు ననిమిషంబు నగు జ్యోతిశ్చక్రంబు సమాహితంబై గోగణంబు మేధియందుం బోలె నెందుఁ బరిభ్రమించుచుండునట్టి యచ్యుతపదంబునుం బొందె విష్ణుపరాయణుండైన ధ్రువుండు త్రిలోకచూడామణియై యొప్పుచుండె నప్పుడు భగవంతుండైన నారదుండు ధ్రువుని మహిమం గనుంగొని ప్రచేత[3]స్సత్త్రంబునందు వీణ వాయించుచు. 379

సీ. పతియె దైవంబుగా ♦ భావంబులోపలఁ
దలఁచు సునీతి నం ♦ దనుతపఃప్ర

---

1 హిరణ్మయరూపము = బంగారురూపు. 2 ఉత్తరించి=దాటి. 3 సత్త్రము=యజ్ఞము.

భావముక్రియ ధర్మ ♦ భవ్యనిష్ఠలఁ బొంద
జాలరు బ్రహ్మర్షి ♦ జనములనిన
క్షత్రియ కులు నెన్నఁ ♦ గా నేల యెవ్వఁడు
పంచసంవత్సర ♦ ప్రాయమునను
సురుచి [1]దురుక్త్యుగ్ర ♦ శరభిన్న హృదయుఁడై
మద్వాక్యహితబోధ ♦ మతిఁ దనర్చి

తే. వనమునకు నేఁగి హరిభక్తి ♦ వశతనొంది
యజితుఁడగు హరి తన వశు ♦ డై చరింపఁ
జేసి వెసఁ దత్పదంబును ♦ జెందె నట్టి
హరిపదంబును బొంద నె ♦ వ్వరికిఁ దరము. 381

క. అని పాడెననుచు విదురున, కనఘుఁడు మైత్రేయుఁడనియె ♦ నంచితభక్తిన్
వినుతోద్దామయశస్కం, డన గల యా ధ్రువుని చరిత ♦ మార్యస్తుత్యా.

సీ. మహితసత్పురుషస ♦ మ్మతమును ధన్యంబు
స్వర్గప్రదంబు య ♦ శస్కరంబు
నాయుష్కరంబుఁ బు ♦ ణ్యప్రదాయకమును
మంగళకర మఘ ♦ మర్షణంబు
సౌమనస్యముఁ బ్రశం ♦ సాయోగ్యమును బాప
హరమును ధ్రువపద ♦ యాపకంబు
నై యొప్పు నీయుపా ♦ ఖ్యానంబుఁ దగ నీకు
నెఱిఁగించితిని దీని ♦ నెవ్వఁ డేని

తే. తివుట శ్రద్ధాగరిష్ఠుఁడై ♦ తీర్థపాద
చరణసరసీరుహద్వయా ♦ శ్రయుఁడు నైన
భవ్యచరితు దినాంత ప్ర ♦ భాతవేళ
లలఘుమతి దర్శ పూర్ణిమ ♦ లందు మఱియు. 382

తే. ద్వాదశినిఁ [2]బద్మబాంధవ ♦ వాసరమున
శ్రవణనక్షత్రమున దిన ♦ క్షయము నందు

1 దురుక్త్యుగ్రశరభిన్నహృదయుఁడు = చెడుమాటలను వాఁడిబాణముల చేఁ జీల్పఁబడిన మనస్సుగలవాఁడు. 2 పద్మబాంధవవాసరము = ఆదివారము.

బరఁగ సంక్రమణ[1]వ్యతీ ♦ పాతలందు
సభల భక్తిని వినునట్టి ♦ సజ్జనులకు. 383

వ. క్లేశనాశనంబును మహాప్రకాశంబును నైన భగవద్భక్తియు శీలాది గుణంబులును గలుగు మఱియుఁ దేజఃకాములకుఁ దేజంబును నిష్కాముకుఁ దత్త్వవిజ్ఞానంబును గలుగు దీని వినుపించువారికి దేవతానుగ్రహంబు గలుగు నిట్టి యుపాఖ్యానంబు నీ కెఱింగించితినని మైత్రేయుండు విదురునకుఁ జెప్పిన క్రమంబున శుకయోగి పరీక్షితున కెఱింగించిన తెఱంగు సూతుండు శౌనకాదులకు వినిపించి వెండియు నిట్లనియె నట్లు సెప్పిన మైత్రేయునిం గని విదురుం డిట్లనియె. 384

సీ. అనఘాత్మ నారద ♦ మునిపతి ధ్రువచరి
త్రము ప్రచేతసులస ♦ త్త్రంబునందు
నర్థిమై గీర్తించె ♦ నంటి ప్రచేతసు
లన నెవ్వ రెవ్వరి ♦ తనయు లెట్టి
వంశజుల్ సత్త్రమె ♦ వ్వలనను జేసి ర
ధ్వరమందు నిజకుల ♦ ధర్మశీలు
రగు ప్రచేతసులచే ♦ యజియింపఁగాఁబడె
యజ్ఞపూరుషుఁ డెట్టు ♦ లచ్యుతాంఘ్రి

తే. భక్తియుక్తుఁడు విదిత స ♦ ద్భాగవతుఁడు
దివిరి హరిపాద సేవావి ♦ ధిప్రయుక్త
దేవధర్మునఁ దగునట్టి ♦ దివ్యయోగి
నారదుం డెట్లు గొనియాడె ♦ శౌరికథలు. 385

క. నాకిపు డెఱిఁగింపుము సు,శ్లోకుని చరితామృతంబు ♦ [2]శ్రోత్రాంజలులం
బైకొని జుఱ్ఱియుఁ దనివిం, గైకొనకున్నది మనంబు ♦ కరుణోపేతా.

క. అనియడిగిన విదురునిఁ గనుఁ గొని మైత్రేయుండు వలికె ♦ గొనకొని ధ్రువుడు
న్వనమునకుఁ జనిన నాతని, తనయుండగు నుత్కలుండు ♦ దళితాఘుండై

1 వ్యతీపాత = ఒక గ్రహయోగము. 2 శ్రోత్రాంజలి = చెవు లను దోసిలి.

సీ. చతురుఁ డాజన్మప్ర ♦ శాంతుండు నిస్సంగుఁ
డును సమదర్శనుం ♦ డును ఘనుండు
నై యాత్మయందు లో ♦ కావళి లోకంబు
లందు నాత్మను జూచు ♦ చనఘుమైన
యనుపమయోగాగ్రి ♦ యాపావశాదగ్ధ
కర్మమలాశయ ♦ కలనఁ బేర్చి
జడునికైవడిఁ [1]జీఁకు ♦ చందంబునను మూఁగు
పగిది [2]నున్మత్తుని ♦ భంగిఁ జెవిటి

తే. వడువునను గానఁబడుచు స ♦ ర్వజ్ఞుఁడై ప్ర
శాంతకీలహుతాశను ♦ సరణిఁ జొచ్చి
సతతశాంతంబు సంచిత ♦ జ్ఞానమయము
నైనబ్రహ్మస్వరూపంబు ♦ నాత్మఁ దలఁచి. 388

క. తనకంటెనితర మొక టెఱుఁగనికతమున సార్వభౌమ♦శ్రీఁబొందక
మనమునఁగోరకయుండుటఁ,గనికులవృద్ధులునుమంత్రి♦గణములునంతన్

వ. అతని నున్మత్తునింగాఁ దెలిసి తదనుజుండైన వత్సరునికిఁ బట్టంబుగట్టి రావత్సరునికి సర్వర్ధి యనుభార్యయందుఁ బుష్పార్ణుండును జంద్రకేతుండును నిషుండును నూర్జుండును వసువును జయుండును నన నార్వురుతనయులు గలిగి రందుఁ బుష్పార్ణుం డనువానికిఁ బ్రభయు దోషయు నను నిద్దఱుభార్యలై రందుఁ బ్రభయనుదానికిం బ్రాతర్మధ్యందినసాయంబు లనుసుతత్రయంబును దోష యను దానికిం బ్రదోషనిశీథవ్యుష్టు లనువారు ముగ్గురును బుట్టి రందు వ్యుష్టుఁడను వానికిఁ బుష్కరిణి యనుపత్నియందు సర్వతేజుం డనుసుతుండు పుట్టె వానికి నాకూతి యను [3]మహిషివలనఁ జక్షుస్సంజ్ఞుం డయిన మనువు జనియించె వానికి నడ్వల యనుభార్యయందుఁ బురువును గుత్సుండును ద్రితుండును ద్యుమ్నుండును సత్యవంతుండును బుతుండును వ్రతుండును నగ్నిష్టోముండును నతిరాత్రుండును సుద్యుమ్నుండును శిబియును నుల్ముకుండును నను పన్నిద్దఱు తనయులు గలిగి

1 చీఁకు = గ్రుడ్డి. 2 ఉన్మత్తుఁడు = పిచ్చివాఁడు. 3 మహిషి = రాణి.

రందు నుల్ముకునికిఁ బుష్కరిణి యనుదానివలన నంగుండును సుమన సుండును ఖ్యాతియుఁ గ్రతువును నంగిరసుండును గయుండును నను నార్వురు గొడుకులు పుట్టి రంగునంగునికి సునీథ యనుధర్మపత్నివలన వేనుం డనుపుత్రుం డుదయించిన. 390

మ. క్షితినాథోత్తముఁ డాత్మనందనుని దు♦శ్శీలంబు వీక్షించి దుః
ఖితుఁడై యొంటిగఁ దత్పురిన్ వెడలి యేఁ♦గన్ వేగ మొందేనిఁ ద
ద్గతి వీక్షించి మునీశ్వరుల్ గుపితులై ♦ [1]దంభోళిసంకాశవా
క్యతతిన్ జావ శపింప వాఁ డపుడు వీఁ♦కం గూలె సమ్మోదినిన్. 391

సీ. కైకొని యపుడు లో ♦ కం బరాజకమైనఁ
బ్రజలు దస్కరపీడఁ ♦ బల్లటిల్లఁ
గనుఁగొని దుఃఖించి ♦ మునులు గతాసుఁడై
పడిన వేనుని[2]వల ♦ పలిభుజంబు
నర్థి మథింప నా ♦ రాయణాంశంబున
నాదిరా జననొప్పు ♦ నట్టి పృథుఁడు
జనియించె ననవుడు ♦ విని విదురుఁడు మునిఁ
గనుఁగొని పలికె నో ♦ యనఘచరిత

తే. సాధువు సుశీలనిధియును ♦ సజ్జనుండు
నలఘుబ్రహ్మణ్యుఁడును నైన ♦ యట్టి యంగ
ధరణివిభునకు దుష్టసం ♦ తాన మెట్లు
గలిగె నయ్యంగపతి యేమి ♦ కారణమున. 392

వ. విమనస్కుం డగుచుఁ బురంబు విడిచె ధర్మకోవిదు లైన మునులు దండవ్రతధరుండును రాజు నగు వేనునియందు నే పాపంబు నిరూపించి బ్రహ్మదండం బొనర్చి రదియునుం గాక లోకంబున రాజులు లోకపాలతేజోధరులుఁ బ్రజాపాలనాసక్తులుఁ గావునఁ గల్మషంబు గలిగినం బ్రజలచేత నవజ్ఞానర్హులై యుందురు గావున నా వేనుని చరిత్రంబు శ్రద్ధాగరిష్ఠుండు భక్తుండునైన నాకుం [3]బరాపరవి

1 దంభోళి = వజ్రాయుధము. 2 వలపలి = కుడి. 3 పరాపరవిదగ్రేసరుఁడు = వెనుకముందెఱింగినవారిలో మేటి.

దగ్రేసరుండ వయిన నీవెఱింగింప నర్హుండ వనిన మైత్రేయుం డతని కిట్లనియె. 393

—♦ అంగపుత్త్రుం డగు వేనుని చరిత్రము ♦—

సీ. అనఘాత్ము రాజర్షి ♦ యైనట్టి యయ్యంగ
మేదినీవిభుఁ డశ్వ ♦ మేధమఖముఁ
గావింప ఋత్విజ్జ్ఞ ♦ కాయంబుచేత నా
హూత మయ్యును సుర ♦ వ్రాతమందు
నాత్మహవిర్భాగ ♦ మంద రాకుండిన
నప్పుడు [1]ఋత్విక్కు ♦ లద్భుతంబు
నందుచు యజమానుఁ ♦ డైన యయ్యంగ మ
హీవరుఁ జూచి రా ♦ జేంద్ర యిట్లు

తే. త్రిదశు లిదె పిల్వఁబడియును ♦ దివిరి యాత్మ
భాగములఁ బొంద రారైరి ♦ భవ్యచరిత
యేమి హేతువొ యిది మాకు ♦ నెఱుఁగఁబడదు
కనఁగ హోమంబు దుష్టంబు ♦ గాదు మఱియు. 394

వ. శ్రద్ధాయుక్తులైనయిాబ్రహ్మవాదులచేత సంప్రయుక్తంబు లైన యిా [2]ఛందస్సులు వీర్యవంతంబులయి యున్నయవి యిందు దేవతాపరాధం బణుమాత్రం బయిన నెఱుంగ మిట్టిచోటం గర్మసాక్షులయినదేవతలుస్వకీయభాగంబులంగీకరింపకుండుటకుఁ గతంబెయ్యదియో యనిన నయ్యంగుండు దుఃఖితస్వాంతుండై తన్నిమిత్తంబు సదస్యుల నడుగం దలంచివారలయనుమతింబడసి మౌనంబుమాని యిట్లనియె. 395

ఆ. అనఘచరితులార ♦ యాహూతు లయ్యు సు
పర్వగణము లాత్మ ♦ భాగములను
స్వీకరింప రేను ♦ జేసిన యపరాధ
మెట్టి దనిన వార ♦ లిట్టులనిరి. 396

---

1 ఋత్విక్కులు = యజ్ఞముచేయించు బ్రాహ్మణులు. 2 ఛందస్సు = మంత్రవిశేషము.

క. నరనాథా యిది యిప్పుడు
వారసినదుష్కృతము గాదు ♦ పూర్వభవమునం
బరఁగినదురితం బిది యా
దరమున నెఱిఁగింతు మింత ♦ ధన్యచరిత్రా. 397

క. నీ వింతవాఁడ వయ్యును
భూవర సంతానలాభ ♦ మును బొందమి నా
దేవతలు యాగభాగము
లీవేళ భుజింపరైరి ♦ యిందుకు నీవున్. 398

తే. పుత్రకామేష్టిఁ గావించి ♦ పుత్రుఁ బడయు
మట్లొనర్చిన దేవత ♦ లాత్మభాగ
మర్థిసంగీకరింతు ర ♦ య్యజ్ఞపురుషు
హరి భజించిన సకలకార్యములుఁ గలుగు. 399

వ. అనిన నాతండు సంతానార్థంబు శిపివిష్టదేవతాకంబయిన [1]పురోడాశంబు చే హోమంబు గావించిన నందదీయ హోమకుండంబునందు హేమమాల్యాంబరాభరణుం డ[illegible]ంసు హిరణ్మయ పాత్రంబున స్నిగ్ధపాయసంబు గొ[illegible] నుదయించిన నప్పుడు విప్రానుమతంబున నారాజు దత్పాయసంబు నంజలిచే గ్రహించి సంతోషయుక్తుం డగుచు భార్యకొసంగె నంత. 400

చ. కమలదళాక్షి పాయసము ♦ గౌతుకమొప్ప భుజించి భవ్యసం
గమమునఁ జేసి తత్క్షణమ ♦ గర్భముఁ దాల్చి కుమారుఁ గాంచె న
క్కొమరుఁడు నంత మాతృజన♦కుండగు మృత్యువుఁబోలి తా నధ
ర్మమునఁ జరించుచుండె గుణ♦[illegible]ండన వేనుఁ డసంగ నిచ్చలున్.

చ. ఎనయఁగ బాల్యమందుఁ దన♦యీడుకుమారులఁ గ్రీడఁబోలె న
మ్మనమున భీతిలేక కృప ♦ మాలి పశుప్రకరంబు నొంచుపో
లిఁగని [2]నరికట్టి చంపుచును ♦ [3]కిల్బిషలుబ్ధకవృత్తి నై శరా
సనశరముల్ ధరించి మృగ♦జాతి నసాధుగతిన్ వధించుచున్. 402

---

1 పురోడాశము = యజ్ఞార్థమగు అపూపము. 2 అరికట్టి = అడ్డగించి.
3 కిల్బిషలుబ్ధకుఁడు = పాపియగు బోయవాఁడు.

వ. ఇట్లు మహాతామహదోషంబునం బాపప్రవర్తనుండై చరియించు కొడుకుం జూచి యంగుడు వివిధశాసనంబుల దండించియు నతని దుశ్చేష్టితంబులు మానుపంజాలక దుఃఖితాత్ముండై మనంబున. 403

క. అనయము నిట్టికుపుత్రునిఁ, గనిపరితాపంబుఁ బొందు ♦ కంటెను ధరలో
[1]ననపత్యుండగుటొప్పును, వనజాక్షుభజించునట్టి ♦ వాఁడగువాఁడున్.

వ. అని వెండియు నిట్లనియె. 405

సీ. జనులకు దుష్పుత్ర ♦ కునిచేత నపకీర్తి
యు నధర్మమును సర్వ ♦ జన విరోధ
మును మనోవ్యథయును ♦ మునుకొని ప్రాపించు
నట్టికుపుత్రు మో ♦ హంబు విడువఁ
జాలక బహుమాన ♦ సంగతిఁ గను నెవ్వఁ
డతని గేహంబు దుః ♦ ఖాలయంబు
నగు నని మఱియు ని ♦ ట్లను మనుజుండు శో
కస్థానమగు పుత్రు ♦ కతనఁ జేసి

తే. యనుపమక్లేశభాజనం ♦ బయినగృహము
విడుచుఁ గావున నిట్టివి ♦ వేకహీనుఁ
డగుకుపుత్రుసుపుత్రుఁగా ♦ నాత్మఁ దలఁతు
ననుచు నారాజు బహుదుఃఖ ♦ తాత్ముఁ డగుచు 406

క. తగుసుమహైశ్వర్యోదయు, మగుగృహమునుబ్రజలనిద్ర ♦ నందినభార్యన్
దిగవిడిచి యొక్కఁడేనిని, జగతీశుఁడు సనె[2]నిశీథ ♦ సమయమునందున్. 407

వ. అంతఁ దద్వృత్తాంతం బంతయు సుహృద్బాంధవ పురోహితామాత్య ప్రభృతు లయిన ప్రజ లెఱింగి దుఃఖించుచున్న సమయంబున భూమియందెల్ల యెడలఁ దదన్వేషణంబాచరించి గూఢుండయిన పరమపురుషునిం గానలేని కుయోగిచందంబున నా రాజుం బొడ గానలేక [3]విఫలోద్యోగులయి మగిడి పురంబునకు వచ్చిరి తద నంతరంబ. 408

---

1 అనపత్యుఁడు = సంతానములేనివాఁడు. 2 నిశీథసమయము = అర్ధరాత్రము.
3 విఫలోద్యోగులు = నిష్ఫలమైనయత్నముగలవారు.

సీ. సమధిగ బ్రహ్మని ♦ ష్ఠాతిగరిష్ఠులౌ
భృగ్వాదిమౌనీంద్ర ♦ బృంద మపుడు
* [1]లోకావనైకావ ♦ లోకనోత్సుకులైన
జనులు స్వరక్షక ♦ జనవిభుండు
లేమిఁ బసుప్రాయు ♦ లై మెలంగుటఁ గని
యంత వేనునిమాత ♦ యగుసునీథ
యనుమతి నఖిల ప్ర ♦ జావళి కప్రియుం
డైన నవ్వేనుఁ బ ♦ ట్టాభిషిక్తుఁ
తే. జేసి రంతట మహిలోగ్ర ♦ శాసనుఁ డగు
వేనుఁ బట్టంబు గట్టుట ♦ విని సమస్త
†తస్కరులు సర్పభీతిచేఁ ♦ దలఁగుమూష
కములకైవడి నడఁగిరి ♦ [2]గహనములను. 409

వ. అంత నతండు. 410

చ. పరువడి నష్టలోకపరి ♦ పాలకముఖ్య విభూతియుక్తుఁడై
పరఁగి నృపాసనంబున వి ♦ భాసితుఁడౌట స్వభావసిద్ధమై
వఱలు మహా[3]వలేపమున ♦ వారక సంతతమాననీయ స
త్పురుషుల నెల్ల నెందుఁ[4]బరి ♦ భూతులఁ జేయుచునుండె నిచ్చలున్.

చ. మఱియు నతండు భూగగన ♦ మార్గములం దొకవేళ నొక్కఁడే
యరదము నెక్కి క్రమ్మరు [5]ని ♦ రంకుశవృత్తిఁ జరించు [6]మత్తసిం
ధురవిభుపోల్కి సత్పురుష ♦ దూషితవర్తన నొప్పుచున్ నిరం
తరసుజనాపరాధకృతి ♦ తత్పరమానసుఁడై క్రమంబునన్. 412

---

*'దైవాని లోకరక్షకునెల్ల నీ లోక, జనరక్షకుం డగు జనవిభుండు' అని పాఠాంతరము.

†'జనులు మార్జాలమును గని చనెడిమూష, కముల కైవడి నడఁచిరి గహనములను'—అనిపాఠాంతరము.

1 లోకావన = లోకమును గాపాడుట. 2 గహనము = అడవి. 3 మహావలేపము = గొప్ప గర్వము. 4 పరిభూతులు = పరాభవింపఁబడినవారు. 5 నిరంకుశవృత్తి = స్వేచ్ఛావ్యాపారము. 6 మత్తసింధురవిభు = మదపుటేనుఁగు.

క. దిక్కులఁ జెలఁగఁ గదలఁగఁ బ్రాధ్వోద్వాహ్యములఁ గల భేరి ♦ వ్రేయించె[1] నయ
ష్టవ్యము దాతవ్యము హో,తవ్యంబి ప్రా' యనుచును ♦ దా దద్ధ్వనులన్.

క. అని యిట్టులు భేరీరవ,మునఁ జేసి సమస్తధర్మ ♦ ములు వారింపన్
మును లవినీతుం డగు వే,నుని దుశ్చరితంబు జనమనోభయ మగుటన్.

తే. కని కృపాయత్తు లగుచు ని ♦ ట్లనిరి యిట్టి
రాజచోరభయంబు లీ ♦ భూజనులను
బలసి యిరువంకలను బాధ ♦ పఱుపఁ జొచ్చె
దారువందుల వహ్నిచం ♦ దమునఁ బెలుచ. 415

చ. అరయ నరాజకంబగు మ ♦ హాభయముం దొలఁగింపఁ గోరి యి
ట్లిలఁ గక యీయనర్హుని మ ♦ హీపతిఁ జేసినయట్టిదోషముం
బరువడిఁ జెందె దుగ్ధరస ♦ పానమునం బరివృద్ధినొందున
య్యురగము భీతి పోషకుని ♦ నొందినరీతి ననర్థహేతువై. 416

వ. అదియునుం గాక. 417

క. మునుకొని సునీథగర్భం,బున జనియించియు స్వభావ ♦ మున దుర్జనుఁడై
యెనయఁ బ్రజాపాలనమున,కును బాల్పడి ప్రజలమన్ని ♦ గొనఁ జొచ్చెఁగదే

వ. అదిగాన నీ వేనుండు పూర్వంబున జ్ఞానసంపన్నులచేత రాజుగాఁ
జేయంబడియెఁ గావున నిట్టివాని మన మందఱమును గూడి ప్రార్థిం
తము లోకరక్షణార్థంబగుటఁ దద్దోషంబు మనల స్పృశింపదు
[2]సమీచీనోక్తులం జేసి వీని ననునయింప వాని గ్రహింపకుండెనేని
మున్న లోకధిక్కారాగ్నిసందగ్ధుండగు వీని మన తేజోమహాగ్నిచేత
భస్మీభూతుం జేయుద మని యాలోచించి [3]గూఢమన్యు లగుచు
వేనుసింగదియం జని యతని కిట్లనిరి. 419

క. నరపాలక నీకాయువు, సిరియును బలమును యశంబుఁ ♦ జేకుఱు వృద్ధిం
బొరయుదుగాక నుచుమునో, హరముగ నాశీర్వదించి ♦ యతివినయమునన్.

వ. ఇట్లనిరి నరేంద్రా యే మొక్కటి విన్నవించెద మవధరింపుము పురు
షులకు వాఙ్మనః కాయవృత్తులవలన నాచరించు ధర్మంబు సమస్త

1 బ్రాహ్మణులు యజ్ఞము చేయరాదు, (హవిస్సుల) ఒసంగరాదు, హోమము చేయరాదు. 2 సమీచీనోక్తులు = మంచిమాటలు. 3 గూఢమన్యులు = మఱుగైన క్రోధముగలవారు.

లోకంబులను విశోకంబులం జేయు ననంగులయిన వారికి మోక్షంబు నిచ్చునట్టి ధర్మంబు ప్రజలకు క్షేమకారణంబుగావున నీయందు జెడకుండంగాక యునివలికి మఱియు ధర్మంబు నాశంబు నొందిన నైశ్వర్యంబుచే రాజువిడువంబడునని చెప్పి వెండియు నట్లగుటంగిదానృపచిత్తులగు నమాత్యులవలనను దస్కరులవలనను బ్రజలు నాశంబు నొందకుండ రక్షించుచు యథాన్యాయంబుగ వారలచేఁ గరంబు గొనుచునుండు మహీపతి యిహపర సౌఖ్యంబుల నందు నదియునుంగాక యెవ్వని రాష్ట్రంబున నేపురంబున యజ్ఞేశ్వరుండగు నన పురుషోత్తముండు నిజవర్ణాశ్రమోచితంబయిన ధర్మంబుగలవారిచేత యజియింపంబడు నట్టి నిజశాసనవర్తియగు రాజువలన సర్వభూత భావనుండును మహాభాగుండును భగవంతుండునగు సర్వేశ్వరుండు సంతుష్టుండగునట్టి సకలజగదీశ్వరుండైన సర్వేశ్వరుండు సంతోషించిన రాష్ట్రాధిపతికి సర్వ సౌఖ్యంబులుఁ బ్రాపించు లోకపాలకులగువారు సర్వేశ్వరునికొఱకు బలిప్రదానంబులు సేయుదురు సమస్త లోక దేవతా యజ్ఞాదిసంగ్రహుండును వేదమయుండును ద్రవ్యమయుండును దపోమయుండు నగు నారాయణుని విచిత్రంబులైన యజ్ఞంబులచేత యజనంబు సేసిన నీకు నభయంబగు మోక్షంబునుం గలుగుంగావున నీ రాజ్యంబున మఖంబులు సేయుమని యాజ్ఞాపింపుము నీదేశంబునఁ జేయుంబడిన యజ్ఞంబులచేత హరికళాయుక్తంబులగు దేవగణంబులు స్విష్టంబులై తుష్టంబులగుచు భవదీయవాంఛితార్థంబుల నిత్తురు గావున దేవతాతిరస్కారంబు నీకు యుక్తంబుగాదు వేదచోదితంబులగు ధర్మంబులం దాసక్తుండవు గమ్మనిన వేనుం డిట్లనియె. 421

క. మునులార మీరలిప్పుడు, ననునిగతిఁ బలుచుచుఁ దనము♦ నంబలికితిరై
ననునదియధర్మమంకుల, నెనయఁగ ధర్మగుననఁ గలదె ♦ యెచ్చట నైనన్.

వ. అదియునుం గాక. 423

చ. ఎనయఁగ జారకామిని ని ♦ జేశుని [1]ముచ్చిలి జారపూరుషుం
దనపతిఁ గాఁ దలంచుగతిఁ ♦ దద్దయు మూఢమనస్కులై లేన

---

1 ముచ్చిలి = వంచించి.

ర్చిన నరపాలయాపముధ ♦ రించిన యీశ్వరు నన్నిరుంగ క
న్యుని భజియింప మీ రిహాప ♦ రోన్నతసౌఖ్యము లంద రెన్నడుఁన్.

వ. అని మఱియు నిల్లనియె యజ్ఞపురుషుండన నెవ్వం డెవ్వనియందు మీకు భక్తి స్నేహంబు లుదయించె భర్తృస్నేహ విదూరలైన కు[1]యోషిద్గణంబులుజారునందుఁ జేయుభక్తి చందంబునఁబలి కెదరది యునుం గాక. 425

క. హరి హర హిరణ్యగర్భ
[2]స్వరధీశ్వర వహ్ని [3]శమన ♦ జలధిపతి మరు
న్నరవాహన శశిభూరవి
సురముఖ్యులు నృపశరీర ♦ సూచకు లగుటన్. 426

క. పరికింప నను భజింపుఁడు
ధరణీశుఁడు సర్వదేవ ♦ తామయుఁడగు మ
త్సర ముడుగుఁడు నాకంటెను
బురుషుఁడు మఱియెవ్వఁ డగ్ర ♦ పూజార్హుఁ డిలన్. 427

వ. అదిగాన మీరు నాయందు బలివిధానంబులు సేయుండని పాప కర్ముండు నసత్ప్రవర్తకుండు నష్టమంగళుండు విపరీతజ్ఞానుండునగు వేనుండు పండితమాని యగుచుం బలికి మునుల వచనంబులు నిరాకరించియూరకున్న నమ్మునులు భగ్నమనోరథులై తమలో నిట్లని రీదారుణకర్ముండయిన పాతకుండు హతుం డగుంగాక వీఁడుజీవించె నేని వీనిచేత నీజగంబులు భస్మంబులు గాఁగల విది నిశ్చితంబు దుర్వృత్తుండగు వీఁడు మహారాజ సింహాసనంబున కర్హుండు గాఁడు వీఁడు మున్ను నేసర్వేశ్వరు ననుగ్రహంబున నిట్టి విభూతి యుక్తుం డయ్యె నట్టి యజ్ఞపతియైన శ్రీవిష్ణుని నిందించు చున్న వాఁడు గావున [4]నిర్లజ్జుండైన హరినిందకుని హననంబు సేయవలయు నని మును లుద్యోగించి యాత్మప్రకాశితంబైన క్రోధంబునం జేసి హుంకారమాత్రంబున నాయీశ్వరనిందాహతుం డగు వేనునిం బొలియించిరంత. 428

1 యోషిద్గణము = స్త్రీసమూహము. 2 స్వరధీశ్వర = ఇంద్రుఁడు 3 శమన = యముఁడు. 4 నిర్లజ్జుఁడు = సిగ్గులేనివాఁడు.

క. అరసి సునీథయు శోకా, తురయై తన సుతుఁడు దనువుఁ ♦ దొఱఁగినఁ దదనం
తరమునను యోగశక్తిం, బరువడి నిజతనయుతనువుఁ ♦ బరిపాలించెన్.

వ. అంతనొక్కనాఁడు. 430

సీ. మునివరేణ్యులు భక్తి ♦ దనర సరస్వతీ
సలిలంబులను గృత ♦ స్నాను లగుచు
మునుకొని తత్తీర ♦ మున నగ్నిహోత్రముల్
విలసిల్ల నియతిఁ గా ♦ వించి యచటఁ
దవిలి సత్పురుషక ♦ థావినోదంబులు
సలుపుచు నుండంగ ♦ సకలలోక
భయదంబు లగుమహో ♦ త్పాతముల్ దోఁచిన
మసలి లోకంబుల[1] ♦ మంగళములు

తే. వారయకుండెడుఁగాకని ♦ బుద్ధిలోనఁ
దలఁచుచుండఁగఁ బెలుచను ♦ దగ్రమగుచు
సర్వదిశలను శాంసువ ♦ ర్షంబుగురిసెఁ
దస్కరులు సర్వజనులవి ♦ త్తములు గొనిరి. 431

వ. ఇట్టిలోకోపద్రవంబెఱింగి జననాథుం డుపరతుం డగుటం జేసి జనపదంబు లరాజకంబులై యన్యోన్యహింసలనొందుచుం దస్కర బాధితంబు లగుచు నుండుట యెఱింగియుఁ దన్నివారణంబునకు సమర్థులయ్యును జోరాది బాధలం గనుంగొనుచు మునులు వారింపక యుండిరి మఱియు సమదర్శనుండు శాంతుండు మననశీలుండును నగు బ్రాహ్మణుండు దీనుల నుపేక్షించిన నతనితపంబు [2]భిన్నభాండగతం బయిన క్షీరంబుచందంబున క్షయించుం గావున నంగవసుధాధీశ వంశోద్భవులు హరిపదాశ్రయు లగుటం జేసియు నమోఘ సత్త్వనిష్ఠులగుటం జేసియు వీరల వంశంబు విచ్ఛిత్తి నొందింప ననర్హంబు గాన [3]స్థాపనీయంబగునని నిశ్చయించి మృతుండైన వేనుని కళేబరంబు డగ్గఱ వచ్చి త[4]దూరుమథనంబు గావింప నందు. 432

---

1 అమంగళము = అశుభము. 2 భిన్నభాండగతంబు = పగిలిన కుండలో నున్నది. 3 స్థాపనీయము = ఉంపదగినది. 4 ఊరుమథనము = తొడలు తఱచుట.

సీ. ఘనకాక [1] కృష్ణసం ♦ కాశవర్ణుండును
    హ్రస్వావయవుఁడు మ ♦ హా [2]హనుండు
హ్రస్వబాహుండును ♦ హ్రస్వపాదుండును
    [3]నిమ్ననాసాగ్రుండు ♦ నెఱయురక్త
నయనుండుఁ దామ్రవ ♦ర్ణశ్మశ్రుకేశుండు
    నతిదీనవదనుండు ♦ నైనయట్టి
యొక్క నిషాదకుం ♦ డుదయించి యేమి సే
    యుదు నని పల్కుచు ♦ నున్నఁ జూచి

తే. వరమునులు 'నిషీద' యనుచుఁ ♦ బలుకుటయును
దాన వాఁడు నిషాదాభి ♦ ధానుఁడయ్యె
నతనివంశ్యులు గిరికాన ♦ నాళి వేను
కల్మషముఁ దెల్పు చుండిరి ♦ కడఁక మఱియు. 433

క. కని వా రనపత్యం డగు
మనుజేంద్రునిబాహు లంత ♦ మథియించిన నం
దనఘం బగు నొక [4]మిథునము
జనియించెను సకలజనులు ♦ సమ్మద మందన్. 434

వ. అందు లోకరక్షణార్థంబుగా నారాయణాంశంబున నొక్క పురుషుం డును హరికి నిత్యానపాయినియై లక్ష్మీకళాకలితయై గుణంబు లను భూషణంబులకు నలంకారప్రదాత్రియునగు కామినియు జనియించె నందుఁ బృథుశ్రవుండును బృథుయశుండు నగుట నతండు పృథుచక్ర వర్తి యనుపేరం బ్రసిద్ధుండయ్యె నయ్యంగనయు నర్చి యను నామంబునం దనరుచు నతని వరియించె నాసమయంబున. 435

సీ. అందంద కురియించి ♦ రమరులు మునినాథ
    వితతి మోదంబంద ♦ విపులవానఁ
బరమానురక్తి శుం ♦ భల్లీలఁ జూపట్టె
    సురపతిపీట న ♦ చ్చరలయాట

1 కాకకృష్ణ = కాకివలె నల్లని 2 మహాహనుఁడు = గొప్పదౌడలు గలవాఁడు 3 నిమ్న = లోపలికణగిన. 4 మిథునము = ఆలుమగలు.

కర్ణరసాయన ♦ క్రమమున వీతెంచెఁ
బర పైన తేటకి ♦ న్నరులపాట
[1]యనిమిషకరహతం ♦ బైచాలఁ జెలఁగెను
విభవోత్సవంబు దుం ♦ దుభిరవంబు

తే. మునినుతి సెలంగె శిఖి గుండ ♦ ముల వెలింగె
నంత సచటికి సరసీరు ♦ హాసనుండు
గరుడగంధర్వకిన్నర ♦ గణముతోడ
నర్థిఁ జనుదెంచె సమ్మోదమతిశయిల్ల. 436

వ. అంత. 437

కవిరాజవిరాజితము:

అరయఁగ వైన్యునిదక్షిణహస్తము ♦ నందె రథాంగరమణీయమనో
హరలలితాయుధచిహ్నములంఘ్రుల ♦ యందునమగ్రహాలాంకుశభా
స్వర [2]కులిశధ్వజచాపసరోరుహ ♦ శంఖవిరాజితరేఖలు వి
స్ఫురగతినొప్పఁ బితామహముఖ్యులు ♦ సూచినవిస్మయులై మఱియున్.

వ. ఇతండు నారాయణాంశసంభూతుండు నితనియుంగనరమాంశసంభూ
తయుం గానోపుదురని తలంచి యయ్యవసరంబునబ్రహ్మవాదులగు
బ్రాహ్మణోత్తము లతనికి విధ్యుక్తప్రకారంబునరాజ్యాభిషేకంబు
గావించిరి తదనంతరంబ. 439

క. సరిదంభోనిధి ఖగమృగ, ధరణీ సురవర్త్మపర్వ ♦ త ప్రముఖములై
పరఁగినభూతశ్రేణులు,నరవరునకుఁదగ[3]నుపాయనములిచ్చినొగిన్.

తే సమధికఖ్యాతి నా పృథు ♦ చక్రవర్తి
దేవియగు నర్చితోఁగూడ ♦ దివ్యవస్త్ర
గంధమాల్యవిభూషణ ♦ కలితుఁ డగుచుఁ
[4]బావకుఁడుఁబోలె నత్ప్రభా ♦ భాసియయ్యె. 441

సీ. రాజరా జాఖ్యపృథు ♦ రాజుకు హేమమ
యంబైన వీరవ ♦ రాసనంబు

---

1 అనిమిషకరహతంబు = వేల్పులచేతితోఁ గొట్టఁబడినది. 2 కులిశము = వజ్రము. 3 ఉపాయనము = కానుక 4 పావకుఁడు = అగ్ని.

జలపతి జలకణ ♦ స్రావకం బగుపూర్ణ
చంద్రసన్నిభసిత ♦ చ్ఛత్త్రము మఱి
బవమానుఁ డమలశో ♦ భన మగు [1]వాల వ్య
జన సమంచితసిత ♦ చామరములు
ధర్ముండు నిర్మలో ♦ ద్యత్కీర్తిమయ మగు
మహనీయనవపుష్ప ♦ మాలికయును

తే. [2]జంభవైరి కిరీటంబు ♦ శమనుఁ డఖిల
జననియామకదండంబు ♦ జలజభవుఁడు
నిగమమయకవచంబు వా ♦ ణీలలామ
స్వచ్ఛమగునవ్యహారమ్ము ♦ సఁగిరి మఱియు. 442

సీ. దామోదరుండు సు ♦ దర్శనచక్రంబు
నవ్యాహతైశ్వర్య ♦ మబ్జపాణి
చంద్రార్ధధరుఁ డర్ధ ♦ చంద్రరేఖాంకిత
కమనీయ [3]కోశసం ♦ కలితఖడ్గ
మంబిక శతచంద్ర ♦ మనుఫలకముఁ జంద్రు
డమృతమయశ్వేత ♦ హయచయంబుఁ
ద్వష్ట రూపాశ్రయో ♦ దాత్తరథంబును
భానుండు ఘృణిమయ ♦ బాణములును

తే. శిఖియు నజగోవిషాణ సం♦చితమహాజ
గవ మనం దగుచాపంబు ♦ నవనిదేవి
యోగమయ మైనపాదుకా ♦ యుగము గగన
చరులు గీతంబులిచ్చిరి ♦ సంతసమున. 443

వ. వెండియుం బ్రతిదివసంబు నాకాశంబుపుష్పంబులుగురియింపమహ
ర్షులు సత్యంబులైన యాశీర్వచనంబులుసలుప సముద్రుండు శంఖం
బును నదంబులు పర్వతంబులు నదులును రథమార్గంబునొసంగెఁ
దదనంతరంబ సూతమాగధ వందిజనంబులు దన్ను నుతియించినం
బ్రతాపశాలియగు నవ్వైన్యుండు మందస్మిత సుందర వదనార

1 వాలవ్యజనము = చమరీమృగపు తోఁకతోఁజేసిన వీవన. 2 జంభవైరి = ఇంద్రుఁడు. 3 కోశసంకలితఖడ్గము= ఒరతోఁగూడిన కత్తి.

విందుండై చతురవచనుం డగుచు మేఘగంభీరభాషణంబుల వారల
కిట్లనియె. 444

సీ. వందిమాగధసూత ♦ వరులార నాయందుఁ
గమనీయగుణములు ♦ గలిగెనేని
సర్వంబు నుతి సేయ ♦ నవి లేవు నాయందు
నది గాన మీనుతి ♦ వ్యర్థ మయ్యె
నిటమీఁద గుణముల ♦ నేపారియుండిన
నప్పుడు నుతించెద ♦ మంటిరేని
సభ్యనియుక్తులై ♦ చతురత నుత్తమ
శ్లోకునిగుణము ల ♦ స్తోకభూప్ర
తే. సిద్ధములు గాన సన్నుతి ♦ సేయుఁ డజుని
నతని బహువిధభావంబు ♦ లభినుతింప
నలవిగాకయె యుండుదు ♦ రదియుఁగాక
చతురమతులార మాగధ ♦ జనములార. 445

వ. మఱియు మహాత్ములగుణంబులు దనయందు సంభావితంబులు సేయ
సామర్థ్యంబులు గలిగిన నందు మహాత్ములగుణంబులు ప్రసిద్ధంబులు
గావునం దత్సమంబుగా నెట్లు నుతింపవచ్చు నెవ్వాండే నొకండు
శాస్త్రాభ్యాసంబునం దనకు విద్యాతిశయగుణంబులు గలుగు నని
పలికిన వానిం జూచి సభ్యులు పరిహసింతు రది కుమతి యగువాఁ
డెఱుంగం డదియునుం గాక. 446

క. అతిపరిశుద్ధులు లజ్జా, న్వితులు మహోదారులధిక ♦ నిర్మలులాత్మ
స్తుతిపరనిందలదోషము, [1]లతిహేయములనితలంతు ♦ రాత్మలనెపుడున్.

క. వందిజనంబులు లోకము, లందునవిదితవరకర్ము ♦ లగుభూపతులన్
నందించు టవశ్యంబై, నం దగదు నుతింపశిశుజ ♦ నంబులపగిదిన్. 448

క. అని సూతవందిమాగధ, జనులానరనాయకునివ ♦ చనములువినియున్
మునిచోదితులై క్రమ్మఱ, ననురాగములుప్పతిల్ల ♦ నమ్మనుజేంద్రున్.

వ. అమృతోపమానంబు లయినమధురవాక్యంబులనిట్లనిరి. 450

---

1 హేయము = అసహ్యము.

క. వేనాంగసంభవుండవు
శ్రీనాథకళాంశజుఁడవు ♦ చిరతరగుణస
మ్మానార్హుండ [1]వతర్కిత
మైనభవన్మహిమఁ బొగడ ♦ నలవియె మాకున్. 451

క. అని వెండియు నిట్లని రై
నను నొకమార్గంబు గలదు ♦ నందింప భవ
ద్ఘనచరితామృతపానం
బునఁ జేసియు మునులవచన ♦ ములఁ జేసి తగన్. 452

వ. శ్లాఘ్యంబు లైనభవదీయచరిత్రంబుల స్తుతియించెదమని యి ట్లనిరి.

సీ. ఈవైన్యుఁ డఖిలలో ♦ కావలి ధర్మాను
వర్తనముల నెప్డు ♦ వఱలఁ జేసి
ఘనధర్మమార్గవ ♦ ర్తనులలో ధన్యుఁ డై
ధర్మసేతువుఁ బ్రీతిఁ ♦ దగిలి ప్రోచు
ధరను శాత్రవులను ♦ దండించు నష్టది
క్పాలకమూర్తిసం ♦ కలితుఁ డగుచు
నయ్యయికాలంబు ♦ లందు భాషణదాన
ములఁ బ్రజారంజన ♦ ములఁ దనర్చు

తే. [2]సవనసద్వృష్టికరణాది ♦ సక్తుఁ డగుట
నుభయలోకంబులకుఁ బ్రీతి ♦ నొదవఁ జేయు
న్యాయమార్గంబునను భూజ ♦ నాళిధనముఁ
బుచ్చుకొను నిచ్చు సూర్యుఁడుఁ ♦ బోలె నితఁడు. 454

వ. మఱియును. 455

సీ. సర్వభూతములకు ♦ సముఁడును బర్యతి
క్రమమున లోకాప ♦ రాధములను
నతికాంతిసంయుక్తు ♦ డై సహించుచు నార్తు
లగువారియెడఁ గృపా ♦ యత్తుఁడగుచు
నరరూపధారియౌ ♦ హరిమూర్తి గావున
నింద్రుండు వర్షించి ♦ యెల్లప్రజల

---

1 అతర్కితము = యోచింపరానిది. 2 సవనసద్వృష్టి = యజ్ఞము, మంచివాన.

రక్షించుగతిఁ దాను ♦ రక్షించు నమృతాంశు
సన్నిభవదనాబ్జ ♦ సస్మితాస్య
తే. రాగమిళితావలోకన ♦ రాజిఁ జేసి
సకలజనులకు సంప్రీతి ♦ సంభవింపఁ
జేయు సంతతమును గూఢ ♦ చిత్తుఁ డగుచు
శత్రువరుల కసాధ్యుఁడై ♦ సంచరించు. 456

వ. అని వెండియుఁ బ్రవేశనిర్గమ శూన్యమార్గనిగూఢ కార్యుండును
నపరిమితమహత్త్వాదిగుణాగ్రైకధాముండును సముద్రునిభంగి గంభీర
చిత్తుండును సుగుప్తవిత్తుండును వరుణుండునుం బోలె సంవృతాత్ముండును
శాత్రవాసహ్యప్రతాపయుక్తుండును దురాసదుండును సమీపవర్తి
యయ్యును దూరస్థునిభంగి వర్తించుచు [1] వేణ్వారణిజనితహుతాశ
నుండు గావున హుతాశనుచందంబున సన్న్యస్తసర్వస్వుండును నై
చారులవలన సకలప్రాణి బాహ్యాభ్యంతరకర్మంబులం దెలియుచు దేహ
ధారులకు నాత్మభూతుండై సూత్రాత్మకుండైన వాయువుభంగి
వర్తించుచు నాత్మస్తుతినిందలవలన నుదాసీనుం డగుచు ధర్మ
పథంబున వర్తించుచు నాత్మీయసుహృద్బంధువులవలనం దప్పు
గలిగినను దండించుచు నాత్మశత్రువులైన నదండ్యుల దండింపక
ధర్మమార్గగతుం డగుచుఁ దన యాజ్ఞాచక్రం బప్రతిహతం బగుచు
మానసాచలపర్యంతంబు వర్తింప సూర్యుండు నిజకిరణంబులచేత
నెంత పర్యంతంబు భూమిం బ్రకాశింపం జేయు నంత పర్యంతంబు
నిజగుణంబులచేత లోకంబుల రంజిల్లం జేయు నదియునుం గాక
ప్రకృతిరంజకంబులైన గుణంబులచేత దృఢవ్రతుండును సత్యసంధుం
డును బ్రహ్మణ్యుండును సర్వభూతశరణ్యుండును వృద్ధసేవకుండును
మానప్రదుండును దీనవత్సలుండును బరవనితామాతృభావనుండును
దన పత్ని నర్ధశరీరంబుగాఁ దలంచువాఁడును నగుచుం బ్రజల యెడఁ
దండ్రివలెఁ బ్రీతి సేయుచు రక్షించుచుండు మఱియును. 457

సీ. తలపోయ బ్రహ్మవి ♦ ద్యానిష్ఠజనముల
కనయంబుఁ గింకరుం ♦ డైనవాఁడు

1. వేణ్వారణిజనితహుతాశనుండు = వేణుఁడను అరణియందుఁబుట్టిన అగ్ని.

సఖిలశరీరగుఁ ♦ డాప్తసుహృజ్జన
తానందకరుఁ డన ♦ నలరువాఁడు
సంసారఘనకర్మ ♦ సంగహీనులయందు
సంగసంప్రీతుఁడై ♦ జరగువాఁడు
దుర్మార్గమనుజసం ♦ దోహంబునకు నుగ్ర
దండధరుం డనఁ ♦ దనరువాఁడుఁ

తే. ప్రకృతిపురుషకావేశుఁడై ♦ పరఁగువాఁడు
భగవదవతారయుక్తుఁడై ♦ నెగడువాఁడు
నగుచు వర్తించు సమ్మోద ♦ మతిశయిల్లఁ
జారుతరమూర్తి యీరాజ ♦ చక్రవర్తి. 458

వ. మఱియుం ద్రవ్యధీశుండుఁ గూటస్థుండుఁ బరమాత్మయు బ్రహ్మకళా
రూపుండు నగువాఁ డను నై యుదయించెం గావున నితనియందు
నవిద్యారచితం బైనభేదంబు నిరర్థకం బగు నని పెద్దలగువారలు
చూత్తురు మఱియును. 459

సీ. ఉదయాద్రిపర్యంత ♦ ముర్వీతలం బేక
వీరుఁడై రక్షించి ♦ వెలయునీతఁ
డొకనాఁడు విజయయా ♦ త్రోత్సవం బేపార
సన్నద్ధుఁడై మణి ♦ స్యందనంబు
నెక్కి చాపముఁబూని ♦ దిక్కుల సూర్యుని
పగిదిని శత్రు భూ ♦ పాలతమము
విరియింతునని చాల ♦ వెలుఁగొందుచును ధరా
చక్రప్రదక్షిణ ♦ శాలియగుచుఁ

తే. దిరుగునెడ సర్వదిక్పాల ♦ వంశమేత
పార్థివోత్తమ నికరము ♦ పాయనంబు
లిచ్చి తనుఁ జక్రపాణిని ♦ నెనయునాది
ధరణివిభుఁడని నుతియించి ♦ తలఁచు రెదల. 460

క. ఈనృపతి ధరాచక్రము, ధేనువుగాఁ జేసి పిదుకు ♦ ధృతి నఖిలపదా
ర్థానీకము విబుధులు స, న్మానింపఁగ బ్రజకుజీవ♦నప్రదుఁడగుచున్.

చ. అమరవరేణ్యుఁ బోలి యన ♦ యంబు నితండును [1]గోత్రభేదన
త్వమునఁ జెలంగుఁ డా [2]నజగ ♦ వ ప్రదరాసనశింజినీ నినా
దమున విరోధిభూపతులు ♦ దల్లడమంద నసహ్యసింహవి
క్రమమున సంచరించునని ♦ కౌతుక మొప్పఁగఁ బల్కి వెండియున్.

వ. ఇట్లనిరి. 463

చ. సకలజగన్నుతుం డితఁడు ♦ చారుయశోనిధి యశ్వమేధముల్
ప్రకటముగా శతంబు దగఁ ♦ బావనమైన సరస్వతీ [3]తటీ
నికటధరిత్రిఁ జేయుతఱి ♦ నేర్పున నంతిమయాగమందుఁ గొం
జక మఖసాధనాశ్వమును ♦ [4]జంభవిరోధి హరించు నుద్ధతిన్.

సీ. ఒకనాఁడు నిజమంది ♦ రోపాంతవనమునఁ
జని యందు సద్గుణ ♦ శాలి యైన
ఘనుని సనత్కుమా ♦ రునిఁ గాంచి యమ్ముని
వరు బ్రహ్మతనయుఁ గా ♦ నెఱిఁగి భక్తిఁ
బూజించి విజ్ఞాన ♦ మును బొందు నచ్చటి
బ్రహ్మవేత్తలు ముని ♦ ప్రవరువలన
మానితలబ్ధవి ♦ జ్ఞానుఁడై వర్తింతు
రిమ్మహారాజు మ ♦ హీతలంబు

తే. నందు విశ్రుతవిక్రముఁ ♦ డగుచు మిగులఁ
దనకథావళి భూప్రజా ♦ తతి నుతింప
నక్కడక్కడ వినుచు శౌ ♦ ర్యమున నఖిల
దిక్కులను గెల్చి వర్తించు ♦ ధీరయశుఁడు. 465

వ. ఇట్లు పాటితవిరోధి [5]మనశ్శల్యుండు సురాసురజేగీయమాననిజవైభవుండునై ధరాచక్రంబున కీతండు రాజయ్యెడి నని యివ్విధంబున స్తోత్రంబు సేసిన వందిమాగధ సూతజనంబులం బృథుచక్రవర్తి పూజించి మఱియు బ్రాహ్మణభృత్యామాత్య పురోహిత పౌర జానపద తైలిక తాంబూలిక నియోజ్య ప్రముఖాశేషజనంబులం

---

1 గోత్రభేదనము = కొండలఁబగులఁగొట్టుట, 2 అజగవప్రదరాసన శింజినీనినాదము = అజగవమనువింటి నారిమ్రోత, 3 తటీనికటధరిత్రి = ఒడ్డుచెంతభూమి, 4 జంభవిరోధి = ఇంద్రుఁడు; 5 మనశ్శల్యుడు = హృదయమునకు బాణమువంటివాఁడు.

దత్తదుచితక్రియలం బూజించె నని మైత్రేయుండు సెప్పిన విని విదురుం డిట్లనియె. 466

— ♦ పృథుచక్రవర్తి గోరూపిణియగు భూమివలన నోషధులం బిదుకుట ♦ —

సీ. ఏమినిమిత్తమై ♦ భూమి గోరూపిణి
యయ్యె దానికి వత్స ♦ మయ్యె నెద్ది
గొనకొని దోహన♦మునకు నర్హంబైన
పాత్ర మెయ్యది దలఁ♦పంగ [1]దోగ్ధ
యైనయాపృథు వేప♦దార్థముల్ పిదికెను
బరికింప నవని స్వ♦భావమునను
విషమమై యుండియు ♦ వెలయంగ నేరీతి
సమగతిఁ జెందెను ♦ జంభవైరి
తే. [2]క్రతుహయంబును గొనిపోవఁ ♦ గార్యమెద్ది
ధీరనిధి యైనబ్రహ్మకు♦మారువలనఁ
గలితవిజ్ఞానుఁడగుచు నే♦గతినిఁ బొందె
ననఘచారిత్ర మైత్రేయ ♦ యదియుఁగాక. 467

వ. మఱియుఁ బరబ్రహ్మంబును భగవంతుండును బుణ్యశ్రవణకీర్తనుండును సర్వనియామకుండును నగు కృష్ణుని యవతారాంతరాశ్రయంబగు దివ్యకథలను భగవంతుం డైన పుండరీకాక్షుండు పృథ్వవతారంబు ధరియించి గోరూపిణియగు పృథివిం బిదికినది మొదలగుకథలన్నియు నీకు [3]నధోక్షజునకు దాసుండ నయిన నాకు నెఱిఁగింపు మనిన వాసుదేవకథాసంప్రీతచేతస్కుం డగు విదురుం బ్రశంసించి మైత్రేయుం డిట్లనియె నట్లు బ్రాహ్మణజనంబులచేత రాజ్యంబునం దభిషిక్తుండగుచు సకలప్రజాపాలననియుక్తుండై పృథువు రాజ్యంబు సేయుచుండునంత నీరస యగుధరిత్రియం దన్నరహితులగుచుం బ్రజలు [4]క్షుత్పీడాక్షీణదేహులై వైన్యునిం జూచి యిట్లనిరి. 468

క. అరయఁగ నేము [5]బుభుక్షా, పరిపీడం బడితి మయ్య ♦ పైకొని తరుకో
టరజనితవహ్నిచేతను, దరికొనువృక్షములుఁబోలె ♦ ధరణీనాథా. 469

1 దోగ్ధ = పాలుపిండువాఁడు. 2 క్రతుహయము = యజ్ఞాశ్వము. 3 అధోక్షజుఁడు = విష్ణువు. 4 క్షుత్పీడాక్షీణదేహులు = ఆఁకలిబాధచే చిక్కిన దేహములుగలవారు. 5 బుభుక్షాపరిపీడ = ఆఁకలిబాధ.

క. శరణాశరణ్యుఁడ వగు నిను, శరణము వేఁడెదము మహిత ♦ సత్కృపసన్నం
బరసి కృపసేసి ప్రోవుము, నరనాయక యనుచుఁ బ్రజలు ♦ నతులై పలుకన్.

క. విని దానికి సముపాయము, జననాయకుఁ డాత్మఁ దలఁచి ♦ సక్రోధుండై
ధనువున బాణముఁ దొడిగెను, ఘనరౌద్రముతోడ [1]త్రిపుర ♦ ఘస్మరు పగిదిన్.

వ. ఇట్లు దొడిగిన. 472

క. మహిపతి నట్లు గనుఁగొని,
మహి గోరూపమునఁ [2]గంప్య ♦ మానయు నగుచున్
[3]కుహకుండగు [4]లుబ్ధకుఁ గని
గహనంబునఁ బాఱు హరిణి ♦ కైవడిఁ బాఱెన్. 473

వ. ఇట్లు ధరణి పాఱిన నతండు కోపితారుణనేత్రుం డై వెంటం దగిలి దిక్కులను విదిక్కులను భూభాగనభోభాగంబుల నెక్కడఁ జనిన నక్కడికి వెనుతగిలి [5]యుద్యతాయుధుం డై చనుచుండ నద్దేవియు నంతం గాని మృత్యుగ్రస్తులగు ప్రజలచందంబున ననన్యశరణ్య యగుచు నంతర్భయం బునం బరితప్యమానహృదయ యగుచు నిట్లనె ధర్మవత్సలుండవును నాపన్నరక్షకుండవును మహాత్ముండవును సకలప్రాణిపరిపాలనావస్థితుండవును నయిన నీ వీ దీనయు నపరాధరహితయుం గామినియు నగు నన్ను వధియింపం బూని యేల వెనుతగులుచున్నవాఁడవు ధర్మజ్ఞత్వం బెఱింగువారు సతీజనంబులు కృతాపరాధలైనను దీనవత్సలతం జేసి వధింపరని పలికి మఱియు నా ధరణీదేవి పృథుచక్రవర్తి కిట్లనియె.

క. జననాథచంద్ర యీ భూ, జనకోటికి [6]యానపాత్ర ♦ సదృశస్థిరతో
ఘనదృఢశరీర యగు నే, ననయము నాధారభూత ♦ నగుచుం జరింతున్.

తే. ఇట్టి నన్నుఁ గృపామతి ♦ యెడలి యిటు వి
పాటనము సేసి త్రుంచెదు ♦ ప్రజలు నీట
మునుఁగకుండంగ నేరీతి ♦ ననఘచరిత
యరసి రక్షింతు వన నతం ♦ డవని కనియె. 476

వ. ధరిత్రి మదీయాజ్ఞోల్లంఘనంబు సేయుచున్నదాన వదియునుంగాక నీవు యజ్ఞంబులందు హవిర్భాగంబుల ననుభవించుచు ధాన్యాదికం

1 త్రిపురఘస్మరుఁడు = శివుఁడు. 2 కంప్యమాన = వణఁకుచున్నది. 3 కుహకుఁడు = మోసగాఁడు. 4 లుబ్ధకుఁడు = బోయవాఁడు. 5 ఉద్యత = ఎత్తఁబడిన. 6 యానపాత్రము = ఓడ.

బుల విస్తరింపంజేయక గోరూపంబు ధరియించి యనయంబుఁ దృణభక్షణంబు సేయుచుఁ గాలం బినుకక నీయంద యడంచికొంటివి నీయం దున్న యోషధీబీజంబులు బ్రహ్మచేతం బూర్వంబునందె కల్పింపంబడినయవి వానిని నీదేహంబునంద యడంచికొని యిప్పు డీయక మూఢహృదయవు మందమతివియున్నె యపరాధంబు సేసిన దురాత్మురాల వగుసిన నాబాణంబులచే [1]జర్జరీభూతశరీరం జేసి వధియించి నీమేని మాంసంబునంజేసి క్షుద్బాధితులు దీనులునగు నీప్రజలయార్తి నివారించెద నీవు కామిని నంటివి స్త్రీపురుషనపుంసకులలో నెవ్వరేని భూతదయ లేక స్వమాత్రపోషకు లగుచు నిరనుక్రోశంబుగ భూతద్రోహులై వర్తింతురు వారిని రాజులు వధించినఁ వధంబుగాదుగాన జానఁ బాపంబు వొరయదు నీవు కామిని వైనను దుర్మదవు [2]స్తబ్ధవు నగుచు మాయాగోరూపంబునం బాఱి పోవుచున్న నిన్నుఁ దిలలంతలఖండంబులు సేసి నాయోగమహిమం బ్రాణికోటి నుద్ధరించెదనని పలికి రోషభీషణాకారంబు ధరియించి దండధరునివడువున వర్తించు పృథునిం జూచి వడఁకుచు మేదిని ప్రాంజలియై యిట్లని నుతియింపం దొడంగె. 477

క. ఓనాథ పరమపురుషుఁడ, వై నిజమాయాగుణంబు ♦ లాదినకతనన్
నానావిధదేహములం, బూనుదు సగుణుండ వగుచు♦బుధనుతచరితా.

వ. అట్టి నీవు. 479

క. నను సకల జీవతతికిని, మును నీ వాధారభూత♦ముగ నిర్మింపన్
విను నాయందుఁ జతుర్విధ, ఘనభూతవిసర్గ మర్థిఁ ♦ గైకొనవలసెన్.

వ. అట్లయి యుండ. 481

క. నను నుద్యతాయుధుఁడ వై
మనుజేంద్ర వధింపఁ బూని ♦ మసలెదు నీకం
టెను నన్యుని నెవ్వని నే
ఘనముగ శరణంబు సొత్తుఁ ♦ గరుణాభరణా. 482

వ. అదియునుం గాక. 483

---

1 జర్జరీభూతశరీర = శిథిలమగు దేహముగలది. 2 స్తబ్ధ = చేష్టారహిత.

సీ. అనఘ స్వాయంబు • వై యలర్కుఁ డను వై
మహిమ నొప్పిన భవ•న్మాయచేత
సకల చరాచర • సర్గంబు నిర్మించి
ధర్మార్థపరుఁడ వై • తనరు దీవ
నీవిక్రమము శత•నీరజలోచన
సకల లోకులకు దు•ర్జయము దలఁపఁ
దగు నట్టి నీవు స్వ•తంత్రుఁడ వగుటను
బ్రహ్మఁ బుట్టించి యా•బ్రహ్మచేత
తే. సకల జగములఁ జేయింతు • సమతఁ బేర్చి
యేక మయ్యు మహాత్మ య•నేక విధము
లగుచు వెలుఁగొందుచుండుదు వీ•యశీలమందుఁ
జారుతరమూర్తి యోపృథు•చక్రవర్తి. 484
వ. మఱియు మహాభూతేంద్రియకారకచేతనాహంకారంబు లను శక్తులం
జేసి యీ జగంబుల సృష్టిస్థితిలయంబులఁ గావించుచు సముత్కట
విరుద్ధశక్తులు గల పురుషునకు నమస్కరించెద నట్టి పరమపురుషుండ
వయిన నీవు నిజనిర్మితంబును భూతేంద్రియాంతఃకరణాత్మకంబును
నైన యీ విశ్వంబు సంస్థాపింపం బూని. 485
సీ. ఆదివరాహంబ•వై యీ రసాతల
గత నైననన్ను స•త్కృటికతోడ
నుద్ధరించితి వట్టి•యుదకాగ్రభాగంబు
నం దద్ది నున్న నే • నటేడినావ
యం దున్న నిఖిలప్ర•జావళి రక్షింపఁ
గోరి యీపృథురూప•ధారి వైతి
వట్టిభూభరణుండ • వైననీ విపుడు వ
యోనిమిత్తంబుగా • నుగ్రచరుఁడ
తే. వగుచు నన్ను వధించెద • ననుచు బుద్ధిఁ
దలఁచుచున్నాఁడ విది విచి•త్రంబుగాదె।
విశ్వసంపాద్య నిరవద్య • వేదవేద్య
భవ్యగుణసాంద్ర వైన్యభూ•పాలచంద్ర. 486

వ. కావున నీశ్వరగుణసర్గరూపంబైన మాయచే మోహితాంతఃకరణుల మైన మావంటివారలచేత హరిభక్తులచేష్టితం బెఱుంగఁబడ దన్న హరిచేష్టితం బెట్లెఱుంగంబడు నట్టి జితేంద్రియయశస్కరు లయిన వారలకు నమస్కరింతు ననుచు నివ్విధంబునం గోపప్రస్ఫురితాధరుం డైన పృథుని నభినుతించి ధైర్యం బవలంబించి వెండియు ని ట్లనియె.

క. విమలాత్మ నాకు నభయము, సమకూరెడునట్లుగాఁగ సన్మతి నీక్రో ధము నుపశమించి కరుణించి, పుము నావిన్నపము వినుము • పురుషవిధానా.

క. ధర విరులు గంధసందఁగ
సరసగతిం బూవుఁదేనెఁ • జవిగొనునిందిం
దిరవిభుకై వడి బుధుఁడగు
పురుషుఁడు సారాంశ మాత్మఁ • బూని గ్రహించున్. 489

సీ. వినవయ్య తత్త్వద•ర్శను లైనయట్టి స
న్మునులచే నైహికా•ముష్మికంబు
లైనఫలప్రాప్తి • కర్థిఁ గృష్యాద్యగ్ని
హోత్రాద్యుపాయంబు • లుర్విమీఁద
దృష్టంబులును నాచ•రితములునగుచుఁ దా
నెనయుఁదగు నుపాయ • మెవ్వఁ డాచ
రించును వాఁడు ప్రా•పించుఁ దత్ఫలమును
విద్వాంసుఁ డైనను • వెలయ దీని

తే. నాదరింపక తనయంత • నాచరించె
నేని నాయానమే యగుఁ • గాని తత్ఫ
లమును బొందఁడు బహుకాల•ములనకైన
వినుతగుణశీల మాటలు • వేయు నేల. 490

వ. అని మఱియు మహి యి ట్లనియె. 491

చ. జలరుహగర్భుచేత మును • చాల సృజింపఁగఁబడ్డ యోషధుల్
కలుషమతిన్ ధృతవ్రతులు • గాని [1]యసజ్జన భుజ్యమాన మై
వెలయుటఁ జూచి యే నృపతి•వీరులు మాన్పమిఁ జోరబాధలన్
బలుమఱుఁ బొంది యే నపరి•పాలిత నై కృశియించి వెండియున్.

---

1 అసజ్జనభుజ్యమాన = నీచులచే ననుభవింపఁబడునది

గనకపాత్రమునందుఁ ♦ దనరు నోజోబల
వీర్యామృతంబునె ♦ వెలయుపయసు
దైత్యదానవులు దై♦త్య శ్రేష్ఠుఁ డగుగుణ
శాలిఁ బ్రహ్లాదు వ♦త్సంబుఁ జేసి

తే. ఘనసురాసవరూప దు♦గ్ధంబు వరుస
నప్సరోజనగంధర్వు ♦ లలరె యపుడు
దనర విశ్వావసువు వత్స♦మునుగఁ జేసి
పద్మమయనిర్మితంబైన ♦ పాత్రమందు. 501

వ. మాధుర్య సౌందర్యసహిత గాంధర్వక్షీరంబును బితృదేవతలు సూర్య వత్సకంబుగా నామపాత్రంబునందుఁ గవ్యంబను దుగ్ధంబును సిద్ధులు గపిలవత్సకంబుగా నాకాశపాత్రమందు సంకల్పనారూపాణిమాదిసిద్ధి యనుక్షీరంబును విద్యాధరాదులు తద్వత్సకంబును దత్పాత్రకం బునుంగా ఖేచరత్వాదివ్యాపారరూపక్షీరంబును గింపురుషాదులు మయవత్సకంబును నాత్మపాత్రంబునుంగా సంకల్పమాత్రప్రభవంబు నంతర్ధానాద్భుతాత్మసంబంధియునగు మాయయనుక్షీరంబును యక్ష రక్షోభూత పిశాచంబులు భూతేశవత్సకంబుఁ గపాలపాత్రంబునుంగా రుధిరాసవం బను క్షీరంబును నహిదందశూకసర్పనాగంబులు దక్షక వత్సంబును బిలపాత్రంబునుంగా విషరూపక్షీరంబును బశువులు గోవృషవత్సకంబు నరణ్యపాత్రంబునుంగాఁ దృణంబను క్షీరంబును గ్రవ్యాదమృగంబులు మృగేంద్రవత్సకంబును నాత్మకళేబర పాత్ర కంబునుం గాఁ గ్రవ్యం బను దుగ్ధంబును విహంగంబులు సుపర్ణ వత్సకంబు నిజకాయ పాత్రంబునుంగాఁ గీటక ఫలాదికంబను దుగ్ధం బును వనస్పతులు వటవత్సకంబుగా .భిన్నరోహరూప పయస్సును గిరులు హిమవద్వత్సకంబును నిజసానుపాత్రకంబునుంగా నానా ధాతువులను దుగ్ధంబునుంగా నివ్విధంబున సమస్త చరాచర వర్గంబు స్వముఖ్య వత్సకంబును స్వస్వ పాత్రికంబునుంగా భిన్నరూపంబులైన క్షీరంబులం బిదికె నని చెప్పి మఱియును. 502

క. క్రమమున నిటుపృథ్వ్యాదులు, దమతమకామితములనఁగఁ♦దగుభిన్నక్షీ
రము దోహనవత్సకభే, దమునం దగఁ బిదికి రంత♦ధరణీధవుఁడున్.

తే. సముచితానందమును బొందు ◆ సర్వ[1]కామ
దుఘ యనందగు భూమిని ◆ దుహితఁగాఁగఁ
గోరి కైకొని నిజధనుః◆కోటిచేత
భూరిగిరికూటములఁ జూర్ణ◆ములుగఁ జేసి. 504

తే. చండదోర్దండలీల భూ◆మండలంబు
సమతలంబుగఁ జేసి శ◆శ్వత్ప్రసిద్ధి
నొంది యవ్విభుఁ డీలోక◆మందు నెల్ల
ప్రజలఁ దండ్రియు జీవన◆ప్రదుఁడు నగుచు. 505

తే. అక్కడక్కడఁ బూర్వంబు◆నందు లేని
గ్రామ పట్టణ దుర్గ [2]ఖ◆ర్వట పుళింద
ఖేట శబరాలయ వ్రజ ◆ ఘోట ఘోష
వివిధ నిలయము లర్థిఁ గా◆వించె నంత. 506

క. వారును భయమువిరహితులై, బోరన నచ్చోట్ల వాస◆ములుఁ జేయుచు సు
శ్రీరుచి నొప్పుచు నుండిరి, వారక యాపృథునిఁ బొగడి◆వరవాక్ప్రౌఢిన్.

సీ. అని చెప్పి మునినాథుఁ◆డనఘ మైత్రేయుఁ డ
వ్విదురున కిట్లను ◆ వేడ్కఁ దోడ
ననఘాత్మ రాజర్షి◆యైన వైన్యుం డశ్వ
మేధశతంబు స◆న్మేధతోడఁ
గావింతునని దీక్ష ◆ గైకొని వ్రతనిష్ఠఁ
దవిలి బ్రహ్మావర్త◆దేశమందు
నలరుమనుక్షేత్ర◆మందు సరస్వతీ
నదిపొంతఁ దా మహో◆న్నతి నొనర్చు

తే. సవనకర్మక్రియకు నతి◆శయవిశేష
ఫలము గలిగెడి నని బుద్ధిఁ ◆ దలఁచి యచట
వరుసఁ గావించు నతిశయా◆ధ్వరమహోత్స
వము సహింపకయుండె న◆య్యమరవిభుఁడు. 508

1 కామదుఘ = కామధేనువు, 2 ఖర్వట = కొండక్రిందిపల్లె, పుళింద = బోయపల్లె, ఖేట = పంటకాపులుండుపల్లె, శబరాలయ = బోయపల్లె, వ్రజ = గొల్లపల్లె.

—♦ పృథుచక్రవర్తియశ్వమేధంబున నింద్రుం డశ్వము నపహరించుట ♦—

సీ. అట్టి యధ్వరకర్మ ♦ మందు సాక్షాద్భగ
వంతుఁడు హరి రమే ♦ శ్వరుఁడు లోక
గురుఁడును సర్వాత్మ ♦ కుండును విభుఁడును
నీరజభవభవా ♦ న్వితుఁడు లోక
పాలక నిఖిల [1]సు ♦ పర్వానుగుండును
యజ్ఞాంగుఁ డఖిలాధ్వ ♦ రాది విభుఁడు
గంధర్వ ముని సిద్ధ ♦ గణ సాధ్య విద్యాధ
రాప్సరోదైత్య గు ♦ హ్యాళి దాన
తే. వాదిజేగీయమానుఁ డ ♦ త్యలఘుయశుఁడు
ప్రకటనందసునందాది ♦ [2]పార్షదుండు
కపిల నారద సనకాది ♦ కప్రముఖ్య
మహిత యోగీంద్ర సంస్తూయ ♦ మానుఁడజుఁడు. 509

వ. మఱియుంబరమభాగవతసేవితుండును నారాయణాంశప్రభవుండును నైన పృథుచక్రవర్తికి భూమి హవిరాది దోగ్ధ్రి యయ్యును సర్వకామదుఘయై సమస్త పదార్థంబులం బిదుకుచుండె మఱియుఁ దరువులు ఘనతరాకారంబులు గలిగి మకరంద స్రావు లగుచు నిక్షుద్రాక్షాదిరసంబులును దధిక్షీరాజ్యతక్రపానకాదికంబులును వర్షింపనవి యెల్ల నదులు వహించె సముద్రంబులు హీరాది రత్నవిశేషంబులనీనుచుండెఁబర్వతంబులుభక్ష్యభోజ్యలేహ్యచోష్యంబులను చతుర్విధాన్నంబులు గురియుచుండె లోకపాలసమేతులైన సకలజనంబులు నుపాయనంబులుదెచ్చి యిచ్చుచుండి రిట్టిపరిపూర్ణవిభవాభిరాముండై యధోక్షజసేవాపరాయణుండగు పృథుచక్రవర్తి యేకోనశతాశ్వమేధంబులు సన్మేధంబునంగావించి నూఱవ యాగంబునందు యజ్ఞపతియైన పుండరీకాక్షుని యజించుచుండం దదీయ పరమోత్సవంబు సహింపం జాలక. 510

క. అమరేంద్రుఁడు ఘనరోషా
దగ్రముఁడై పాషండవేష ♦ కలిత [3]తిరోభా

1 సుపర్వానుగుండు = దేవతల వెంటఁబోవువాఁడు 2 పార్షదుఁడు = కూడనుండువాఁడు 3 తిరోభావము = అదృశ్యము.

వమునం దస్మఖపశువుం
గ్రమమేది హరించిచనియె ♦ గగనంబునకున్. 511

వ. అట్లు చనునప్పుడు. 512

క. అనఘుండగు నత్రిమహా
మునిచోదితుఁ డగుచుఁ బృథుని ♦ పుత్రుడు [1]బాణా
సనతూణీరధరుండై
యనిమిషపతి వెనుకఁ జనియె ♦ నతిదర్పమునన్. 513

వ. అట్లు చని ముందట. 514

సీ. యజ్ఞసాధన పశు ♦ హరణుని వధియించు
ధర్మంబునందు న ♦ ధర్మమనెడి
బుద్ధిఁ బుట్టఁగఁ జేయు ♦ భూరిమాయావేష
ధారియై యరుగు [2]సు ♦ త్రాముఁ గదిసి
నిలు నిలు మని యార్చి ♦ నిజ [3]గుణధ్వని సేసి
ఘనజటాభస్మాస్థి ♦ కలిత మయిన
మూర్తిఁ గనుంగొని ♦ మూర్తిభవించిన
ధర్మంబ కా బుద్ధిఁ ♦ దలఁచి యమర

తే. నాయకుని మీఁద సాయక ♦ మేయఁ జాల
కున్నఁ గనుఁగొని యత్రి వి ♦ ద్వన్నుతుండు
వైన్యజున కనె వాసవు ♦ వలను సూపి
మనములోపల రోషంబు ♦ మల్లడింప. 515

క. వినుమితఁడు యజ్ఞహంతయు, ననిమిషనికరాధిపుండు ♦ నగు నింద్రుఁడు గా
వున నితని జయింపుము నీ, వని ముమ్మాఱుచ్చరింప ♦ న వైన్యజుఁడున్.

మ. వినునీథింజను దేవవల్లభునిపై ♦ పీయుండు క్రోధాంతరం
గనిరూఢిన్ [4]మృగరాట్కిశోరము సుహా ♦ గంధద్విపేంద్రంబుమీఁ
దను లంఘించువిధంబునం బడిన నా ♦ తండశ్వచౌర్యైకసా
ధనురూపంబుఁ దదశ్వమున్ విడిచి యంతర్ధానముం బొందినన్. 517

1 బాణాసనతూణీరధరుఁడు = విల్లు, అమ్ములపొది ధరించినవాఁడు.
2 సుత్రాముఁడు = ఇంద్రుఁడు. 3 గుణధ్వని = నారిమ్రోఁత. 4 మృగరాట్కిశోరము = సింహపుఁబిల్ల.

క. వీఁడుపృథుభూపాలకు, మూఁడునిజయజ్ఞపశువు♦మరలంగొనిదు
ర్వారబలుఁడగుచు జనకుని, భూరిసవనరాజపుణ్య♦భూమికి వచ్చెన్.

వ. అయ్యవసరంబున నచ్చట నున్న పరమర్షి పుంగవు లతని యద్భుత కర్మంబు గనుంగొని యాశ్చర్యంబు నొంది యతనికి జితాశ్వుం డను నన్వర్థనామంబు వెట్టియున్న సమయంబున. 519

చ. మఱియును దేవతాపతి [1]త ♦ మఃపటలంబు జనింపఁజేసి యె
వ్వరుఁ దనుఁ గాన కుండ నని ♦ వారణఁ గాంచనపాశబద్ధమై
సురుచిరయూపదారుపరి ♦ శోభిత మైనహయంబుఁ గొంచుఁ జె
చ్చెర వినువీధి నేఁగఁగ ఋ ♦ షిప్రవరుం డగునత్రి సెప్పినన్. 520

క. వినిపృథుభూవరతనయుఁడు, ఘనబలమునఁజనికపాల♦ఖట్వాంగములో
లినిధరియించిరయంబునఁ, జనునింద్రునిఁగాంచినొంపఁ♦జాలకయుంతన్.

ఉ. క్రమ్మఱ నత్రిచేఁ దెలుపఁ ♦ గాఁబడి వైన్యతనూభవుండు రో
షమ్మునఁ దోఁకఁ ద్రొక్కినభు♦జంగమపుంగవుఁ బోలి యుగ్రుఁడై
య మ్మరిఁబోసినం గని సు ♦ రాధిపుఁ డెప్పటియట్లఁ బాఱె న
శ్వమ్మును రూపముఁ విడిచి ♦ చాలఁ దిరోహితుఁడై రయంబునన్.

వ. అట్లు సనినం బశువుం గొని మరలి యవ్వీరోత్తముండు పితృయజ్ఞశాలకుం జనుదెంచె నంత. 523

సీ. హరిహయుం డధ్వర ♦ హయహరణార్థమై
మించి కైకొని విస ♦ ర్జించినట్టి
భూరియమంగళ ♦ భూతమాయారూప
ములను ధరించిరి ♦ మూఢజనులు
పాషండచిహ్నముల్ ♦ వరఁగుట వారలు
జగతిపై [2]నగ్నవే ♦ షములు గలుగు
జైనులు భూరికా ♦ షాయవస్త్రంబులు
ధరియించు బౌద్ధులు ♦ దగ జటాస్థి

తే. భస్మధారులు నయినకా ♦ పాలికాదు
లనఁగ వెలసిరి లోకంబు ♦ లందుఁ జాలఁ
దలఁప ధర్మోపమం బనఁ ♦ దగు నధర్మ
మందు నభరతి వొడమిన ♦ యజ్ఞజనులు. 524

---

1 తమఃపటలము = చీఁకటిసమూహము. 2 నగ్నవేషములు = దిగంబరవేషములు.

వ. తదీయచిహ్నంబులు పారంపర్యంబుగా ధరియింపం దొడంగిరి తద్వృత్తాంతంబు భగవంతుం డయిన పృథుచక్రవర్తి యెఱింగి కుపితుండై [1]యుద్యతకార్ముకుండగుచు నింద్రునిమీఁద బాణంబు నేయ నుద్యమించిన ఋత్విక్కులు శక్రవధోద్యుక్తుండును [2]నసహ్యరంహుండును నయిన పృథుచక్రవర్తిం గనుంగొని యిట్లనిరి. 525

క. జననాయక యజ్ఞములం, దనుపమవిధిచోదితంబు ♦ లనఁదగుపశుబం
ధనహింసల కాకితరుల, ఘనదీక్షితునకు వధింపఁ ♦ గాదగ్రబుధుల్.

వ. కావున నీవిపు డింద్రవధోద్యోగం బుపసంహరింపుము భవదీయధర్మవిరోధియైనయట్టి యింద్రుని. 527

క. జనపాల వీర్యవంతము, లనఁదగుమంత్రములచేత ♦ [3]నాహ్వానము సే
సిన నతఁడిచటికి వచ్చును, జనుదెంచినయాసురవిభుని ♦ సరభసతఁ దగన్.

క. ధృతి సెదరఁ, బట్టి శిఖిఁ గా, హుతిఁ గా వేల్చెదము దాన ♦ నుర్వీవర నీ
వితతమహోహాత్తవిరోధ్యన్నతుఁడై చెడిపోవు నమర ♦ నాథుం డంతన్.

వ. అని పృథుని వారించి ఋత్విగ్జనంబులు కుపితస్వాంతులై హస్తంబుల [4]స్రుక్స్రువంబులు ధరియించి వేల్చు సమయంబునం జతుర్ముఖుండు సనుదెంచి ఋత్విజులం గనుంగొని యిట్లనియె యజ్ఞంబులందు యజింపంబడు దేవత లెవ్వనియంశంబు లెవ్వండు యజ్ఞనామకం బగు భగవదంశం బగు నట్టి యింద్రుండు మీచేత వధార్హుండుగాఁ డితండు భగవదంశసంభవుండగుట నీయజ్ఞకర్మవిధ్వంస నేచ్ఛుండయి కావించు ధర్మవ్యతికరంబులు సూచుచుండవలయుం గాని ప్రతీకారంబులు గర్తవ్యంబులుగా వీపృథుకీర్తి యగు నీపృథునకు నేకోనశతం బగు నధ్వరప్రయోగఫలంబు సిద్ధించుం గాక యని పృథుచక్రవర్తి కిట్లనియె. 530

సీ. మనుజేంద్ర మోక్షధ ♦ ర్మము నెఱింగిననీకు
సవనముల్ సేయుట ♦ చాలు మఱియు
నేవిధంబుననైన ♦ దేవేంద్రు మనమునఁ
గైకొని రోషంబు ♦ గదుర కుండ

1 ఉద్యతకార్ముకుండు=ఎత్తినవిల్లుగలవాఁడు. 2 అసహ్యరంహుఁడు=సహింపరానివేగముగలవాఁడు. 3 ఆహ్వానము=పిలుపు. 4 స్రుక్స్రువములు=హోమపాత్రములు.

హారమణికుండలప్రభా ♦ పూరకలిత
చారు [1]మృగరాజసన్నిభ ♦ స్కంధయుతము. 710

వ. వెండియు శంఖచక్రగదాపద్మకలితాయత బాహుచతుష్టయంబును వై జయంతీ వనమాలికా కౌస్తుభమణి శ్రీవిరాజితంబును నిత్యాన పాయిని యయిన యిందిరా సుందరీరత్న [2]పరిస్పందంబునం దనరి తిరస్కృత[3]నికషోపలంబైనవక్షస్థలంబునునుచ్ఛ్వాసనిశ్వాసంబులం జంచలంబులైనవళిత్రయరుచిరప్రకాశమానదళోదరంబును బూర్వ వినిర్గతనిఖిల విశ్వంబునుం [4]బ్రవిష్టంబు సేయురీతి నొందు [5]సలిలా వర్త సన్నిభగంభీర నాభివివరంబును బంకజకింజల్కవిభాసితదుకూల నిబద్ధకనక మేఖలాకలాపశోభితశ్యామ పృథునితంబబింబంబును నీల కదళీస్తంభరుచిరోరుయుగళంబును సమచారుజంఘంబును నిమ్న జాను యుగళంబును బద్మపత్రిభాసుర పాదద్వయంబునుమదీయాంతరంగ తమోనివారక నిర్మలచంద్రదళకల సన్నిభ నఖంబును గిరీటకుండల గ్రైవేయ హార కేయూరవలయ ముద్రికా మణినూపురాది వివిధ భూషణభూషితంబును నిరస్తసమస్తనతజన[6]సాధ్వసంబును భక్తజన మనోహరంబును సర్వమంగళాకరంబునునై నభగవద్దివ్యరూపంబుఁ దామసజన సన్మార్గ ప్రదర్శకుండవైన నీవు మాకుంజూపి మమ్ముఁ గృతార్థులం జేయుమని వెండియు నిట్లనియె. 711

సీ. ఆత్మకుఁ బరిశుద్ధి ♦ నర్థించువారికి
ధ్యేయవస్తువు భవ ♦ ద్దివ్యమూర్తి
యంచితస్వర్గరా ♦ జ్యాభిషిక్తునకైన
సమధిక [7]స్పృహణీయ ♦ తముఁడ వీవు
సద్భక్తియుతభక్త ♦ జనసులభుండవు
దుష్టాత్ములకుఁ గడు ♦ దుర్లభుండ
వాత్మదర్శనులకు ♦ నరయ గమ్యుండవు
నై యర్థి విలసిల్లు ♦ దనఘచరిత

1 మృగ...స్కంధయుతము = సింహసమానములగు మూపులతోఁగూడినది. 2 పరిస్పందము = మాల్యాద్యలంకరణము దర్పణాద్యుపకరణము. 3 నికషోపలము = ఒఱపిడిఱాయి. 4 ప్రవిష్టము = ప్రవేశము. 5 సలిలావర్త = నీటిసుడి. 6. సాధ్వసము = భయము. 7 స్పృహణీయతముఁడు = తలంపఁదగినవారిలో శ్రేష్ఠుఁడు.

తే. యిట్టినిఖిలదురారాధ్యు ♦ నీశు నిన్ను
నెఱయ సుజనులకైన వ ♦ ర్ణింప రాదు
వలల నెవ్వఁడు పూజించు ♦ వాఁడు నిపుణుఁ
జాలునే పద్మదళనేత్ర ♦ సచ్చరిత్ర. 712

చ. ఎనసినభక్తి యోగమున ♦ నే భవదీయ పదాబ్జ మొందఁగా
ననయము గోరువాఁడు చటు♦లోగ్రసహాభీమణావీర్యశౌర్యత
ర్జనములచే ననూనగతి ♦ సర్వజగంబులు సంహరించు న
య్యనుపమదైనకాలునిభ♦యంబును బొందఁడు సుమ్ము కావునన్.

తే. ఇట్టి నీపాదమూలంబు ♦ లెవ్వఁడేని
బొంది ధన్యాత్ముఁడై నట్టి ♦ పుణ్యుఁడొందు
మనములోపలఁ గోరునే ♦ మఱచియైన
నవ్యయానంద గోవింద ♦ హరి ముకుంద. 714

క. హరి నీభక్తులతోడను, నిరుపమగతిఁ జెలిమిసేయు♦నిమిషార్ధముతో
సరిగాదు మోక్షమనినన, చిరశుభమగు మర్త్యసుఖముఁ♦ జెప్పఁగనేలా.

క. దురితవినాశకపదపం, కరుహ భవత్కీర్తితీర్థ♦కణచయ బాహ్యాం
తర [1]సేకధూతకల్మష, పురుషులు ధరమీఁదఁ దీర్థ♦భూతులు గారే.

వ. అట్టిభూతదయాసమేతులును రాగాదివిరహితచిత్తులును [2]నార్జవాది
గుణయుక్తులును నయిన భాగవతజనులసంగంబు మాకుం గలుగఁ
జేయు మిదియ మమ్మనుగ్రహించుటయని వెండియు నిట్లనియె. 717

చ. సరసిజనాభ సత్పురుష ♦ సంగసముంచిత భక్తియోగ వి
స్ఫురణ ననుగ్రహింపఁబడి ♦ శుద్ధము నొందినవాని చిత్తము
స్థిరబహిరంగముం గనదు ♦ చెందదు [3]భూరితమస్స్వరూపసం
సరణగుహం జిరంబు గనఁ♦జాలు భవన్మహనీయతత్త్వమున్. 718

వ. అది యెట్టి దనిన. 719

సీ. అరయంగ నేమిటి ♦ యందు నీవిశ్వంబు
విదితమైయుండు నీ ♦ విశ్వమందు

---

1 సేకధూత కల్మషపురుషులు = చల్లుటచేఁ బోఁగొట్టఁబడిన పాపముగల పురుషులు. 2 ఆర్జవ = సంపాదనము. 3 భూరి...గుహ = గొప్పతమోగుణరూపమగు సంసారమను గుహ.

నేది ప్రకాశించు ♦ నెప్పుడు నట్టి స్వ
యంజ్యోతి నిత్యంబు ♦ నవ్యయంబు
నాకాశమునుబోలి ♦ యవిరళవ్యాపక
మగునాత్మతత్త్వంబు ♦ నధికమహిమ
నమరుపరబ్రహ్మ ♦ మగునని పల్కి యి
ట్లనియె నవిక్రియుం ♦ డైనవాఁడు

తే. నెవ్వఁ డాతఁడు దనయందు ♦ నెపుడు నాత్మ
కార్యకరణసమర్థంబు ♦ గానిభేద
బుద్ధిజనకంబు నాఁ దగు ♦ భూరిమాయఁ
జేసి విశ్వంబు సత్యంబు ♦ గా సృజించె. 720

ఆ. మరల మరలఁ బెక్కు ♦ మాఱు లీవిశ్వంబు
జననవృద్ధివిలయ ♦ సంగతులను
నందఁజేయుచుండు నట్టి యీశ్వరుఁడవై
తనరునిన్ను నాత్మ ♦ తత్త్వముగను. 721

వ. తెలియుదుమని వెండియు నిట్లనియె. యోగపరాయణు లగువారు శ్రద్ధా సమన్వితులై క్రియా కలాపంబుల నంతఃకరణోపలక్షితం బయిన భవదీయ రూపంబు [1]యజింతురు వారు వేదాగమతత్త్వ జ్ఞానులు నీ వాద్యుండవును ననాదియు నద్వితీయుండవును మాయా శక్తియుక్తుండవునునై విలసిల్లుచుండుదు వట్టిమాయాశక్తిచేత. 722

సీ. చతురాత్మ సత్త్వర ♦ జస్తమోగుణములు
వెరస జనించెను ♦ వానివలన
మహదహంకారత ♦ న్మాత్రనభోమరు
దనలజలావని ♦ మునిసుపర్వ
భూతగణాత్మక ♦ స్ఫురణ నీవిశ్వంబు
భిన్నరూపమున ను ♦ త్పన్న మయ్యె
దేవ యీగతి భవ ♦ దీయ మాయనుజేసి
రూఢిఁ జతుర్విధ ♦ రూపమైన

తే. పురము నాత్మాంశమునఁ జెందు ♦ పురుషుఁ డింద్రి
యములచే విషయసుఖము ♦ లనుభవించు

---

1 యజింతురు = పూజింతురు.

మహిని [1]మధుమక్షి కాకృత ♦ మధువుఁ బోలి
యతనిఁ బరవర్తియగు జీవుఁ ♦ డంద్రు మఱియు. 723

వ. ఇట్టి జగత్సర్జకుండ వైననీవు. 724

క. భూతగణంబులచేత నె, భూతగణంబులను మేఘ♦పుంజంబుల ని
ర్ధూతముగఁ జేయుననిలుని, భాతినిజరియింపఁజేసి♦పౌరుష మొప్పన్.

తే. రూఢిఁ దత్తత్క్రియాలబ్ధ♦రూపుఁడవును
సుమహితస్ఫురదమితతే♦జుఁడవుఁ జండ
వేగుఁడవు నయి ఘనభుజా ♦ విపులమహిమ
విశ్వసంహార మర్థిఁ గా♦వింతు నీశ. 726

వ. అది యెట్లనిన. 727

క. ఇతికర్తవ్యవిచారక,మతిచేఁ దగ నెప్పుడుం బ్ర♦మత్తంబును సం
చితవిషయ [2]లాలసమునూ,ర్జితలోభమునైనయట్టి♦సృష్టి గడంకన్.

తే. అప్రమత్తుండవగుచుఁ బ ♦ ద్మాక్ష నీవు
మ్రింగుదువు చాల నాఁకట ♦ మ్రేఁగుచుండి
నాలుకలు గ్రోయుభూరిప ♦ న్నగము వాతఁ
బడిన యెలుకను భక్షించు ♦ పగిది ననఘ. 729

చ. అనిశము నన్నదీయగురుఁ ♦ డైన సరోరుహసంభవుండు న
మ్మనువులు నాత్మసంశయము ♦ మాని భజించుభవత్పదాబ్జముల్
మనమున నిల్పి యుష్మదవ♦మానమహావ్యథఁ జెందునట్టి స
జ్జనుఁడు పరిత్యజించునె భ ♦ జంగమతల్పక భక్తకల్పకా. 730

క. కావున నాకును సూరిజ,నావళికిని సర్వసంశ ♦ యంబులు వాపం
గావను బ్రోవను దగుగతి, నీవని వినుతించినట్టి♦యీ స్తవమెలమిన్.

వ. రుద్రుండు ప్రచేతసుల కెఱింగించి వెండియు నిట్లనియెఁ బ్రచేతసులారా
యిట్టి యోగాదేశనామకంబైనయీస్తోత్రంబు బహువారావృత్తిచేఁ
బఠించి మనంబున ధరియించి సమాహితచిత్తులై మీరందఱు నాద
రంబున విశ్వాసయుక్తులును స్వధర్మాచారవంతులును [3]భగవదర్పితా

1 మధుమక్షికాకృతమధువు = తేనెటీఁగలచేఁ జేయఁబడిన తేనె. 2 లాలసము = ఆసక్తిగలది. 3 భగవదర్పితాశయులు = భగవానునకు సమర్పించిన మనస్సుగలవారు.

శయులునునై జపియించుచు సర్వభూతావస్థితుండును నాత్మారాముండు నైన సర్వేశ్వరుని నుతించుచు ధ్యానంబు సేయుచుం బూజించుచుండుఁడు తొల్లి యీ స్తోత్రంబు భగవంతుండైన పద్మసంభవుండు [1] సిసృక్షువగుచు నాత్మజుల మైన మాకును సృజియింపనిచ్ఛగించు భృగ్వాదులకును నెఱింగించె మేము నా భృగ్వాదులును బ్రజాసర్గంబునందు బ్రహ్మచోదితులమై యీ స్తోత్రంబునం జేసి [2] విధ్వస్త సమస్తతమోగుణులమై వివిధప్రజాసర్గంబు గావించితిమి. కావున నీ స్తోత్రంబు నెల్లప్పుడు నేకాగ్ర చిత్తుండును వాసుదేవ పరాయణుండునునై యెవ్వండు జపియించు వాఁడు వేగంబె శ్రేయస్సును బొంది తదీయ [3] జ్ఞానప్లవంబున వ్యసనార్ణవ రూపం బయిన సంసారంబును సుఖతరంబుగఁ దరియించు నట్టి మదుపదిష్టం బయిన యీ హరిస్తవంబు నెవ్వండు సదువుచు దురారాధ్యుండైన శ్రీహరిం బూజించువాఁడు మదుక్తస్తోత్రగానసంతుష్టుండును శ్రేయస్సులకు నేకాశ్రయభూతుండును నగు శ్రీమన్నారాయణునివలన సమస్తాభీష్టంబులం బొందు నెవ్వండేనిఁ బ్రభాతంబున లేచి ప్రాంజలియు శ్రద్ధాసమన్వితుండునునై యీ మంగళ స్తవరాజంబును వినిన వినిపించినం గర్మబంధవిముక్తుండగునని మఱియు నిట్లనియె. 732

క. నరదేవతనయులారా, పురుషాధీశుండు పరమ♦పురుషుఁడునగు నీ
శ్వరుసుస్తోత్రము మీ కా, దరమునఁ దెలిపితిని మీరుఁ♦దద్దయు భక్తిన్.
క. ఏకాగ్రచిత్తులును సుశ్లోకులునై జపము సేయు♦చును ఘనతపముం
గైకొని చేసిన మీకును, జేకుఱు మహితేప్సితార్థ♦సిద్ధి గడంకన్.
క. అని యీగతి నుపదేశం, బొనరించి సదాశివుండు ♦ నొగి వారలచే
తను బూజితుఁడై వారలు, గననంతర్ధానుఁడయ్యెఁ♦గౌతుక మొప్పన్.
వ. అంత. 736

తే. [4]తివుట వారలు రుద్రోప ♦ దిష్టమైన
యచ్యుతస్తవము జపించు ♦ చయుత సంఖ్య

---

1 సిసృక్షువు = సృజింపనిచ్ఛగలవాఁడు. 2 విధ్వస్తసమస్త తమోగుణుఁడు = నాశనముచేఁయబడిన పూర్ణతమస్సు గలవాఁడు. 3 జ్ఞానప్లవము = జ్ఞానమను పడవ. 4 తివుట = కోరిక.

వత్సరము లుగ్రతపము [1]దు ♦ ర్వారవారి
మధ్యమునఁజేయుచున్న స ♦ మయమునందు. 737

—♦ నారదుండు ప్రాచీనబర్హికి జ్ఞానమార్గమును దెలియఁజేయుట ♦—

వ. అంతం గర్మాసక్తచిత్తుం డైయున్న ప్రాచీనబర్హికడకు నధ్యాత్మవేదియుం గృపాళువు నైననారదుండు సనుదెంచి యారాజునకుఁ జ్ఞానబోధంబు సేయుకొఱకు నతనితో నిట్లనియె రాజా యీకర్మంబునం జేసి యెట్టి శ్రేయస్సు నభిలషించుచున్నవాఁడ వట్టి యరిష్టనిరసనంబు నభీష్టప్రాప్తికరంబు నయిన శ్రేయంబీకర్మంబువలన లభింప దనినం బ్రాచీనబర్హి నారదున కిట్లనియె. 738

సీ. అనఘ మునీంద్ర మ ♦ హాభాగ యేను గ
ర్మాపహతజ్ఞాని ♦ నగుచు మోక్ష
మెఱుఁగంగ లేనైతి ♦ నిట్టినా కిప్పుడు
గడువిమలంబును ♦ గర్మబంధ
నాశకంబును నగు ♦ జ్ఞానోపదేశంబు
గావింపు మతిదయా ♦ కార కూట
ధర్మంబు లగు [2]గేహ ♦ తతులందుఁ జెంది జా
యాతనూజాతధ ♦ నాదికములె

తే. భూరిపురుషార్థములుగాఁగ ♦ బుద్ధిఁదలఁచు
మతివిహీనుండు సంసార ♦ మార్గములను
దగఁబరిభ్రామ్యమాణుఁడై ♦ యొగిని మోక్ష
పదము నొందంగఁజాలఁడు ♦ భవ్యచరిత. 739

క. అనవుడునతనికినతఁడును, నసఘా యీయధ్వరంబు♦లందును గృపమాలినసీచే విశసింపం, జని కూలినపశుల వేల♦సంఖ్యలఁ గనుమా.

వ. కావునం బశువ్రాతంబులు ద్వదీయ[3]వైశసంబును స్మరించుచున్నవై లోహ యంత్రమయ శృంగంబులచేత నెప్పుడు నీవు పరలోకంబు నొందెద వప్పుడ నిన్ను హింసింతుమని భవదీయమృతికి నెదురుచూచుచున్న విట్టి సంకటంబు నొందంగల నీకు నిస్తారకం బయినయొకక యితిహాసంబు గల దెఱింగింతు వినుమని యిట్లనియె. 741

1 దుర్వారవారిమధ్యము = అడ్డగింపరాని నీటినడుమ, 2 గేహతతి = గృహసమూహము, 3 వైశసము = హింస.

—♦ పురంజనోపాఖ్యానము ♦—

సీ. భూమిపాల వినవయ్య ♦ పూర్వకాలమునఁ బు
రంజనుం డను నొక్క ♦ రాజు గలఁడు
నతనికి విజ్ఞాతుఁ ♦ డనుపేర దగిన వి
జ్ఞాతచేష్టితుఁడగు ♦ సఖుఁడు గలఁడు
నాపురంజనుఁడు [1]పు ♦ రాన్వేషియై ధరా
చక్రంబు గలయంగ ♦ సంచరించి
తన కనురూపమై ♦ పెనుపొందుపుర మెందు
వీక్షింపఁ జాలక ♦ విమనుఁ డగుచు
తే. నేపురము లుర్విఁ బొడగనె ♦ నా పురములు
గామములఁ గోరు తనకు న♦ క్కామములను
బొందుటకు వానిని నసర్హ ♦ ములుగఁ దన మ
నమునఁ దలఁచి యొకానొక ♦ నాఁ డతండు. 742

వ. చనుచున్న సమయంబున హిమవత్పర్వత దక్షిణసానువులందు. 743

సీ. వర నవద్వార క ♦ వాటగవాక్ష తో
రణ [2]దేహళీగోపు ♦ రములు నొప్పి
ప్రాకారయంత్ర [3]వ ♦ ప్రప్రతోళీపరి
ఖాట్టాలకోపవ ♦ నాళిఁదనరి
సౌవర్ణ రౌప్యాయ ♦ సఘనశృంగంబుల
రమణీయవివిధగే ♦ హముల మించి
రథ్యాసభాచత్వ ♦ రధ్వజ [4]క్రీడాయ
తనసుచైత్యాపణ ♦ తతిఁ దనర్చి
తే. మరకతస్ఫటికవిదూర ♦ మణివినూత్న
మౌక్తికాయతఖచిత హర్మ్యములు గలిగి
[5]విద్రుమద్రుమవేదుల ♦ వెలయునొక్క
పురముఁగనె భోగవతి కెనఁ ♦ బోలుదాని. 744

---

1 పురాన్వేషి = పురముల వెదకువాఁడు. 2 దేహళి = గడప. 3 వప్ర... వనాళి = ప్రాకారము, పెద్దవీథి, అగడ్త, బురుజు ఉపవనసమూహము. 4 క్రీడాయతనసుచైత్య = ఆఁటతావు, యజ్ఞశాల. 5 విద్రుమద్రుమవేది = పగడపుచెట్ల అరుగు.

వ. ఇట్లు గనుంగొని యనంతరంబ యుందటంబురబాహ్యాంతరంబున దివ్య ద్రుమలతాకుంజపుంజంబును సమద నదద్విహంగమత్తమధుకరకుల కోలాహలసంకులజలాశయశోభితంబును హిమనిర్ఝరబిందుసందోహ పరిస్పందకందళిత మందమలయ మరుదుచ్చలిత ప్రవాళవిటపనళినీ తటంబును శాంతజన మనోరంజనాహ్వానబుద్ధిజనకకలహంసరాజ కీరకోకిలాలాపవిరాజమానంబును మునివ్రతనానావిధవనమృగవ్రాత బాధారహితంబును నైనపురబాహ్యోద్యానవనంబునందు యాదృచ్ఛికంబుగ నేకైకశతనాయకం బైనయనుచరదశకంబును బంచమస్తకసర్పప్రతీహారుండును దోడరాఁజనుదెంచుచున్న [1]భర్త్రన్వేషిణియుం గామరూపిణియు సవోఢయు నగునయ్యట్టి. 745

సీ. ఘనసమవిన్యస్త ♦ కర్ణకుండలరుచుల్
గండభాగంబుల ♦ నిండి పర్వఁ
దమ్మిఱేకులసిరిఁ ♦ దటమటింపఁగఁ జాలు
మెఱుఁగుఁగన్నులు దలఁ ♦ దిరిగి రాఁగ
జఘనసంకలిత [2]పి ♦ శంగనీవిద్యుతి
కనక ♦ కాంచీరుచిఁ గరము పెనుపఁ
జరణసరోజభా ♦ సురచలన్నూపుర
ఝణఝణధ్వని [3]నర్మ ♦ సరణిఁ జూప
తే. లలితయౌవనలక్ష్మివి ♦ లాసభాసు
రోదయవ్యంజిత ప్రభా ♦ యుక్తపీన
సమనిరంతర కుచ [4]కుట్మ ♦ లముల వ్రీడఁ
జెంది పయ్యెదఁ గప్పు బా ♦ లేందుముఖిని. 746

వ. మఱియును బాలయు సుదతియు గజగామినియు నయిన యొక్క ప్రమదోత్తమం గాంచి. 747

క. తరమిడి ప్రేమోద్గమమై, మరువిండ్లం బోలుకనుబొ♦మలు గలతరుణీ
సరసాపాంగవిలోకన, శరపరివిద్ధాంగుఁ డగుచు♦ జనవిభుఁ డనియెన్.
క. ఎవ్వరి దానవు జనకుం, డెవ్వఁడు పేరేమి భృత్యు♦లీపదియొకరిం
డెవ్వరు సతులెవ్వరు మఱి, యివ్వనమున నుండఁ గార్య♦ మెద్ది మృగాక్షీ.

1 భర్త్రన్వేషిణి=భర్తకై వెదకునది. 2 పిశంగనీవిద్యుతి = గోరోచనవర్ణముగల పోఁకముడికాంతి. 3 నర్మసరణి=సరసపురీతి. 4 కుట్మలములు = మొగ్గలు.

క. భవదీయపురస్సరుఁ డగు, పవనాశనుఁ డెవ్వఁడతికృ♦పామతి నాకుం
వివరింపుమనుచు వెండియు,ధవళేక్షణఁ జూచి ధరణి♦ధవుఁ డిట్లనియెన్.

సీ. తరళాక్షి పతి యగు ♦ ధర్మ్మ నన్వేషింపఁ
జరియించు హ్రీ యను ♦ సతివొ కాక
రుద్రు నన్వేషించు ♦ [1]రుద్రాణివో కాక
బ్రహ్మను వెదకు భా ♦ రతివొ కాక
నారాయణుని భక్తిఁ ♦ గోరి యన్వేషించు
నిందిరవో కాక ♦ యెవ్వ రీవు
త్వత్పాదకామన ♦ త్వమునను సంప్రాప్త
సకలకాముం డగు ♦ సరసు నట్టి
తే. వాని వెదకెదు తరుణి [2]భ ♦ వత్కరాగ్ర
పద్మకోశంబ దెక్కడఁ ♦ బతితమయ్యె
నాకు నెఱిఁగింపఁదగుదు వి ♦ వేక చరిత
యని నృపాలుఁడు మఱియు ని ♦ ట్లనియె సతికి. 751

క. కరమొప్పఁగ నీ విటు భూ,చరవగుటను హ్రీవి శివవు♦శారదవును సా
గరకన్యవుఁ గాకుండుటఁ,దరుణీ పొడగంటినని ప♦దంపడి పలికెన్.

సీ. మొనసి యదభ్రభక ♦ ర్మ్మఁడ నైన నాచేత
నిపుడు పాలిత మైన ♦ యీపురంబు
సరసిజోదరుని భు ♦ జాపాలితోదాత్త
లలితవైకుంఠ మ ♦ లంకరించు
నిందిరాసుందరి ♦ చందంబునను నీ వ
లంకరింపఁ గడంగు ♦ పంకజాక్షి
యది గాక తావకీ ♦ నాపాంగరుచి మోహి
తాంతరంగుండ నై ♦ నట్టినన్ను
తే. మహిత[3]సవ్రీడభావస ♦ న్మందహాస
[4]చారువిభ్రమభ్రూలతా ♦ ప్రేరితుఁడుగఁ

---

1 రుద్రాణి = గౌరి. 2 భవత్కరాగ్రపద్మకోశము = నీచేతికొనలోఁగల తమ్మిమొగ్గ. 3 సవ్రీడ = సిగ్గుతోఁగూడిన. 4 చారువిభ్రమభ్రూలత = మనోహర విలాసములుగల కనుబొమ లను తీగలు.

దనరు భగవంతుఁడగునట్టి ♦ మనసిజుండు
పడఁతి యుడుగక పీడింపఁ ♦ దొడఁగె నిపుడు. 753
వ. కావున. 754
చ. తరుణి [1]సుతారలోచనయుతంబును ♦ మంజుసుధాసమానభా
సురమృదువాక్యయుక్తమును ♦ శోభితకోమల[2]లంబమానసుం
దరచికురాభిరామమును ♦ దారము నైనభవన్ముఖాబ్జముఁ
సురుచిరలీల నెత్తినను ♦ జూడుము సిగ్గును జెంద నేటికిన్. 755
వ. అని యివ్విధంబున నధీరుండై పలుకు పురంజనుం జూచి యాప్రమ
దోత్తమ వీరమోహితయై సస్మితానన యగుచు నానందంబునొంది
యిట్లనియె. 756
క. పురుషవర నాకు నీకును, గురువును నామమును గులము ♦ గోరి యెఱుఁగ నీ
పురమున నుండుదుఁ గానీ, పురమును నిర్మించినట్టి ♦ పురుషు నెఱుంగన్.
క. వీరలు నాసఖు లీ లలనారత్నము లార్యవినుత ♦ నాచెలు లీవ్య
ద్ఘోరగమే నిద్రింపఁగ, ధీరత మేల్కాంచి పురము ♦ ధృతిఁ బాలించుచున్.
వ. వెండియు నిట్లనియె. 759
సీ. మనుజనాయక నీవు ♦ మద్భాగ్యవశమున
నిటకు నేతెంచితి ♦ విపుడ నీకు
మంగళంబగు నీవు ♦ మహితేంద్రియగ్రామ
భోగ్యంబులగు కామ ♦ పుంజములను
నర్థిసంపాదింతు ♦ వనఘాత్మ యీ నవ
ద్వారప్రయుక్తమై ♦ తనరు పురము
*నీవు గైకొని యేలు ♦ నీకంటె దీనికి
నధిపుఁడన్యుండు లేఁ ♦ డనఘ యిందు
తే. మదుపనీతములైన కా ♦ మముల ననుభ
వింపఁగా [3]సమాశత మధి ♦ ష్ఠింపు మెలమిఁ

---

* నందునువసియించి యనుదినంబును మన్మనోభీష్ట నిరతినై ప్రాభవమున.— అని పాఠాంతరము.

1 సుతార...యుతము = మంచిపాపలుగల లోచనములతోఁ గూడినది.
2 లంబమానసుందరచికురాభిరామము = వ్రేలాడు అందమగు ముంగురులతో మనోహరము. 3 సమాశతము = నూరేండ్లు.

గోరినీకంటెఁ బ్రియులు నె ♦ వ్వారునాకు
నరసిచూడంగ మనుజేంద్ర ♦ యదియుఁగాక. 760

వ. మఱియురతిజ్ఞానవిహీనుండునకోవిదుండునిహపరచింతాశూన్యుండుఁ
బశుప్రాయుండుఁ ద్వదన్యుండు నైనవాని నెవ్వనివరియింతు గృహ
స్థాశ్రమమందు ధర్మార్థ కామ మోక్ష ప్రజానందంబులును యశం
బును యతివేద్యంబులు గానిరజస్తమోవిహీనపుణ్యలోకంబులును
గలుగుఁ బితృదేవర్షి మర్త్యభూతగణంబులకుం దనకునీలోకంబున
గృహస్థాశ్రమంబు సర్వక్షేమార్థం బయిన యాశ్రమం బండ్రు
గావునవదాన్యుండవువీరవిఖ్యాతుండవుఁబ్రియదర్శనుండవు స్వయం
ప్రాప్తుండవు నయి [1]భోగిభోగ సదృశ భుజాదండంబులచే నొప్పు
భవాదృశుం దగిలిమాదృశయగుకన్య వరియింప కుండునే యని
వెండియు. 761

క. కరుణారసపరిపూర్ణ, స్ఫురితస్మితరుచివిలోక ♦ పుంజముచేతం
గర మర్థి దీనజనభయ, హరణుఁడవై సంచరింపు♦మఖిలజగములన్.

క. అని యీగతిఁబలికినయా,వనజాక్షిఁ బురంజనుండు♦వరియించిముదం
బున నన్యోన్యప్రీతిం,దనరుచుఁ దత్పురముసొచ్చి♦ధన్యుండగుచున్.

చ. శతసమకాల మప్పురి [2]న ♦ జస్రము భూరిసమస్తసౌఖ్యసం
గతులఁ దనర్చి వందిజన ♦ గాయక సద్వినుతోరుగాన మో
దితమతి నొప్పి సుందరస ♦ తీజనసేవితుఁడై నృపాలకో
చిత లలితస్థలంబుల వ ♦ సించుచుఁ గ్రీడలు సల్పుచుండఁగన్. 764

క. నరనాథుఁడు లోకభయం, కరగతి వర్తించుగ్రీష్మ♦కాలముదోఁపం
[3]దరళలహరీమనోహర, వరప్రవాదినిసలిలమందు♦వసియించెఁదగన్.

వ. ఇట్లు వసియించి [4]కతిపయదినంబు లరుగుసమయంబున. 766

సీ. అవనీశ్వరోత్తమ ♦ యప్పురంబున నాల్గు
వంకల నున్నగ ♦ వఁకులు వినుము
తూర్పుదిక్కునను నై ♦ దును దక్షిణోత్తరం
బుల రెండుఁ బశ్చిమం ♦ బునను రెండు

---

1 భోగిభోగ = పాముపడగ. 2 అజస్రము = ఎల్లప్పుడు. 3 తరళలహరీ మనోహరవరప్రవాదిని = చలించు అలలచే మనోజ్ఞమగు మేలైన నది.
4 కతిపయ = కొన్ని.

గాఁగ నాతొమ్మిది ♦ గవనుల నుపరిది
క్కున నేఁడు గ్రిందిది ♦ క్కునను రెండు
నయియుండు మఱి వాని ♦ యందుఁ బృథగ్విధ
విషయగత్యర్థమై ♦ వెలయునీశ్వ

తే. రుం డొకం డరయఁ గలండు ♦ రూఢిఁ దత్పు
రంబుఁ బాలించునట్టి పు ♦ రంజనుండు
నా పుర ద్వారనవకంబు ♦ నందు లోన
నర్థి [1]ప్రాగ్ద్వార పంచక ♦ మందు వరుస. 767

వ. ఖద్యోతయు నావిర్ముఖియు ననునామంబులుగల ద్వారయుగంబున ద్యుమత్సఖుండై విభ్రాజితాఖ్య జనపదంబును బొందు వెండియు నళినియు నాళినియు ననుపేళ్ళు గల వాకిళ్ళు రెంటియందు నవధూత సఖుండై సౌరభరూపంబు లయిన విషయంబులం బొందు మఱియు ముఖ్యానామకంబైన ప్రధానప్రాగ్ద్వారంబున రసజ్ఞవిపణాన్వితుండై యాపణ బహూదనంబు లను విషయంబుల నొందుఁ బితృహూ నామకం బయిన దక్షిణ ద్వారంబున శ్రుతధరాన్వితుండై దక్షిణ పాంచాలం బను రాష్ట్రంబు నొందు దేవహూనామకం బయిన యుత్తరపువాకిట శ్రుతధరాన్వితుండై యుత్తరపాంచాలం బను రాష్ట్రంబు నొందు వెండియుం బడమటివాకిళ్ళు రెంటియందు నాసురీ నామకం బైన వాకిట దుర్మద సమేతుండై గ్రామక నామకంబైన విషయంబును నిరృతినామకం బయిన వాకిటియందు లుబ్ధకయుక్తుండై వైశసం బనువిషయంబు నొందుచుండు వెండియుం బురంజనుం డప్పురంబునం బౌరజనంబులందు నిర్వాక్పేశస్కరుల నిద్ద ఱంధులు గలరు వారలచేత గమనకరణంబులను క్రియలనొందుచు నంతఃపురగతుం డగునప్పుడు విషూచీసమన్వితుండై జాయాత్మజోద్భవంబు లైన మోహ ప్రసాద హర్షంబుల నొందుచుండు నవ్విధంబునం గర్మాసక్తుండుఁ గామాత్మకుండు నై బుద్ధి యను మహిషిచేత వంచితుం డయ్యె నక్కామినియు. 768

---

1 ప్రాగ్ద్వారపంచకము = తూర్పునఁగల ఐదుద్వారములు.

సీ. పానంబు సేసినఁ ♦ దాను బానము సేయుఁ
గుడిచినఁ దానును ♦ గుడుచు మఱియు
భక్షింపఁ దానును ♦ భక్షించు నడచిన
నడచును నవ్విన ♦ నవ్వు నేడ్వ
నేడుచుఁ బాడినఁ ♦ బాడు విన్నను వినుఁ
జూచినఁ జూచుఁ గూ ♦ ర్చున్న నుండు
దుఃఖింప దీనుఁడై ♦ దుఃఖించు నిలిచిన
నిలుచు నిద్రింపంగ ♦ నిద్రవోవు
తే. ముట్టినను ముట్టు మూర్కొన్న ♦ మూరుకొనును
బలుకఁ బలుకును బవళింపఁ ♦ బవ్వళించు
హర్షమును బొంద నాత్మను ♦ హర్ష మొందు
మోదమును బొందఁ దానును ♦ మోద మందు. 769

వ. ఇవ్విధంబున నతండు [1]మహిషీవిప్రలబ్ధుండును వంచితస్వభావుండును నై పారవశ్యంబునం జేసి యజ్ఞుండును నితరేచ్ఛావిరహితుండును నై [2]క్రీడామృగంబు చాడ్పున వర్తించుచు నాపురంబునఁ గాఁపురంబుండు నాపురంజనుండొకానొక దినంబున ధనుర్ధరుండై. 770

సీ. పంచాశ్వయుక్తంబు ♦ పంచబంధనముఁ జ
క్ర ద్వితయమును యు ♦ గద్వయంబు
[3]నాశువేగంబు నే ♦ కాక్షంబు కూబర
ద్వయముఁ బతాకాత్రి ♦ తయయుతంబు
[4]నేకరశ్మియుతంబు ♦ నేకసారథికంబు
సప్తవరూథంబు ♦ స్వర్ణభూష
మును బంచవిక్రమ ♦ మును నేకనీడంబుఁ
బ్రకటపంచప్రహ ♦ రణము నయిన
తే. రథము కాంచనరచిత [5]వ ♦ ర్మము ధరించి
విలసదక్షయతూణీర ♦ కలితుఁ డగుచుఁ

1 మహిషీ విప్రలబ్ధుండు = రాణితో ఎడబాటు గలవాఁడు. 2 క్రీడామృగము = ఆటజంతువు. 3 ఆశువేగము = శీఘ్రమగు తొందర. 4 ఏకరశ్మి = ఒకపగ్గము 5 వర్మము = కవచము. 6 అక్షయతూణీర = తరుగని అమ్ములపొది.

గడఁక దీపింప నెక్కి యే ♦ కాదశ ప్ర
సంఖ్యసేనాసమేతుఁ డై ♦ సరభసముగ. 771

వ. పురంబు వెడలి పంచప్రస్థం బను వనంబునకుం జని యందు విడువ రానిమహిషిని విడిచి మృగయాసక్తుం డై [1]దృప్తుం డగుచు ధనుర్బాణంబులు ధరియించి సంచరించుచు నాసురవర్తనంబునం దగిలి ఘోరాత్ముం డదయుండు నై నిశాతసాయకంబులచేత నమ్మృగవ్రాతంబులం బరిమార్చె రాజులకు మృగయావినోదంబు విహితానుష్ఠానం బగుచుండ నాసురవృత్తి యెట్లయ్యె నని యంటి వేని నిది రాగప్రాప్తం బగుటను విహితంబు గాదు వినుము శ్రాద్ధాదులందే ప్రఖ్యాతశ్రాద్ధదివసంబులయందే రాజైనవాఁడే మేధ్యంబు లయిన పశువులనే వనంబునందే యథోపయుక్తంబుగానే వధియింపం జనునను నియమమాత్రంబు గలదు గావున జ్ఞానియైన విద్వాంసుం డాచరింపండుగాక యాచరించినం గర్మానుష్ఠానజనితంబయినజ్ఞానంబునం జేసి యందుఁ బొరయం డట్లు గాక నియమోల్లంఘనంబునం గర్మాచరణుండగు వాఁడభిమానంబునొంది కర్మబద్ధుండై గుణప్రవాహపతితుండును నష్టప్రజ్ఞుండును నై యధోగతిం గూలు నిట్లగుటం జేసి సాధుజనులకు సర్వప్రకారంబుల నాసురవృత్తి మానం దగు నని వెండియు నిట్లనియె నంతం బురంజనుం డవ్వనంబున. 772

క. వరచిత్రపక్షసునిశిత, శరములచే శశవరాహ ♦ చమరీ[2]రురు కా
సరగవయశల్యహరిణ, కరిహరి వృకపుండరీక ♦ కపి ఖడ్గములన్.

వ. వధియించి మఱియును. 774

సీ. వరుస [3]మేధ్యామేధ్య ♦ వనమృగంబుల [4]ఘృణ
సన దుస్సహక్రీడ ♦ సంహరించి
శ్రమయుక్తుఁ డై వేఁట ♦ చాలించి మరలి మం
దిరమున కర్థి నే ♦ తెంచి యందు

---

1 దృప్తుఁడు = మదించినవాఁడు. 2 రురు = జింక, కాసర = దున్న, గవయ = గురుపోతు, శల్య = ఏదు, వృక = తోడేలు, పుండరీకము = బెబ్బులి. 3 మేధ్యామేధ్యవనమృగములు = పవిత్రములు, అపవిత్రములగు జంతువులు. 4 ఘృణ = దయ.

సముచిత స్నానభో ♦ జనకృత్యములుదీర్చి
యతిపరిశ్రాంతి శ ♦ యానుఁడగుచుఁ
బరిమళమిళిత ధూ ♦ పవ్రాత వాసిత
సర్వాంగుఁడగుచు [1]స్ర ♦ క్చందనములు

తే. వివిధభూషణచేలముల్ ♦ వెలయఁ దాల్చి
తుష్టుఁడును హృష్టుఁడున్ మఱి ♦ ధృష్టుఁడై య
నన్యజాకృష్ట చిత్తుండు ♦ నై రతిప్ర
సంగకౌతుక మాత్మను ♦ దొంగలింప. 775

వ. అంత స్వకీయప్రాణవల్లభయగు మహిషియందు మనంబు నునిచిన [2]నావరారోహయు గృహమేధినియునయిన గృహిణిం గానకవిమనస్కుండై నిజాంతఃపుర కామినులం గనుంగొని యిట్లనియె. 776

క. రామాజనసంఘములా,రా మానవతీలలామ ♦ రామామణిసా
రామలకృపచే మెలఁగుదు, రామానుగఁ గుశలమా ప♦రామర్శింపన్.

ఉ. సారవివేకలార గృహ ♦ సంపద లీయెడఁ బూర్వరీతిచే
నారయఁ గా రుచింపవు గృ ♦ హస్థునకుం గృహమందుమాతగా
నీ రమణానుకూల రమ ♦ ణీమణి యైమె తనరారుభార్య గా
నీ రుచి నొంద కున్నఁ గన♦నేర్చునె తద్గృహమేధి సౌఖ్యముల్.

వ. అదియునుం గాక. 779

క. పొగ డొందుజనని గానీ, తగవున వర్తించునట్టి♦దయితయ కానీ
తగ నుండనిగృహమునను,టగుఁజక్రవిహీనరథము♦ నందుంటరయన్.

వ. కావున. 781

చ. తలకొని నాకుఁ దాను సుప♦థంబునఁ బ్రజ్ఞ జనింపఁజేసి సం
చలదురుదుర్భరవ్యసన ♦ సాగరమగ్నుఁడనైన నన్ను ని
శ్చలమతి నుద్ధరించి యని♦శంబును మత్ప్రియ యైనభార్య యే
వలనఁ జరించుచున్న దని ♦ వారణనాకెఱిఁగింపరే దయన్. 782

క. అనవుడు విని యకాంతలు,జనపతికిట్లనిరి రాజ♦సత్తమ యిదిగోఁ
దనకొంగ్రైనను బలుపుగ, నొనరింపక నేలఁబొరలు♦చున్నదివగలన్.

---

1 స్రక్చందనములు = దండలు గంధము 2 వరారోహ = స్త్రీ

తే. ఏమికతమున నున్నదో ♦ యెఱుఁగ మేము
నీవు సూడు మటన్న నా ♦ భూవరుండు
నేలఁబడి పొరలెడుభార్యఁ ♦ బోలఁజూచి
మనములో దుఃఖతాపంబు ♦ మల్లడింప. 784

వ. అంత. 785

ఆ. జలజనేత్ర ప్రణయ ♦ సంజాతరోషభా
వమున నయినయట్టి ♦ వక్రదృష్టి
జనవిభుండు సూచి ♦ యనునయకోవిదుఁ
డగుచు నప్పయోరు ♦ హాక్షిఁ జేరి. 786

క. పొలఁతుకఁ దనయుత్సంగం
బులనిడి తత్పాదయుగళ ♦ మును నొటుచు మం
జుల మృదుభాషణముల నా
లలనామణిఁ జూచి పలికె ♦ లాలన మొప్పన్. 787

చ. రమణిరో భృత్యులందు నప ♦ రాధము గల్గిన నాయకుల్ స్వప
క్షముఁ దలపోసి యుగ్రతర ♦ శాసనముం దెగి చేయ రట్లు గా
క మనములోనికిన్కఁ దమ ♦ కంబున నాజ్ఞయొనర్చి రేని ని
క్కముగ ననుగ్రహించుటయ ♦ కాక తలంపఁగ నాజ్ఞసేయుటే. 788

క. కమలానన బాంధవకృత్యములందలఁపక రోషచిత్తుఁ ♦ డగుకుటిలాత్మున్
సమదామర్షుఁడు నీతిక్రమరహితుఁడు నైన బాలుఁ ♦ గా నన్నఁదగున్.

వ. అని వెండియు నిట్లనియె. సుదతీహృదయేశ్వరివైననీవు. 790

మ. సరసోదార సుధారసోపమవచ ♦ శ్చాతుర్య సౌభాగ్యమై
హరినీలోపమకోమలాలకయుతం ♦ బై విభ్రమభ్రూలతా
పరిజుష్టస్మితసద్విలోకనమునై ♦ భాసిల్లు యుష్మన్ముఖాం
బురుహంబుం భవదీయదాసునకుఁబూఁ ♦ బోఁడీకృపం జూపవే. 791

క. విను వీరపత్ని నీయెడ, ననయంబును బ్రాహ్మణులును ♦ హరిభక్తులుఁ ద
క్కను నితరు లెగ్గుసేసిన, వనితా శిక్షింతు నెంత ♦ వారలనయినన్.

క. ఈముల్లోకములందును, నామనమున రోష మొదవి ♦ నన్ భయరహితుం
డైమదిలోఁ బరితోషము, తో మెలఁగెడువానిఁ గానఁ ♦ దోయజనేత్రా.

సీ. ఇందీవరేక్షణ ♦ యే నెందు భవదీయ
తిలకవిరహితము ♦ మలినయుతము
హర్షశూన్యంబు మ ♦ నోప్రకాశకమునై
యత్యమర్ష యుతంబు ♦ నయినముఖము
గళితాశ్రుబిందు సం ♦ కలితసంచిత శోభ
మూన పీన స్తన ♦ మండలమును
రమణీయతాంబూల ♦ రాగవిహీనమై
నట్టి సుపక్వబిం ♦ బాధరంబు
తే. గాఁగ నిట్లుంట కిపుడేమి ♦ కతము నాకు
నర్థి నెఱిఁగింపవే మృగ ♦ యాతిస క్తి
నబల నీ కెఱిఁగింపక ♦ యరిగినట్టి
తప్పునైరించి కావంగఁ ♦ దగుదు నేను. 794
క. వనితాజనపరవశుఁడై, మనసిజశరబాధ్యమాన ♦ మానసుఁడగువా
నిని దగఁ గర్త వ్యార్థము,లనుభజియింపక తొలంగు♦లలనలు గలరే.
వ. అనుచుం దదీయవిభ్రమ [1]వశంగతుండై పలికిన విని. 796
క. కంజాతపత్త్రినేత్ర పు, రంజను దెస రోష ముడిగి ♦ రమణీయశ్రీ
[2]మంజులమృదూక్తులమనము,రంజించుచుఁబలికెనదను♦రాగమెలర్పన్.
వ. అంత. 798
సీ. అమ్మహాదేవి [3]నె ♦ య్యంబున మంగళ
స్నానయై మృదులవ ♦ స్త్రములు గట్టి
[4]స్రక్చందనాదిభూ ♦ షణములు ధరియించి
కమనీయమోహనా ♦ కార యగుచుఁ
బతికడ నిలిచిన ♦ నతఁడు సంతుష్టాంత
రంగుఁడై యభ్యంత ♦ రమున నుండి
యన్యోన్యసరస [5]గా ♦ ఢాలింగనంబులు
గావించి గోష్ఠ్యవా ♦ క్యముల చేత

1 వశంగతుఁడు = లోఁబడినవాఁడు 2 మంజులమృదూక్తులు = మనోహరమగు మెత్తని పల్కులు. 3 నెయ్యము = చెలిమి. 4 స్రక్చందన = దండలు, గంధము. 5 గాఢాలింగనములు = దట్టపుఁ గౌఁగిళ్లు.

తే. నతఁడు ¹ప్రమదాపరిగ్రహ ♦ వ్యసనమునను
గడఁక నపకృష్టఘనవివే ♦ కంబు గలిగి
పగలు రే యని ప్రొద్దు లే♦ర్పఱుప రాక
యెనసి యాయుర్వ్యయంబు దా ♦ నెఱుఁగఁ డయ్యె. 799

వ. మఱియు నతం డున్నద్ధముకుండును మహాత్ముండును సర్వాశయా
శయానుండును మహిషీభు²జోపధానుండును నై యఙ్గనాభిభూతుం
డగుటం జేసి స్వరూపభూతపరమపురుషార్థంబు నెఱుంగక నిజమహి
షియె పరమపురుషార్థంబుగాఁ దలంచుచు రమించుచుండఁగా మకశ్మల
చిత్తుం డైన యతనికి నవయౌవనం బైన కాలంబు క్షణార్థంబునుం
బోలె గతంబయ్యె నంత. 800

క. విశదయశోజలనిధి యా, శశిముఖియగు భార్యవలన ♦ సమ్మతి నేకా
దశశతపుత్రుల రణకర్కశదేహులఁ గాంచి కౌతు♦కంబున మఱియున్.

క. గురుశీలౌదార్యగుణో, త్తరలను సల్లలితగుణక♦దంబలఁ బ్రియలన్
వరకులపావనల ³దశో, త్తరశతదుహితలను గాంచెఁ ♦ దత్సతివలనన్.

వ. ఇట్లు పుత్రపుత్రికాజనంబులం గని యున్నంత. 803

క. విను మాతనియాయువులో, సను నర్ధంబరిగె నంత ♦ నరపతి కులవ
ర్ధనులగు సుతులకుఁ బరిణయ, మొనరించెన్ సదృశలయిన ♦ యువిదల
తోడన్. 804

క. నరనాథుఁ డాడుబిడ్డల, వరరూపవయోవిలాస ♦ వైభవములచేఁ
బరఁగిన నిజతనయలసమ, వరులకు సంప్రీతితో వి♦వాహము చేసెన్.

వ. అట్లు వివాహంబులు గావించి యున్న సమయంబున. 806

క. వినుతత్సుతులొక్కొకనికి, ననయముఁ బాంచాలదేశ ♦ మందులఁ బౌరం
జనకులవర్ధనులగుచుఁ, జనియించిరి నూర్వురేసి ♦ శౌర్యబలాఢ్యుల్.

ఆ. అనఘ యట్టి ⁴ రిక్థ♦హారులు గేహ కో
శానుజీవయుతులు ♦ నయినయట్టి
నందనాదులందుఁ ♦ జెందినమమత ని
బద్ధుఁ డయ్యె నంతఁ ♦ బార్థివుండు. 808

---

1 ప్రమద = స్త్రీ. 2 ఉపధాన = దిండు. 3 దశోత్తర శత దుహితలు = నూటపదిమంది కూతుండ్రు. 4 రిక్థ = ధనము, ఆస్తి.

చ. తిరముగునిష్ఠతో నతఁడు ♦ దీక్షితుఁడై పశుమారకంబులుర్
సరవి భయంకరంబులగు ♦ సన్మఖముల్ దగఁబెక్కుసేసి యా
దరమున నీవునుంబలెను ♦ దత్తదనూన ఫలాప్తికాముఁడై
సురపితృ భూతసంఘము న ♦ సూయఁ దనర్చ భజించెభూవరా. 809

వ. ఇట్లాత్మహితంబు లైన కర్మంబులయం దనవహితుండును గుటుంబాసక్తమానసుండునై యున్నయతనికి విరోధియై ప్రియాంగనాజనంబులకున ప్రియంబగు కాలంబు సంభవించినం జండవేగవిఖ్యాతుండను గంధర్వాధీశుండు షష్ట్యుత్తర శతత్రయసంఖ్యాకులైన గంధర్వులును నంతఱ గంధర్వీజనంబులును సితాసిత వర్ణంబులు గలిగి మిథునీభూతు లగుచు ననుగమింపం జనుదెంచి స్వపరిభ్రమణంబుచేతనే సర్వకామంబులనిర్మితంబగు నాపురంబు నిరోధించిననప్పుడాచండవేగానుచరులైనగంధర్వులాపురంజనుపురంబు[1]వ్యాకులత్వంబు నొందించుచు నపహరింప నుపక్రమించు సమయంబునఁ బురంజనపురాధ్యక్షుండైన ప్రజాగరుండనువాఁడు వింశత్యుత్తర సప్తశతంబులైన గంధర్వ గంధర్వీ జనంబుల నివారించి బలవంతుండై సంవత్సరశతంబు యుద్ధంబుగావించియొక్కరుండయ్యునప్పొక్కండ్రఁగో నిట్లు పోరి క్షీణుండైనం బురంజనుండు దాన నిలిచి తత్పురంబున నల్పసుఖంబు లనుభవించుచుఁ బాంచాల దేశంబులందు నిజ[2]పార్షదులచేత నానీతంబులైన పదార్థంబులనొందుచుంగామినీజనసమేతుండై భయపర్యాలోచనంబు సేయనేరక రాష్ట్రపుర బాంధవసమేతుండై యార్తినొందిచింతాక్రాంతుండై యుండెనంత. 810

క. అనయంబుఁ గాలపుత్రిక, యనునొక కామిని వరేచ్ఛ ♦నఖిలజగంబుం
దనయంతఁగలయఁదిరుగుచుఁ,జనిచనియొకనాఁడురాజ♦సత్తమువింటే.

సీ. అనఘాత్మ రాజర్షి ♦ యైనయయాతికు
మారకుం డయినట్టి ♦ పూరు చేత
వరియింపఁగాఁ బడి ♦ వల నొప్ప నతనికి
వర మిచ్చి దౌర్భాగ్య ♦ వశత నొంది

1 వ్యాకులత్వము = కలత. 2 పార్షదులు = కూడనుండువారు.

ప్రఖ్యాతి గనుట దు ♦ ర్భగ యను పేరను
బరఁగునకాంత నే ♦ పురుషవరుఁడు
వరియింపఁ డయ్యె నా ♦ తరుణియు నొకనాఁడు
గరమొప్ప బ్రహ్మలో ♦ కమునుండి

తే. వసుధ కేతెంచి విను బృహ ♦ ద్వ్రతుఁడ వయిన
నన్ను వరియింపఁ గోరి మ ♦ నమునఁ [1]గామ
శరవిమోహిత నై వేఁడఁ ♦ గరము నేను
సమ్మతింపక యున్న రో ♦ షమున నలిగి. 812

వ. ఇట్లను మునీంద్రా మదీయాశా [2]విముఖుండ వైన నీకు నేకత్రావస్థానంబు లేకయుండుం గాక యని శపించి [3]విహతసంకల్పనై మదుపదేశంబునం జని యవనేశ్వరుండును భయనామకుండును నయిన వానిఁ గదిసి యిట్లనియె. 813

క. అవనీపతి భయనామక, యవనకులాధీశ్వరుండ ♦ వగు నినుఁ బతిఁ గాఁ
దవిలి వరింపఁగ వచ్చితి, సవినయముగ విను ముభూత ♦ సంకల్పమునన్.

వ. కలుగు మత్కామితంబు వృథ గాదు లోకంబున వేదంబులందు [4]దేయగ్రాహ్య రూపంబైన వస్తువు [5]యాచ్యమానం బగుచుండ నెవ్వం డొసంగం డెవ్వం డిందు [6]దీయమానం బగుచుండం గోరం డట్టివా రిద్దఱును జడస్వభావు లని సత్పురుషులు శోకంబునొందుదురు గావున నిన్ను భజియించుచున్న నన్నుం గరుణార్ద్రచిత్తుండవై భజియింపు మిట్టి [7]యార్తానుకంపయుఁ బురుషధర్మం బని పలికిన యా కాలపుత్రికవచనంబులు విని యవనేశ్వరుండు దేవగుహ్య [8]చికీర్షువగు దానిం గనుంగొని మందస్మితవదనుండగుచు నిట్లనియె.

క. విను తరుణి యాచ్యమానం
బనఁ దగు నీలోకమందు ♦ నత్యశుభవు స

1 కామశరవిమోహిత = మన్మథబాణములచే మోహ మొందింపఁబడినది. 2 విముఖుఁడు = పెడముఖమైనవాఁడు. 3 విహతసంకల్ప = కొట్టఁబడిన కోరికగలది. 4 దేయగ్రాహ్య = ఈయఁదగిన తీసుకొనఁదగిన. 5 యాచ్యమానము = అడుగఁబడుచున్నది. 6 దీయమానము = ఈయఁబడుచున్నది. 7 ఆర్తానుకంప = బాధనొందువారియెడ దయ 8 చికీర్షువు = చేయనిచ్ఛగలది.

జనముల కసమ్మతవు నగు
నిను నభినందింప రెందు ♦ నెట్టి వారున్. 816

వ. కావున నేను జ్ఞానదృష్టిం జేసి నీకుం బతినిరూపణంబు సేసెద దది యెట్లనిన మదీయ సేనాసాహాయ్యంబువడసి ప్రజానాశంబొనరించు నట్టి నీ వవ్యక్తగతివై కర్మనిర్మితంబైన లోకంబుననుభవింపుమీ ప్రజ్వారుం డనువాఁడు నాకు సహోదరుండు నీవు మదీయభగినివి మీ రిద్దఱుం గూడి యీలోకంబునందు నవ్యక్తుండును భీమసైనికుండును నై యేను వర్తింతు ననిన నా భయనామకుండయిన యవనేశ్వరుని దిష్టకారులైన సైనికులు ప్రజ్వారకాలకన్యాయుక్తులై భూమండలం బెల్లఁ దిరుగుచు నొక్కనాఁ డతివేగంబున భౌమభోగాఢ్యంబును [1]జరత్పన్నగపాలితంబును నయిన పురంజను పురంబు నావరించియున్నంత స్వాభిభూతుం డయిన పురుషునకు నిస్సారత్వంబు గలిగించునట్టి కాలకన్యక బలాత్కారంబున నా పురంజను పురంబు ననుభవించె నట్లు కాలకన్య [2]కోపభుజ్యమానంబైన పురంబు సర్వద్వారంబులందును సర్వతోధికంబుగా నయ్యవనులు ప్రవేశించి తత్పురంబు సమస్తంబును బాధింపనిట్లు పురంబు ప్రపీడ్యమానం బగుచుండ నభిమానియైన పురంజనుండు.

సీ. అనఘ యెంతయు మమ ♦ తాకులచిత్తుఁడై
బహువిధభూరితా ♦ పములఁ బొందె
ఘనకుటుంబియుఁ గాల ♦ కన్యో[3]పగూఢుండు
నష్టసంపదుఁడు వి ♦ నష్టమతియు
విషయాత్మకుండును ♦ వినిహతైశ్వర్యుండుఁ
గృపణుండు సాల న ♦ కించనుండు
నగుపురంజనుఁడు శో ♦ కా[4]విలభావుఁడై
గంధర్వయవనసం ♦ ఘముల చేత

తే. నోజ సెడి వికలత నొందు ♦ నైజపురముఁ
దవిలి ప్రతికూలురగు ♦ తనూ ♦ దరణాయుతులు

1 జరత్పన్నగపాలితము = ముసలిదగుపాముచేఁబాలింపఁబడునది. 2 ఉపభుజ్యమానము = అనుభవింపఁబడుచున్నది. 3 ఉపగూఢుఁడు = మఱుఁగుపడినవాఁడు. 4 ఆవిల = కలుషము.

నయిన పుత్రులఁ బౌత్రుల ♦ ననుచరులను
సచివపౌరోహితుల నిజ ♦ సతినిఁ జూచి. 818

వ. మఱియుం గాలకన్యాగ్రస్తుం డయినతన్ను నసకృదూషితంబు లైన పాంచాల బలంబునుం జూచి యపార చింతం నొంది తత్ప్రతీకారంబు సేయ నెఱుంగక కాలకన్యాపహృత వీర్యంబు లయినం గామంబుల నభిలషించుచు దీనుండును విగతాత్మగతికుండును స్నేహంబునం జేసి పుత్రదారోపలాలన పరుండును నై కాలకన్యో[1]పమర్దితంబును గంధర్వయవనాక్రాంతంబును నైన పురంబు విడువ నిచ్ఛ లేకయు విడువ నుపక్రమించె నప్పుడు. 819

క. అనఘాభయనామాగ్రజుఁ, డనఁగల ప్రజ్వారుఁ డపుడ ♦ యరుదెంచి పురం
బును సకలంబును భయనా, మునికిం బ్రీతిగ దహించె ♦ మును కొనియంతన్.

వ. అట్లు పురంబు దహ్యమానం బగుచుండఁ బౌరభృత్యవర్గాది సమన్వితుండును కౌటుంబికుండును బుత్త్రాదిసమన్వితుండును యవనో[2]పరుద్ధాలయుండును గాలకన్యాగ్రస్తుండును నయిన పురంజనుండప్పురంబునందుఁ బ్రజ్వారసంస్పృష్టుండై యనుతాపంబు నొందితత్పురపాలనంబునందు సమర్థుండు గాక పురు[3]కృచ్ఛ్రోరువేపథుండయి యం దుండ నశక్తుం డయ్యె నంత. 821

క. దవశిఖయుత [4]తరుకోటర, నివసితపన్నగము పగిది ♦ నిజపురి వెడలం
దివురుచు నతఁ డుశిథిలదవ, యవుఁ డను గంధర్వగణవి ♦ హతశౌర్యుండున్.

సీ. అయి చాల ఘురఘుర ♦ మనుశబ్ద మడరంగ
మనమునఁ జింతాని ♦ మగ్నుఁ డగుచుఁ
గొడుకులఁ గోడండ్రఁ ♦ గూఁతుల నల్లుర
మనుమల నాప్తుల ♦ ననుచరాళి
ననయంబు నల్పమా ♦ [5]త్రావశిష్టం బైన
గృహకోశనివహాప ♦ రిచ్ఛదముల
మసలు నహంకార ♦ మమకారములఁ జేసి
మతిహీనుఁ డగుచు నె♦మ్మనములోనఁ

1 ఉపమర్దితము = పీడితము. 2 ఉపరుద్ధ = అడ్డగింపఁబడిన. 3 కృచ్ఛ్రోరువేపథుడు = బాధయొక్క గొప్పతనముచే వణకువాఁడు. 4 తరుకోటరనివసితపన్నగము = చెట్టుతొఱ్ఱలో నున్నపాము. 5 అవశిష్టము = మిగిలినది.

తే. గడఁక దలఁచుచు [1]విప్రయో ♦ గమునఁ దాను
గటకటా యిట్లు పరలోక ♦ గతుఁడనైన
యిట్టిభార్య యనాథయై ♦ యీకుమార
వరుల నేరీతిఁ బ్రోచునో ♦ యరసియనుచు. 823

వ. మఱియు నిట్లని తలంచు. 824

సీ. పడఁతి యే మును భుజిం ♦ పక భుజింపదు నేను
నిద్ర వోవక మఱి ♦ నిద్రవోదు
నేను నీళ్లాడక ♦ నీళ్లాడ నొల్లదు
వదరి యేఁ గోపింప ♦ భయము నొందు
[2]భర్జించినను మాఱు ♦ వలుకక వాయోడు
బుద్ధిహీనుఁడ నైన ♦ బుద్ధి సెప్పు
లలి మీఱ నిట్టిక ♦ ళత్రంబుతో నేను
గడఁగి దేహాంతర ♦ గతుఁడనైన

తే. ననయమును దాను బుత్రిణి ♦ యగుటఁ జేసి
యాత్మశోచిని యగుచు గృ ♦ హస్థధర్మ
మాచరించుచు నుండునో ♦ యనుగమనము
సేయునో యని మనమునఁ ♦ జింత నొంది. 825

క. తనపుత్రులుఁ దనపౌత్రులు
ననయముఁ దాఁజనినయెడ ని ♦ రాశ్రయులగుచున్
వననిధిమధ్యంబున [3]నవి
సినకలముంబోలె నెట్లు ♦ జీవించెదరో. 826

క. అని యివ్విధమునఁ గృపణుని
యనువున ఘనదుఃఖవిహ్వ ♦ లాత్ముఁడ
య్యును దుఃఖించు పురంజను
ననయముఁ గొనిపోవ జొచ్చె ♦ తాత్మ్యండగుచున్. 827

క. చనుదెంచెను భయనాముం
డనువాఁ డప్పుడు పురంజ ♦ నాఖ్యుఁడు వెలుచన్

1 విప్రయోగము = ఎడబాటు. 2 భర్జించిన = భయపెట్టిన. 3 అవిసిన కలము = పగిలినపడవ.

వినుతాత్మ పశువుభంగిని
మానము గలఁగ యవన[1]నీయ ♦ మానుఁ డయ్యెన్. 828

వ. అనుచరవర్గంబు భ్రాతృసుతులును శోకితులు నై వెను చనుచుండ నుపరుద్ధంబగు భుజంగమంబు పురంబు నెప్పుడు వాసె నప్పుడా పురంబు పురంజనుం బాసి [2]విశీర్ణం బై ప్రకృతిం బొందె బలవంతుం డయిన యవనుని చేత బలాత్కారంబున [3]విక్రృష్యమాణుం డైన పురంజనుండు దమహిషీసహితుం డై పూర్వసుహృత్తగు సఖు నీశ్వరు నెఱుంగకుండె నంతం బరలోకగతుం డైన పురంజనుం గదిసి పూర్వంబున నదయుం డైనయతనిచేత హింసింపంబడిన యజ్ఞపశువులు క్రోధోద్రేకంబునఁ [4]కుఠారంబుల నతని నఱకె నివ్విధంబునఁ [5]ప్రమదాసంగదోషదూషితుండును [6]నపారతమోనిమగ్నుండును నష్టజ్ఞానుండును నగు పురంజనుం డనేక కాలంబు పరలోకంబున నార్తి ననుభవించి తద్భార్య యైన ప్రమదోత్తమం జిత్తంబున నశ్రాంతంబును దలంచుచుండం దదీయసంస్మరణంబునం జేసి తరువాతిజన్మంబున విదర్భరాజగృహంబునం బ్రమదోత్తమ యై జన్మించె నంత. 829

సీ. అవనీశ [7]వీర్యప ♦ ణాత్మ యైనట్టి వై
దర్భుని మలయకే ♦ తనుఁ డనంగఁ
బరపురంజయుఁ డైన ♦ పాండ్యభూమీశుఁడు
దారుణసంగర ♦ స్థలమునందు
శత్రు ననేకరా ♦ జన్యుల నిర్జించి
పరిణయం బయ్యె నా ♦ గురుభుజుండు
నావిదర్భాత్మజ ♦ యం దసితేక్షణ
యైనకూఁతును ద్రవి ♦ డాధినాథు

తే. డైనకొడుకుల నేడ్వుర ♦ నర్థిఁ గని యె
వారలకు నెల్ల నొక్కొక్క ♦ వరుస నర్బు

1 యవనీయమానుఁడు=యవనులచేఁ గొనిపోవఁబడువాఁడు.

2 విశీర్ణము=శుష్కించిన, విడిచిన. 3 విక్రృష్యమాణుఁడు = లాగఁబడినవాఁడు. 4 కుఠారము=గొడ్డలి. 5 ప్రమదాసంగదోషదూషితము = స్త్రీసాంగత్యమను పాపముచే నిందితము. 6 అపారతమోనిమగ్నుఁడు=అంతులేనితమోగుణమున మునిఁగినవాఁడు. 7 వీర్యపణాత్త=పరాక్రమమను పందెముచే బొందఁబడినది.

దార్చ్యదసుతులు సంజాతు ♦ లైరి యతని
సుత ధృతవ్రత నాయగ ♦ స్తుడు వరించె. 830

క. అతఁ డాకన్యకవలనను
జతురుండై యిధ్మవాహ ♦ జనకుఁ డగుదృఢ
చ్యుతుఁ డను మునీంద్రుఁగనియెను
మతినంత విరక్తుఁడగుచు ♦ మలయధ్వజుఁడుఁ. 831

తే. క్ష్మాతలం బెల్ల నిజతనూ ♦ జాతులకును
బంచి యిచ్చి సరోజాక్షు ♦ పాదపంక
జార్చనాయత్తుఁడగుచుఁ గు ♦ లాద్రికరుగ
నంత మదిరాక్షి సతియగు ♦ నావిదర్భి. 832

తే. కడఁక గృహములు నఖిల భో ♦ గములు విడిచి
చంద్రు వెనుచను చంద్రిక ♦ చందమునను
భక్తిదళుకొత్తఁ బాండ్య భూ ♦ పాలుఁ డయిన
మలయ కేతను వెనుకొని ♦ మగువ సనియె. 833

వ. అట్లు ధర్మపత్ని వెంట రాఁ జని యందుఁ జంద్రమసా తామ్రపర్ణీ వటోదక లను నదుల పుణ్యజలంబుల సుస్నాతుండయి [1]ప్రక్షాళిత బాహ్యాభ్యంతరమలుండును గందమూలఫలబీజపుష్పపర్ణతృణతో యాహారుండునై [2]కాయకర్శనంబైన తపం బాచరించుచు శీతోష్ణవర్ష వాతంబులు క్షుత్పిపాసలుఁ బ్రియాప్రియంబులు సుఖదుఃఖంబులు ననుద్వంద్వంబుల సమదర్శనుండై జయించి తపోవిద్యాయమనియ మంబులం జేసి పక్వ కషాయుండై బ్రహ్మంబునందు నిజాత్మ నను సంధించి విజితేంద్రియు ప్రాణచిత్తుండై [3]స్థాణువుంబోలె దివ్యవర్ష శతంబు దపంబుసేసి భగవంతుండయిన వాసుదేవునియందుఁ బ్రీతి వహించుచు నన్యం బెఱుంగక వర్తించుచుఁ దన్ను స్వప్నమందు మమేదం శిర శ్ఛిన్న మితియను ప్రతీతియంగుంబోలె వ్యతిరిక్తునిఁగా వ్యాపకునిఁగా నంతఃకరణవృత్తిసాక్షినిఁగా నెఱింగి. 834

---

1 ప్రక్షాళితబాహ్యాభ్యంతరమలుఁడు = కడుగఁబడిన లోపలివెలుపలి మలము గలవాఁడు. 2 కాయకర్శనము = దేహమును కృశింపఁజేయునది. 3 స్థాణువు = చెట్టుబోదె.

సీ. సాక్షాత్కృతుండును ♦ సర్వేశ్వరుండును
భగవంతుఁడును గృపా ♦ పరుఁడునైన
హరి యనులోకైక ♦ గురునిచే నుక్తము
సర్వతోముఖమును ♦ స్వప్రకాశి
తమునగు మహితము ♦ దగ్ జ్ఞానదీప ప్ర
భాతతిచేఁ బర ♦ బ్రహ్మమునఁగఁ
దన్నును దనయందుఁ ♦ దగఁబరబ్రహ్మంబు
నెనయఁ గన్గొనుచు [1] ద ♦ గ్ధేంధనాగ్ని
తే. భంగి [2] నేషణములఁ బెడఁ ♦ బాసి భూరి
వ్యసనసాగరసంసృతి ♦ వలనఁ జాల
[3]నుపరతుండయ్యె నా మహీ ♦ తోన్నతుండు
నవనినాయక వినుమప్పు ♦ డతనిభార్య. 835
క. పతిదైవత శీలసమం, చిత వేణీభూతచికుర ♦ చీరాంబర సు
వ్రతచర్యా[4]క్షామాంగి వి, గతదోష విదర్భరాజ ♦ కన్యక యచటన్.
తే. కమలలోచన నిఖిలభో ♦ గములఁ దొఱఁగి
మలయకేతనుఁ బరమధ ♦ ర్మజ్ఞుఁ జేరి
నిరుపమైకపతివ్రతా ♦ నియమ మొప్ప
సాధ్వియై భక్తిఁ బరిచర్య ♦ సలుపుచుండె. 837
క. విమలమతిని జేసు సమిధా, పవమానసతిర్ధూమరహిత ♦ పవమానసఖా
గ్రమున వెలుఁగొందు కీలవి, ధమునఁ బ్రకాశించుచుండెఁ ♦ దద్దయు వేడ్కన్.
క. సతిదనప్రాణేశ్వరుఁడుప, రతుఁడగుట మనంబులోన ♦ రయమక మొపూర్వ
స్థితి నుపచారక్రియ లం, చితమతిఁ గావింపఁదలఁచి ♦ చిరతరభక్తిన్.
క. అనుపమసుస్థిరనియమా, ననుఁడగు నిజనాథుడాయఁ ♦ జని పూర్వగతిన్
వినమితయై సతి తత్పద, వనజము లర్చించునపుడు ♦ వరు పాదములన్.
క. వినుమూష్మత లేకున్నను, గని [6]యూథభ్రష్టహరిణి ♦ కైవడి సతి నె
మ్మనమున బెగడుచు దీనత, ననయంబును బంధురహిత ♦ యై శోకించెన్.

---

1 దగ్ధేంధనాగ్ని = కాల్పఁబడిన కట్టెలందలినిప్పు, 2 ఏషణములు = ధనము భార్య పుత్రుఁడు వీనిపయి కోరిక, 3 ఉపరతుఁడు = విరమించినవాఁడు, 4 క్షామాంగి = చిక్కినమేనుగలది 5 ధూమరహిత పవమానసఖాగ్రము = పొగలేనినిప్పుముందు 6 యూథభ్రష్ట = గుంపునుండి తొలఁగిన.

చ. అనయము నిట్లు శోకవివ ♦ [1]శాశ్రుపయఃకణసిక్తమానిత
స్తనయుగయై వియోగపరి ♦ తాపమునన్ హృదయంబు గందశో
భనలక్షితాధరోష్ఠనవ ♦ పద్మము శోషిల సుస్వరంబుగా
వనజదళాక్షి యేడ్చె నని ♦ వారణఁ దద్విపినాంతరంబునన్. 842

ఉ. హా నరనాథ! హా సుమహి ♦ తాత్మక! హా గుణశాలి! యింక [2]నం
భోనిధిమేఖలాకలిత ♦ భూమి యధార్మికరాజచోరపీ
డానిరతిం గృశింప నక ♦ టా తగు నయ్య యుపేక్షసేయ శో
భానయశాలి! నీవు పరి ♦ పాలన సేయుదు లెమ్ము భూవరా! 843

చ. అని విలపించుచున్ సరసి ♦ జాక్షి నిజేశుపదారవిందముల్
దననిటలంబు సోఁకఁ బరి ♦ తాపమునం బడి బిట్టు చాల రో
దన మొనరించుచుం దగిలి ♦ దారువులం జితిఁ జేర్చి యందులోఁ
బెనుపగు తత్కళేబరముఁ ♦ బెట్టి శిఖిం దరికొల్పి యిమ్ములన్. 844

క. తాననుగమనము సేయం, బూనుటయును నంతలోనఁ ♦ బూర్వసఖుఁడు వి
జ్ఞానస్వరూపుఁడమలుఁడు, నైన [3]ధరాదివిజుఁ డొక్కఁ ♦ డబలం గనుచున్.

క. చనుదెంచి యత్తలోదరి, సునయోక్తుల [4]ననునయించు ♦ చుం దగ ననియెన్
వనితా నీ వెవ్వతె వె, వ్వని దాన వితం డెవండు ♦ వగచెద వేలా. 846

క. అనియడిగి వెండియును ని, ట్లనియెను నీసృష్టిపూర్వ ♦ మందును నీ వె
వ్వనితోడి సఖ్యసౌఖ్యము, లనవరతము ననుభవించి ♦ తట్టిసఖుండన్.

క. నన్నెఱుఁగుదే మనమున, నన్నెఱుఁగక యున్న నైన ♦ నళినదళాక్షీ
నన్నుఁ బురాతనసఖుఁగా, నెన్నంగలదానవైన ♦ నెఱుఁగవె చెపుమా.

వ. కావున నీవును నేనునుం బూర్వంబునందు మానస నివాసుల
మై నహంసలమైయుండి గృహంబుఁ బాసి సహస్రవత్సరంబులు సఖుల
మై వర్తించుచుండ నీవు నన్నుం బాసి భామాభోగరతుండవై పదంబు
నిచ్ఛగించుచు మహీమండలంబు గలయం గ్రుమ్మరుచున్న డొక్క
కామినీనిర్మితంబుం బంచారామంబు నవద్వారసమేతంబు నేకపాల
కంబుఁ ద్రికోష్ఠంబు షట్కులంబుఁ బంచవిపణంబుఁ బంచప్రకృ

---

1 అశ్రుపయఃకణసిక్త = కన్నీటిజలకణములచే తడిసిన, 2 అంభోనిధిమేఖల = సముద్రముఒడ్డాణము గాఁగల, 3 ధరాదివిజుండు = బ్రాహ్మణుండు 4 అనునయించు = ఓదార్చు.

ఱియు స్త్రీనాయకంబు నైన యొక్క పురంబు పొడగంటి వది యెట్టి దనినం బంచారామంబు లనం బంచేంద్రియార్థంబులు నవద్వారంబు లన నాసికాది ద్వారంబు లేకపాలకం బనం బ్రాణ పాలనంబు త్రికోష్ఠంబు లనం దేజోబన్నంబులు హట్టంబు లన నింద్రియ సంగ్రహంబు విషయంబు లనఁ గర్మేంద్రియంబులు పంచప్రకృతి యనం బంచభూతంబులు ప్రకృతి యను కామిని యన బుద్ధి నిట్టి పురంబునం బ్రవిష్టుండ వైన పురుషుం డంగనాపరతంత్రుండు నజ్ఞుండు నైన నీవ యప్పురంబునం గామినీసంస్పృష్టుండవై రమియించుచుం దత్సంగమంబున నష్టస్మృతివై వైదర్భీజనసంభావితసుఖాభాసంబు లగు దుఃఖంబులచే నిట్టి పాపిష్ఠురా లైన దశం బొందితివి గావున. 849

సీ. నీవు వైదర్భివి ♦ గావు నీకుఁ దెలుపు
వివరింపఁగాఁ గాఁడు ♦ విభుఁడు నీకు
నొగి మున్ను పురమున ♦ నుపరుద్ధఁ జేసిన
యాపురంజనపతి ♦ వగుటఁ గావు
మఱియు నీ[1]వన్యసీ ♦ మంతిని యగుటయును
జర్చింపఁగా బూర్వ ♦ జన్మమునను
బురుషుండ వనియును ♦ బుద్ధిఁ దలంపుము
యారయంగ నీయుభ ♦ యము నసత్య

తే. మింతయును మామకీన మై ♦ యెసఁగు మాయఁ
జేసి కల్పిత మయ్యెఁ జ ♦ ర్చింప మనము
పూర్వమున హంసలము యని ♦ పూని యెఱుఁగఁ
బలికితి దెలియ మనలపో ♦ పంబుఁ జూడు. 850

వ. ఏనే నీవుగాని యన్యుండవు గావు నీవే నేఁ గాని యన్యుండం గా నిట్లని యెఱుంగుము విద్వాంసులు మనయిద్దర యందు నంతరంబు నీక్షింపరు పురుషుండు దను నొక్కని నె యాదర్శ చక్షువులం దభిన్న రూపునింగాఁ దలంచు చందంబున మనయిద్దఱకు భేదంబు గలిగిన యట్ల తోఁచునని యివ్విధంబున నతం డతనిచేత నీవు పూర్వంబున మదీయసఖుండ వైన హంసవని తెలుపంబడి స్వస్థుండై తద్వియోగ

1 అన్యసీమంతిని = ఇతర స్త్రీ.

నష్టం బైనజ్ఞానంబు గ్రమ్మఱం బొందె నని చెప్పి నారదుండు ప్రాచీనబర్హిం జూచి యీ యధ్యాత్మతత్త్వంబు రాజకథా మిషంబున నీకు నెఱింగించితి ననిన. 851

క. విని భూమీశుఁడు నారద, మునికి ననుభవదీయవచన♦ములు సూరులుంద
కఁను గర్మమోహితులమై, వన రెడు నేమెట్లు దెలియు♦వారము చెప్పుమా.

వ. అనిన యోగీంద్రుండు రాజేంద్రున కిట్లనియె నరేంద్రా యేమి కతంబున నాత్మ యేక ద్విత్రి చతుష్పాదంబును బహుపాదంబును నపాదంబు నగుచుఁ బురంజను దేహంబు ప్రకటంబు గావించు నాకతంబునం బురంజనుండు పురుషుం డయ్యె నట్టిపురుషునకు నామక్రియాగుణంబుల విజ్ఞాతుండు గాకుండుటం జేసి యవిజ్ఞాతశబ్దంబునం జెప్పంబడు సఖుం డీశ్వరుండు పురుషుండు సాకల్యంబునం జేసి దేహపరిగ్రహంబు సేయ నిచ్ఛించునప్పుడు నవద్వారకలితంబును ద్విహస్తచరణయుక్తంబును నయిన పురం బేది గల దది లెస్స యని తలంచి యప్పురం బను దేహంబునందుఁ బురుషుం డింద్రియంబులం జేసి యేబుద్ధి నధిష్ఠించి విషయంబుల ననుభవించు నహంకార మమకారంబులకు నేబుద్ధితత్త్వంబు గారణం బగు నట్టి బుద్ధి ప్రమదోత్తమ యనంబడు దానికి సఖులు జ్ఞాన కర్మ కారణంబు లైన యింద్రియగుణంబులు సఖీజనంబులు దదీయవృత్తులు పంచముఖోరగంబనం బంచవృత్తి యైన ప్రాణంబు నేకాదశమహాభటులన బృహద్బలుండు నుభయేంద్రియ నాయకుండు నైన మనంబు నవద్వార సమేతం బైన యప్పురంబు చుట్టివచ్చిన పాంచాల దేశంబులనం బంచవిషయంబులు నవద్వారంబు లన నక్షినాసికా కర్ణముఖగుదశిశ్నంబులు నందు నక్షినాసాస్యంబు లైదునుం బ్రాగ్ద్వార పురస్కృతంబులు దక్షిణోత్తరకర్ణంబులు దక్షిణోత్తర ద్వారంబులు గుదశిశ్నంబులు పశ్చిమద్వారంబులందు నేకస్థలనిర్మితంబు లైనఖద్యోతావిర్ముఖులు నేత్రంబులు విభ్రాజితం బన రూపంబు ద్యుమంతుండనం జక్షురింద్రియంబు నళినీ నాళినులన నాసికాద్వారంబులు సౌరభం బనం గంధంబు నవధూతయన ఘ్రాణేంద్రియంబు ముఖ్యయన నాస్యంబు విపణంబన వాక్కు రసజ్ఞుండన రసం బాపణంబన

వ్యవహారంబు బహూదనంబన వివిధాన్నంబు పితృహు వన దక్షిణ
కర్ణంబు దేవహు వన నుత్తరకర్ణంబు చండవేగుండనం గాలోప
లక్షకంబైన సంవత్సరంబు గంధర్వులన దివసంబులు గంధర్వీజనంబు
లన రాత్రులు పరివర్తనంబన నాయుర్హరణంబు గాలకన్యక యన
జర యవనేశ్వరుం డన మృత్యు వతసైనికు లన నాధివ్యాధులు
ప్రజ్వారుండనం బ్రాణిహింసయందు శీఘ్రవేగంబు గలిగి శీతోష్ణ
భేదంబులం ద్వివిధంబైన జ్వరంబు దక్షిణపాంచాలంబనంబితృలోక
ప్రాపకంబును బ్రవృత్తిరూపకంబునైన శాస్త్రం బుత్తరపాంచాలం
బన దేవలోకప్రాపకంబు నివృత్తిసంజ్ఞికంబు నయిన శాస్త్రంబు
శ్రుతధరుం డన శ్రోత్రంబు నాసురీనామకం బనం బశ్చాద్ద్వారం
బైనమేఢ్రంబు గ్రామకం బన సురతసుఖంబు దుర్మదుం డన
గుహ్యేంద్రియంబు నిరృతినామకంబైనపశ్చిమద్వారంబన గుదంబు
వైశసం బన నరకంబు లుబ్ధకుండనం బాయువు సంధు లన హస్త
పాదంబు లంతఃపురం బన హృదయంబు విషూచి యన మనం బని
వెండియు నిట్లనియె. 853

సీ. అనఘాత్మ వినుము జా ♦ యాత్మజా నను గుణా
త్మకంబగు మఱి బుద్ధి ♦ తత్త్వ మర్థి
వెలయ నే యే గతి ♦ వికృతి నే యంబడు
నే యే తెఱంగుల ♦ నింద్రియములు
వికృతిని బొందు నా ♦ విధమునఁ దద్గుణా
న్వితుఁడును వరుసఁ ద ♦ ద్వృత్తులకును
ఘనుఁడు నుపద్రష్ట ♦ యును దగు నాత్మయుఁ
దద్వృత్తులును బలా ♦ త్కారమునను

తే. ననుకరింపంగ నర్థిఁ జే ♦ యంగఁబడుట
ననవరత మాత్మమహిమిని ♦ ననుసరించు
టయు నెఱుఁగఁగఁ జెప్పి యిట్టు ల ♦ నియెను మఱియు
జనవరేణ్యునితోఁ యోగి ♦ సత్తముండు. 854

వ. మఱియు నరదం బన దేహంబు తురంగంబు లన నింద్రియంబు లీషా
ద్వయంబన సంవత్సరంబునుం దత్కృతవయస్సును జక్రద్వయం

బనం బుణ్యపాపకర్మద్వయంబు వేణుత్రయం బన గుణత్రయంబు పంచబంధురం బనం బంచప్రాణంబులు రశ్మియన మనంబు సారథి యన బుద్ధి రథికోపవేశస్థానం బన హృదయంబు కూబరంబు లన శోకమోహంబులు పంచప్రహరణంబులనం బంచేంద్రియార్థప్రక్షేపంబు పంచవిక్రమంబనం గర్మేంద్రియంబులు సప్తవరూథంబులన ధాతువులు హైమోపస్కరం బన రజోగుణంబత్తు యతూణీరంబన ననంతవాసనాహంకారోపాధి యేకాదశచమూపతి యన నేకాదశేంద్రియం బైన మనం బాసురీవృత్తి యనం బాహ్యావిక్రమంబు పంచేంద్రియంబులచేత మృగయా వినోదంబుచందంబున హింసాదులం జేసి విషయంబు లనుభవించుటయు మృగయాచరణంబీవిధంబుననుండ జీవుండు దేహంబున స్వప్నసుషుప్తిజాగ్రదవస్థల యందు నాధ్యాత్మికాధిదైవికాధిభౌతికంబు లైన బహువిధ దుఃఖంబులం జేసి క్లేశంబుల ననుభవించుచు నజ్ఞానావృతుండయి వర్షశతంబు నిర్గుణుం డయ్యును బ్రాణేంద్రియ మనోధర్మంబులం దనయందు నధ్యవసించి కామలవంబుల ధ్యానంబుసేయుచు నహంకార మమకారసహితంబుగాఁ గర్మాచరణంబు సేయుచుండు. 855

క. పురుషుఁడు నిజప్రకాశతఁ, బరగియు నలఘుఁడు బరుండు ♦ భగవంతుండున్
గురుఁడగు నయ్యాత్మను దగఁ, బరువడి నెఱుఁగంగ లేక ♦ ప్రకృతిగుణములన్.

క. విను మెప్పుడు దగులునప్పుడయి యొనరంగ గుణాభిమాని ♦ యును గర్మవశుం
డనఁదగు నా పురుషుఁడు దా, ఘనమగు త్రైగుణ్యకర్మ ♦ కలితుండగుచున్

సీ. ధృతి నొప్పుచున్న సా ♦ త్త్వికకర్మమునను బ
కాశభూయిష్ఠలో ♦ కముల భూరి
రాజసప్రకటక ♦ ర్మమున దుఃఖోదర్క
లోల క్రియాయాస ♦ లోకములను
గైకొని తామస ♦ కర్మంబునను దమ
శ్శోకమోహాత్కట ♦ లోకములను
బొందుచుఁ బుంస్త్రీన ♦ పుంసక మూర్తుల
దేవ తిర్యఙ్మర్త్య ♦ భావములను

తే. గలుగుఁ గర్మానుగుణములు ♦ గాఁగ జగతిఁ
బుట్టి చచ్చుచుఁ గ్రమ్మఱఁ ♦ బుట్టు చిట్టు
లివిరి కామాశయుండైన ♦ దేహి యెప్డు
నున్న తానత పదముల ♦ నొందుచుండు. 858

వ. అని మఱియు నిట్లనియె. 859

మ. ఎనయన్ క్షుత్పరిపీడఁ గుంది శునకం ♦ బింటింటికిం బోవఁ బూ
నినఁ ద [1]దైవికమైన దండహతిఁ గా♦సి కాక [2] చౌర్యాన్న మై
నను గానీ తగఁ బొందుచందమున నె♦న్నన్ దైవయోగంబు పెం
పున నీజీవుఁడు దాఁ బ్రియాప్రియములం ♦ బొందుంద్రిలోకంబులన్.

చ. గొనకొని యిట్టి దుఃఖముల ♦ కుం బ్రతికారము మానవేంద్ర క
ల్గిన విను తత్ప్రతిక్రియ [3]న♦కించనవృత్తి జనుండు మస్తకం
బున నిడుమోపు మూఁపునను♦బూనినఁ దద్భగదుఃఖ మాత్మఁ బా
యునిగతి జీవుఁడుం ద్రివిధ♦మై తగుదుఃఖముఁ బాయఁ డెన్నఁడున్.

క. ఘనదుఃఖహేతుకర్మం,బును దత్ప్రతికారకర్మ♦మును నివి మాయా
జననములగుటను బురుషుఁడు,గనుఁగలలోఁ దోఁచినట్టి♦కలచందమునన్.

వ. సవాసనోచ్ఛేదకంబు గాదని వెండియు నిట్లనియె. 863

సీ. నరనాథ వినుము స్వ♦ప్నంబుచందంబున
నజ్ఞానవిలసితం ♦ బగుటఁ జేసి
తివిరి మిథ్యాభూత ♦ దేహాదికమునకు
నరయ [4]నివర్తనా ♦ యాస మేటి
కని యంటివేనిని ♦ నర్థంబు లేకున్న
నర్థి సోపాధికం ♦ బైన మనము
వాంఛతో స్వప్నము ♦ వర్తింపఁ బురుషుని
బూని జాగ్రద్బోధ ♦ చే నుపాధి

తే. చెడక [5]స్వాప్నికసంసృతి ♦ విడువనట్లు
తత్త్వవిజ్ఞానమున నవి ♦ ద్యానివృత్తి

---

1 దైవికమైన దండహతి = దైవవశమునఁ గలిగిన కఱ్ఱదెబ్బ 2 చౌర్యాన్నము = దొంగతనమున అన్నము 3 అకించనవృత్తి = ఏమియులేనివ్యాపారము 4 నివర్తనము = మరలుబాటు 5 స్వాప్నిక = స్వప్నసంబంధమగు.

దారదేహాదికనివృత్తి ♦ దగుల కున్నఁ
దివుట సంసృతి దాని వర్తింప కుండు. 864

చ. ఘనపురుషార్థభూత మనఁ♦గాఁ దగునాత్మకు నేనిమిత్తమై
యొనర ననర్థహేతు వన ♦ నూల్కొనుసంసృతి సంభవించు న
ట్లనయముఁ దన్నిమిత్తహరి ♦ హారక మర్థి జగద్గురుండు నాఁ
దనరినవాసుదేవపద♦తామరసస్ఫుటభక్తి యారయన్. 865

క. పూనినతద్భక్తి సమీ,చీనగతిం దెలియ ననఘ ♦ చిరవైరాగ్య
జ్ఞానజనకమగుభక్తిని,దానము గోవిందవరక♦థాశ్రయమ యగున్.

వ. కావున నది తత్కథాకర్ణనగాననిరతుండు విశ్వాసయుక్తుండు
నైనవానికి సంభవించు మఱియును. 867

క. ధర సాధులు విమలాంతః,కరణులు భగవద్గుణాను♦కథనశ్రవణ
స్ఫురితస్వాంతులు ననఘులు,[1]వరధిషణులునైనభాగ♦వతజనులసభన్.

క. సరసోదారమహాత్మ్య[2]ము ఖరితములగు మధువిరోధి♦కమనీయగుణో
త్కరసురుచిర చరితామృత, పరిపూరితవాహినులను♦బరమప్రీతిన్.

క. మనమలరఁగ శ్రోత్రాంజలు,లను బానము సేయుపుణ్యు♦లకు[3]క్షుత్తృష్ణా
ఘనభయశోకవిమోహము,లనయంబును సోఁకకుండు♦నవనీనాథా.

వ. కావున నిట్టి భాగవతసహవాసంబు లేక తనంతన భగవద్భాగవత
గుణాభివర్ణనకథానుచింతనాదులయందుం బ్రవర్తించిన నాలస్యాది
దోషంబులొందియీజీవలోకంబుసహజక్షుధాదికంబున నుపద్రుతం
బై సర్వేశ్వరకథామృతవాహినియందు రతిం జేయ దిది నిశ్చితం
బని మఱియు నిట్లనియె. 871

సీ. పద్మసంభవుఁడును ♦ భవుఁడును మనుకుల
సమితి దక్షాదిప్ర ♦ జాపతులును
నైష్ఠికులైన స ♦ నకముఖ్యమునులుఁ బు
లస్త్యుండు భృగువుఁ బు ♦ లహుఁడుఁ గ్రతువు
నత్రి మరీచియు ♦ నంగిరసుండు [4] న
రుంధతీవిభుఁడును ♦ ఋషిమెఱయ

1 వరధిషణులు = గొప్పబుద్ధిగలవారు. 2 ముఖరితము = ధ్వనిచేయునది
3 క్షుత్తృష్ణ = ఆఁకలిదప్పికలు. 4 అరుంధతీవిభుఁడు = వసిష్ఠుఁడు.

బహుపుణ్యు లేకడ ♦ వలఁ గాఁగ బ్రహ్మా
దులును నందఱును వా ♦ రుకులకుఁ దగను

తే. ఎనయ నీశ్వరులై యుండి ♦ యును సమగ్ర
మతిఁ దపోయోగవిద్యా స ♦ మాధి వరవి
చారులై యుండియును సర్వ ♦ సాక్షి యైన
యీశ్వరుని వెదకియుఁ గాన ♦ రిద్ధచరిత. 872

వ. అది యెట్లంటేని. 873

మ. ఘనవిస్తార మపార మద్వయ మసం ♦ గా నొప్పు వేదంబు దా
మనువర్తించుచు మంత్రయుక్తి వివిధంబై ♦ సర్వ దేవాఖ్యశో
భనసామర్థ్యము చేత నింద్రముఖరూ ♦ పం బిష్టదైవంబుగాఁ
గని వేడ్కన్ భజియించువారలు గనం ♦ గా నేర్తురే యీశ్వరున్.

క. విను మాత్మభావితుండన, నెనసిన భగవంతుఁ డెప్పుడెవ్వనిఁ గరుణం
దనరుచు ననుగ్రహించును, మనుజేశ్వర యపుడు వాఁడు ♦ మహితాత్ముఁడై.

క. ధీరత నీలోకవ్యవహారంబును వైదికంబు ♦ ననఁ దగు కర్మా
చారములందు వినిష్ఠిత, మైమాఘిఁ దనర్చు బుద్ధి ♦ నర్థిన్ విడుచున్. 876

సీ. కావున రాజేంద్ర ♦ నీవును బరమార్థ
రూపంబు లగుచుఁ బ్ర ♦ రోచనమాన
ములును గర్ణప్రియం ♦ బులు నగు నస్పష్ట
వస్తువులను దగ ♦ వఱలు కర్మ
ములయందుఁ బురుషార్థ ♦ బుద్ధి గావింపకు
మతిఘనస్వాంతులై ♦ నట్టివారు
పరఁగు జనార్దన ♦ ప్రతిపాదకంబైన
[1]శ్రుతి గర్మపర మని ♦ చూపుచుందు

తే. వారు వేదజ్ఞు లనఁ దగు ♦ వారు గారు
రూఢి మతి వారు నిత్యస్వ ♦ రూపభూత
మైనయీయాత్మతత్త్వంబు ♦ గలదు వేద
కలితతాత్పర్యమని యాత్మఁ ♦ దెలియలేరు. 877

1 శ్రుతికర్మపరము = వేదము కర్మములఁ బ్రతిపాదించునది.

వ. కావునం [1]బ్రాగగ్రంబు లైనదర్భలచేత సకలక్షితిమండ[2]లాస్తరణంబు గావించియహంకారయుక్తుండవును వినీతుండవునై పెక్కు పశువులం జంపనేకాని కర్మస్వరూపంబును విద్యాస్వరూపంబును నెఱుంగవా కర్మవిద్యాస్వరూపంబు లెట్టి వనిన [3]సర్వేశ్వరపరితోషకం బేది యదియ కర్మం బా సర్వేశ్వరునియందు నేమిట మతి సంభవించు నదియ విద్య యతండే దేహులకు నాత్మయు నీశ్వరుండు నగుచుండుం గావునం బురుషులకు క్షేమకరంబయిన యాశ్రయంబు దత్పాదమూలంబ యతండు ప్రియతముండును సేవ్యమానుండును నగుచుండ నణుమాత్రం బయిన దుఃఖంబు లే దట్టి యా భగవత్స్వరూపం బెవ్వం డెఱుంగును వాఁడు విద్వాంసుండును గురుండును హరియు నని చెప్పి వెండియు నిట్లనియె. 878

క. అవనీశ యీవిధంబున, భవదీయప్రశ్న మిట్లు ♦ [4]పరిహృత మయ్యెం
దవిలి యిఁక నొక్క [5]గోప్యము, వివరించెదఁ జిత్తగింపు ♦ విమలచరిత్రా.

సీ. లలి [6]సుమనోవాటి ♦ కలయందు నల్పప్ర
సూనమరందగం ♦ ధానుమోద
సంచారియును మృగీ ♦ సహితముఁ దన్నివే
శితచిత్తమును [7]మధు ♦ వ్రతనినాద
మేదురశ్రవణాను ♦ మోదితమును బురో
భాగచరన్నిజ ♦ ప్రాణహారి
దీపితవృకగణా ♦ ధిష్ఠితమును [8]లుబ్ధ
క క్రూరఘనసాయ ♦ కప్రభిన్న
తే. పృష్ఠభాగంబునై తగ ♦ నెదను మృత్యు
భీతి వాటిల్ల నొంపఁద ♦ ప్పింప వెరవు
గాన కడవిఁ జరించు మృ ♦ గంబుపగిది
భూవరోత్తమ వినవయ్య ♦ పురుషుఁ డెపుడు. 880

1 ప్రాగగ్రము = తూర్పునకుఁ గొనలుగలది; 2 ఆస్తరణము = పఱచుట. 3 సర్వేశ్వర పరితోషకము = భగవంతునకుఁ దృప్తికల్గించునది. 4 పరిహృతము = తొలంగింపఁబడినది. 5 గోప్యము = రహస్యము. 6 సుమనోవాటిక = పుష్పవనము. 7 మధువ్రత = తుమ్మెదల. 8 లుబ్ధక...భాగము = వేఁటకాని వాఁడిగల మేటిబాణములచే చీల్పఁబడిన వెనుకభాగముగలది.

వ. అంగనానివాసంబులయందు క్షుద్రతమం బగు కామ్యకర్మపరిపాకజని
తం బైన జిహ్వోపస్థాది కామజనిత సుఖలేశంబుల నన్వేషించుచుఁ
గామినీయుక్తుండును దన్నివేశితమానసుండును నతిమనోహరవనితా
జనాలాప శ్రవణతత్పర చిత్తుండును బ్రత్యక్షంబున నాయుర్హరణ
కారణాహోరాత్రాదికాలవిశేషగణనాపరుండును గాక పరోక్షం
బునం [1]కృతాంతశర నిర్భిన్నగాత్రుండును నగుచు నీజీవుండు విహ
రించుచుండుం గావున నీవు నీజీవుని మృగచేష్టితునింగా విచారించి
శ్రోత్రాదులం దున్న శబ్దాదులంబోలె బాహ్యవృత్తు లగు శ్రౌత
స్మార్తాదిరూప కర్మంబులను హృదయంబునందు నియమించుచు
నసజ్జనయూథవార్తాసహితం బైన గృహాశ్రమంబు విడువుము సకల
జీవాశ్రయుం డైన యీశ్వరుని భజియింపు మిట్లు [2]సర్వతోవిరక్తుం
డవు గమ్మని నారదుండు పలికినం బ్రాచీనబర్హి యిట్లనియె. 881

క. మునివర భగవంతుఁడవు, ననుపమవిజ్ఞాననిధివి ♦ ననఁదగు నీచే
తనువివరింపంగాఁ దగి, యొనసిన యీయాత్మతత్త్వ ♦ మిట నాచేతన్.

వ. శ్రుతంబును విచారితంబును నయ్యెఁ గర్మనిష్ఠులగు నుపాధ్యాయు
లైనవార లీయాత్మతత్త్వంబు నెఱుంగ రెఱింగి రేని నుపదేశింపరు
గావునఁ దత్కృతం బయిన మహాసంశయంబు నీచేత నివృత్తం బయ్యె
నని వెండియు నిట్లనియె. 883

సీ. అనఘాత్మ యేమిటి ♦ యందు నీయింద్రియ
వృత్తులు దగఁ బ్రవ ♦ ర్తింపకుండు
టను జేసి బుధులైన ♦ ఘనముగ మోహింతు
రట్టియర్థమునందు ♦ నాత్మసంశ
యము గల్గుచున్నది ♦ యది యెట్టి దనినను
బురుషుఁ జేయే దేహ ♦ మునను జేసి
కర్మముల్ సేసి త ♦ త్కాయంబు నీలోక
మందునే విడిచి తా ♦ నన్యదేహ

1 కృతాంతశరనిర్భిన్నగాత్రుఁడు = యముని బాణములఁ జీల్పఁబడిన మేనుగలవాఁడు.
2 సర్వతోవిరక్తుఁడు = అంతటను విరాగము గలవాఁడు.

తే. మర్త్యతో ఘటియించి లో ♦ కాంతరమును
బొంది తత్కర్మఫలమును ♦ బొందు ననుచుఁ
బ్రకటముగ వేదవేత్తలు ♦ వలుకుచుందు
రన్న నది యెట్లు విన నుప ♦ పన్న మగును. 884

వ. అదియునుం గాక యాచరితం బైనకర్మంబు తత్క్షణంబ వినష్టం బగుటం జేసి దేహాంతరంబున లోకాంతరగామి యైన ఫలం బెట్లు సంభవించు ననిన బ్రాచీనబర్హికి నారదుం డిట్లనియె నరేంద్రా స్వప్నావస్థయందు లింగశరీరాధిష్ఠాత యైన జీవుండు జాగ్రద్దేహాభిమానంబు విడిచి తాదృశంబు కాని యతాదృశంబు కాని యైన శరీరాంతరంబు నొంది మనంబునందు సంస్కారరూపంబున నాహితం బైన కర్మంబు ననుభవించుచందంబునం బురుషుం డేలింగశరీరంబునం జేసి కర్మంబు నాచరించు నాలింగశరీరంబున లోకాంతరంబున దేహవిభేదంబు నొందక తత్ఫలం బనుభవించు నదియునుం గాక దాన ప్రతిగ్రహాదులయందు స్థూలదేహంబునకుం గర్తృత్వంబు గలదంటి వేని నహంకారమమకారయుక్తుం డయిన పురుషుండు మనంబునం జేసి యే యే దేహంబు పరిగ్రహించు నాయాదేహంబున సిద్ధం బైన కర్మంబు నా జీవుం డనుభవించు నట్లు గాకున్నఁ గర్మంబు [1]పునర్భవకారణం బగుట యుపపన్నంబు గాకుండుఁ గావున మనఃప్రధానం బైన లింగశరీరంబునకే కర్తృత్వం [2]బుపపన్నం బగు నని వెండియు నిట్లనియె. 885

క. క్షితినుభయేంద్రియకర్మస్థితులనుభవమందఁబడిన ♦ చిత్తము పగిదిన్
ధృతిఁ జిత్తవృత్తులనుల, క్షితమగుఁ దత్పూర్వదేహ ♦ కృతకర్మంబుల్.

వ. అది యెట్లనిన నీ దేహంబునం జేసి యేరూపంబు నేప్రకారంబున నెప్పు డెచ్చట నగు నది [3]యననుభూతంబును నదృష్టంబును నశ్రుతంబును నై యుండునట్టిది యొకానొకకాలంబున వాసనాశ్రయుండయిన పురుషునకుఁ దదనుభవాదియుక్తం బగు పూర్వదేహంబున ననుభూతంబును దృష్టంబును శ్రుతంబును నని విశ్వసింపుమీ మనం

1 పునర్భవకారణము = తిరుగ జన్మింపహేతువు. 2 ఉపపన్నము = సమకూరుట. 3 అననుభూతము = అనుభవింపఁబడనిది.

బున ననుభూతార్థంబు గోచరింపఁ జాల దీమనంబె పురుషులకు శుభాశుభనిమిత్తంబులైన పూర్వాపరదేహంబులం బ్రకాశింపం జేయుచుండు నీమనంబునందు నదృష్టంబు నశ్రుతంబు నైనయర్థంబు స్వప్నాదికమందుం దోఁచు నంటివేని నది దేశకాలక్రియాశ్రయం బని తలంపందగు సమస్తవిషయంబులుఁ గ్రమానురోధంబున మనం బునం జేసి భోగ్యంబు లగునని మఱియు నిట్లనియె. 887

చ. సుమహితశుద్ధసత్త్వగుణ ♦ శోభితమున్ గన సీరుహోదరో
త్తమగుణచింతనాపరము ♦ ధన్యము నైనమనంబునందు భూ
రమణ సుధాంశునందు [1]నుప♦రాగమునన్ దివిఁ దోఁచు రాహుచం
దమునను గోచరింబగు ను♦దారత నీ యఖిలప్రపంచమున్.

వ. అని వెండియు నిట్లనియె లింగదేహమునకుఁ గర్తృత్వభోక్తృత్వం బులు స్థూలదేహద్వారకంబు లగుటం జేసి స్థూలదేహవినాశంబు గలుగన్ జీవునకుఁ [2] కర్తృత్వభోక్తృత్వంబులు లేకుండుటం జేసి ముక్తిగలుగునంటివేని నీ స్థూలదేహసంబంధంబు జీవునియందుబుద్ధి మనోమోహార్థ గుణవ్యూహరూపాదిలింగ శరీరభంగపర్యంతంబు గలుగుచుండును. సుషుప్తిమూర్ఛాదులయందు నిష్టవియోగాది దుఃఖమందు నహంకారంబు గలిగియుండు నది యింద్రియోపహతిం జేసి యమావాస్యయందలి చంద్రుండునుంబోలెఁ దరుణపురుషు నకు గర్భబాల్యావస్థలయందు నింద్రియపౌష్కల్యంబు లేకుండుటం జేసి యేకాదశేంద్రియస్ఫురణసమర్థంబైన యహంకారంబు గర్భా దులకుఁ బ్రకాశింపనిచందంబునం దోఁపకుండుఁగావున స్థూలదేహ విచ్ఛేదకంబు లేకుండుటం జేసి వస్తుభూతార్థంబు లేకున్న నీసంసా రంబు విషయంబులయం దాసక్తుండగు జీవునకు [4] స్వాప్నికానర్థా గమనంబునుంబోలె నివర్తింప దీతీరునఁ బంచతన్మాత్రాత్మకంబును త్రిగుణాత్మకంబును షోడశవికారాత్మవిస్తృతంబును నయిన లింగ శరీరంబు నధిష్ఠించి చేతనాయుక్తుండైన జీవుండని చెప్పంబడు మఱియును. 889

1 ఉపరాగము = గ్రహణము. 2 కర్తృత్వభోక్తృత్వములు = పనిచేయుట అనుభవించుట. 3 శరీరభంగపర్యంతము = మరణించువఱకు. 4 స్వాప్నికానర్థాగమనంబు = కలయందలి కష్టములరాకడలు.

సీ. తివిరి యప్పురుషుండు ♦ దేహంబునను జేసి
యనయంబుఁ బెక్కు దే ♦ హాంతరముల
నంగీకరించుచు ♦ నవి విసర్జించుచు
సుఖదుఃఖభయ మోహ ♦ శోకములను
బొలుపొందు తద్దేహ ♦ ములనె పొందుచు నుండు
నదియెట్టులన్నను ♦ నగ్రభాగ
తృణమూఁది మఱిపూర్వ ♦ తృణపరిత్యాగంబు
గావించు [1]తృణజలూ ♦ కయును బోలె

ఆ. జీవుఁడవనిఁ గొంత ♦ జీవించి [2]మ్రియమాణుఁ
డగుచు నొందుదేహ ♦ మర్థిఁ జెంది
తానిపూర్వమైన ♦ కాయంబు విడువఁడు
గాన మనమె జన్మ ♦ కారణంబు. 890

తరలము. నరవరోత్తమ యట్లుగాన మ ♦ నంబె జీవుల కెల్ల నం
సరణకారణ మట్టికర్మవ ♦ శంబునన్ సకలేంద్రియా
చరణుఁడౌట నవిద్య గల్గును ♦ సంతతంబు నవిద్యచేఁ
బరఁగుటన్ బహుదేహకర్మని ♦ బంధముల్ గలుగుం జుమీ. 891

చ. వినుమదిగాన భూవర య♦విద్య లయించుటకై రమాపతిన్
ఘనజననస్థితిప్రళయ ♦ కారణభూతునిఁ బద్మపత్త్రలో
చనుఁ బరమేశు నీశ్వరుని ♦ సర్వజగంబుఁ దదాత్మకంబుగాఁ
గనుఁగొనుచుం దదీయపద ♦ కంజములర్థి భజింపుమెప్పుడున్. 892

క. అనియీగతిభగవంతుం,డనఘుఁడు భాగవతముఖ్యుఁ♦డగు నారదుఁడా
ఘనునకు జీవేశ్వరగతి,ఘనకృప నెఱిఁగించి సిద్ధ♦గతిఁజనినయెడన్. 893

సీ. రాజర్షి యైనట్టి ♦ ప్రాచీన బర్హి దా
దగఁ బ్రజాపాలనా ♦ ర్థంబు సుతుల
ధరకు నియోగించి ♦ తపము చేయుటకునై
కపిలాశ్రమంబున ♦ కపుడావోయి

1 తృణజలూక = గడ్డియందలి జలగవంటి పురుగు. 2 మ్రియమాణుఁడు = మరణించుచున్నవాఁడు.

యచ్చ్యుతనియతి నే ♦ కాగ్రచిత్తుండును
[1] ముక్తసంగుండును ♦ భూరిధైర్య
యుక్తుండునగుచును ♦ భక్తియోగంబున
ననఘ గోవిందప ♦ దారవింద
తే. చింతనామృతపాన వి ♦ శేషచిత్తుఁ
డగుచు విధిరుద్రముఖ్యుల ♦ కందరాని
యవ్యయానందమయపద ♦ మందె నప్పు
డనుచు మైత్రేయముని విదు ♦ రునకుఁ జెప్పె. 894
వ. వెండియు నిట్లనియె. నిట్లుముకుందయశంబునం జేసి భువనపావనంబు
మనశ్శుద్ధికరంబు సర్వోత్కృష్టఫలప్రదాయకంబు దేవర్షివర్యముఖ
వి [2]నిస్సృతంబునైన యీ యధ్యాత్మపారోక్ష్యంబు నెవ్వండు పఠి
యించు నెవ్వండు విను నట్టివారు లింగశరీరవిధూననంబు గావించి
ముక్తసమస్తబంధులయి విదేహకైవల్యంబునొంది సంసారమునందుఁ
బరిభ్రమింపరనిన మైత్రేయునకు విదురుం డిట్లనియె. 895
క. మునినాథ ప్రచేతసు లా, ఘనమగురుద్రోపదిష్ట ♦ కమలోదరకీ
ర్తనమున నేగతిఁబొందిరి,వనజాక్షుఁడు సంతసింప ♦ వారన ఖాత్మా. 896

—♦ ప్రచేతసులతపంబునకు భగవంతుండు మెచ్చి వరంబులిచ్చుట ♦—

తే. కడఁగి మఱి వారు యాదృచ్ఛి ♦ కతను జేసి
హరికి నిత్యప్రియుండగు ♦ హరునిఁగాంచి
యతనివలని యనుగ్రహ ♦ మంది మోక్ష
మందిరని చెప్పి తది నిశ్చ ♦ యంబు మఱియు. 897
క. హరిదర్శన పూర్వం బిహ,పరలోకములందునాన్ఫ ♦ పాలతనయు లం
దిరియేఫలములనందఱు,నిరతి నెఱింగింపుమనము ♦ నివరుఁడువలికెన్.
క. వినుజనకాదేశమునుద,మునఁదాల్చి నృపాత్మజులుస ♦ ముద్రోదరమం
దనుపమజపయజ్ఞంబున,నొనరఁదపంబూనిముదము ♦ నొందుచునుండన్.
క. పదివేలేఁడులు నిష్ఠను,వదలక తప మాచరింప ♦ వారల కర్థిక
సదయాంతరంగుఁడభయ,ప్రదుఁడుసనాతనుఁడునైన ♦ పద్మోదరుఁడున్.

1 ముక్తసంగుఁడు = సంబంధములు వదలినవాఁడు. 2 నిస్సృతము = బయలువెడలినది.

క. అనుపమశాంతము లగునిజ, తనురశ్ములచే నృపాల ♦ తనయతపోవే
దనలు శమింపఁగఁ జేయుచు, ననయముఁ బ్రత్యక్షమయ్యె ♦ నచ్యుతుఁ డంతన్

సీ. ఘనమేరుశృంగసం ♦ గతనీలమేఘంబు
నెఱి గరుడస్కంధ ♦ నివసితుండుఁ
గమనీయనిజదేహ ♦ కాంతివిపాటితా
భీలాఖిలా[1]శాంత ♦ రాళతముఁడు
సుమహితాష్టాయుధ ♦ [2]సుమనోమునీశ్వర
సేవకపరిజన ♦ సేవితుండు
మండితకాంచన ♦ కుండలరుచిరోప
లాలిత వదనక ♦ పోలతలుఁడు

తే. చారునవరత్న[3]దివ్యకో ♦ టీరధరుఁడు
కౌస్తుభ ప్రవిలంబమం ♦ గళగళుండు
లలిత పీతాంబర ప్రభా ♦ లంకృతుండు
హారకేయూరవలయమం ♦ జీరయుతుఁడు. 902

క. లలితాయతాష్టభుజమం, డలమధ్యస్ఫురితరుచివి ♦ డంబిత లక్ష్మీ
లలనాకాంతిస్పర్ధా, కలితలసద్వైజయంతి ♦ కాశోభితుఁడున్. 903

క. సురగరుడయక్షకిన్నర, నిరుపమ జేగీయమాన ♦ నిఖిలాశా సం
భరితయశోమహనీయ, స్ఫురణుం డగునప్పురాణ ♦ పురుషుం డెలమిన్.

క. కరుణావలోకనంబుల, నిర వొంద నృపాలసుతుల ♦ నీక్షించి రమా
వరుఁ డంబుదగంభీరమ, ధురభాషలఁ బలికెఁ బ్రియము ♦ దూఁకొనుచుండన్.

తే. తాపసోత్తము లగు ప్రచే ♦ తసులు! వేడ్క
వినుఁడు మీరలు సౌహార్ద ♦ మున నభిన్న
ధర్ము లగుట భవత్సౌహృ ♦ దమున కేను
జాలఁ బరితోష మందితి ♦ సమత నేఁడు. 906

క. అనయమును మీ మనోరథ
మొనరింతు నెఱుంగఁ బలుకుఁ ♦ డుత్తము లగుమి
మ్మనుదినము నెవ్వఁడు సుఖశ
యనుఁడై మదిలోనఁ దలఁచు ♦ నా నరుఁ డెప్పుడున్. 907

1 అంతరాళము = మధ్యభాగము. 2 సుమనః = దేవతలు. 3 దివ్యకోటీర = దేవసంబంధమగు కిరీటము.

క. భ్రాతృజన[1]సౌహృదంబును, భూతదయాగుణము విమల ♦ బుద్ధియు సుజన
ప్రీతియుఁ గల్గి సుఖించును, పీతసమస్తాఘుఁ డగుచు ♦ విశ్వములోనన్.

వ. మఱియు రుద్రగీతం బయిన మదీయ స్తవం బెవ్వ రనుదినంబును స్తోత్రంబు సేయుదురు వారల కభిమతవరంబులు శోభనకరం బగు ప్రజ్ఞయు నిత్తు మీరలు ముదన్వితులై జనకాదేశం బంగీకరించుటం జేసి మీ కీర్తి లోకంబుల విస్తరిల్లు మీకు ననూనబ్రహ్మగుణుండు నాత్మసంతతిం జేసి లోకత్రయ పరిపూర్ణగుణాకరుండు నైన పుత్రుండు సంభవింపంగలండు నకంఠు మహాముని తపోవినాశార్థంబుగా నింద్రుని చేతఁ బ్రేరిత యగు ప్రమ్లోచ యనునప్సరస గర్భంబు దాల్చి యమ్మునీంద్రుని వీడ్కొని దివంబునకుం జనుసమయంబునం బ్రసూతయై తత్పుత్రిని వృక్షంబులందుఁ బెట్టి చనినం. 909

సీ. ఆ శిశు వపుడు పే ♦ రాఁకలి చేఁ గుంది
వా విచ్చి బిట్టు వా ♦ పోవుచుండ
నాలించి యటకు రా ♦ జైన సోముఁడు వచ్చి
వలనొప్ప నవసుధా ♦ వర్షియైన
యాత్మీయ[2]తర్జని ♦ నర్థిఁ బానమ్ము సే
యింపంగఁ బెరిఁగి య ♦ య్యిందువదనఁ
గన్య [3]వరారోహఁ ♦ గడఁక మారిష యను
చెలువఁ బుణ్యుండు ప్రా ♦ చీనబర్హి

తే. యన్నృపుని చేఁ బ్రజా విస ♦ర్గావసరము
నందు వేడ్కఁ దదాదిష్టు ♦ లైన మీర
లందఱును నెయ్యమున వివా ♦ హంబు గండ
యని సరోరుహనయనుఁ డి ♦ ట్లని యె మఱియు. 910

వ. అనఘాత్ములారా యభిన్నధర్మశీలురయిన మీకు నందఱకు నా సుమధ్యయైన కన్య యభిన్నధర్మశీలయు భవదర్పితాశయయునయిన భార్యయగు మీర లప్రతిహత తేజస్కులై దివ్యవర్షసహస్రంబులు భౌమదివ్యభోగంబులు మదనుగ్రహులై యనుభవించెద రంత నా

1 సౌహృదము = స్నేహము. 2 తర్జని = చూపుడువ్రేలు.
3 వరారోహ = స్త్రీ.

యందుల భక్తిం జేసి నిర్మలాంతఃకరణులై యాభోగంబులు[1] నిరయ
ప్రాయంబులుగాఁ దలంచి మదీయస్థానంబు నొందెదరని వెండియు
నిట్లనియె. 911

చ. అరయ గృహస్థులయ్యు ను మ ♦ దర్పితకర్ములు నస్మదీయ సుం
దరచరితామృత శ్రవణ ♦ తత్పరమానసయాతయాములున్
సరసగుణాఢ్యులై తనరు ♦ సాధుల కీగృహముల్ దలంప దు
ష్కరభవబంధహేతువులు ♦ గావు నృపాత్మజులార యెన్నఁడున్.

వ. అది యెట్లంటి రేని. 913

చ. అనుపమబ్రహ్మవాదులగు ♦ నంచితయోగిజనానుగీయమా
న నిజకథాసముత్సుకుఁ డ ♦ నం దగు నేను మదీయులం దనూ
తనముగ నుందుఁ గావున ను ♦ దారత వారికి నీగృహావళుల్
ఘనభవబంధహేతువులు ♦ గా విది యంతయు నిక్కమారయన్.

క. సరసుఁడ నగుననుఁ బొందిన
పురుషులు ఘనశోకమోహ ♦ మోదంబులఁ బొం
దరు గావున నెనయఁగను ద్రి
పురుషాధీశ్వరుఁడ బ్రహ్మ ♦ భూతుఁడ నగుదున్. 915

వ. అని యిట్లు పలుకుచున్న పురుషార్థభాజనుండగు జనార్దను దర్శించి
తద్దర్శన విధ్వస్తరజస్తమోగుణులయిన ప్రచేతసులు. 916

చ. కరసరసీరుహంబు లెస ♦ కం బెసఁగ౯ ముకుళించి గద్గద
స్వరములఁ జేసి యిట్లనిరి ♦ సర్వశరణ్యు ననణ్యు నిందిరా
వరు నజితున్ గుణాఢ్యు నన ♦ వద్యచరిత్రుఁ బవిత్రు నచ్యుతుం
బరుఁ బరమేశు నీశు భవ ♦ బంధవిమోచనుఁ బద్మలోచనున్. 917

సీ. కేశవ సంతత ♦ క్లేశనాశకుఁడవు
గురుసన్మనోవాగ ♦ గోచరుఁడవు
సిద్ధ మనోరథ ♦ హేతుభూతోదార
గుణనాముఁడవు స[2]త్త్వ ♦ గుణుఁడ వఖిల
విశ్వోద్భవస్థితి ♦ విలయార్థధృతనిత్య
విఫులమాయాగుణ ♦ విగ్రహుఁడవు

1 నిరయప్రాయము = నరకసమానము 2 విధ్వస్తరజస్తమోగుణులు = నాశనము చేయఁబడిన రజస్సు తమస్సు అను గుణములు గలవారు.

మహితాఖిలేంద్రియ ♦ మార్గ [1]నిరధిగత
మార్గుఁడ వతిశాంత ♦ మానసుఁడవు
తే. తవిలి సంసారహారి మే ♦ ధస్కుఁడవును
దేవదేవుఁడవును వాసు ♦ దేవుఁడవును
సర్వభూతనివాసివి ♦ సర్వసాక్షి
వైన నీకు నమస్కార ♦ మయ్య కృష్ణ. 918
వ. మఱియును. 919
ఉ. తోయరుహోదరాయ భవ♦దుఃఖహరాయ నమోనమః పరే
శాయ [2]సరోజకేసరపి ♦ శఙ్గవినిర్మలదివ్య [3]భర్మవ
స్త్రాయ పయోజసన్నిభప ♦ దాయ సరోరుహమాలికాయ కృ
ష్ణాయ పరాపరాయ సుగు ♦ ణాయ సురారిహరాయ వేధసే. 920
వ. అనివినుతించి. 921
చ. కమలదళాక్ష దుఃఖలయ ♦ కారణమై తగుతావకీనరూ
పము ననివార్యదుర్భరవి ♦ పద్దశ దుఃఖమునొందు మాకు నీ
సుమహితసత్కృపాగరిమఁ ♦ జూపుటకంటె ననుగ్రహంబు లో
కమునఁదలంప నొండొకటి ♦ గల్గునె భక్తఫలప్రదాయకా. 922
ఉ. భూరి [4]వివేకితావహవి ♦ భూతిసమేత మహాత్మ దీనర
క్షారతినొప్పు నీవు చిర♦కాలమునన్ సుఖవృత్తి పేరు మా
వార లటంచు బుద్ధి నన ♦ వద్య తలంచిన యంతమాత్ర స
త్కారమె చాలు నట్లగుట ♦ గా కిటు సన్నిధి వైతి పీశ్వరా. 923
చ. అరయఁగ క్షుద్రభూతహృద ♦ యంబులయందుల నంతరాత్మ వై
తిరముగ నుండునీవు భవ ♦ దీయ పదాంబుకుహద్వయార్చనా
పరమతులైన మాకును శు ♦ భప్రదభూరిమనోరథంబు లీ
వరుదుగ నీవె భక్తహృద ♦ య [5]ప్రమదప్రదము క్తినాయకా. 924
సీ. అయినను విను సరో ♦ జాయతలోచన
వరమోక్షమార్గప్ర ♦ వర్తకుఁడవుఁ

1 నిరధిగత = పొందరాని. 2 సరోజకేసర = పద్మకింజల్కములవలె.
3 భర్మవస్త్ర = బంగారువస్త్రము. 4 వివేకితావహ = జ్ఞానదాయకమగు.
5 ప్రమదప్రద = సంతోషమునొసంగువాఁడా.

బురుషార్థభూతవి ♦ స్త్రరుఁడవు నగునీవు
దగిలి వ్రిసన్నుఁడ ♦ వగుటమాకు
నర్థి మనోభీష్ట ♦ మైనవరం బయ్యె
నైనను నాథప ♦ రావరుండ
వైన నిన్నొకవరం ♦ బర్థింతు మనినను
భువిఁ దావకీనవి ♦ భూతు లెన్న
తే. నంత మెఱుఁగంగ రామి న ♦ నంతుఁ డనుచుఁ
బలుకుదురు నిన్ను నది గాన ♦ పరమపురుష
యేవరం బని కోరుదు ♦ మేముదప్పి
గొన్న బాలకుఁ డబ్ధినీ ♦ ళ్లెన్ని గ్రోలు. 925
వ. అదియునుం గాక. 926
ఉ. పూని భవత్పదాంబురుహ ♦ మూలనివాసుల మైనమేము మే
ధానిధి నీవిలోకనముఁ ♦ దక్కఁగ నన్య మెఱుంగ నేర్తుమే
మానితపారిజాతకుసు ♦ మ[1]స్ఫుటనవ్యమరందలుబ్ధశో
భానయశాలి యైనమధు♦పంబు భజించునె యన్యపుష్పముల్.927
చ. హరి భవదీయమాయ నన ♦ యంబును జెందిననేము నిచ్చలుం
గర మనురక్తి నేది తుద ♦ గా భవకర్మములమై ధరిత్రిపైఁ
దిరుగుదు మంతదాఁక భవ ♦దీయజనంబులతోడి సంగతిన్
గురుమతి జన్మజన్మముల ♦ కున్ సమకూరఁగఁ జేయుమాధవా.928
మ. కమలాధీశ్వర తావకీనవరభ ♦ క్తవ్రాత[2]సంసర్గలే
శముతోడన్ సరిగాఁ దలంప మెలమిన్ ♦ స్వర్గా[3]పవర్గాదిసౌ
ఖ్యము లన్నన్ వినుమానుషంబు లగునీ ♦ కామంబులం జెప్పనే
ల మునీంద్రస్తుతపాదపద్మ సుజనా ♦ లాపానుమోదాత్మకా. 929
వ. మఱియు భగవద్భక్తసంగంబులయందుఁ దృష్ణాప్రశమనంబులైన మృష్ట కథలు చెప్పఁబడుట చేత భూతంబుల యందు వైరంబును నుద్వేగంబును లేకుండునని. 930

1 స్ఫుటనవ్యమరందలుబ్ధ = స్పష్టమగు క్రొత్తతేనెయందు ఆసక్తిగల.
2 సంసర్గలేశము = కలయికయొక్క స్వల్పము. 3 అపవర్గము = మోక్షము.

చ. వనముల ముక్తసంగులగు ♦ వారు నుతింపఁ దనర్తు వీవు గా
వున నిలఁ బుణ్యతీర్థములఁ ♦ బోలఁ బవిత్రము సేయఁబూని య
ర్థిని బదచారులై ధరఁ జ ♦ రించుభవత్పదభక్తసంగమం
బనుపమభూరిసంసృతిభ ♦ యస్థనిబుద్ధి రుచింపకుండునే. 931

వ. కావున. 932

చ. వనరుహపత్త్రలోచన భ ♦ వత్సఖుఁడైన సుధాంశుమౌళితో
డి నిమిషమాత్రసంగతిఁ గ ♦ డిందిరవణంబును దుశ్చికిత్సము
న్ననఁ దగు జన్మరోగమున ♦ కగ్గలి వైద్యుఁడ వైననిన్ను నే
మనయముఁ జూడఁ గంటిమిక ♦ తార్థుల మైతిమంటి మీశ్వరా.

వ. దేవా మదీయ [1]స్వాధ్యాయాధ్యయనంబులును గురుప్రసాదంబును
విప్రవృద్ధానువర్తనంబును నార్యజనసమస్కరణంబును సర్వభూతాన
సూయయును నన్నవిరహితంబుగా ననేక కాలం బుదకంబులయందు
[2]సుతప్తం బయినతపంబు సేయుటయు నివి యన్నియును బురాణ
పురుషుండ వైన భవదీయపరితోషంబు కొఱకు నగుంగాక యని
విన్నవించెద మని వెండియు నిట్లనిరి. 934

మ. మనుపద్మాసన[3]ధూర్జటిప్రముఖధీ ♦ మంతుల్ తపోజ్ఞానత
త్త్వనిరూఢిం దగువారు నీమహిమముల్ ♦ వర్ణింపఁ బారం బెఱుం
గనివా రయ్యును నోపినంత వినుతుల్ ♦ గావింతు రట్లాట నే
మును నిన్నర్థినుతింతు మీశ వరదా ♦ బుద్ధ్యాదిమూలంబుగన్. 935

వ. అని మఱియు నముండవు నాదిపురుషుండవుఁ బరుండవు శుద్ధుండవు
వాసుదేవుండవు సత్త్వమూర్తివియు భగవంతుండవు నైననీకు నమ
స్కరించెద మని యిట్లు ప్రచేతసులచేత నుతింపంబడి శరణ్యావత్సలుం
డగుహరి సంతుష్టాంతరంగుండై వారల కోరినయట్లువరంబు లిచ్చిన.

తరలము. అనయ మానృపనందనుల్ ముద ♦ మారసన్నుతిఁ జేయఁగాఁ
మనములోఁ బరితోషమంది ర ♦ మాహృదీశుఁడు భక్తపా
లనకరుండు తదీయదర్శన ♦ లాలసాత్మకు లాత్మలం
దనివి సాలక చూడ నాత్మప ♦ దంబు కేఁగె రయంబునన్. 937

---

1 స్వాధ్యాయాధ్యయనము = వేదపఠనము. 2 సుతప్తము = బాగుగాఁ గాల్పఁబడినది. 3 ధూర్జటి = శివుఁడు.

వ. తదనంతరంబ ప్రచేతసులు భగవదాజ్ఞశిరంబుల ధరియించి [1]సముద్ర సలిలనిర్గతు లయి. 938

క. భూరిసమున్నతినాక, ద్వారనిరోధంబు గాఁగఁ దగఁ బెరిఁగిన యా [2]భూరుహసంఛన్నాఖిల, ధారుణిఁ బీక్షించి రాజతనయులు వరుసన్.

చ. ఘనకుపితాత్ములై విలయ ♦ కాలభయంకర [3]హవ్యవాహలో చనుగతి నుగ్రులై ధరణి ♦ చక్రము నిర్వసుధారుహంబు గా ననయముఁ జేయఁబూనిన జ ♦ నాధిపసూనులమోములందుఁ దా మనలసమీరముల్ జనన ♦ మంది కుజంబులఁ గాల్పఁ జొచ్చినన్.

క. నలినభవుఁ డామహీజ, ప్రళయముఁ గని వచ్చి ధరణి ♦ పాలతనూజా తులమధురోక్తులనుపశాం, తులఁ గావించుచు నుసయము ♦ దూఁకొనఁ బలికెన్. 941

వ. అట్లు పలికి వారల నుపశమితక్రోధులం జేసినయనంతరంబ. 942

సీ. [4]అవశిష్టధరణీరు ♦ హంబులు భయమంది
తివిరి చతుర్ముఖా ♦ దేశమునను
మారిష యనుసతీ ♦ మణిఁ దమకూఁతును
నాప్రచేతసులకు ♦ నర్థి నిచ్చె
నానరపాలక ♦ సూనులు దక్షున
కరయంగ మున్నీశ్వ ♦ రాపరాధ
మునఁ బ్రాప్తమైనట్టి ♦ జనపాలజన్మంబు
నకుఁ గారణం బైన ♦ నలిననయన

తే. నాదరంబునఁ గమలజు ♦ నాజ్ఞఁ జేసి
కడఁక దీపింప విధివత్ప్ర ♦ కారమునను
వరుస నందఱుఁ గూడి వి ♦ వాహ మైరి
గడవ వచ్చునె దైవసం ♦ కల్ప మెందు. 943

క. కలదే జగతిం బదురున్పు, పులకిలనొక భార్య యెందు ♦ బొసఁగు నెవినఁ గా నలినోదరుఘనమాయా, కలితాద్భుతములకు నతులు ♦ గావింపఁదగున్.

వ. అంతఁ జాక్షుషమన్వంతరంబున దైవచోదితుండై యిష్టప్రజాసర్గంబు

1 సముద్రసలిల నిర్గతులు = సముద్రజలమునుండి బయటికి వచ్చినవారు
2 భూరుహసంఛన్నాఖిలధారుణి = చెట్లచేనావరింపఁబడిన సమస్తభూమి. 3 హవ్య వాహలోచనుఁడు = శివుఁడు. 4 అవశిష్టధరణీరుహములు = మిగిలిన చెట్లు.

గావించుచుఁ బ్రసిద్ధుండైన దక్షుండు పూర్వదేహంబు గాలవిద్రుతం బగు చుండం బ్రచేతసులకు నమ్మారిష యను భార్యయందు సంభవించి నిజకాంతిం జేసి సమస్తతేజోధనుల తేజంబును బిహితంబుగాఁ జేయుచుఁ గర్మదాక్ష్యంబున దక్షుండను నామంబు వహించి బ్రహ్మచేతం బ్రజాసర్గరక్షయందు నియోగింపంబడి మరీచ్యాదులం దత్తద్వ్యాపారంబులందు నియోగించి యుండెనంత. 945

సీ. ఒనరఁ బ్రచేతసు ♦ లుత్పన్నవిజ్ఞాను
లగుచు వేగంబ నా ♦ రాయణోక్తిఁ
దలఁచుచు నాత్మనం ♦ దనుకడ నిజభార్య
నిడి వనవాసులై ♦ కడఁగి మున్ను
జాబలి యనుమునీ ♦ శ్వరుఁడు సిద్ధుండైన
భూరిపశ్చిమవార్ధి ♦ తీరమునను
సర్వభూతాత్మ వి♦జ్ఞానంబు గలయాత్మ
ఘనవిమర్శకృతసం ♦ కల్పులైరి
తే. యంత నచటికి సమ్మోద ♦ మతిశయిల్ల
వరసురాసురయక్షకి ♦ న్నర వరేణ్య
మానితోన్నత సంపూజ్య ♦ మానుఁడైన
నారదుండు వివేకవి ♦ శారదుండు. 946

వ. చనుదెంచి నిర్జితప్రాణమనోవాగ్దర్శనులును జితాసనులును శాంతులును నసమానవిగ్రహులును నిర్మలం బైన పరబ్రహ్మంబునందు నియోజితంబైన యంతఃకరణంబు గలవారును నైన రాజనందనుల కడ నిలిచిన. 947

క. చనుదెంచిన నారదమునిఁ
గనుఁగొని నృపసుతులు లేచి ♦ కౌతుకమొప్పన్
వినమితులై సముచిత పూ
జనములఁ బరితుష్టుఁ జేసి ♦ సద్వినయమునన్. 948

చ. అనఘ మునీంద్రచంద్ర భవ ♦ దాగమనంబు సమస్తలోకశో
భనమగు నస్మదీయమగు ♦ భాగ్యవశంబున నేఁడు విశ్వపా
వన నినుఁ జూడఁ గంటి మని ♦ వార్యభవద్భ్రమణంబు లోకలో
చనుగతిఁ బోలెఁ బ్రాణులకు ♦ సర్వభయాపహరంబుగావునన్. 949

వ. అని మఱియు నిట్లనిగి. 950

సీ. అనఘాత్మ భగవంతు ♦ లైన కేశవ స్వామి
దేవులచే నుప ♦ దిష్టమైన
యాత్మతత్త్వంబు గృ ♦ హస్థుల మగుమాకు
ననయంబు విస్మృతం ♦ బయ్యె నట్టి
కలితతత్త్వార్థప్ర ♦ కాశకంబును భూరి
ఘోరసంసారాబ్ధి ♦ [1]తారకంబు
నైనదర మొప్పారు ♦ నాత్మతత్త్వము నేఁడు
చిరదయామతిఁ బ్రకా ♦ శింపఁజేయు

తే. మని ప్రచేతసు లర్థిఁ బ ♦ లికినఁ జెలంగి
భగవదాయత్తచిత్తుండు ♦ భవ్యగుణుఁడు
నఖిలలోకవిహారుండు ♦ నైనయట్టి
నారదుఁడు వల్కెనా రాకు ♦ మారులకును. 951

సీ. చర్చింప నరులకీ ♦ జన్మకర్మాయుర్మ
నోవచనంబుల ♦ దేవదేవుఁ
డఖిలవిశ్వాత్మకుం ♦ డైన గోవిందుండు
విలసిల్లు భక్తి సే ♦ వింపఁబడిన
నవియ పో జన్మక ♦ ర్మాయుర్మనోవచ
నములను ధరణి నె ♦ న్నంగఁ దగును
వనరుహనాభసే ♦ వారహితము లైన
జననోపనయునదీ ♦ క్షాకృతంబు

తే. లైనజన్మంబులేల దీ ♦ ర్ఘాయు వేల
వేదచోదిత యగుకర్మ ♦ వితతి యేల
జపతపశ్శ్రుతవాగ్విలా ♦ సంబు లేల
మహితనానావధానసా ♦ మర్థ్యమేల. 952

వ. మఱియు హరివిరహితం బైనయింద్రియపాటవంబును నిపుణమైన బుద్ధియు బ్రాణాయామాదియోగంబును దేహాదివ్యతిరిక్తాత్మజ్ఞానంబును సన్న్యాసస్వాధ్యాయనంబులును దక్కిన వ్రతవైరాగ్యాదిశ్రేయ

1 తారకము = దాటించునది.

స్సాధనంబులును నేల సర్వేశ్వరుండును సమస్తశ్రేయస్స్వరూపుం డును సమస్తశ్రేయోవధిభూతుండును సర్వభూతావాసుండును సర్వ భూతాత్మప్రదుండును సర్వభూతప్రియుండును సర్వవ్యాపకుండునుం గావున. 953

మ. కమలాధీశ్వరుఁ బూజ సేయుట సమ♦గ్రప్రీతిఁ బ్రాణోపహా
రము సర్వేంద్రియ తృప్తిహేతువును సా♦ర్వత్మ్యజమూలాభిషే
కము శాఖాభుజపుష్టిదంబు నగు రే♦ఖన్ సర్వదేవార్చన
క్రమమై యొప్పు ధరావరేణ్యసుతులా♦రా బుద్ధి నూహించినన్.

వ. అదియునుం గాక. 955

క. వెను పగువర్షాకాలం
బున దినాయకునివలనఁ♦ బొడమినసలిలం
బనయముఁ గ్రమ్మఱ గ్రీష్మం
బున సూర్యునియందు డిందు♦ పోలిక మఱియున్. 956

క. ధరణిఁ జరాచరభూతము
లరయఁగ జనియించి యందె♦ యడఁగినపగిదిన్
హరిచేఁ బుట్టినవిశ్వము
హరియందె లయంబు నొందు♦ నది యెట్లన్నన్. 957

మ. అరుదారన్ భ్రతమఃప్రభల్ మునునభం♦బందొప్పఁగాఁ దోఁచియున్
మరలం జూడఁగ నందె లేనిగతి బ్ర♦హ్మంబందు నీశక్తులుం
బరికింపం ద్రిగుణప్రవాహమున ను♦త్పన్నంబులై క్రమ్మఱన్
విరతిం బొందుచు నుండుఁ గావున హరిన్♦ విజ్ఞుల్ భజింపందగున్.

వ. మఱియును సమస్తదేహులకు నాత్మయు నిమిత్తభూతుండును నద్వితీ యుండును శశ్వత్ప్రకాశుండును బ్రధాన పురుషుండును స్వతేజో విధ్వస్త గుణ ప్రవాహుండును మానస బుద్ధి సుఖేచ్ఛాద్వేషాది వికల్పరహితుండును సగుణుండును దేహాత్మ భ్రమ నివృత్త్యుపల భ్యుండును నాదిమధ్యాంతరహితుండును నిత్యానందస్వరూపుండును సర్వజ్ఞుండును బరమేశ్వరుండును నైన నారాయణు నభేద బుద్ధిం జేసి భజింపుఁ డటండు సర్వభూతదయాళువులును నెంతమాత్రంబు సంభవించు నంతమాత్రంబున సంతుష్టచిత్తులును సర్వేంద్రియోప

శాంతులును నగు పురుషులయెడ సంతుష్టుండగుననివెండియు నిట్లనియె. 959

చ. చతురతనట్టి యీశ్వరుఁడు ♦ సజ్జనలోకనిరస్తసర్వకా
మిత విమలాంతరంగమున ♦ మిశ్రితభావనఁజేసి సన్నిధా
పితుఁ డగుచుం దయాకరగ ♦ భీరగుణంబులఁ జాల నొప్పి యా
శ్రితజనపారతంత్ర్యమును♦జేకొని పాయకయుండునిచ్చలున్. 960

క. శ్రుతధనకులకర్మసము,న్నతమదములఁజేసిసజ్జ ♦ నప్రతతికి సంతతమును నెగ్గొనరించుచు,మతులర్థింజేయుపూజ♦మతిఁగొనఁడెందుఁ.

వ. అది యెట్లనిన. 962

సీ. వల నొప్పఁదను నను ♦ వర్తించు నిందిరా
కామినీమణిఁ దదా ♦ కాంక్షులగుచు
ధృతి ననువర్తించు ♦ దేవేంద్రముఖ్యుల
నైన నెవ్వఁడుచూడఁ ♦ డాత్మనట్టి
నిత్యస్వతంత్రుని ♦ నిజభక్తవరదుని
దీనవత్సలు గుణా ♦ ధీశు నజునిఁ
బురుషోత్తముని జగ ♦ ద్భరితు సర్వేశ్వరు
నారాయణునిఁ జిదా ♦ నందమయుని

తే. నజితు నచ్యుతుఁ బుండరీ ♦ కాయతాక్షుఁ
దవిలి సేవింపకుండునే ♦ ధర రసజ్ఞుఁ
డైన పురుషుండు సమ్మోదితో ♦ తాత్ముఁ డగుచుఁ
జారుమతులార రాజకు ♦ మారులార. 963

వ. అని మఱియు నిట్లనియె భవదీయవంశధుర్యుండుఁజిత్రరథుండునగు ధ్రువుండు సపత్నీమాతృవాగ్బాణభిన్నహృదయుండై పంచవర్షార్భకుం డగుచుఁ దపోవనంబున కరుగునపుడు మార్గంబున నారదుచే నుపదిష్టం బైన క్రమంబున భగవంతుం డగు పుండరీకాక్షు నారాధించి యితరులచే నొందరాని సర్వోత్తమంబగు పదంబు నొందెఁ గాన మీరును రుద్రోపదేశక్రమంబున సర్వభూతాంతర్యామియగు నీశ్వరుఁ భవచ్ఛేదంబునకై భజియింపుఁడు. 964

క. అనియివ్విధముననారద,మునిరాజకుమారులకును♦ముదముదలిర్పన్
వనజోదరుసచ్చరితము,వినిపించి సరోజభవుని♦వీటికిఁజనియెన్. 965

వ. ఇట్లు నారదుండు సనినయనంతరంబ. 966

చ. నరవరనందనుల్ గడఁక ♦ నారదవక్త్రవిసర్గతంబు సుం
దరమును మంగళావహము ♦ ధన్యము లోకమలాపహంబు నై
పరఁగినవిష్ణుసద్యశము ♦ భక్తి నుతించి ముకుందచింతనా
నిరుపమభక్తిఁ జెంది హరి ♦ నిత్యపదంబును బొంది రున్నతిన్. 967

వ. అని మైత్రేయుండు విదురున కిట్లనియె. మహాత్మా నీవు నన్నడిగిన ప్రచేతోనారదసంవాదరూపంబైనహరికీర్తనంబు మనుపుత్రుండైన యుత్తానపాదుని వంశప్రకారంబును జెప్పితినని వెండియునిట్లనియె. నారదువలనం బ్రియవ్రతుం డాత్మవిజ్ఞానంబు నొంది మహీమండలంబుఁ బరిపాలించి యనంతరంబునఁ బుత్రులకు రాజ్యంబుఁ బంచి యిచ్చి పరలోకగతుండయ్యెననిన. 968

క. విని విదురుండా మునివరు
ఘనచరణము లాత్మమస్త ♦ కంబున మధుసూ
దను చరణాంభోరుహములు
మనమునఁ దగఁదాల్చిపలికె ♦ మైత్రేయునితోన్. 969

క. మునినాథచంద్ర కరుణా,వననిధి నీచేత భక్త ♦ వత్సలుఁడగు నా
వనజాక్షుతత్త్వమెఱిఁగితి,ననితత్పదములకువినతుఁ♦డైవినయమునన్.

క. ఆమునిచే నామంత్రితుఁ,డై మనమున బంధుదర్శ♦నాకాంక్షితుఁడై
ధీమహితుఁడైనవిదురుఁడు,సామజపురమునకుఁజనియె♦సమ్మదమొప్పన్.

క. అని శుకుఁడు పరీక్షిత్తున, కనుకంపంజెప్పె నీ యు♦పాఖ్యానంబున్
వినువాఁడైశ్వర్యాయు,ర్ధనకీర్తిస్వస్తిగతులఁ ♦ దగఁ బ్రాపించున్.

క. అని శుకయోగి పరీక్షిజ్జనపాలసుధాపయోధి♦చంద్రున కర్థిన్
వినిపించినకథమోదం,బునసూతుఁడుశౌనకాది♦మునులకుఁజెప్పెన్.

చ. సరసవచోవిలాస గుణ ♦ సాగర సాగరమేఖలామహీ
భరణధురంధరప్రకట♦భవ్యభుజాభుజగేంద్ర రాజశే
ఖర ఖరదూషణప్రముఖగా ♦ ఘతమఃపటలప్రచండభా
స్కర గరకంఠకార్ముకవి♦ఖండనఖేలన భక్తపాలనా. 974

క. శరవిదళితసారంగా, సరసదయాపాంగ భక్త ♦ జలధితరంగా
దురితధ్వాంతశతాంగా, వరజనకసుతానుషంగ ♦ వననిధిభంగా. 975

మాలిని. సురవిమతవిదారీ ♦ సుందరీశంబరారీ
సరసవినుతసూరీ ♦ సర్వలోకోపకారీ
నిరుపమగుణహారీ ♦ నిర్మలానందకారీ
గురుసమరవిహారీ ♦ ఘోరదైత్యప్రహారీ. 976

గద్యము. ఇది శ్రీపరమేశ్వర కరుణా కలిత కవితావిచిత్ర కేసనమంత్రి పుత్రసహజపాండిత్య పోతనామాత్యప్రణీతంబైన శ్రీమహాభాగవతం బను మహాపురాణంబునందు స్వాయంభువమనువునకు నాకూతి దేవహూతి ప్రసూతి ప్రియవ్రతోత్తానపాదులు జన్మించుటయు నందు నాకూతిని రుచిప్రజాపతికి నిచ్చుటయు నారుచిప్రజాపతికినాకూతి దేవియందు శ్రీవిష్ణుమూర్త్యంశజుండైన యజ్ఞుండును లక్ష్మీకళాంశజ యగు దక్షిణ యనుకన్యకయు నుద్భవించుటయు మనుపుత్రియైన దేవహూతిని గర్దమున కిచ్చుటయుఁ బ్రసూతిందక్షప్రజాపతి కిచ్చుటయుఁ బ్రసూతి దక్షులవలనం బ్రజాపరంపరలు గలుగుటయుమఱియుంగర్దమప్రజాపతి పుత్రికాసముదయంబునుమత్రి ప్రముఖ బ్రహ్మర్షుల కిచ్చుటయుఁ గర్దమపుత్రి యైన కళవలన మరీచికిఁ గశ్యపుం డను పుత్రుండును బూర్ణిమ యను కూతునుం బుట్టుటయును పూర్ణిమ వలన గంగయు విరజుం డనెడు కుమారుండును జన్మించుటయుఁ గశ్యప ప్రజాపతివలన నయిన ప్రజా పరంపరలచే ముల్లోకంబులాపూర్ణంబు లగుటయు నత్రిమహాముని తపంబున నతనికి హరిహర బ్రహ్మలు ప్రత్యక్షం బగుటయునననసూయా పాతివ్రత్య మాహాత్మ్యంబు వలన ననసూయాత్రిలకుం ద్రిమూర్తులకళాంశజు లయిన చంద్రదత్తాత్రేయ దుర్వాసులజన్మంబును దక్షాత్మజల జన్మంబును భృగువువలనఖ్యాతియనునంగనకు శ్రీ మహాలక్ష్మి జన్మించుటయును భృగుపౌత్రుండయినమార్కండేయు జన్మంబును ధర్మునకు మూర్తివలన నరనారాయణులు సంభవించుటయును సత్త్రయాగంబునందు దక్షుండు శివునినిందించు టయును దక్షాధ్వరధ్వంసంబును బ్రహ్మచేఁ బ్రార్థితుండై శివుండు

దక్షాదుల ననుగ్రహించుటయును దక్షాదికృత శ్రీహరి స్తవంబును శ్రీహరి ప్రసన్నుండై దక్షుని యజ్ఞంబు సఫలంబుగా ననుగ్రహించుటయును సతీదేవి హిమవంతునకు జనించి హరునకుం బ్రాపించుటయు నుత్తానపాదుని వృత్తాంతంబును ధ్రువోపాఖ్యానంబును ధ్రువుండు దండ్రిచేత నవమానితుండై నారదోపదేశంబున మధువనంబునకుం జని తపంబు సేయుటయును హరి ప్రసన్నుండై యతని మనోరథంబు లిచ్చుటయును నతండు మరలం బురంబునకు వచ్చుటయుం గుబేరానుచరులైన యక్షులతోడి యుద్ధంబును ధ్రువుండు యజ్ఞంబులు సేయుచు రాజ్యభోగంబులందనిసి తనయు నుత్కలునిం బట్టంబుగట్టి హరియనుగ్రహంబున ధ్రువక్షితిని నిలుచుటయు నుత్కలుండు వత్సరుండను తనసుతునిం బట్టంబుగట్టి హరిం జేరుటయు వత్సరుని వంశపరంపరయు నందు నంగుని సుతుండయిన వేను కళేబరంబు లక్ష్మీనారాయణుల యంశంబున నర్చియుం బృథుండును జన్మించుటయుం బృథుండు భూమిం గామధేనువురీతి నఖిల వస్తువులుం బిదుక నియమించి సమస్థరిం జేసి యింద్రుండు వశవర్తియై యుండ బహుయజ్ఞంబులు సేసిన నతనికి హరి ప్రత్యక్షంబగుటయు నధ్యాత్మ ప్రబోధంబును నింద్రునివలనం బాషండ సంభవంబును నింద్రుని జయించిన విజితాశ్వుని నతని తమ్ములను దిక్పాలనంబునకు నిలిపి పృథుండు నర్చియుం బరమపదప్రాప్తులగుటయు వసిష్ఠుశాపంబునం ద్రేతాగ్నులు విజితాశ్వునికిం దనయులై జనియించుటయుం బృథుని పౌత్రుండయిన ప్రాచీనబర్హి రాజ్యంబును నతని యజ్ఞంబుల సంఖ్యాతంబులైన నారదుండు మానృం దలంచి పురంజనుకథ నధ్యాత్మ ప్రపంచంబుగాం దెలుపుటయు ప్రాచీనబర్హిసుతులయిన ప్రచేతసులు పదుగురకు శ్రీ మహాదేవుండు ప్రత్యక్షంబై హరి స్తవంబుపదేశించుటయుం బ్రచేతసుల తపంబునకు మెచ్చి హరి ప్రత్యక్షంబగుటయు వారికి మారిషవలన దక్షుండు పూర్వకాలంబున శివవిద్వేషప్రయుక్త శాపంబునం బుత్రుండై జనియించుటయును బ్రచేతసులు ముక్తిం జనుటయును విదురుండు మైత్రేయుని వీడ్కొని హస్తిపురంబున కరుగుటయు ననుకథలం గల చతుర్థస్కంధము. 977

ఓం తత్సద్బ్రహ్మార్పణ మస్తు.

శ్రీనివాస పరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్ర భాగవతము

## పంచమస్కంధము - ప్రథమాశ్వాసము

శ్రీ కర కరుణాసాగర
ప్రాకట [1]లక్ష్మీకళత్ర ♦ భవ్యచరిత్రా
[2]లోకాతీత గుణాశ్రయ
గోకులవిస్తార నంద ♦ గోపకుమారా. 1

వ. సకల పురాణార్థజ్ఞాన విఖ్యాతుండగు సూతుండు శౌనకాది మహా మునుల కిట్లనియె. 2

క. భూనాథుఁ [3]డుత్తరాత్మజుఁ
డైన పరీక్షిన్నరేంద్రుఁ ♦ డభిమన్యుసుతుం
డానందమంది ఘన సు
జ్ఞానుండగు శుకునిఁ గాంచి ♦ సరసతఁ బలికెన్. 3

వ. మునీంద్రా, పరమభాగవతుండు నాత్మారాముండు నైన ప్రియ వ్రతుండు గృహంబున నెట్లు రమించె? కర్మబంధంబులయిన పరా భవంబులు గల గృహంబుల యందు ముక్తసంబంధులైన పురుషు లకు సంతోషంబు గానేరదు. [4]ఉత్తమశ్లోకుండైన పుండరీకాక్షుని పాదచ్ఛాయం జేసి నిర్వృత చిత్తులయిన మహాత్ములు కుటుంబంబు నందు నిస్పృహత సేయుదురు గానఁ బ్రియవ్రతునికి సంసారంబు నందు దగులంబు గలుగు టెట్లు? [5]దారాగారసుతాదులందుఁ దగు

1. లక్ష్మీకళత్ర = లక్ష్మీదేవిని భార్యగాఁ గలవాఁడా ! 2. లోకాతీత గుణాశ్రయ = జనులు తెలిసికొనఁ జాలని గుణములకు నివాసమైన వాఁడా !
3. ఉత్తరాత్మజుఁడు = ఉత్తర కొడుకు (పరీక్షిత్తు)
4. ఉత్తమశ్లోకుఁడు = మేలైన కీర్తి గలవాఁడు, 5. దారాగారసుతాదులు = పెండ్లము, ఇల్లు, కొడుకులు మొదలైనవారు

లంబు గలవానికి నెట్లు సిద్ధి గలుగు? శ్రీహరియం దస్ఖలిత మతి యెట్లు గలుగు? నీ సంశయంబుఁ దేటపఱుపు మని పరీక్షిన్నరేంద్రుం డడిగిన శుకయోగీంద్రుం డిట్లనియె. 4

క. [1]హరిచరణాంబుజ మకరం
ద రసావేశితమనః ప్ర ♦ ధానుం డగు స
త్పురుషుఁ డొకవేళ విఘ్నముఁ
బొరసినఁ దన పూర్వమార్గ ♦ మును విడువఁ డిలన్. 5

క. ధరణీవల్లభ విను మా
నరవరుఁడు ప్రియవ్రతుండు ♦ నారదముని స
చ్చరణోప సేవఁ జెందుచు
నరుదుగ [2]నధ్యాత్మ సత్ర ♦ యాగం బంగున్. 6

సీ. దీక్షితుండై ధరి ♦ త్రీపాలనముఁ దండ్రి
పనిచిన సుజ్ఞాన ♦ భంగమనుచు
నంగీకరింపమి ♦ నంతయుఁ దెలిసి ప
ద్మాసనుం డతనికి ♦ నతుల రాజ్య
మందుల మిక్కిలి ♦ యాసక్తిఁ బుట్టింతు
ననుచును దన చిత్త ♦ మందుఁ దలఁచి
తారకాపరివృత ♦ తారాధిపునిమాడ్కి
శ్రుతులతోఁ గూడి [3]య ♦ చ్యుత విభూతి
తే. [4]హంసవాహనుఁ డగుచు నింద్రాదు లెల్లఁ
గదిసి సేవింప బ్రహ్మలోకమున నుండి
నమ్మునీంద్రులు దన్నుఁ బ్ర ♦ శంస సేయ
నల్లనల్లన యుడువీథి ♦ నరుగు దెంచె. 7

---

1. హరి........ప్రధానుఁడు = విష్ణు పాదకమల మందలి తేనెఁ ద్రాగుటచేఁదేలి యని మనస్సు గల వారిలో ముఖ్యుఁడైన వాఁడు
2. అధ్యాత్మసత్రయాగము=దేవుని గూర్చి చేయు (ఆత్మనుగుఱించిచేయు) ప్రశంస
3. అచ్యుత విభూతి=చెడని సంపద, 4. హంసవాహనుఁడు=అంచరౌతు (బ్రహ్మ)

వ. మఱియు నాయా మార్గంబులయందు సిద్ధసాధ్యగంధర్వచారణ
గరుడ కింపురుషు లిరుదెసల స్తోత్రంబులు సేయుచుండ గంధ
మాదనద్రోణులం బ్రకాశంబు నొందించుచుఁ జనుదెంచిన పద్మా
సనునకు నారదుండు స్వాయంభువ ప్రియవ్రతులతోఁ గూడి
[1]ముకుళితకరకమలుండై యెదురు చనుదెంచి సంస్తుతి [2]స్తబకం
బులఁ బూజించిరి. విరించి సంతసించి ప్రియవ్రతునిం జూచి నవ్వుచు
నిట్లనియె. 8

క. హరి [3]నాముఖమున ♦ న నీకును
గరమెఱిఁగింపంగఁ బనిచెఁ ♦ గావున నిదె సు
స్థిరమతి విను మం ♦ తయు శ్రీ
హరి వాక్యముగా నెఱింగి ♦ యవనీనాథా. 9

ఆ. కోరి వేడ్కనీవు ♦ నారదుండును నేను
నందఱమును నీశ్వ ♦ రాజ్ఞఁ బూని
యుడుగ కెపుడుఁ జేయు ♦ చున్న వారము గాన
యతని యాజ్ఞఁ దప్ప ♦ నలవిగాదు. 10

వ. మఱియు శ్రీహరియాజ్ఞను జీవుండు తపోవిద్యలను యోగవీర్య
జ్ఞానార్థధర్మంబులను తనచేత నొరులచేతం దప్పింప సమర్థుండు గాఁ
డుత్పత్తి స్థితినాశంబులకు శోక మోహ భయ సుఖదుఃఖంబులకు నీశ్వ
రాధీనుండ కాని జీవుండు స్వతంత్రుండు గాఁడు శ్రీహరి వాగ్రూ
పంబులయిన [4]శ్రుతులందు గుణత్రయం బను రజ్జువున బంధింపం
బడిన మస్మదాదులము ముకుఁద్రాటిచేఁ బశువు మనుష్యులకు
వశం బయిన చందంబున నీశ్వరాజ్ఞం బ్రవర్తించుచుందుము
నరుండు సుఖదుఃఖానుభవంబులకు నీశ్వరాధీనుండు నేత్రంబులు

1. ముకుళితకరకమలుఁడు = ముడిచిన చేయిదామరలు గలవాఁడు
2. స్తబకము = పూలగుత్తి
3. నా ముఖమున = నా వలన
4. శ్రుతులు=ఒకనిచేతఁ గల్పింపఁబడక వినఁబడిన భగవద్వాక్యులు (వేదములు)

గలవానిచేతఁ దివియంబడిన యంధుండునుం బోలె నీశ్వరుం డిచ్చిన సుఖదుఃఖంబు లనుభవించు చున్నవారము. స్వప్నంబునం గన్న పదార్థంబు మేల్కాంచి మిథ్యగాఁ దలఁచిన కరణి మోక్షార్థియైన సుజ్ఞానవంతుండు ప్రాప్తసుఖదుఃఖంబు లనుభవించుచు దేహారబ్ధ కర్మంబులంబాయ నొల్లఁడు వనవాసియైనను జితేంద్రియుండు గాకుండెనేనిఁ గామాదిసహితుం డగుటం జేసి సంసార బంధంబులు సిద్ధించు గృహస్థాశ్రమంబందు జితేంద్రియుండై యాత్మజ్ఞానంబు గల పురుషునకు మోక్షంబు సిద్ధించు శత్రువుల గెలువ నిశ్చయించిన పురుషుండు దుర్గంబాశ్రయించి శత్రువుల జయించిన మాడ్కిని మోక్షార్థియగు నీవును గృహాశ్రయుండ వగుచు శ్రీనారాయణ చరణారవిందంబు లను దుర్గం బాశ్రయించి [1]యరిషడ్వర్గంబుల జయించి ముక్తసంగుండవై యీశ్వర కల్పితంబులగు భోగంబుల ననుభవించి ముక్తిం జెందు మనినఁ బ్రియవ్రతుండు త్రిభువన గురుండయిన చతురానను వాక్యంబు [2]లవనతమస్తకుండై బహుమానపూర్వకంబుగా నంగీకరించె నంత. 11

ఆ. సరసిజాసనుండు ♦ స్వాయంభువునిచేత
నధికమైన పూజ ♦ లంది నార
దుండు నాప్రియ వ్ర ♦ తుండును జూడంగఁ
జనియెఁ దనదు పూర్వ ♦ సదనమునకు. 12

ఆ. సత్యసంధుఁడైన ♦ స్వాయంభువుం డను
[3]మనువు బ్రహ్మచేత ♦ మన్ననఁ దగ
నంది యంత నార ♦ దానుమతంబునఁ
దనదు సుతుని రాజ్య ♦ ము నను నిలిపె. 13

---

1. అరిషడ్వర్గము = కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు.
2. అవనత మస్తకుఁడు = వంచిన తల గలవాఁడు
3. మనువు = బ్రహ్మ పగటికాలమైన 4000 యుగముల పరిమాణములో 14వ వంతు కాలము భూమి నేలువాఁడు. వైవస్వతుఁడు మొదలైన మనువులు 14 గురు

వ. ఇట్లు స్వాయంభువమనువు భూచక్ర పరిపాలనంబునకుం బ్రియ వ్రతునిఁ బట్టంబుగట్టి విషమంబులగు విషయంబుల వలన విముక్తుండై వనంబునకుం జనియె నంత. 14

మ. ధరణీ వల్లభుఁ డా ప్రియవ్రతుఁడు మో ♦ దం బందుచుఁ దా లీల నీ
శ్వరవాక్యంబునఁ గర్మతంత్రపరుఁడై ♦ సంగంబులం బాపు శ్రీ
హరి పాదాంబుజ చింతనం దగిలి ని ♦ త్యానందముం బొంది దు
ర్భర [1]రాగాదులఁ బాఱఁదోలి ప్రజలం ♦ బాలించె నత్యున్నతిన్.

వ. ఇట్లు ప్రియవ్రతుండు రాజ్యంబుసేయుచు విశ్వకర్మ ప్రజాపతి పుత్రిక యగు బర్హిష్మతి యనుదానిం బత్నిఁగాఁ బడసి యా సతి వలన శీలవృత్తగుణరూప వీర్యౌదార్యంబులం దనకు సమానులైన యాగ్నీధ్రేధ్మజిహ్వాయజ్ఞబాహు మహావీరహిరణ్యరేతోఘృత ప్రృష్ఠసవన మేధాతిథి వీతిహోత్రకవులను నామంబులు గల పుత్రదశకంబును [2]నూర్జస్వతి యను నొక్క కన్యకనుగాంచె నందుఁ గవిమహావీరసవనులు మువ్వురు బాలకులయ్యు [2]నూర్ధ్వరేతస్కులై బ్రహ్మవిద్యానిష్ణాతులై యుపశమన శీలురగుచుం బారమహంస్యయోగం బాశ్రయించి సర్వజీవనికాయవాసుండు భవభీతజనశరణ్యుండు సర్వాంతర్యామియు భగవంతుండు నగు [3]వాసుదేవుని చరణారవిందావిరతస్మరణాగత పరమభక్తియోగానుభావంబున విశోధితాంతఃకరణు లగుచు నీశ్వరు[4]తాదాత్మ్యంబు నొంది రంత.

సీ. వసుధేశ యా ప్రియ ♦ వ్రతుఁ డొండు కాంతయం
దధికుల మన్వంత ♦ రాధిపతుల
మఱియు నుత్తముఁడు తా ♦ మసుఁడు రైవతుఁడను
సుతులను బుట్టించె ♦ సుమహితుల

1. రాగాదులు = ప్రేమ, పగను సాధించుట మొదలైనవి
2. ఊర్ధ్వరేతస్కులు = ఎన్నఁడు జారని వీర్యము గలవారు (బ్రహ్మచర్య వ్రతము నడపు వారు) 3. వాసుదేవుఁడు = అన్ని వస్తువులందుండు వాఁడు (వసుదేవ నందనుఁడు) కృష్ణుఁడు, 4. తాదాత్మ్యము=అదియే (భగవత్తత్వమే) తానగుట

మున్ను జన్మించిన ♦ మువ్వురు పుత్రులు
నవ్యయ పదవికి ♦ నరుగుటయును
నంతఁ బ్రియవ్రతుఁ ♦ డఖిలశాత్రవకోటిఁ
దనబాహుబలముచే ♦ తను జయించి

తే. యతఁడు బర్హిష్మతీకాంత ♦ యందుఁ బ్రీతి
గలిగి యౌవనలీలా వి ♦ కాసహాస
హేలనాదులఁజిత్తంబు ♦ గీలుకొల్పి
గత వివేకుఁడుఁబోలె భో ♦ గములఁబొందె. 17

వ. ఇట్లు ప్రియవ్రతుం డేకాదశార్బుద పరివత్సరంబులు రాజ్యంబు సేసి యొక్కనాఁడు మేరునగ ప్రదక్షిణంబు సేయు సూర్యునకు నపర భాగంబునం బ్రవర్తించు నంధకారంబు నివర్తింపం బూని భగవదుపాసనాజనితాతిపురుషప్రభావుండై [1]సవితృరథసదృక్షవేగంబు గలిగి తేజోమయంబైన రథంబు నారోహణంబు సేసి రాత్రులనెల్ల దివంబులొనర్తునని సప్తరాత్రంబులు [2]ద్వితీయ తపనుండునుంబోలె నరదంబు వఱపుటయు నా రథ[3] నేమిమార్గంబులు సప్తసముద్రంబులును నా మధ్యభూసంధులు సప్తద్వీపంబులు నయ్యె నందు. 18

సీ. వరుస జంబూప్లక్ష ♦ వరకుశ క్రౌంచముల్
శాక శాల్మలులు పు ♦ ష్కరము ననఁగ
నలరు నా ద్వీపంబు ♦ లందు జంబూద్వీప
మొనరంగ లక్షయో ♦ జనము లయ్యె
నట యుత్తరోత్తరా ♦ యత సంఖ్యఁ దా ద్విగు
ణిత మయి యొండొంటి ♦ కతిశయిల్లు
క్షా[4]రేక్షురససురా ♦ జ్యక్షీరదధ్యుద
కంబులఁ గలుగు సా ♦ [5]గరము లేడు

---

1. సవితృరథసదృక్షవేగము=సూర్యునితేరుతో సరియైన తొందర 2. ద్వితీయపవనుఁడు=రెండవ సూర్యుఁడు 3. నేమి మార్గము=చక్రపుదారి 4. క్షారేక్ష......ద్యుదకములు=ఉప్పు, చెఱకుపాలు, కల్లు, నెయ్యి, పాలు, పెరుగు, నీరు 4. సాగరము=సగరుని కొడుకులచే త్రవ్వఁబడినది (సముద్రము)

తే. ద్వీప పరిమాణములు గల్గి ♦ విస్తరిల్లు
సంధి సంధిని బరిఖల చందమునను
గ్రమము దప్పక యొండొంటిఁ ♦ గలయకుండు
సకలజీవుల కెల్ల నా ♦ శ్చర్యముగను. 19

వ. అట్టి ద్వీపంబులందుఁ బరిపాలనంబునకుం బ్రియవ్రతుం డాత్మ భవులు నాత్మసమానశీలురు నైన యాగ్నీధ్రేధ్మజిహ్వాయజ్ఞబాహుహిరణ్యరేతోఘృతపృష్ఠమేధాతిథివీతిహోత్రుల నొక్కొకని నొక్కొక్క ద్వీపంబునకుం బట్టంబు గట్టి యూర్జస్వతియను కన్యకను భార్గవున కిచ్చిన నా[1]భార్గవునకు నూర్జస్వతి యందు దేవయానియను కన్యారత్నంబు జనించె నట్టి బలపరాక్రమవంతుం డైన ప్రియవ్రతుండు విరక్తుం డై యొక్కనాఁడు నిజగురు వగు నారదుని చరణానుసేవానుపతిత రాజ్యాది ప్రపంచ[2]సంసర్గంబుఁదలంచి దుఃఖించి యిట్లనియె.

సీ. అక్కట యే నింద్రి ♦ యములచేఁ గట్టంగఁ
బడి యుండి యందులఁ ♦ బాయలేక
యజ్ఞాన విరచితం ♦ బగు సర్వవిషయము
లను [3]నంధకూపంబు ♦ లందు నడఁగి
తరుణులకే వినో ♦ దమృగంబ నై యుండి
యవి యెల్ల నే నొల్ల ♦ ననుచు రోసి
హరికృపచే నప్పు ♦ డబ్బిన[4] యాత్మవి
ద్యను గల్గి తనవెంట ♦ నరుగుదెంచు

తే. కొడుకులకు నెల్ల రాజ్యము ♦ గుదురుపఱిచి
తనదు పత్నుల దిగనాడి ♦ ధనము విడిచి
హరి విహారంబు చిత్తంబు ♦ నందు నిలిపి
పరగ నల్లన నారద ♦ పదవి కరిగె. 21

---

1. భార్గవుఁడు = భృగువంశమునఁ బుట్టిన వాఁడు
2. సంసర్గ = కూడిక
3. అంధకూపము = చీకటినూయి

వ. ఇట్లు దనరథమార్గంబులు సప్తద్వీపసాగరంబులుగాఁ జేసి సూర్యు
నకుఁ బ్రతిసూర్యుండై [1]సరిద్గిరివనాదులచేత భూత నిర్వృతి
కొఱకుఁ బ్రతిద్వీపంబునకు నవధులు గల్పించి ద్వీపవర్షనిర్ణయంబు
లం బుట్టించి పాతాళభూస్వర్గాది సుఖంబులు నరకసమానంబు
లుగాఁ దలంచి విరక్తిం బొంది నిరంతర భగవద్ధ్యాన విమలీ
కృతాశయుండగుచు హరిభక్తిప్రియుండైన ప్రియవ్రతుని చరి
త్రంబు లీశ్వరులకుఁ దక్క నన్యుల కెఱుంగఁ దరంబు గా దతని
మహిమంబులు నేఁడునుం గొనియాడుదు రని శుకుండు మఱియు
నిట్లనియె. 22

క. హరిసేవ నా ప్రియవ్రతుఁ
డరయఁగఁ గైవల్యపదవి ♦ నందుట యరుదే
ధరఁ జండాలుం డైనను
హరి నామస్మరణఁ జెందు ♦ [2]నవ్యయపదముల్. 23

వ. అని పలికి శుకుండు మఱియు నిట్లనియె. 24

మ. జనకుం డిట్లు విరక్తుఁ డైనను దదా ♦ జ్ఞం జేసి యాగ్నీధ్రుఁ డే
పున ధర్మప్రతిపాలనుం డగుచు జం ♦ బూద్వీప మేలెం దగం
దనసత్పుత్రులమాడ్కి నెల్లప్రజలం ♦ దాత్పర్యచిత్తంబునన్
ఘనతం బ్రోచె ననేకకాల మిలఁ బ్ర ♦ ఖ్యాతంబుగా భూవరా.

వ. ఇట్లాగ్నీధ్రుండు రాజ్యంబు సేయుచు నొక్కనాఁడు పుత్రకా
ముండై మందరాద్రి సమీపంబున నఖిలోపచారంబుల నేకాగ్ర
చిత్తుండై యర్చించినం గమలసంభవుండు సంతసిల్లి తనసమ్ము
ఖంబున సంగీతంబు సేయు పూర్వచిత్తి యను నప్సరోంగనం
బంపుటయు [3]నా యప్సరోంగన జనుదెంచి రమణీయ వివిధనిబిడ
విటపివిటప సమాశ్లిష్ట సమీప సువర్ణలతికారూఢస్థలవిహంగమ
మిథునోచ్చార్యమాణషడ్జాది స్వరంబులచే బోధ్యమానసలిల

1. సరి ద్గిరి వనాదులు = ఏఱులు కొండలు అడవులు మొదలైనవి
2. అవ్యయపదము = చెడని చోటు 3. అప్సరోంగన=అచ్చర చాన

కుక్కుట కారండవ బకకలహంసాది విచిత్రకూజితసంకులంబు లయిన నిర్మలోదక కమలాకరంబులు గల తదాశ్రమ వనోపవనంబు నందు విహరించుచు విలాసవిభ్రమగతి విశేషంబులం జలనంబు నొందు స్వర్ణచరణాభరణస్వనం బన్నరదేవకుమారుం డాలించి యోగసమాధిం జేసి ముకుళితనేత్రుండై యుండి యల్లన కనువిచ్చి చూచి తన సమీపంబున మధుకరాంగనయుంబోలెఁ బుష్పాఘ్రాణంబు సేయుచు దేవమానవుల మనోనయనంబుల కాహ్లాదంబుఁ బుట్టించు చున్న గతి విహారవినయావలోకనసుస్వరావయవంబుల మన్మథశరపరంపరల నొందించుచు ముఖకమలవిగళితామృత సమానహాసభాషణామోదమదాంధంబు లయిన మధుకర[1]మిథునంబుల వంచించి శీఘ్రగమనంబునం జలించు కుచ కచ మేఖలలు గల దేవిం గనుంగొని చిత్తచలనంబు నొంది మన్మథపరవశుం డై జడుని చందంబున నిట్లనియె 26

క. సతి నీ వెవ్వతె వీప
ర్వతమున కేమేనిఁ గోరి ♦ వచ్చిన వనదే
వతవో శారద[3]వో రతి
పతి పంచిన మాయవో త ♦ పస్సారమవో. 27

ఉ. అ[2]ంగజుఁ డెక్కుడించినశ ♦ రాసనమున్ ధరియించి యంత నా
యంగజువేఁట మానవమృ ♦ గావళి నూటిగఁ జూచుదానవో
రం గగు నీ నిజాకృతి తె ♦ ఱం గెఱుఁగంగ నిజంబు పల్కు మా
యంగన నిన్నుఁ గన్గొనిన ♦ యంత ననంగుఁడు సందడించెడున్.

క. పొలు పగు చున్న విలాసం
బుల సంగజుబాణములను ♦ బోలెడి నీ చం
చలసత్కటాక్షవీక్షణ
ముల నెవ్వని నింకి చిత్త ♦ మునఁ గలఁచెద వే. 29

---

1. మధుకరమిథునములు=తేనెటీగల జంటలు
2. అంగజుఁడు=శరీరమునఁ బుట్టు వాఁడు

చ. చెదరఁగ వేదముల్ సదువు ♦ శిష్యులపైఁ దగఁ బుష్పవృష్టి స
మ్మదమున నంతలోఁ గురియు ♦ మాడ్కిని మన్మథసామగానముల్
సదివెడుశిష్యులో యనఁగ ♦ [1]షట్పదపంక్తులు సేరి మ్రోయఁగాఁ
బదపడి మీఁద రాలుఁ గచ ♦ భారమునందుల జాఱుక్రొవ్విరుల్.

క. [1]అందియలు [2]డిండిమంబుల
చందమునం బాదపంక ♦ జంబుల యందున్
అందంద మ్రోయుచును నా
డెందంబునఁ దగిలి సంద ♦ డించెడిఁ దరుణీ. 31

క. పాయక కదంబపుష్ప
చ్ఛాయం గల వస్త్రకాంతి ♦ సల్లెడుఁ గంటే
యా యెడ నితంబరోచులు
గాయుచు నెడ తెగక తటిమి ♦ కప్పెడుఁ దన్వీ. 32

క. నిరతము నీ [3]తనుమధ్యము
గర మరుదుగ నరసి చూడఁ ♦ గానంబడ దీ
కరికుంభంబులఁ బోలెడి
గురుకుచముల నెట్లు నిలుపు ♦ కొంటి లతాంగీ. 33

క. పొంకము లగు కుచములపైఁ
గుంకుమ పంకంబుఁ బూసి ♦ కొని వాసనలం
గొంకక వెదచల్లెడు నీ
బింకం బగుచున్నదోయి ♦ పెంపో సొంపో. 34

శా. ఏ లోకంబున నుండి వచ్చితివి నీ ♦ విచ్చోటికిన్ మున్ను నే
నేలోకంబునఁ జెప్పఁ జూప నెఱుఁగ ♦ న్నీసుందరాకారము
న్నీలాలిత్యము లీవినోదములు నీ ♦ కిట్లొప్పునే కామినీ
భూలోకంబున కెట్లు వచ్చితివి నా ♦ పుణ్యం బగణ్యంబుగన్. 35

క॥ అందియల వెలయు రత్నము, లందంబుగ లలిత పదములన్ సుభగములై, యందంద మ్రోయుచును నా, డెందంబున దగిలి సందడించుచు నున్నన్—అని పాఠాంతరము. 1. షట్పదము = ఆరు కాళ్ళ పురుగు (తుమ్మెద) 2. డిండిమము = ఒకవాద్య విశేషము 3, తనుమధ్యము = సన్నని నడుము

క. హాసావలోకనంబుల
భాసిల్లెడు నీ ముఖంబు ♦ పలుమఱు నిపుడే
యాసలు పుట్టింపఁగ నే
నాసగొనెద నిన్నుఁ జూచి ♦ యంబుజనేత్రా. 36

ఆ. [1]కందు లేని యిందు ♦ కళ మించి నెమ్మోము
కాంతియుక్త మగుచుఁ ♦ గానిపించెఁ
గాన విష్ణుకలయు ♦ గాఁబోలు నని నా మ
నంబు నందుఁ దోఁచు ♦ నళిననేత్ర. 37

మ. పటుతాటంకరథాంగయుగ్మమున కుం ♦ బల్మాఱు భీతిల్లుచు
న్నటనం బందెడు గండుమీనములతో ♦ నాసన్న నీలాలకో
త్కటభృంగావళితో [3]ద్విజావళి లస ♦ త్కాంతిన్ విడంబించుమా
ఱట కాసారముఁ బోలె నెమ్మొగము దా ♦ రంజిల్లు నత్యున్నతిన్

చ. కరువలిఁ బాయువస్త్రమును ♦ గట్ట నెఱుంగవు చూడ్కి దిక్కులం
బరపుచుఁ జంచరీకముల ♦ భాతిఁ జెలంగెడు కంధరంబునం
బొరలెడుముక్తకేశభర ♦ ముం దుఱుమంగఁ దలంప విప్పడి
ట్లరుదుగ రత్నకందుకవి ♦ హారము సల్పెదు సంభ్రమంబునన్ . 39

వ. మఱియు నిట్లనుఁ దపోధను లగు వారల తపంబులను నీ రూపంబున నపహ్నవించినదాన నీచక్కఁదనం బేమితపంబున సంపాదించితివి నాతోడం గూడి తపంబు సేయుము సంసారంబు వృద్ధిఁ బొందం జేయుము పద్మాసనుండు నాకుం బ్రత్యక్షుం బై నిన్ను నిచ్చినవాఁడుఁ గావున నిన్ను విడువం జాలను నీసఖీజనంబులు నా వాక్యంబులకు ననుకూలింతురు గాక నీవు చనుచోటికి నన్నుం దోడ్కొని చను మని స్త్రీలకు ననుకూలంబుగాఁ బలుక నేర్చిన యాగ్నీధ్రుండు పెక్కుభంగులం బలికిన నా పూర్వచిత్తియు నతనియనునయ వాక్యం

1. కందు=నల్లని మచ్చ 2. ఇందుకళ=చంద్రునిలోఁ బదునారవపాలు 3. ద్విజ+ఆవళి=రెండు పుట్టుకలు గలవాని గుంపు, పక్షులు, పలువరుస, బ్రాహ్మణులు

బులకు సమ్మతించి వీరశ్రేష్ఠుం డగునా రాజవర్యునిబుద్ధి [4]రూపశీలౌ దార్య విద్యావయశ్శ్రీలచేఁ బరాధీనచిత్తయగుచు జంబూద్వీపాధిపతియగునా రాజశ్రేష్ఠునితోడం గూడి శతసహస్రసంవత్సరంబులు భూస్వర్గభోగంబు లనుభవించె నంత నాగ్నీధ్రుం డాపూర్వచిత్తివలన నాభి కింపురుష హరివర్షేలావృత రమ్యక హిరణ్మయ కురుభద్రాశ్వ కేతుమాల సంజ్ఞలు గలకుమారులఁ బ్రతిసంవత్సరంబు నొక్కొక్క నిఁగఁ దొమ్మండ్రం గాంచె నంత నాపూర్వచిత్తి యాయర్భకుల గృహంబున విడిచి యాగ్నీ[2]ధ్రుం బాసి బ్రహ్మలోకంబునకుం జనిన నాయాగ్నీధ్రపుత్రులు మాతృసామర్థ్యంబునం జేసి స్వభావంబునన శరీరబలయుక్తు లగుచుఁ దండ్రిచేత ననుజ్ఞాతులై తమ నామంబులఁ బ్రసిద్ధంబు లయినజంబూ ద్వీపవర్షంబులం బాలించు చుండి రంత నాగ్నీధ్రుండు నాపూర్వచిత్తివలనం గామోపభోగంబులందృప్తిం బొందక పూర్వచిత్తిం దలంచుచు వేదోక్తంబు లగుకర్మంబులం జేసి తత్సలోకంబగు బ్రహ్మలోకంబునకుం జనియె నిట్లు దండ్రి పరలోకంబునకుఁ జనిన నాభిప్రముఖులగు నాగ్నీధ్రకుమారులు దొమ్మండ్రును మేరుదేవియుఁ బ్రతిరూపయు నుగ్రదంష్ట్రియు లతయు రమ్యయు శ్యామయు నారియు భద్రయు దేవియు ననునామంబులు గల మేరుపుత్రిక లగు తొమ్మండ్రు కన్యకలను వివాహంబై రంత. 40

—♦ భగవంతుండగు నారాయణుండు ఋషభావతార మెత్తుట ♦—

అ. నరవరేణ్యుఁ డైన ♦ నాభిసంతానార్థ
మంగనయును దాను ♦ యజ్ఞపురుషుఁ
డయినవాసుదేవు ♦ నతులభక్తిశ్రద్ధ
లను జెలంగి పూజ ♦ లొనరఁ జేసి. 41

1. రూప.........శీలు=అందము, మంచి నడవడి, ఇచ్చు నేర్పు, చదువు, ప్రాయపు గలుములు

వ. మఱియుం బ్రవర్గ్య సంజ్ఞికంబు లగుకర్మంబులు శ్రద్ధావిశుద్ధ ద్రవ్యదేశకాల [1]మంత్ర ర్త్విగ్దక్షిణావిధానయోగంబులంబరమేశ్వరుని మెప్పించిన నెవ్వరికిం బ్రసన్నుండు గానిపుండరీకాక్షుండు భక్తవత్సలుం డై సురుచిరావయవంబులతో యజనశీలం బయిన యాతని హృదయంబునందుఁ బాయనిరూపంబుగలగి మనోనయనానంద కరావయవంబులు గల తనస్వరూపం బాతనికిఁ జూపందలంచి. 42

సీ. అంత [2]నావిష్కృత ♦ కాంతచతుర్భుజం
బులును బీతాంబరం ♦ బును వెలుంగ
శ్రీవత్సకౌస్తుభ ♦ శ్రీరమాచిహ్నంబు
లురమందు రమ్యమై ♦ యిరవుపడఁగ
శంఖచక్రగదాంబు ♦ జాతఖడ్గాదిది
వ్యాయుధంబులు సేతు ♦ లంద మెఱయ
నతులితనవరత్న ♦ హాటకాంకితనూత్న
ఘనకిరీటద్యుతుల్ ♦ గడలుకొనఁగఁ

తే. గర్ణకుండలకటిసూత్ర ♦ కనకరత్న
హారకేయూరవరనూపు ♦ రాదిభూష
ణముల భూషితుఁడై నశ్రీ ♦ నాయకుండు
దంపతులకప్పుడెదురఁ బ్ర ♦ త్యక్షమయ్యె. 43

తే. ఇట్లు ప్రత్యక్షమగుపర ♦ మేశ్వరునకుఁ
బెన్ని[3]ధానంబుఁగనుఁగొన్న ♦ పేదమాడ్కి
హర్షమున [4]ఋత్విగాదికు ♦ లవనతాస్యు
లగుచు నభినుతిచేసి రి ♦ ట్లనుచు నపుడు, 44

1. మంత్ర. ...... యోగములు=మంత్రము, యజ్ఞముచేయించువాఁడు, దక్షిణనిచ్చు విధము, మంత్రప్రయోగము
2. అవిష్కృత కాంత-చతుర్భుజములు=ప్రకటితమై మనోహరమైన నాలుగుచేతులు
3. పెను + నిధానము = పెద్ద ధనపుఁ బాతర
4. ఋత్విగాదికులు = యజ్ఞము చేయించువారు, మొదలైన వారు

క. పరిపూర్ణుఁడవై యుండియు, మఱవక
మాపూజ లెల్ల ♦ మన్నింతువు నీ
చరణారవింద సేవయు
ధరఁ బెద్దలు వినిచినటులు ♦ దగఁ జేసెద మా. 45

క. ఏమిప్పుడు సేయుసంస్తుతి
నీమహిమ నెఱింగి కాదు ♦ నిరతముఁ బెద్దల్
దా మెదియుపదేశించిరొ యామతమునఁ
బ్రస్తుతింతు ♦ మయ్య మహాత్మా. 46

వ. మఱియు నీవు సంసారాసక్తమతి గలిగినవారికి వశ్యుండవుగా
నీశ్వరుండవును బ్రకృతిపురుషవ్యతిరిక్తుండవును బరమపురుషుండ
వును నయిననిన్నుఁ బొందని ప్రపంచాంతర్గతంబు లయిన నామ
రూపంబులు గల యస్మదాదులచేత నిరూపింప నశక్యంబగు సర్వ
జీవులం జెందినదురితసంఘంబుల నిరసించు స్వభావంబు గల నీయు
త్తమ గుణంబులయందు నేక దేశంబుగాని సర్వగుణ నిరూపణంబు
సేయశక్యంబు గా నేరదు నీభక్తులు మిక్కిలి భక్తిం జేసి సంస్తు
తించు గద్గదాక్షరంబులను సలిలశుద్ధపల్లవ తులసీదళ దూర్వాంకు
రంబులను సంపాదించినపూజను సంతసిల్లెడినీకు బహువిధ ద్రవ్య
సంపాదనంబు గలిగివిభవయుక్తంబు లయిన [1]యశ్వమేధాదులును
దృప్తికరంబులుగా నేరవు స్వభావంబున సర్వకాలంబులందును
సాక్షాత్కరించి యతిశయంబై వర్తించుచు నశేష [2]పురుషార్థ
స్వరూపంబుఁ బరమానందరూపంబు నైనవాఁడ వగుటంజేసి
యజ్ఞాదులయందు నీకుఁ దృప్తి లేక యున్న నస్మదాదుల కోరికల
కుపచరించుకతంబున యజ్ఞాదుల నొనరింతు మని మఱియు
నిట్లనిరి. 47

1. అశ్వమేధము = గుఱ్ఱములోపలి చర్మమును వ్రేల్చిచేయు యజ్ఞము
2. పురుషార్థ స్వరూపము = ధర్మ, అర్థ, కామ, మోక్షముల ఆకారము

క. [1]బాలిశుల మగుచు మిక్కిలి
మే మెఱుఁగని మమ్ము నీదు ♦ మించిన దయచేఁ
బాలించు యిత్తు వెప్పుడుఁ
జాలఁగ నిహపరములందు ♦ సకల సుఖములున్. 48

ఆ. ఇపుడు మేము నీకు ♦ నిష్టంబు లగుపూజ
లాచరింప కున్న ♦ నైన నధిక
మయిన నీ[2]కృపా క ♦ టాక్షవీక్షణములఁ
జక్కఁజూచి తగఁ బ్ర♦సన్నుఁ డగుచు. 49

క. వర మీయఁ దలఁచి మమ్మం
గరుణించితి గాక నిన్నుఁ ♦ గనుగొనుటకు నై
యరసి నుతింపగ మాకుం
దర మగునే వరద [3]నీర ♦ దశ్యామాంగా. 50

వ. మఱియు నిస్సంగులై నిశితజ్ఞానంబునం జేసి దోషరహితులై భగవత్స్వభావులు నాత్మారాములు నగు మునులకు స్తుతియింపఁ దగిన గుణంబులు గలవాఁడ వగుచుండియుఁ బ్రసన్నుండవు [4]స్ఖలనక్షుత పతన జృంభణాది దురవస్థలందును జ్వరమరణాది దుర్దశలందును వివశుల మగు మాకుఁ గల్మషనాశకరంబు లయిన భవద్దివ్య నామంబులు మా వచనగోచరంబులగుం గాక మఱియు నీ రాజర్షి పుత్రకాముండై నీతోడ సమానుం డయిన కుమారునిం గోరి కామంబుల స్వర్గాప వర్గంబుల నీ నోపిన నిన్నుం బూజించి ధనకాముం డైనవాఁడు ధనవంతునిం జేరి తుషమాత్రం బడిగిన చందంబున మోక్షనాథుండ వైన నీ వలన సంతానంబు గోరుచున్నవాఁడు జయింప రాని నీ మాయచేత నెవ్వండు

---

1. బాలిశులు = మూఢులు (బాలకులు)
2. కృపాకటాక్షవీక్షణము = దయగల చూపులతోఁ జూచుట
3. నీరదశ్యామాంగ = వానమబ్బువంటి నల్లని శరీరము గలవాఁడా!
4. స్ఖల......ణాదులు = వీర్యము జారుట, తుమ్మట పెరుగుట, పడుట, మొదలైనవి

మోహంబు నొంది విషయాసక్తుండవు గాక యుండు నర్థకాములము మదాంధులము నగు మేము నిన్ను నాహ్వానంబు సేసినయపరాధంబు [1]సర్వాత్మకుండ వగుటం జేసి సామ్యంబుచే మన్నింపం దగుదువు మమ్ము దయం జూడు మని ప్రణమిల్లిన సర్వేశ్వరుండు వర్షాధిపతి యగునాభిచేతను ఋత్విక్కులచేతను వంద్యమానుండై దయాకలితుం డగుచు ని ట్లనియె. 51

క. మునులార వేదవాక్యము
లను బ్రస్తుతి సేసి సర్వ ♦ లక్షణముల నా
కెన యగు పుత్త్రుని నిమ్మని
వినఁ బలికితి రిపుడు మిగుల ♦ వేడుకతోడన్. 52

క. [2]నాకాదిలోకములలో
నాకున్ సరివచ్చునట్టి ♦ నందను నెటు నా
లోకింప లేరు గావున
నాకున్ సరి నేన కామ ♦ నమున నెఱుఁగుఁడీ 53

వ. అదియునుం గాక భూసురోత్తములు నాముఖం బగుటం జేసి విప్రవాక్యంబు దప్పింపరాదు నాభిపత్ని యగు మేరుదేవియందు నేన పుత్త్రుండ నై జనియించెద నని పలికి పరమేశ్వరుం డాగ్నీధ్రీయపత్ని యగు మేరుదేవి సూచుచుండ నా యజ్ఞంబున నంతర్ధానంబు నొంది యా నాభిమీఁదిదయం జేసి దిగంబరులును దపస్వులును జ్ఞానులును నూర్ధ్వరేతస్కులును నగు నైష్ఠికులకు యోగధర్మంబుల నెఱింగింపం దలంచి పుండరీకాక్షుండు నాభిపత్ని యగు మేరుదేవి [3]గర్భాగారంబునం బ్రవేశించె నంత. 54

1. సర్వాత్మకుఁడు = అంతట నిండియుండు వాఁడు (దేవుఁడు)
2. నాకాది లోకములు = సుఖము నిచ్చు స్వర్గము మొదలైన జగములు
3. గర్భాగారము = కడుపనెడు (గుడి లోపలి చోటు)గృహము

ఆ. మేరుదేవియందు ♦ మేరుధీరుండగు
హరి సమస్తలక్ష ♦ ణాన్వితుండు
శమదమా[1]దిగుణ వి ♦ శారదుండుదయించె
సకల జనుల కపుడు ♦ సంతసముగ. 55

ఆ. ధవళ కాంతి యుక్తిఁ ♦ దనరు దేహంబును
మహిత బల పరాక్ర ♦ మంబు వీర్య
మును దలంచి చూచి ♦ జనకుండు పేరిడె
సుతుని ఋషభుఁడనుచు ♦ సొంపుతోడ. 56

క. ధరణీసురులును మంత్రులుఁ
బరివారము హితులుఁ బ్రజలు ♦ బాంధవులును సు
స్థిరమతి నా బాలకునిం
గర మనురాగమున రాజు ♦ గాఁ జూచి రిలన్. 57

క. [2]పురుహూతుఁ డతనిమహిమలు
సరగున విని చిత్తమునకు ♦ సహ్యము గామిం
బరికించి ఋషభుఁ డేలెడి
ధరణి ననావృష్టి మిగుల ♦ దట్టము సేసెన్. 58

ఆ. అది యెఱింగి ఋషభుఁ ♦ డంతట యోగమా
యా బలంబుకతన ♦ నఖిలరాజ్య

---

1. శమదమాదిగుణ విశారదుఁడు = బైట లోపల నుండు నింద్రియములు గెలుచు నలవాటు నేర్పు గలవాఁడు.

బైట ఇంద్రియములు { తోలు, కన్ను, చెవి, నాలుక, ముక్కు, (జ్ఞానేంద్రియములు) నోరు, చేయి, కాలు, మలమూత్రద్వారములు (కర్మేంద్రియములు 5)

లోపలి ఇంద్రియములు:— మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము (అంతరింద్రియాలు 4)

2. పురుహూతుఁడు = ఇంద్రుఁడు, 2. అనావృష్టి = వాన లేకుండుట(కఱవు)

మందుఁ గురియఁ జేసె ♦ నత్యంత సంపూర్ణ
వృష్టి దినదినంబు ♦ వృద్ధిఁ బొంద. 59

వ. ఇట్లు ఋషభుండు పురందరుండు సేయు దౌ[1]ష్ట్యంబునకు నవ్వి యజనాభం బను తన మండలంబు సుభిక్షంబుగాఁ జేసి నాభియుం దన కోరిన చందంబునం బుత్రుండు జనియించి వర్ధిల్లుటకు సంతసిల్లి తనచేత నంగీకరింపంబడు నరలోకధర్మంబు గల పుండరీకాక్షుని మాయావిలసితంబునం జేసి బాలక నా తండ్రి యని మోహంబున నుపలాలించుచుఁ బ్రజానురాగంబున సర్వసమ్మతుం డగుని పుత్రుని సమయ సేతురక్షణంబునకుఁ బూజ్యం బయినరాజ్యంబునం దభిషిక్తుం జేసి భూసురులకుఁ బ్రదానవర్గంబునకు నప్పగించి మేరుదేవిం గూడి నరనారాయణస్థానం బయినబదరి[2]కాశ్రమంబునకుం జని యచ్చట మహాయోగసమాధిచే నరనారాయణాఖ్యుండుఁ బురుషోత్తముండు నగు వాసుదేవు నారాధించి క్షీణదేహుండై యానాభి హరి[5]తాదాత్మ్యంబు నొందె నంత. 60

చ. నరసుత నే నృపాలకుని ♦ జన్మమునందును భూసురోత్తముల్
సరసిజనాభునిం దగఁ ♦ బ్రసన్నుతఁ బెట్టిన నంత మెచ్చి యీ
శ్వరుఁడు దనంత గర్భమున ♦ వచ్చి తనూభవుఁడై జనించె నా
నరపతి నాభికిన్ సరి య ♦ నం దగునే నరనాథ యన్యులన్. 61

సీ. భూవరుఁడగు ఋష ♦ భుఁడు దన రాజ్యంబుఁ
గర్మభూమిఁగ నాత్మఁ ♦ గాంచి జనుల
కందఱకును బ్రియం ♦ బగునట్లు కర్మ తం
త్రం బెల్లఁ దెలుపంగఁ ♦ దలఁచి కర్మ
ములు సేయుటకు గురు ♦ వుల యొద్ద వేదంబు
సదివి వారల యను ♦ జ్ఞను వహించి
శతమన్యుఁ డిచ్చిన ♦ సతి జయంతీ కన్యఁ
బరిణయంబై యట్టి ♦ పడఁతి వలన

1. దౌష్ట్యము = దుష్టుని స్వభావము 2. బదరి కాశ్రమము = రేగుల యడవి ।

తే. భరతుఁ డాదిగ సుతుల నూ ♦ ర్వురను గాంచె
నట్టిభరతుని పేరను ♦ నవని తలము
పురవరాశ్రమ గిరి తరు ♦ పూర్ణ మగుచు
నమరి భారతవర్ష నా ♦ మమున మించె 62

వ. ఆ మహాభారతవర్షంబు నందుఁ దమతమ పేరం బరఁగుభూములకుం గుశావర్త నిలావర్త బ్రహ్మావర్త నార్యావర్త మలయకేతు భద్రసేన నిద్రస్పృ గ్విదర్భ కీకటులను తొమ్మండ్రు కుమారులను దక్కంగల తొంబండ్రు పుత్రులకుఁ బ్రధానులం జేసె నంతం గవి హరి నంతరిక్షు ప్రబుద్ధ పిప్పలాయ నావిర్హోత్ర ద్రమీఢ చమస కరభాజను లను వారు దొమ్మండ్రును భాగవతధర్మ ప్రకాశకులైరి భగవన్మహిమోప బృంహితంబులగు వారల చరిత్రంబులు ముందఱెఱింగించెదఁ దక్కిన యెనుబదియిద్దఱు కుమారులు పిత్రాదేశకరులు నతివినీతులు మహాశ్రోత్రియులు[1] యజ్ఞశీలురుఁ గర్మనిష్ఠులు నయిన బ్రాహ్మణోత్తములైరి ఋషభుండుస్వతంత్రుండై సంసారధర్మంబులఁ బొరయక కేవలానందానుభవుండయిన యీశ్వరుండైయుండియుఁ బ్రాకృతు[2]ండునుంబోలెఁ గాలానుగతంబులగు ధర్మంబుల నాచరించుచు ధర్మప్రవర్తకులకు సముండును నుపశాంతుండును మైత్రుండును గారుణికుండును నై ధర్మార్థయశః ప్రజానందామృతావరోధంబుచే గృహస్థాశ్రమంబులం బ్రజల నియమించుచుఁ గొంతకాలంబు నీతిమార్గంబు దప్పక ప్రజాపాలనంబు సేయుచు వేదరహస్యంబులగు సకల ధర్మంబులు స్వవిదితంబులయినను బ్రాహ్మణోపదేశ పూర్వకంబుగా ద్రవ్యదేశకాల వయశ్శ్ర[3]ద్ధర్త్విగ్విధోద్దేశోపచితంబులుగ నొక్కొక్క క్రతువును శతవారంబు యథావిధిగఁ జేసి సుఖంబుండె నంత 63

---

1. శ్రోత్రియులు = (శ్రుతులు) వేదము చెప్పినట్లునడచుకొనువారు. 2. ప్రాకృతుఁడు= ప్రకృతి సంబంధమైన వాఁడు, 3. ద్రవ్య....చితంబులు = వస్తువులు, దేశకాలములు, వయస్సు, శ్రద్ధ, యజ్ఞము చేయించువాని పని, ఉద్దేశ్యములు, అనుకూలములు

క. జనవర ఋ ♦ షభుని రాజ్యం
బున [1]నైహిక ఫలముఁ గోరు ♦ పురుషుని లోకనిం
గనుఁగొన నె ♦ ఱుంగ మెన్నఁడు
నిన తేజం డతనిమహిమ ♦ లే మని చెప్పన్ 64

—♦ ఋషభుండు పుత్త్రులకు నీతి యుపదేశించుట. ♦—

సీ. ఆఋషభుండు రా ♦ జ్యంబుసేయుచు నుండి
యంతట లోకులా ♦ త్మ యందుఁ
దలపోసి భూలోక ♦ ఫల మపేక్షింపక
మోహంబు దిగనాడి ♦ పుత్త్రులకును
దనరాజ్యమెల్ల న ♦ ప్పనజేసి వెనువెంటఁ
గొడుకులు మంత్రులుఁ ♦ గొలిచిరాఁగ
నల్లన యరిగి బ్ర ♦ హ్మావర్తదేశంబు
నందుల నపుడు మ ♦ హాత్ము లయిన
తే. యట్టిమునిజన సమ్ముఖం ♦ బందుఁ జేరి
తనదు పుత్త్రుల నందఱ ♦ [2]దాయఁ బిలిచి
పరమ పుణ్యుండు ఋషభుండు ♦ ప్రణయ మొప్ప
హర్షమందుచు నప్పు డి ♦ ట్లనుచుఁ బలికె. 65

ఆ. తనయులార వినుఁడు ♦ ధరలోనఁ బుట్టిన
పురుషులకును శునక ♦ సూకరులకు లేని
కష్టములను దెచ్చుఁ ♦ గాన కామంబుల
వలన బుద్ధి సేయ ♦ వలదు మీరు 66

చ. నరులకు నే తపంబున న ♦ నంత సుఖంబులు గల్గుచుండు శ్రీ
కరమతి నాతపంబుఁ దగఁ ♦ గైకొని చేసిన [3]బ్రహ్మసౌఖ్యముం
దిరముగఁ గల్గు వృద్ధులను ♦ దీనులఁ బ్రోవుఁడు దుష్టవర్తనన్
జరగుచుచుండు కాముకుల ♦ సంగతిఁ బోకుఁడు మీఁద మేలగున్ 67

1. ఐహికము = ఈ లోక సంబంధమైనది. 2. ఇనతేజుఁడు = సూర్యతేజుఁడు
2. దాయన్ = (డాయు రూపాంతరము) దగ్గరఁ జేరుచేట్లు
3. బ్రహ్మ సౌఖ్యము = తనయొక్క ఆత్మానంద సుఖము

వ. మఱియు నంగనాసక్తులగు కాముకులసంగంబు నిరయరూపం బయిన సంసారంబగు మహత్సంగంబు మోక్షద్వారం[1] బగునట్టి మహాత్ము లెవ్వరనిన శత్రుమిత్ర వివేకంబు లేక సమచిత్తులును శాంతులును క్రోధ రహితులును సకలభూతదయాపరులును సాధువులును నగువారలు మహాత్ము లనం దగుదు రట్టిమహాత్ములు నాయందలి స్నేహంబె ప్రయోజనంబుగాఁ గలిగి యుండుటం జేసి విషయవార్తా ప్రవృత్తులగు కుజనులందుఁ దమదేహగృహమిత్ర దారాత్మజాదులందుఁ బ్రీతి లేక యుండుదురు విషయాసక్తులయిన వారు వ్యర్థకర్మంబులం జేయుదు రట్టి దుష్కృతకర్మంబులం జేయువా రెప్పుడును బాపకర్ములగుచుం గ్లేశదం బగు దేహంబు నొందు చుండుదురు గావునఁ బాపమూలంబు లయిన కామంబులు గోరకుఁ డీజ్ఞానం బెంత కాలంబు లేక యుండు నంత కాలంబు నాత్మ తత్త్వం బెఱుంగంబడ దాతత్త్వం బెఱుంగ కుండుటం జేసి దేహికి దుఃఖం బధికం బై యుండు లింగ దేహం బెంతదడ వుండు నంత దడవును మనంబు కర్మవశం బై జ్ఞానవంతంబు గాక యవిద్యం బాయకుండు శరీరంబు గర్మమూలంబగుటవలనఁ గర్మంబులు సేయఁ జనదు వాసుదేవుం డగునాయందుఁ బ్రీతి యెంతదడవు లేక యుండునంత దడవును దేహధర్మంబులు బాధించు విద్వాంసుం డైనను దేహేంద్రియాదులయందుఁ బ్రీతిసేసిన మిథునీభావసుఖ ప్రధానం బగుగృహస్థాశ్రమంబు నంగీకరించి స్వరూపస్మృతి శూన్యుం డై మూఢుం డగుచు నందు సంసారతాపంబులఁ బొందుఁ బురుషుండు స్త్రీతోడం గూడి యేకీభావంబు నొందుట దనకు హృదయగ్రంథియై యుండు నందు జనునకు గృహక్షేత్రసుతాప్త విత్తంబులందు నేను నాయది యనియెడిమోహంబు గలుగు నట్టి స్త్రీపురుషమిథునీ భావంబుచే సంతానంబు గలుగు నాసంతానకారణంబున గృహక్షేత్రవిత్తాదులు సంపాదింపంబడు నందు మోహం

---

1. మోక్షద్వారము = సంసారము నుండి తొలఁగిపనుట కైన వాకిలి.

బధికం బగుటంజేసి మోక్షమార్గంబు దవ్వగు నిట్లు సంసారం
బునం దుండియుఁ మనంబున నెప్పుడు ముక్తిచింతం జేయు నప్పుడు
సంసారంబునుం బాయు మోక్షోపాయంబులు పరమ గురుండనైన
నాయందుల భక్తిసేయుటయు [1]విగతతృష్ణయు ద్వ[2]ంద్వతితిక్షయు
సర్వలోకంబులందుల జంతువ్యసనావగతియు నీశ్వ[3]రవిషయజ్ఞా
నాపేక్షయుఁ దపంబును విగతేచ్ఛయు మత్కృతకర్మంబులు
మత్కథలు వినుటయు నన్నె దైవంబుగా నెఱుంగుటయు నస్మద్గుణ
కీర్తనంబులును నిర్వైరత్వసామ్యోపశమంబులును దేహగేహంబు
లందు నాత్మబుద్ధిజిహాసయు నధ్యాత్మయోగంబును నేకాంత
సేవయుఁ బ్రాణేంద్రియాత్మలగెలుచుటయుఁ గర్తవ్యాపరిత్యాగం
బును సచ్ఛ్రద్ధయు బ్రహ్మచర్యంబును గర్తవ్యకృత్యంబులందుల
నప్రమత్తుం డగుటయు [4]వాఙ్నియమనంబును సర్వంబునన్నుఁ గాఁ
దలంచుటయు జ్ఞానంబును విజ్ఞానవిజృంభితంబైన యోగంబును
ధృత్యుద్యమంబును సాత్త్వికంబును నాదిగాఁ గల తెఱంగులచేత
[5]లింగదేహంబు జయించి దేహి కుశలుం డగుచు నుండవలయు. 68

ఆ. అరయఁ గర్మరూప ♦ మగున వి[6]ద్యాజన్మ
మైనహృదయబంధ ♦ నాదిలతల
నప్రమత్తయోగ ♦ మనుమహా[7]చ్ఛురికచేఁ
ద్రెంపవలయు నంతఁ ♦ ద్రెంపుతోడ. 69

ఆ. ఒనర నిట్లు యోగ ♦ యుక్తుండు గురుఁడైన
భూపుఁ డైన శిష్య ♦ పుత్రవరుల

---

1. విగతతృష్ణ=విడిచిన ఆశ. 2. ద్వంద్వ తితిక్ష=సుఖదుఃఖములు శీతోష్ణాదులను ఓర్చుకొనుట. 3. ఈశ్వర......క్షయు=దైవజ్ఞానమం దపేక్ష. 4. వాఙ్నియమనంబు = మితమైన సంభాషణము. 5. లింగదేహము = (జీవునకు) నిద్రావస్థ యందలి శరీరము.

6. అవిద్యా జన్మము = మాయవలని పుట్టుక. 7. మహాచ్ఛురిక = పెద్దకత్తి.

యోగయుతులఁ జేయ ♦ నొప్పఁగానలఘును
గర్మపరులఁజేయఁ ♦ గాదు కాదు. 70

సీ. జను లెల్ల [1]నర్థవాం ♦ ఛలఁజేసి యత్యంత
మూఢులై యైహికం ♦ బును మనంబు
లందును గోరుదు ♦ రల్పసౌఖ్యములకు
నన్యోన్యవైరంబు ♦ లంది దుఃఖ
ములఁబొందుచురుగాన ♦ మునుకొనిగురుఁడైన
వాఁడుమాయామోహ ♦ వశుఁడు నిత్య
జడుఁడు నైనట్టిమా ♦ జంతువునందును
దయగల్గి మిక్కిలి ♦ ధర్మబుద్ధిఁ

ఆ. గన్ను లున్నవాఁడు ♦ గానివానికిఁ
దెరువుఁ జూపినట్లు ♦ దెలియఁ బలికి
యతులమగుచుదివ్య ♦ మైనయామోక్షమా
ర్గంబుఁజూపవలయు ♦ రమణతోడ. 71

వ. మఱియుఁ బితృగురు జననీ బంధుపతిదైవతంబులలో నెవ్వరైనను సంసారరూప మృ[2]త్యురహితంబైన మో[3]క్షమార్గంబుఁ జూపకుండి రేని వా రెవ్వరును హితులు గా నేరరు నాదుశరీరంబు దుర్విభావ్యంబు నాదు మనంబు సత్త్వయుక్తంబును ధర్మసమేతంబును బాపరహితంబును నగుటం జేసి పెద్దలు నన్ను ఋషభుండండ్రు గావున శుద్ధసత్త్వమయంబైన నాశరీరంబునం బుట్టినమీర లందఱును సోదరుండును మహాత్ముండును నగ్రజుండును నైన భరతు నన్నె కాఁ జూచి యక్లిష్టబుద్ధిచే భజింపుండదియ నాకు శుశ్రూషణంబు ప్రజాపాలనంబు సేయుట మీకును బరమధర్మం బని మఱియు ని ట్లనియె. 72

1. అర్థవాంఛలు _ పదార్థములందు గోరికలు
2. మృత్యు రహితము = చావు లేకుండుట. 3. మోక్షమార్గము=కుటుంబము నుండి వెలువడు దారి

సీ. భూతజాలములందు ♦ భూజముల్ వర్యముల్
భూరుహములకంటెఁ ♦ భోగికులము
భోగిసంతతికన్న ♦ బోధనిష్ఠులు బోధ
మాన్యులకన్నను ♦ మనుజవరులు
వీరికన్నను సిద్ధ ♦ విబుధగంధర్వులు
వారికన్నను సురల్ ♦ వారికన్న
నింద్రాది దేవత ♦ లిందఱికన్నను
దక్షాదిసన్మునుల్ ♦ దలఁప నెక్కు

తే. డంతకన్నను భ[1]ర్గుఁడా ♦ యభవుకన్నఁ
[2]గమలభవుఁ డెక్కుడాతని ♦ కంటె[3]విష్ణుఁ
డధికుఁ డాతఁడు విప్రుల ♦ నాదరించుఁ
గాన విప్రుఁడు దైవంబు ♦ మానవులకు. 73

క. భూసురులకు సరి దైవం
బీసచరాచరమునందు ♦ నెఱుఁగను నాకున్
భూసురులు గుడుచునప్పటి
యా సంతోషంబు దోఁప ♦ దగ్నులయందున్. 74

సీ. మంగళంబైన బ్ర ♦ హ్మస్వరూపంబును
వేదరూపంబు న ♦ నాదిరూప
మగుచున్నదు దే ♦ హము బ్రాహ్మణోత్తముల్
ధరియింతు రెప్పుడుఁ ♦ దత్త్వబుద్ధి
శమదమానుగ్రహ ♦ సత్యతపస్తితి
క్షలు గల్గు విప్రుండు ♦ సద్గురుండు
గాన మిక్కిలి భక్తి ♦ గల్గి యకించను
లైనభూసురుల దే ♦ హములవలన

1. భర్గుఁడు = తేజస్సు గలవాఁడు (శివుఁడు), 2. కమలభవుఁడు = తామర యందు బుట్టినవాఁడు (బ్రహ్మ), విష్ణువు = అంతట నిండి యుండు వాఁడు (నారాయణుఁడు)

తే. నందు చుండును నాదు దే ♦ హంబు గాఁగ
నెఱిఁగి వరు లగు విప్రుల ♦ నెల్లభక్తిఁ
బూజసేయుటయే నన్నుఁ ♦ బూజసేయు
టనుచు వినిపించి మఱియు ని ♦ ట్లనుచుఁ బలికె. 75

క. ఈ తెఱఁగు దెలిసి భూసుర
జాతిం బూజించునట్టి ♦ జనుఁడును మాయా
తీతుం డై నిక్కంబుగ భూతలమున
మోక్షమార్గ ♦ మును బొడగాంచున్. 76

వ. ఇట్లు సదాచారు లగు కుమారులకు [1]లోకానుశాసనార్థం బాచారంబు
లుపదేశించి మహాత్ముండును బరమసుహృత్తును నగు భగవం
తుండు ఋషభాపదేశంబునం గర్మత్యాగంబు సేసి [2]యుపశమశీలు
రగు మునులకు భక్తిజ్ఞానవైరాగ్య లక్షణంబులు గల పారమహం
స్యధర్మంబు నుపదేశింపఁ గలవాఁ డగుచుఁ బుత్త్ర శతంబునం దగ్రి
జుండును బరమభాగవతుండును భగవజ్జనపరాయణుండును నగు
భరతుని ధరణీపాలనంబునకుఁ బట్టంబు గట్టి తాను గృహమందె
దేహమాత్రావలంబనంబు సేసి దిగంబరుం డై యున్మత్తాకారుం
డగుచుం [3]బ్రకీర్ణ కేశుండై యగ్నుల [4]నాత్మారోపణంబు సేసి బ్ర
హ్మావర్త దేశంబును బాసి జడాంధబధిర మూకపిశాచోన్మాదులుం
బోలె నవధూతవేషంబు నొంది జనులకు మాఱుపలుకక మౌన
వ్రతంబునం బుర గ్రామాకర జనప దారామ శిబిర వ్రజఘోష
సార్థగిరి వనాశ్రమాదులయందు వెంటఁ జనుదెంచు దుర్జనతర్జన తాడ

1. లోకానుశాసనార్థము = జనులను శిక్షించి నడుపుకొఱకు. 2. ఉపశమశీలురు = ఇంద్రియములను నెమ్మతిగా నుంచుటయందు నేర్పు గలవారు. 3. ప్రకీర్ణకేశుఁడు = ముడివైచిన వెండ్రుకలు గలవాఁడు. 4. ఆత్మారోపణము తన యందు నిల్పుకొనుట.

నావమాన మేహన[1]నిష్ఠీవన పాషాణ శకృద్రజః ప్రక్షేపణ పూతివాత దురుక్తులం బరిభూతుం డయ్యును గణనం బెట్టక [2]వనమదేభంబు మక్షికాదికృతోపద్రవంబునుం బోలెఁ గైకొనక దేహాభిమానంబునం జిత్తచలనంబు నొందక యేకాకియై చరియించుచుండ నతిసుకుమారంబు లగుకరచరణోరస్స్థలంబులు విపులంబు లగుబాహ్వంసకంఠవదనాద్యవయవవిన్యాసంబులుం గలిగి ప్రకృతిసుందరం బగుచు స్వతస్సిద్ధదరహాసరుచిరముఖారవిందంబై నవనళినదళంబులం బోలి శిశిరకనీనికలం జెలువొంది యరుణాయతంబు లగునయనంబులచే నొప్పి యన్యూనాధికంబు లగు [3]కపోలకర్ణకంఠనాసాగండంబులచేఁ దేజరిల్లుచు [4]నిగూఢస్మితవదన విభ్రమంబులం బ్రకాశించుతనదివ్యమంగళవిగ్రహంబుచేఁ బురసుందరుల మనంబుల కత్యంత మోహంబు గలుగఁ జేయుచు. 77

ఆ. ధూళిచేత మిగుల ♦ ధూసరితంబునై
జడలు గట్టి కడుఁ బి ♦ శంగవర్ణ
మునగు కేశపాశ ♦ మును వెలిఁగించుచు
నితరు లెవరుఁ దన్ను ♦ నెఱుఁగకుండ. 78

క. అవ[5]ధూతవేషమున ని, ట్లవని
మలినంబు లైన ♦ యవయవములతోఁ
దవిలి చరించుచు నుండును
భువి భూతాక్రాంతుఁడయిన ♦ పురుషునిమాడ్కిన్. 79

1. వన మదేభము = అడవియందలి పొగరెక్కిన యేనుఁగు. 2. నిష్ఠీవన........ దురుక్తులు = ఉమ్మివేయుట. రాళ్ళచేత, దుమ్ము చేత విసరుట కలిగి చెడువాసనతోడి వెగటుమాటలు. 3. కపోల....గండంబులు = చెక్కిలి, చెవి, మెడ, ముక్కు, ప్రక్కలు. 4. నిగూఢ........విభ్రమము = మఱుగు పడిన చిరునవ్వుతో గూడిన మోము యొక్క యొప్పిదము
5. అవధూత = నలువురు యతులలోఁ గడపటివాఁడు,

ఆ. జనుల కిట్లు యోగ ♦ సంచార మెల్ల వి
రుద్ధ మనుచు నాత్మ ♦ బుద్ధిఁ జూచి
యజ[1]గరంబుమాడ్కి ♦ నవనిపై నుండె బీ
భత్సకర్మమునకుఁ ♦ బాలుపడుచు. 80

వ. ఇట్లు బీభత్సరూపంబున వసుంధరం బడియుండి యన్నంబు భుజియించుచు నీరు ద్రావుచు మూత్రపురీషంబులు విడుచుచు నవి శరీరంబున నంటం బొరలుచుండు మఱియుఁ [2]దత్పురీష సౌగంధ్యయుక్తం బగు వాయువు దశదిశలకు దశయోజన[3] పర్యంతంబు పరిమళింపం జేయుచుండ గోమృగకాకచర్యలం జరియించుచు భగవదంశంబైన ఋషభుండు మహానందంబు ననుభవించుచుఁ దనయందు సర్వభూతాంతర్యామి యగు వాసుదేవుని బ్రత్యక్షంబుగాఁ గనుంగొనుచు సిద్ధిం బొందిన [4]వైహాయస మనోజవ పరకాయ ప్రవేశాంతర్ధానదూరగ్రహణ శ్రవణాది యోగ సిద్ధులు దమంత వచ్చినం గైకొనక యుండె నని పలికిన శుక యోగీంద్రునకుం బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె. 81

క. మునివర యోగజ్ఞానం
బునఁ జెఱుపం బడ్డకర్మ ♦ ములు గల పెద్దల్
గని యుండెడి యైశ్వర్యం
బును ఋషభుం డేటికిఁ గై ♦ కొనక యుండెన్. 82

వ. అనిన శుకుం డిట్లనియె. 83

---

1. అజగరము = కొండశిల యను దాసరి పాము

2. పురీషసౌగంధ్యము = పెంటవలన మంచి వాసనం గలిగి వెలయించుట. 3. యోజనపర్యంతము= ఆమడదూరము వరకు. 4. వైహాయస.... శ్రవణాదులు= ఆకాశమున దిరుగుట, మనస్సంత తొందరగ వెళ్ళుట, ఒక శరీరము నుండి మరొక శరీరమునం బ్రవేశించుట, కనుపడకపోవుట, దూరమున నుండి చూచుట, వినుట, మొదలగు శక్తులు.

మ. ధరణీవల్లభ నీదువాక్యములు త ♦ థ్యం బింతయుం దప్ప దె
ట్లరయన్ వన్యమృగంబు పట్టువడి తా ♦ నావేళ నాలుబ్ధకున్
ధర్మవంచించిన మాడ్కి నింద్రియములన్ ♦ దండించి చిత్తంబు ని
ర్భరకామాదుల కాస యిచ్చుఁ గడు సం♦రంభంబుతో గ్రక్కునన్.

క. చిరకాల తపము నైనను
హరియింపఁగ నోపుఁ జిత్త ♦ మని పెద్దలు న
మ్మరు జారులకున్ జారిణి
కరణిని నడరించు మనసు ♦ కామాదులకున్. 85

క. కామక్రోధాదికముల్
భూమీశ్వర కర్మబంధ ♦ ములు మాఱియును జే
తోమూలము లగుటను దా
రీ మహిలో మనసు నమ్మ ♦ రెప్పుడుఁ బెద్దల్. 86

సీ. అది గాన యెన్నఁడు ♦ నైశ్వర్యములను జే
పట్టఁ జూడఁడు లోక ♦ భవ్యు లైన
వారలచే సభి♦వందనంబులుఁబొంది
వెలయుంగ నవధూత ♦ వేషభాష
ణంబుల నెఱిఁగి కొ ♦ నఁగ రాని భగవత్స్వ
రూపంబు గలిగి యా ♦ రూపమందుఁ
బరమ యోగధ్యాన ♦ పరులకు నెల్ల దే
హత్యాగ సమయంబు ♦ నంతలోనఁ

తే. జూపు చుండియు దేహంబుఁ ♦ బాపనిచ్చ
గించెనచ్చట దివ్యయో ♦ గీంద్రుఁడాద్యుఁ డతుల
దివ్యప్రకాశకుఁ ♦ డమర వరుఁడు
పరమపురుషుండు ఋషభుండు ♦ పార్థివేంద్ర. 87

వ. అంత విముక్తలింగుండును భగవంతుండును నగు ఋషభుండు మనంబున దేహాభిమానంబు విసర్జించి[1]కులాలచక్రంబు గులాలుని

1. కులాల చక్రము = కుమ్మర సారె,

చేత భ్రమియింపంబడి విసృష్టంబయ్యును భ్రమియించుగతిం బ్రాచీనసంస్కార విశేషంబగు నభిమానాభాసంబున దేహచలనాదికంబుల నొప్పి యుండియు యోగమాయా వాసనచే యుక్తుండయ్యె మఱియు నా ఋషభుం డొక్కదినంబునం గోంకణ వంకపటంబు లను దక్షిణకర్ణాటక దేశంబులకు యదృచ్ఛం జని కుటకాచలోప వనంబున నిజాస్య[1]కృతశిలా కబళుండగుచు నున్మత్తుని చందంబున వికీర్ణ కేశుండు దిగంబరుండునై సంచరింప వాయువేగ విధూత రేణు సంఘర్షణసంజాతంబగు నుగ్రదావానలంబు తద్వనంబు దహింప నందు దగ్ధుం డయ్యె నంత నతనికృత్యంబులు తద్దేశవాసులగు జనంబులు సెప్ప నర్హన్నామకుం డగు తద్రాష్ట్రాధిపతి విని నిజధర్మంబులం బరిత్యజించి స్వదేశస్థులతోడం గూడి దా నాయాచారంబుల నంగీకరించి యధర్మ బహుళంబగు కలియుగంబున భవితవ్యతచే విమోహితుండై మనుజుల నసమంజసంబగు పాషండ మతాభినివేశులం జేసె మఱియును గలియుగంబునందు మనుజాధములు దేవమాయామోహితులై శాస్త్రోక్త శౌచాచారంబులు విడిచి నిజేచ్ఛంజేసి దేవతాహేళనంబులు సేయుచు నస్నా[2]నానాచమనాశౌచకేశోల్లుంచనాదికా పవిత్ర వ్రతంబులం జేయుచు నధర్మబహుళం బగు కలియుగంబునం జెఱుపంబడ్డ బుద్ధిధర్మంబులు గలిగి వేదబ్రాహ్మణ యజ్ఞపురుషుల దూషించుచు లోకంబులం దమ తమ మతంబులకుం దామె సంతసిల్లుచు నవేదమూలం బగు స్వేచ్ఛంజేసి ప్రవర్తించి యంధపరంపరచే విశ్వాసంబు సేసి తమంతన యంధతమసంబునం బడుచు నుండుదు రీఋషభుని యవతారంబు రజోవ్యాప్తు లగు పురుషులకు మోక్షమార్గంబు నుపదేశించుటకు నయ్యె నదియునుం గాక

---

1. కృతశిలాకబళుఁడు=జేసికొనఁబడిన ఱాతి ముద్దలు గలవాఁడు, 2. అస్నాన.... వ్రతములు = స్నానము,ఆచమనము, ఆచారము లేకుండ, వెంట్రుకలు ముడువకుండం జేయు వ్రతములు.

సప్త సముద్ర పరివృతంబు లగు నీ భూద్వీప వర్షంబులందలి జనంబులు దివ్యావతార ప్రతిపాదకంబు శుద్ధంబు నగు నెవ్వాని కృత్యంబులు గీర్తింతురు మఱియు నెవ్వాని యంశంబున నతికీర్తిమంతుండగు ప్రియవ్రతుండు గలిగె నెందుః జగదాద్యుండగు పురాణపురుషుం డవతారంబు నొంది కర్మ హేతుకంబు గాని మోక్షధర్మంబుం దెలిపె నెండియు నెవ్వాండు యోగమాయాసిద్ధుల నసద్వ్యాతంబు లగుటం జేసి నిరసించె నట్టి ఋషభునితోడఁ దత్సిద్ధికృత ప్రయత్ను లగు నితర యోగీశ్వరులు మనోరథంబున నైన నెట్లు సరియగుదు రిట్లు సకల వేదలోక దేవబ్రాహ్మణులకు గోవులకుం బరమగురుండు భగవంతుండునగు ఋషభుని చరిత్రంబు వినిన వారల దుశ్చరితంబులు దొలంగు మంగళంబులు సిద్ధించు మిక్కిలి శ్రద్ధతో నెవ్వాండు విను వినిపించు వానికి హరిభక్తి దృఢం బగు నట్టి హరిభక్తితాత్పర్యంబునం బెద్దలు భాగవతు లగుటం జేసి సంప్రాప్త సర్వపురుషార్థు లగుచు వివిధ[1]వృజిన హేతుకం బగు సంసారతాపంబును బాసి యవిరతంబుఁ దద్భక్తి యోగామృత స్నానంబు సేసి పరమ పురుషార్థం బయిన మోక్షంబును జెందుదు రని సప్తద్వీపంబులవారు నేఁడునుం గొనియాడుచుందురు.

ఆ. యాదవులకు మీకు ♦ నత్యంతకులగురు
వైన కృష్ణుఁ డెచట ♦ నైనఁ గలఁడు
గొలుచు వారి కెల్ల ♦ సులభుఁడై మోక్షంబు
నిచ్చుఁ జింతసేయ ♦ నేల నీకు. 89

సీ. నిత్యాను భూత మా ♦ నిజరూపలాభని
వృత్తమై తగుమహా ♦ తృష్ణ గలి
యతులిత విపుల మా ♦ యారచితం బైన
లాభంబునకుఁ దగు ♦ లంబు లేని

1. వివిధ.........కములు = అన్ని పాపములకుఁ గారణములు.

మతి గల్గి లోకుల ♦ నతివేడ్కఁ గరుణించి
యభయదానం బిచ్చి ♦ యండజ కిల
నవ్యయం బై దివ్య ♦ మై మహానంద మై
యత్యంత సేవ్య మై ♦ యతుల మైన

తే. తనదు లోకంబు సూపంగఁ ♦ దగినయట్టి
మోక్షమార్గంబు నెఱిఁగించి ♦ ముక్త దేహుఁ
డగుచుఁ దాదాత్మ్య మొందెఁ బ్ర ♦ త్యక్షవిష్ణు
నైన ఋషభుండు జనులకు ♦ నద్భుతముగ. 90

భరతోపాఖ్యానము

మ. భరతుం డంత ధరాతలంబుఁ గడఁకం ♦ బాలించుచున్ ధారుణీ
శ్వర చంద్రుండగు విశ్వరూపునకు మున్ ♦ సంజాత యై యుండి ని
ర్భర కాంతిన్ విలసిల్లు పంచజని పే ♦ రం గల్గుకాంతామణిం
గర మర్థిన్ ధరఁ బెండ్లియాడె శుభ ల ♦ గ్నంబందు భూవల్లభా

వ. ఇట్లు వివాహితుండై యా పంచజనివలన నహంకారంబునం బం[1]
చతన్మాత్రలు జనించిన తెఱంగున సుమతి రాష్ట్రభృత్సుదర్శనాచరణ
ధూమ్రకేతువు లను నేవురు పుత్రులం బుట్టించె నట మున్నజ
నాభం బనుపేరం బరఁగు వర్షంబు భరతుండు పాలించుకతంబున
భారతవర్షంబు నాఁ బరఁగె నంత. 92

క. భరతుఁడు నిజపిత లేలిన
కరణిని గర్మముల నెల్లఁ ♦ గైకొని ప్రజలన్
హరికృప నొందుచు నేలెను
ధరణీ సురవరులు వొగడ ♦ ధరణీనాథా 93

---

1. పంచతన్మాత్రలు = శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము, (పంచభూత విషయములు)

సీ. భగవంతుఁ డగు జగ ♦ ద్భరితు నల్పంబులు
నధికంబు లైన పె ♦ క్కధ్వరములు
దర్శపూర్ణిమలచేఁ ♦ దగను జా[1]తుర్మాస్య
ములు నగ్నిహోత్రము ♦ వలనఁ గడఁకఁ
బశుసోమములచేతఁ ♦ బలుమాఱుఁ బూజించి
వేదోక్తమైన యా ♦ విమల కర్మ
ములఁ గల్గు ధర్మంబుఁ ♦ బురుషోత్తమార్పణం
బుగఁ జేయుచును మఖం ♦ బులను మంత్ర

తే. ములను బలికెడు నా దేవ ♦ ములను శ్రీశు
నవయవంబులు గాఁగ భూ ♦ ధవుఁడు ప్రేమ
ననుదినంబును బాయక ♦ ఘనతఁ దలఁచి
యఖిల రాజ్యానుసంధానుఁ ♦ డగుచు నుండె. 94

క. ఈరీతిఁ గర్మసిద్ధుల
నారయ నత్యంత శుద్ధ ♦ మగు చిత్తముతో
నా రాచపట్టి భరతుఁడు
ధారుణిఁ బాలించె నధిక ♦ ధర్మాన్వితుఁడై 95

వ. మఱియు నా భరతుండు శ్రీవత్సకౌస్తుభ వనమాలాలంకృతుండును సు[2]దర్శనాద్యాయుధోపలక్షితుండును నిజభక్తజన హృదయారవింద నివాసుండును బరమపురుషుండును నైన వాసుదేవునియందు నధిక భక్తి ననుదినంబును జేయుచు నేఁబదిలక్షల వేలేండ్లు రాజ్యంబు సేసి పితృపితామహాద్యాయాతంబగు నా ధనంబును యథార్హంబుగఁ బుత్రులకు బంచి యిచ్చి బహువిధ సంపదలు గలగృహంబును బాసి పులహాశ్రమంబున కరిగె నంత. 96

---

1. చాతుర్మాస్యలు = ఆషాఢపూర్ణిమ మొదలు కార్తికపూర్ణిమ వరకుఁ గల నాలుగు నెలల కాలము. ఆకాలమున యతులు కదలకుండ నొక్క చోట యుందురు.

2. సుదర్శనము = విష్ణు చక్రము

సీ. ఏ యాశ్రమంబున ♦ నిందిరాధీశ్వరుఁ
డచ్చటివారల ♦ నాదరించి
ప్రత్యక్షమున నుండుఁ ♦ బాయక యెప్పుడు
నట్టి రమ్యం బైన ♦ యాశ్రమమున
నిలిచి సా[1]లగ్రామ ♦ ములు గల గండకీ
నది యొందు నెంతయుఁ ♦ గదిసి యుండు
నచ్చోట నేకాకి ♦ యగుచును భరతుండు
బహువిధ నవపుష్ప ♦ పల్లవముల
తే. సతుల తులసీదళంబుల ♦ నంబువులను
గందమూలాదిఫలములఁ ♦ గంజములను
ఘనత నర్పించి నిచ్చలుఁ ♦ దనివి లేక
సేవ సేయుచు నుండె నా ♦ శ్రీపు హరిని. 97

వ. దానం జేసి విగత విషయాభిలాషుండై శమదమాది గుణంబులు గలిగి యథేచ్ఛం జేసి మెడ తెగక పరమపురుషుని పరిచర్యాభక్తిభరంబున శిథి[2]లీకృతహృదయగ్రంథి గలిగి సంతోషాతిశయంబునం బులకితాంగుండు నానందబా[3]ష్పనిరుద్ధావలోక నయనుండు నగుచు నిజస్వామియైన హరిచరణారవిందానుధ్యానపరిచిత భక్తియోగంబునం బరమానందగంభీరహృదయం బను నమృతహ్రదంబున నిమగ్నుండగుచుఁ దా నపుడు పూజించుపూజ నెఱుంగక యిట్లు భగవద్వ్రతంబు ధరియించి యేణాజినవాసస్త్రిషవణస్నానంబుల నార్ద్రకుటిలకపిశవర్ణజటాకలాపంబులు గలిగి మార్తాండాంతర్గతుండయిన పరమేశ్వరుని [4]హిరణ్మయ పురుషునింగాఁ దలంచుచు నిట్లనియె 98

1. సాలగ్రామములు = సాల మను పురుగునకు నివాసములైన శిలలు. వీనినే సాలగ్రామము లందురు. (తులసి) బృంద శాపము వలన విష్ణువే శిలారూపమును వహించెను.
2. శిథి........గ్రంథి = చెదరఁగొట్టఁబడిన మనస్సనెడుముడి. 3. బాష్ప.... నయనుఁడు=కన్నీళ్ళచేత నడ్డగింపఁ బడిన చూపులు గల నేత్రములు గలవాఁడు
4. హిర........షుఁడు = బంగారు వర్ణము వాఁడు,

సీ. కర్మ ఫలంబులఁ ♦ గడఁక నిచ్చుచు మనో
వ్యాపారమున నిట్టి ♦ యఖిల లోక
ములఁ జేసి యాలోక ♦ ములకు నంతర్యామి
యగుచు బ్రవేశించి ♦ యంత మీఁద
నానందరూప మై ♦ నట్టి బ్రహ్మముఁ గోరు
చున్న జీవుఁ దనయం ♦ దున్న యోగ
శక్తిచేఁ దగ నని ♦ శంబుఁ బాలనసేయు
చుండి యంతటను మా ♦ ర్తాండమధ్య

తే. వర్తి యగుచు నిట్లు ♦ వఱలుచు జగముల
యందు నుండి ప్రకృతిఁ ♦ బొంద కంత
నతులదివ్యమూర్తి ♦ యైన యానందరూ
పమును శరణ మొందె ♦ భరతవిభుఁడు 99

వ. అంత నాభరతుం డొక్కనాఁ డా మహానదింగృతాభిషేకుం డయి ముహూర్తత్రయం బంతర్జలంబులందుఁ బ్రణవోచ్చారణంబు సేయు చుండు సమయంబున నిర్భ[1]రగర్భిణియగు నొక్కహా[2]రిణి జలార్థిని యై యొంటిజలాశయ సమీపంబునకువచ్చి జలపానంబు సేయు నెడ నాసమీపంబున మృ[3]గపతి గర్జించి లోకభయంకరంబుగ నాదం బుసేయ నాహరిణి స్వభావంబున భీతయగుటం జేసి బెగ్గడిలి హరి విలోకన వ్యాకులచిత్తయై దిగ్గన నదరి గగనంబునకు నెగిరి య[4]గత తృషయగుచు నది నుల్లంఘించు నెడ నధికభయంబునం జేసి యా గర్భంబు యోనిద్వారంబున గళితంబై జలంబులంబడియె నాహరిణి యుల్లంఘునాది భయంబునం జేసి తత్తీరంబున నుండుగిరిదరిం బడి

1. నిర్భరగర్భిణి = మోయుటకు వీలుకాని నిండుచూలాలు 2. హరిణి జలార్థిని = లేడినీళ్లకొఱకు వచ్చినది. 3. మృగపతి = సింహము. 4. అగతతృష = పోయినకోరిక.

శరీరంబుఁ బాసె నంత నాహరిణ[1]పోతంబు జలంబులం దేలుచున్న భరతుండు గను విచ్చి చూచి కరుణార్ద్రచిత్తుండై మృత జనని యగు నా హరిణపోతంబును దన యాశ్రమంబునకుం గొంపోయి మిక్కిలి ప్రీతిసేసి యుపలాలనంబు సేయుచుఁ బో[2]షణపాలనప్రీణన లాలనానుధ్యానంబుల భరతునకు నాత్మనియమంబులైన యష్టాంగయోగంబులును బరమపురుషపూజాపరిచర్యాదులు నొక్కొక్కటిగఁ గ్రమక్రమంబునం గొన్నిదినంబులకు సమస్తంబును నుత్సన్నంబయ్యె నంత 100

క. ఘనతపము చలన మొందుట
యును భరతుం డెఱుఁగ కాత్మ ♦ యోగంబునఁ జ
య్యనఁ బాసె హరిణపోతముఁ,
దనమదిలో నిల్పి ప్రీతి ♦ తప్పక పలికెన్. 101

ఉ. అక్కట తల్లిఁ బాసి హరి ♦ ణార్భక మాప్తులు లేమిఁ జేసి యే
దిక్కును లేక యున్న నిటఁ ♦ దెచ్చితి నాయెడ [3]నీమృగార్భకం
బెక్కుడుప్రేమసేసి చరి ♦ యించుచు నున్నది నాదు సన్నిధిన్
మక్కువచేసి దీనిఁ గడు ♦ మన్ననలం దగఁ బ్రోతు నెంతయున్.

క. శరణని వచ్చినజంతువుఁ
గరుణం గనువిచ్చి చూచి కాచినఁ బుణ్యం
బరయఁగ నధికం బని ముని
కర మెఱిఁగించిరి మునీంద్రగణములుప్రేమన్

వ. అని యిట్లు హరిణపోతంబుం దనయాశ్రమంబున నత్యాసక్తిం జేసి యాసనశయనాటన స్నానసమిత్కుశ కుసుమఫలపలాశమూలోదకాహరణ దేవపూజాజపాదులయెడం దనయొద్దన యునిచికొనుచు

1. హరిణపోతము = జింకపిల్ల. 2. పోషణ........బులు = కాచుట, మేతబెట్టుట సంతోష పెట్టుట, లాలించుట.
3. మృగార్భకము = (జింక) లేడి పిల్ల.

వృ[1]కసాలావృకాది క్రూరమృగంబులవలని భయంబున వనంబుల వెనువెంటం దిరుగుచు నధిక [2]ప్రణయభరపరీతహృదయుం డగుచు నతిస్నేహంబునం జేసి కొంతసేపు స్కంధంబుల వహించుచు మఱి కొంత తడ వురంబున నుత్సంగంబున నుంచికొని లాలించుచు సంతసంబునొందు మఱియు నా భరతుండు నిత్యనైమిత్తికాది క్రియాకలాపంబు నిర్వర్తించు నెడ నంత నంత లేచి హరిణకుణకంబుఁ జూచుచుఁ [3]గించిత్స్వస్థహృదయుండై దానినాశీఃపరంపరల నభినందించుచుఁ జుంబనాదుల బ్రీతి సేయుచు నతిమోహంబునం బెంచుచుండు నెడ. 104

తే. గరిమ నీగతి మెల్లన ♦ కెరలు వొడిచి
చెలఁగి యాడంగ భరతుండు ♦ చిత్తమందు
సంతసిల్లుచునుండె నా ♦ శ్రమముఁ బాసి
హరిణడింభక మంతలో ♦ నరిఁగి చనిన. 105

వ. భరతుం డంతం దన్మృగ[4]శాబకంబు గానంబడమికి వ్యాకులితచిత్తుం డగుచు [5]నష్టధనుండునుంబోలె నతిదీనుండై కరుణతోడం గూడి తద్విరహవిహ్వలమతియై దానిన తలంచుచు నతిశోకంబుతో మనంబున దుఃఖించి యిట్లనియె. 106

తే. హరిణపోతంబ నీకు వ ♦ నాంతమందుఁ
గ్రూరమృగబాధ లేకుండఁ ♦ గోరుచుండఁ
దలఁగి పోయితె యనుచుఁ జి ♦ త్తంబునందు
రాజవృషభుండు భరతుఁ డా ♦ రాట మంది. 107

1. వృకము = తోడేలు. 2. హరిణ కుణకము = జింక పిల్ల. 3. కించిత్స్వస్థ = కొంచెము నెమ్మతి.

4. శాబకము, డింభకము = బిడ్డ లేక పిల్ల

5. నష్టధనుఁడు = పోగొట్టుకొనంబడిన ధనము గలవాఁడు.

తే. తల్లి చచ్చిన హరిణపో ♦ తంబు వచ్చి
పుణ్యహీనుండ నగునన్నుఁ ♦ బొంది పాసె
నేమి సేయుదు నే నింక ♦ నెట్లు గందుఁ
జేరి యేరీతిఁ గాంచి ర ♦ క్షించుకొందు. 108

క. కట్టా యీ యాశ్రమమునఁ
బుట్టినతృణచయము మేసి ♦ పొదలినహరిణం
బిట్టట్టుఁ దిరుగు చుండఁగఁ
బట్టిమృగేంద్రుండు గొట్టి ♦ బాధించె నొకో. 109

వ. ఇట్లు భరతుండు హరిణకుణక క్షేమంబు గోరుచు నెప్పుడువచ్చి నన్ను సంతోషపఱచు నానాప్రకారంబులైన తనగతులచేత నన్ను నెప్పుడానందంబు నొందించు ధ్యానసమాధి నున్నప్పుడు నన్నుఁ గొమ్ముల గోఁకుచు నుండునట్టి వినోదంబు లెప్పుడు గనుఁగొందు దేవపూజా ద్రవ్యంబులు ద్రొక్కి మూర్కొనినం గోపించి చూచినం గుమారుండునుంబోలె దూరంబునకుం జని నిలిచి మరలనేఁ బిలిచిన వెనుక నిలిచి యుండు నిట్టి మెలఁకువస్వభావంబులు గలుగుట యెట్టు లీభూదేవి యెంతతపంబు చేసి నదియో యాహరిణపాదస్పర్శంబులం బవిత్ర మైనభూమి స్వర్గాపవర్గకాములైన మునులకు యజ్ఞార్హ యగు నట్టిహరిణ పోతంబు నెట్లు గనుఁగొందు నదియునుం గాక భగవంతుం డగు చంద్రుండు మృగపతి భయంబున మృత[1]జననియు స్వా[2]శ్రమపరిభ్రష్టంబు నైన మృగశాబకంబును గొనిపోయి పెంచుచున్నవాఁడో మున్ను పుత్రవియోగ తాపంబునం జంద్రకిరణంబులం బాపుదు నిపుడు హరిణపోతంబు దన శరీరస్పర్శంజేసి చంద్రకిరణంబులకన్న నధికంబగుచుం బుత్రవియోగతాపంబు నివర్తింపం జేసె ననుచుం బెక్కుభంగుల హరిణనిమిత్తంబులైనమనోరథంబులచేతం బూర్వకర్మ

1. మృతజనని = చచ్చిన తల్లి. 2. స్వాశ్ర......ష్టము = తా నుండు చోటు నుండి జారి.చెడుట.

వశంబున యోగభ్రష్టుండగు భరతుండు భగవదారాధనంబువలన విభ్రంశితుండగుచు నితరజాతిం బుట్టిన హరిణపోతంబు మీఁదిమోహం బగ్గలం బగుచుండ నుండెనని పలికి శుకయోగీంద్రుండు మఱియు నిట్లనియె. 110

సీ. జననాథ మున్ను మో ♦ క్షవిరోధ మనిపాయఁ
గారాని పుత్రాది ♦ కంబు నెల్లఁ
బాసి తపస్వియై ♦ భరతుండు హరిణశా
బకపోషణంబునఁ ♦ బాలనమున
నటలాలన ప్రీణ ♦ నానుషంగంబుల
మూ[1]షకబిల మతి ♦ రోషమునను
సర్పంబు సొచ్చిన ♦ చందంబునను యోగ
విఘ్నంబు మిక్కిలి విస్తరిల్లెఁ

ఆ. గాన యెంతవాని ♦ కైనను గాలంబు
గడవ రామినట్లు ♦ గాక పోదు
పరమమునుల కైనఁ ♦ బాయవు కర్మంబు
లారులనంగ నెంత ♦ నరవరేణ్య. 111

వ. ఇట్లు భరతుండు మృగవియోగతాపంబు నొందుచుండు నెడ నామృగశాబకంబు ననుసరించిన సంతసిల్లుచుండె నంత నొక్కనాఁడు

మ. భరతుం డల్లన యంత్యకాలము వెసం ♦ బ్రాపింపఁగా నప్పుడా
హరిణంబుం గడుభక్తిఁ బుత్రుగతి న ♦ త్యాసక్తి వీక్షింప నా
హరిణంబుం దనయాత్మలో నిలిపి దే ♦ హంబంతటం బాసి తా
హరిణీగర్భమునన్ జనించి హరిణం ♦ బై యొప్పెఁ బూ[2]ర్వస్మృతిన్.

వ. ఇట్లు భరతుండు హరిణీగర్భంబునం బుట్టియు భగవదారాధన సామర్థ్యంబునం దనమృగజన్మ కారణంబుఁ దెలిసి కడుం దాపంబు నొందుచు నిట్లనియె. 114

---

1. మూషక బిలము - ఎలుక కన్నము.

2. పూర్వ స్మృతి = వెనుకటి పుట్టుక యందలి పనులు తలంపునకు వచ్చుట

ఉ. రాజులు ప్రస్తుతింప సుర[1] ♦ రాజ సమానుఁడ నై తనూజులన్
రాజులఁ జేసి తాపసులు ♦ రాజఋషీంద్రుఁ డటంచుఁ బల్కఁగాఁ
దేజము నొంది యాహరిణ ♦ దేహమునందలి ప్రీతిఁ జేసి నా
యోజ సెడంగ నేఁ జెడితి ♦ యోగిజనంబులలోన బేల నై. 115

వ. ఇట్లు శ్రీహరిశ్రవణమనన సంకీర్తనారాధనానుస్మరణాభియోగం బులం జేసి యశూన్య[2]సకలయామం బగుకాలంబుగలనాకు హరిణ పోతస్మరణంబుకతంబున యోగవిఘ్నంబు ప్రాప్తం బయ్యె మో క్షదూరుండ నైతి నని నిగూఢనిర్వేదుం డగుచుఁ దల్లిం బాసి క్రమ్మఱ నుపశమశీలమునిగణసేవితం బయి భగవత్క్షేత్రం బైన సాలతరునిబిడ తమగ్రామసమీప పులస్త్యపులహాశ్రమంబులకుం గాలాంజనపర్వతంబువలనఁ జనుదెంచి యందు మృగదేహత్యా గావసానంబు గోరుచు సంగంబు విడిచి యేకాకియగుచు శుష్క పర్ణతృణవీరుదాహారుఁ డై మృగత్వనిమిత్తంబగు నా నదీ తీర్థం బునందు నవసానంబు గోరుచుఁ దత్తీర్థోదకక్లిన్నం బగుచునుండు శరీరంబు విడిచెనని శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునకు విని పించి మఱియు ని ట్లనియె. 116

భరతుండు హరిణజన్మంబు విడిచి బ్రాహ్మణుం డై జనించుట.

సీ. హరిణదేహముఁ బాసి ♦ యంతనాంగిరసాహ్వ
యుండు శుద్ధుఁడు పవి ♦ త్రుండుఘనుఁడు
శమదమఘనతప ♦ స్స్వాధ్యాయనిరతుండు
గుణగరిష్ఠుఁడు నీతి ♦ కోవిదుండు
నైన బ్రాహ్మణునకు ♦ నాత్మజుం డై పుట్టి
సంగంబువలనను ♦ జకితుఁ డగుచుఁ
గర్మబంధంబుల ♦ ఖండింపఁజాలు నీ
శ్వరుని నచ్యుతు నజు ♦ శ్రవణమనన

1. సురరాజ సమానుఁడు = దేవతల రాజైన ఇంద్రునితో సరియైన వాఁడు.

2. అశూన్య సకల యామము = (శూన్యము కాని) ఉన్న యన్ని జాములు.

తే. ములను హరిచరణ ధ్యాన ♦ ములను విఘ్న
భయమునను జేసి మానముండు ♦ బాయనీక
నిలిపినసంస్తుతి సేయుచు ♦ నిలిచియుండె
భరితయశుఁడైన భరతుండు ♦ పార్థివేంద్ర 117

వ. ఇట్లాంగిరసుండు ప్రథమభార్యయందుఁ బుత్రనవకంబును గనిష్ఠ భార్యయందు స్త్రీపురుషుల నిద్దఱను గలుగంజేసిన సందుఁ బురుషుండు పరమభాగవతుండును రాజర్షిప్రవరుండును నుత్సృష్టమృగశరీరుండును జరమశరీరంబునం బ్రా[1]ప్తవిప్రశరీరుండును నగు భరతుం డయ్యె నతం డాజన్మంబున నన్యజనసంగంబు జన్మపరంపరలకుఁ గారణం బని యత్యంతభయంబు నొంది కర్మబంధవిధ్వంసన శ్రవణస్మరణాదుల శ్రీహరి యనుగ్రహంబునం బూర్వజన్మపరంపరల సంస్మరించుచుఁ దనస్వరూపంబు నున్మత్తజడాంధబధిరరూపంబుల లోకులకుం జూపుచుండె నంత 118

మ. జనకుం డాంగిరసుండు నాత్మజుని వా ♦ త్సల్యంబునం బెంచుచుం
దనరం జౌల[2]ముఖాగ్రకర్మములచే ♦ తఁ సంస్కృ[3]తుంజేసి పా
యని మోహంబున నిచ్చలుంగడఁక శౌ ♦ చాచారముల్ సెప్పినన్
ఘనుఁ డా భాగవతుం డనుష్ఠితిని ద ♦ త్కర్మంబులం గైకొనెన్.

వ. ఇట్లు బ్రాహ్మణకుమారుండు గర్మంబులయందు నిచ్ఛ లేక యుండియును పి[4]తృనియోగనిర్బంధంబునం బితృసన్నిధియందు సమీచీనంబుగా వ్యాహృతిప్రణవ శిరస్సహితం బగునట్లుగా యత్రిమంత్రంబు జపియించుచుఁ జైత్రాది చతుర్మాసంబుల సమవేతంబుగ వేదంబుల సధ్యయనంబు సేయుచుండె జనకుం డాత్మజుని శిష్టాచారం

1. ప్రాప్తవిప్రశరీరుఁడు = పొందఁబడిన వేదము చదివిన బ్రాహ్మణశరీరము గలవాఁడు.
2. చౌల ముఖాగ్ర్యకర్మలు = చెవులు కుట్టించుట మొదలైన మొదటిపనులు (శ్రేష్ఠ కార్యములు) 3. సంస్కృతుఁడు = చక్కపరుచఁబడినవాఁడు.
4. పితృ........బంధులు = తండ్రి మాట యనెడు నడ్డు.

బుచే శిక్షింపవలయు నను లోకాచారంబు ననువర్తించి యాత్మ భూతుండగు నాత్మజునందు నభినివేశితచిత్తుం డగుచు శౌచాచమ నాధ్యయన వ్రతనియమ [1]గుర్వనల శుశ్రూషణాదికంబుల నభియు క్తంబు లయినం బుత్రునిచే నొనరింపించుచు నప్రాప్తమనోరథుం డయ్యె నంత. 120

క. ఈరీతిని గొడుకున కా
చారంబులు గఱపి చింత ♦ సద్గృహమున సం
సారి యగు చుండి విప్రుఁడు
బోరన దేహంబుఁ బాసి ♦ పోయిన మీఁదన్. 121

ఆ. తల్లి తండ్రితోడ ♦ దా నగ్నిఁ జొచ్చిన
నతని మహిమ లెఱుఁగ ♦ కంతలోన
సవతితల్లి కొడుకు ♦ లవివేకులగుచును
శాస్త్రవిద్య లతనిఁ ♦ జదువనీక. 122

వ. ఇట్లు బ్రాహ్మణకుమారుని సవతితల్లికొడుకులు వేదవిద్యలవలనం బాపి గృహకర్మంబుల నతని నియమించిన. 123

క. ధరణీసురోత్తముఁడు దా
నరుసుగఁ దమువారు సెప్పి ♦ నవి యెల్లను సే
మఱ కందుఁ బ్రీతిసేయక
నిరతము గృహకర్మ మట్లు ♦ నెఱపుచు నుండెన్. 124

వ. ఇట్లు గృహకర్మ ప్రవర్తనుం డగుచు నుండ మూఢు లగుద్వి[2]పా త్పశువులచే నున్మత్త జడ బధిర యని యూహాయమానుం డగు నపుడు తదను రూపంబు లగు సంభాషణంబుల నొనర్చుచుఁ బరే[3] చ్ఛా[3]యదృచ్ఛలం జేసి విష్టి వేతనయాజ్ఞాదుల వలన నియుక్తకర్మం బులం బ్రవర్తించుచు. 125

1. గుర్వనలశుశ్రూష = గురుపు యొక్క అగ్నిపూజ.
2. ద్విపాత్పశువులు = రెండు కాళ్ళ (జంతువులు) మానవులు. 3. పరేచ్ఛాయ దృచ్ఛలు = ఒకరిచే గోరఁ బడినవి తన చేత గోరబడినవి.

తే. అతుల దివ్యాన్నమైన మృ ♦ ష్టాన్నమైన
నెద్ది వెట్టిన జిహ్వకు ♦ హితముగాను
దలఁచి భక్షించుఁ గాఁ గోరుఁ ♦ దలఁచి మిగులఁ
బ్రీతి సేయఁడు రుచులందుఁ ♦ బెంపుతోడ. 126

వ. మఱియు నావిప్రుండు నిత్యానందసుఖలాభంబు గలిగి బాహ్య సుఖదుఃఖంబులయందు దేహాభిమానంబు సేయక శీతోష్ణవాత వర్షాతపంబులకు నోడి పైచీర గప్పక వృషభంబునుంబోలెఁ బీనండును గఠినాంగుండును నగుచు స్థండిలశాయియై ర[1]జఃపటలంబునం గప్పంబడిన దివ్యమాణిక్యంబునుంబోలె ననభివ్యక్త బ్రహ్మవర్చసుండై మలినాంబరపరీతకటీతటుండు నతిమషీ[2]లిప్తయజ్ఞోపవీతుండు నగుటం జేసి యజ్ఞజనంబులచేఁ బ్రాహ్మణాభాసుండు మందుండు నని పలుక సంచరించుచుండం గర్మమూలంబునం బరులవలన నాహారంబు గొనునపుడు దమవారును వ్యవసాయకర్మంబునందు నియమించిన క్షేత్రవిహితసమవిషమన్యూనాధికంబుల నెఱుంగక ప్రవర్తిల్లుచు నూఁక తవుడు తెలికపిండిపొట్టు మాఁడు ద్రబ్బెడ యాదిగాఁ గల ద్రవ్యంబులయందు నమృతంబు పగిది రుచిసేసి భక్షించుచుం జేనికావలియుండు నెడ నొక్కనాఁడు. 127

—వృషలరాజభృత్యులు కాళిబలికి భరతునిం గొంపోవుట—

క. పురిలోన వృ[3]షలపతి దా
నరుదుగ సంతానకాముఁ ♦ డై వేడుకతోఁ
బురుషుఁ డగు పశువుఁ గాళికి
దరుముక గొనిపోవఁ బశువు ♦ దలఁగిన భృ[4]త్యుల్ 128

ఆ. అరసి కానలేక ♦ యారాత్రి వీరాస
నమునఁ జేసి కాపు ♦ విమలబుద్ధి

1. రజః పటలము = దుమ్ము మొత్తము 2 మషీ............వీతుఁడు = మసి బూసిన జన్నిదము గల వాఁడు.
3. వృషలపతి = శూద్రరాజు 4. భృత్యులు = భటులు

నెసఁగు విప్రయోగి ♦ నీతనిఁ బొడగాంచి
పశువు మంచి దనుచుఁ ♦ బట్టి రతని. 129

క. ఆరీతిని భూసురవరు
నారయ నా కాళికా గృ ♦ హమునకు భృత్యుల్
బోరనఁ గొనిచని సల్పిరి
చారుతరాభ్యంజనాది ♦ సంస్కారంబుల్. 130

వ. ఇట్లభ్యంజనాదికృత్యంబులు దీర్చి నూతన వసనంబు గట్ట నిచ్చి గంధపుష్పాభరణాక్షతాలంకృతునిం జేసి మృష్టాన్నంబులు భుజి యింపం బెట్టి ధూ[1]పదీపమాల్యలాజకిసలయాంకురఫలోపహారాదులు సమర్పించి మహావాద్యఘోషంబులతోడ నా పురుషపశువుం గాళికాదేవి సమ్ముఖంబున నాసీనుం గావించి యా వృషలపతి పు[2]రుషపశువు రక్తంబున భద్రకాళి సంతోషపెట్టం దలంచి కాళికా మంత్రాభిమంత్రితంబు నతి కరాళంబు నైనఖడ్గం బంది నిజాభీష్ట సిద్ధికి హింసింపం దలంచిన. 131

సీ. సర్వభూతములకు ♦ సఖుఁడును బ్రహ్మభూ
తాత్ముఁడు నిర్వైరుఁ ♦ డయిన బ్రహ్మ
సుతుని తేజం బంతఁ ♦ జూడ దుస్సహ మైన
భయమంది వడఁకుచు ♦ భద్రకాళి
క్రోధంబు మ్మడి ♦ గొనఁగ హుంకారంబు
సలుపుచు నట్టహా ♦ సంబు సేసి
పాపాత్ములును ద్రొష్ట్య ♦ పరులును రాజస
తామసకర్మసం ♦ ధాను లగుచు

---

1. ధూప............హారాదులు = ధూపము, దీపము, పూదండలు, వరిపేలాలు చిగురుటాకులు, పండ్లు మొదలైన కానుకలు. 2. పురుష పశురక్తము= మగవాఁ డను గొడ్డు నెత్తురు.

తే. విప్రవరు నల్లు హింసించు ♦ వృషలపతిని
భృత్యవర్గంబుఁ దోడ్తోడఁ ♦ బృథ్విఁ గూల్చి
యపుడు వృషలాధిపుని శిర ♦ మంది లీలఁ
బాడియాడుచు నందంద ♦ క్రీడ సలిపె. 132

క. ధరలోన నెవ్వ రేనిని
ధరణీసురవరుల కెగ్గు దగఁ దలఁచిన వా
రరయఁగఁ జెడుదురు నిక్కము
హరి ధరణీసురవరేణ్యు ♦ లం దుండుటచేన్. 133

వ. మఱియును. 134

ఉ. అచ్చట విప్రసూనుఁడు భ ♦ యం బొకయించుక లేక చంపఁగా
వచ్చినవారియందుఁ గర ♦ వాలమునందును గాళియందుఁ దా
నచ్యుతభావ ముంచి హృద ♦ యంబునఁ బద్మదళాక్షు నెంతయుఁ
మచ్చికతోడ నిల్పి యను ♦ మానము నొందక యుండె నెంతయున్.
వ. మఱియు నా విప్రవరుండు చండికాగృహంబు వెలువడి క్రమ్మఱం
జని కావలియుండు నెడ. 136

సీ. అంతటఁ గొన్ని హా ♦ యనములు సన సింధు
భూపాలనము సేయు ♦ భూవరుండు
ధీరత నిక్షుమ ♦ తీతీరమున నున్న
కపిలమహామునిఁ ♦ గాంచి తత్త్వ
విజ్ఞాన మెఱుఁగెడు ♦ వేడ్కతోడుత శిబి
కారోహణము చేసి ♦ యరుగుచుండ
నాలోన నా[1]శిబి ♦ కావహు లా చేనఁ
గా పున్న విప్రునిఁ ♦ గాంచి తెచ్చి
తే. శిబిక మోపింత మీతని ♦ చేత ననుచుఁ
బట్టి మూఁపునఁ బల్లకిఁ ♦ బెట్టి మోవ

1. శిబికా వహులు = మేనా బుజముల నిలిపిన వాండ్రు. (మోతగాండ్రు)

మనుచు మోపించునంత ధ ♦ రామరుఁడు
శిబిక మూఁపున నిడి యుండుఁ ♦ జింత లేక. 137

క. తన మనసుకోలఁది నప్పుడు
మునుకొని యట్లప్రయత్న ♦ మున నడవఁగ నా
జనపతి నిమ్నోన్నతమై
చనుట యెఱిఁగి శిబిక మోచు ♦ జనులకు ననియెన్. 138

ఆ. మీర లిప్పు డిచటఁ ♦ జేరి మిక్కిలి ప్రయ
త్నంబుతోడఁ దగిలి ♦ నడచు చుండ
విషమ మగుచు గమన ♦ వేగంబు నను బాధఁ
బెట్టుచున్న దనిన ♦ బెస్త లనిరి. 139

వ. దేవా యీవిషమగమనంబు మావలన నైనది గా దీతు[1]రీయవాహకుండు సుఖగమనంబుగా నడవ నేరండు వీనితోడ మేము నడవ నేర మనిన రహూగణుండనునారా జుపాసితవృద్ధజనుండైనను బలాత్కారంబునం బుట్టిన కోపంబునం గోపించి విమర్శ దప్పి నీఱుగప్పిన నిప్పునుంబోలె నెఱుంగ రాని బ్రహ్మతేజంబుగల బ్రాహ్మణునికిం గంటకంబుగా నిష్ఠురవాక్యంబుల నిట్లనియె. 140

చ. అలసితి వెంతయున్ ముసలి ♦ వాఁకట డస్సితి వెన్ను మిక్కిలిం
బలుచన యున్నదీ శిబిక ♦ భారము దూరము మోసి తేగతిన్
నిలిచెద వంచు భూవరుఁడు ♦ నిష్ఠురముల్ దగఁ బల్క నాయెడం
బలుకక మోసె నాశిబిక ♦ బ్రాహ్మణవర్యుఁడు పార్థివేశ్వరా. 141

వ. అప్పు డావిప్రవరుండు దనకుం గడపటిశరీరం బయిన కళేబరంబునందు నహంకారమమకారంబులం బొంద నీక మి[2]థ్యాజ్ఞానరహితుం డై బ్రహ్మభూతుం డై మౌనవ్రతంబున నాశిబిక మోచుచున్న విషమగమనంబుఁ జూచి యతికుపితుం డగుచు నాభూవరుండు వెండియు ని ట్లనియె. 142

---

1. తురీయవాహకుఁడు = చివర మోతగాఁడు. 2. మిథ్యాజ్ఞాన రహితుఁడు = కల్ల తెలివిలేని వాఁడు.

సీ. ఓరి దుర్మద విన ♦ రోరి జీ[1]వన్మృత
నాయాజ్ఞఁ దప్పించి ♦ నడచె దీవు
ఈ వక్రమార్గంబు ♦ లిన్నియు విడిపించి
నడపింతు నిన్ను స ♦ న్మార్గమందు
నని [2]రాజగర్వాంధుఁ ♦ డగుచు గుణత్రయం
బున వృద్ధిఁబొందిన ♦ భూవరుం డ
బద్ధప్రలాపముల్ ♦ వల్కుచుండినఁ జూచి
శమదమాదులచేఁ బ్రి ♦ శస్తుఁ డగుచు
తే. జగతి బ్రహ్మస్వరూపమై ♦ సకలభూత
ములకు నత్యంతహితుఁడైన ♦ భూసురుండు
యో[3]గివర్తన దెలియ లే ♦ కున్న రాజు
నంత వీక్షించి యల్లని ♦ ట్లనుచుఁ బలికె. 143

—♦ భరతుండు రహూగణునిమాటలకుఁ బ్రత్యుత్తరంబు లిచ్చుట ♦—

వ. నరేంద్రా నీవు సెప్పినది సత్యంబు భారం బీ శరీరంబునకే కాని నాకుం గలుగనేరదైనను స్థౌల్యకార్శ్యంబులు వ్యాధులు నాధులు [4]క్షుత్తృష్ణలు నిచ్ఛావిరోధభయంబులు జరామరణంబులు రోష నిద్రాజాగరణంబులు నహంకారమమకార మదశోషణాదులును దేహంబుతోడన జనియించుం గాని నాకుం గలుగనేరవు జీవన్మృతుండ నేనకా దాద్యంతంబులు గలుగుటం జేసి యందఱయందును గలిగియుండు స్వామిభృత్యసంబంధంబులు విధికృతంబు లగుచు వ్యవహారంబులం జేసి శరీరంబులకుం గలుగుం గాని జీవునికి లేకయుండు నదియునుం గాక రాజాభిమానంబున నీవు నన్నాజ్ఞాపించెదవేని ప్రమత్తుండవైన నీకుం బూర్వస్వభావం బెట్లుండెనట్లు గాక బోలె యే నేమిసేయుదు నెఱింగింపు [5]మున్మత్తమూకాంధజడులుం

---

1. జీవన్మృత=బ్రతికియుఁ జచ్చిన వాఁడా! 2. రాజగర్వాంధుఁడు = రాజను పొగరు చేతఁ గన్నుఁ గానని వాఁడు. 3. యోగివర్తన = జోగినడక. 4. క్షుత్తృష్ణలు = ఆకలి దప్పికలు. 5. ఉన్మత్త... ....జడులు = ఒడలు తెలియనివాఁడు, మూఁగ వాఁడు, గ్రుడ్డివాఁడు, పిచ్చివాఁడు.

సహజ స్వభావంబునుం బొందిన నాయందు నీశిక్ష యేమిలాభంబుఁ బొందింప నేర్చు నదియునుంగాక స్తబ్ధుండు మత్తుండు నైననాకు నీశిక్ష వ్యర్థంబగు నని పలికి యుపశమశీలుండైన మునివరుండు పూర్వకర్మ శేషంబునం గల్గు భారవాహకత్వంబుం దలంగం ద్రోయుటకు భారంబు వహించి శిబిక మోచుచుం జనునెడ నారాజవల్లభుండు దత్త్వజ్ఞానాపేక్షితుండై చనియెడివాఁ డగుటం దన [1]హృదయగ్రంథివిమోచకంబులును బహుయోగగ్రంథసమ్మతంబులును నగు బ్రాహ్మణవాక్యంబులు విని యా శిబిక దిగ్గన డిగ్గ నుఱికి యావిప్రునికి సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి సర్వగర్వవర్జితుండై ముకుళితహస్తుండగుచు నిట్లనియె. 144

సీ. ధరణీసురులలోనఁ ♦ దలఁప నెవ్వఁడవు నీ
వ[2]వధూతవేషి వై ♦ యవనియందు
నేమిటికై చరి ♦ యింపంగ వచ్చితి
చట నొక్కఁడవు నొంటి ♦ సనుట నేఁడు
ననుఁగృతార్థునిఁ జేయ ♦ ననుకూలుఁ డగుచున్న
యట్టి యా కపిలమ ♦ హామునీంద్రుఁ
డవొ నీమహత్త్వంబు ♦ దవిలి విచారింప
నెఱుఁగక చేసితిఁ ♦ గరుణఁ జూడు

తే. తప్పు సైరింపు నే యమ ♦ దండమునకు
హరుని శూలంబునకునువ ♦ జ్రాయుధమున
కనల చంద్రార్కధనదశ ♦ స్త్రాస్త్రములకు
వెఱవ విప్రుని కేమది ♦ వెఱచినట్లు. 145

వ. మఱియు నిస్సంగుండ వయి జడుండునుంబోలె నిగూఢవిజ్ఞానంబు గలిగి చరియించుచు నున్నవాఁడవు నీవచనంబులు యోగశాస్త్ర సమానంబులై వాఙ్మనసంబులకు నభేద్యంబు లయి యున్నవే

1. హృదయ గ్రంథి = మనస్సునెడు ముడి. 2. అవధూతవేషి = దిగంబరుఁడైన జోగి వేసము గలవాఁడు.

న[1]విష్ణుకళావతీర్ణుండు [2]సాక్షాద్ధరియు నగు కపిలమహామునివలన
బ్రహ్మవిద్య దెలియం గోరి చనుచున్నవాఁడ నీవు లోకనిరీక్ష
ణార్థం బవ్యక్తలింగుండ వై చరియించుచున్న కపిలమహాము
నీంద్రుండవు గాఁబోలుదువు మందుండైన గృహస్థుండు యోగీశ్వ
రచరిత్రంబు లెట్టు లెఱుంగ నేర్చుఁ గర్మవశంబున దృష్టం బైన
భ్రాంతి వహించుచు నడచుచు నున్న యీ యాశ్రమంబు నాకు
నుం బోలె నీకు నగు నని తోఁచుచున్న దది యెట్లనిన ఘటంబు
లేక జలంబు దే నేరని తెఱంగున లేనిది గలుగ నేరదు గావునం
బ్రమాణ మూలం బయిన లోకవ్యవహారంబు సత్యపథంబున సమ్మ
తంబై యుండుటం జేసి నీ వాడువాక్యంబులు నాకు సమ్మతంబు
గానేర వని సింధుదేశాధీశ్వరుండు వినిపించిన నా విప్రుండు
లోకవ్యవహారంబునకు నిత్యత్వం బౌపాధికం బగుం గాని నిత్యంబు
గా నేర దని దృష్టాంత నిదర్శనంబుగా నిట్లనియె. 146

సీ. పావకశిఖలచే ♦ భాండంబు దాఁ దప్త
మగుఁ దప్త[3]ఘటముచే ♦ నందు నున్న
జలము తపించు నా ♦ జలముచేఁ ద[4]ండులం
బులు తప్త మొంది య ♦ ప్పుడు విశిష్ట
మైన యన్నం బగు ♦ నాచందమునను దా
దేహేంద్రియంబులఁ ♦ దెలివితోడ
నాశ్రయించుక యున్న ♦ యట్టిజీవునకు దే
హంబునఁ బ్రాణేంద్రి ♦ యాదికమున
ఆ. జరుగుచుండు నిట్లు ♦ సంసారఘటవృత్తి
నందు నయిన రాజు ♦ దుష్టమైన
కర్మములకుఁ బాసి ♦ కంజాక్షుపద సేవఁ
జేసె నేని భవముఁ ♦ జెంద కుండు. 147

---

1. విష్ణుకళావతీర్ణుఁడు=విష్ణునియం దొక యంశచేఁ బుట్టినవాఁడు. 2. సాక్షాత్ + హరి = సాక్షాద్ధరి=రెండవ విష్ణువైనవాఁడు. 3. తప్త ఘటము = కాలిన కుండ. 4. తండులములు = బియ్యము.

ఆ. అనుచు ధారుణీసు ♦ రాత్మజుఁ డీ రీతిఁ
బలుకుటయును రాజు ♦ పరిణమించి
వినయవాక్యములను ♦ వినుతించి క్రమ్మఱఁ
బుణ్యుఁ డైనసింధు ♦ భూవరుండు. 148

వ. మహాత్మా నేను రాజ ననియెడియభిమానమదాంధుండ నై మహాత్ముల నిరస్కరించిననన్నుఁ గరుణింపుము నీ వార్తబంధుండవు నీ కృపాదృష్టిం జేసి మహాత్ముల నవమానంబు సేసినదురితంబువలన విముక్తుండ నయ్యెద [1]విశ్వసుహృత్తవైన నీకుం గోపంబు గలుగ నేర దసమర్థు లయినమాబోఁటివారలు మహాజనావమానంబున శీఘ్రుంబె నశింతురు గావున నీవు దయాళుండ వయి నన్ను మన్నింపు మనిన నావిప్రుం డిట్లనియె. 149

క. కడువేడ్క నీవు విద్వాం
సుఁడ వై యుండియును మిగులఁ ♦ జోద్య మవిద్వాం
సుఁడుఁబోలెను బలికెద వి
ప్పుడు మే లన వచ్చుఁ గొంత ♦ పురుషులలోనన్. 150

ఆ. పరఁగఁ బెద్ద లీప్ర ♦పంచ మంతయుఁ దథ్య
మనరు నీవు తథ్య♦మనుచుఁ బలికి
తట్లు గాన నిన్ను♦ నధికుండ వని పల్క
రాదు నాకుఁ జూడ ♦ రాజచంద్ర. 151

సీ యజ్ఞాదికములందు ♦ నా[2]మ్నాయములయందుఁ
దఱుచుగాఁ దత్త్వవా ♦ దంబు లేదు
స్వప్నంబు నందుల ♦ సౌఖ్యమాకారంబు
నంపుల నిత్యమై ♦ యంతలేని
యట్టి చందమున వే ♦ దాంత వాక్యంబులు
తత్త్వంబు నెఱిఁగించి ♦ తెలఁగుఁ గాని

1. విశ్వసుహృత్తు = జగమునకుఁ (అంతటికిఁ) జెలికాఁడు. 2. అమ్నాయములు = వేదములు.

నిత్యంబులై యుండ ♦ నేరవు పురుషుని
చిత్తంబు గుణములఁ ♦ జెంది యెంత
తే. కాల ముండును మఱి యంత ♦ కాలమందు
నరయ విజ్ఞాన కర్మేంద్రి ♦ యముల చేత
మరగి ధర్మంబులను నధ ♦ ర్మంబులట్లు
దగిలి పుట్టించుచుండు న ♦ త్యంత మహిమ. 152

వ. మఱియు ధర్మాధర్మ వాస నా యుక్తంబు విషయాను రక్తంబు నైన చిత్తంబు గుణప్రవాహంబుల చేత వికారంబు నొంది దేవ తిర్యఙ్మనుష్య రూపంబు లయిన దేహంబులం బుట్టించుచుఁ గాల ప్రాప్తంబు లైన సుఖదుఃఖతదుభయ ఫలంబుల ననుభవించుచు ననవరతంబు జీవునికిం బ్రత్యక్షం బగుచు స్థూలసూక్ష్మరూపంబుల నుండు స్వాంతంబు గుణరహితంబైన ముక్తికారణం బగు ఘృత వర్తులు గల దీపంబు సధూమశిఖలం బుట్టించు ఘృతవర్తులు నాశంబు నొందిన స్వరూపంబుఁ బొందిన తెఱంగున మనంబు గుణ కర్మాను బంధంబైన జన్మాదులం బుట్టించు గుణకర్మంబులం బాసి నేనిం బరతత్త్వంబు నొందు జ్ఞానేంద్రియంబు లేనును విష యంబుల మీఁదఁ బోఁచు బుద్ధు లేనును నభిమానంబును నను నే కాదశ వృత్తులంగూడిన మనంబు జీవునికి ననంఖ్యంబు లయిన జన్మంబుల బొందించు మనోవృత్తుల నతిక్రమించిన జీవుండు పరం జ్యోతి యైన నారాయణ స్వరూపంబుగా నెఱుంగుము స్థావర జంగ మంబు లయిన జీవులకుం బవనుండు ప్రాణంబై యున్న చందంబున నీశ్వరుండు సర్వభూతాంతర్యామి యగుచు జీవాత్మ స్వరూపంబున నుండు జీవాత్ముండు జ్ఞానోదయంబునం జేసి మాయ నెంత కాలంబు గెలువకుండు నంతకాలంబు ముక్తసంగుండుగాఁ డరి షడ్వర్గంబును జయించి పరతత్త్వంబు నెఱింగిన నీశ్వరుండగుఁ జిత్తం బెంత

1. ఏకాదశవృత్తులు:—1. చప్పుడు 2. తాకుడు 3. రూపము 4. రసము 5. వాసన 6. మాటాడుట 7. నడచుట 8. ఇచ్చుట 9. సంతోషించుట 10. విడుచుట 11. అభిమానము

కాలంబు విషయాసక్తం బగు నంతదడవు సంసార చక్రంబునందు సంచరించుం గావున మహావీరుండైనను దనకు శత్రువైన మనంబున ప్రమత్తుండయి యిచ్ఛావిహారంబున జరగ నీక పరమగురుండైన శ్రీహరి చరణోపాసనాస్త్రంబునం జిత్తంబు గెలిచినం బరతత్త్వంబు నొందునని విప్రుండు వలికిన నతనిమహిమకు వెఱఁ గంది బ్రాహ్మణునకు నమస్కారంబు సేయుచు భూవరుం డిట్లనియె. 153

ఉ. కారణ విగ్రహంబు నురు♦కాయము నీ యవధూత వేషముం
భూరిధ[1]రామరత్వమును ♦ బూర్వసమాగమ మాత్మభావముం
జారు విహార మత్యతుల ♦ శాంతిగుణంబును గూఢవర్తనం
బారయఁ గల్గునీకు నన♦యంబును మ్రొక్కెదఁ బెక్కుభంగులన్.

మ. జ్వరితార్తుం డగు రోగి కౌషధ మతీ ♦ ష్టంబైన చందంబునన్
ధరలో నాతపతప్తదేహి గడుశీ ♦ తం బైన తోయంబునుం
గరిమం గోరినరీతి నెంతయు నహం[3] ♦ కారాహిదష్టుండ నై
పరఁగుం నాకును నీవచోమృతము ద♦ప్పుం మందు వే ఉన్నదే.

ఆ. విప్రవర్య నేను ♦ వేడ్కతో నా సంశ
యంబులెల్ల నిన్ను ♦ నడిగి తెలియఁ
దలఁచి యున్నవాఁడఁ ♦ దప్పక యెఱిఁగింపు
ముచిత వృత్తిఁ దత్త్వ ♦ యోగమెల్ల. 156

వ. అని యడిగిన యా రాజునకు విప్రుం డిట్లనియె. 157

తే. కాన వచ్చిన ఫలములు ♦ కర్మ మూల
ము లగుటను జేసి సంసార ♦ ములను జిత్త
మెపుడు వర్తించుచుండఁగా ♦ నెఱుఁగ లేవు
తత్త్వయోగంబు మిగుల ని ♦ త్యంబటంచు. 158

---

1. ధరామరత్వము = పుడమి వేల్పుఁదనము(బ్రాహ్మణత్వము). 2. గూఢవర్తన = తెలియని నడక. 3. అహంకార + అహి + దష్టుఁడు = అహ (నేను) మను పాముచేఁ గరువఁబడిన వాఁడు.

వ. మఱియు నీవసుంధర నున్న చరణంబులకు నెక్కుడు జంఘ లా మీఁద జానువు లాపైఁడవున నూరువు లందులకు నుపరిప్రదేశంబున మధ్యం బటమీఁద నుర మందులకు నెక్కువ కంఠం బటమీఁద స్కంధం బందుల దారు వాదారువున శిబిక శిబికయందు రాజ నని యెడి యభిమానంబు గలిగి నీ వున్నవాఁడ విట్టిచోద్యంబయిన కష్టదశం బొందిననీవు ప్రజాపాలనంబు సేయు చున్నవాఁడ నను గర్వం బున మావంటి మహాత్ముల సభలలోనం బూజ్యుండవు గాక యున్నవాఁడ వీస్థావర జంగమంబులకు నివాసస్థానంబు వసుంధర యైనచందంబున సత్క్రియలచేత నెఱుఁగం దగిన జగత్కారణంబైన తత్త్వంబు నెఱింగించెదఁ బరమాణుసముదయం బీ ధరిత్రి యైనచందంబున నవిద్యామనంబుల చేతం గల్పితం బయిన [1]కృశ స్థూల బృహదణు సద సజ్జీవాజీవద్రవ్యస్వభావాశయకాలనా మబుద్ధిరూపం బైన మాయచే జగత్తు రెండవది యై కల్పింపం బడియె బాహ్యాభ్యంతరంబులం గలిగి స్వప్రకాశం బై భగవచ్ఛబ్ద వాచ్యంబును విశుద్ధంబును బరమార్థంబును జ్ఞాన రూపంబును నైనబ్రహ్మం బొకటియ సత్యంబు జగ త్తసత్యం బగు నని పలికి మఱియును. 159

సీ. ధరలోన బ్రహ్మంబుఁ ♦ దపమున దానంబు
లను గృహధర్మంబు ♦ లను జలాగ్ని
సోమ సూర్యుల చేత ♦ శ్రుతులచే నైనను
బరమ భాగవతుల ♦ పాదసేవఁ
బొందిన మాడ్కిని ♦ బొందంగ రాదని
వలుకుదు రార్యులుఁ ♦ బరమ మునులు

---

1. కృశ ........ రూపము = చిక్కుట, పెరుగుట, బలియుట, చిన్నదగుట, చెడకుండుట, చెడుట, బ్రతుకుట, చచ్చుట, వస్తువగుట, అలవాటుపడుట, కాలము నగుట, పేరు గొనుట, మతి గలిగి యుండుట లను వానితోనుండుట. (ఇవన్నీ మాయావికారములు)

ఘన తపోబాహ్య సా ♦ ఖ్యములకు విముఖులు
నయి పుణ్యులు హరి ♦ గుణాను వాద
తే. మోదితాత్ములు నగు [1]బుధ ♦ పాదసేవ
ననుదినంబును జేసిన ♦ నంత మీఁద
మోక్షమార్గంబునకును ♦ బద్ధాత్మునందు
బట్టువడియుండు నెప్పుడుఁ ♦ బరఁగ బుద్ధి. 160

వ. నరేంద్రా యేను బూర్వంబున భరతుం డనురాజను సర్వసంగ పరిత్యాగంబు సేసి భగవదారాధనంబు సేయుచు మృగంబుతోడి స్నేహంబు కతన మృగంబ నై పుట్టియు నంతను హరిభక్తి దప్పకుండిన కతంబున నిప్పుడు మనుష్యుండ నై మనుష్య సంసర్గంబును బాసి యేకాకినై చరియించు చున్నవాఁడ నరుండు వృద్ధ సంసేవం జేసి సంసార మోహంబును బాసి హరిధ్యానకథలచే [2]లబ్ధజ్ఞానుండై [3]పుండరీకాక్షునిం బూజించుచుం బరలోకంబునుం బొందు నని పలికి విప్రుండు మఱియు ని ట్లనియె. 161

సీ. ధరణీశ మాయచే ♦ తను దాఁటఁగారాని
పదమునఁ బట్టంగఁ ♦ బడ్డజీవుఁ
డెలమి మై గుణకర్మ ♦ ములఁ జేయుచును లాభ
మాశించి తిరుగు బే ♦ హారివాడ్క-
ఫల మపేక్షించుచుఁ ♦ బాయక జీవుండు
సంసార గహన సం ♦ చారి యగుచు
ననవరతము నుండు ♦ నా మహావనమందుఁ
గామలోభాది త ♦ స్కరులు గూడి
తే. ధరణి విజితేంద్రియుఁడు గాని ♦ నరునిఁ బట్టి
ధర్మ మని యెడి యా మహా ♦ ధనము నెల్ల

1. బుధ పాదసేవ = పెద్దల యడుగులఁ గొలుచుట 2. లబ్ధజ్ఞానుఁడు= పొందఁబడిన తెలివిగలవాఁడు 3. పుండరీకాక్షుఁడు = తెల్లని తామర పువ్వులవంటి కన్నులు గలవాఁడు (విష్ణువు)

నరసి గొనిపోవు చుండుదు ♦ రనుదినంబుఁ
గాన సంసారమందు నా ♦ కాంక్ష వలదు. 162

క. అరయఁగ సంసారాటవిఁ
దరలక యా పుత్త్రమిత్త్ర ♦ దారాదు లనం
బరఁగుచు నుండెడు వృకములు
పరువడి [1]నరబస్తములను ♦ భక్షించు వడిన్. 163

తరలము. మలసి సం[2]సృతి ఘోరకానన ♦ మందిరంబుల నెల్ల నుం
జెలఁగి గుల్మ లతాతృణాదుల ♦ చేత గహ్వర మైన ని
శ్చలకుంజములందు దుర్జన ♦ సంజ్ఞలం గలమక్షికం
బుల నిరోధము దన్ను సోఁకినఁ ♦ బొందు చుండు విపద్దశన్. 164

ఆ. మఱియు నీ గృహస్థ ♦ మార్గంబునం దెల్ల
విషయములను బొంది ♦ విశ్వ మెల్లఁ
గడఁక తోడ నిల్లు ♦ గంధర్వలోకంబుఁ
గాఁ దలచి మిగుల ♦ మోద మందు. 165

ఆ. మఱచి కాననమునఁ ♦ గొఱవిదయ్యముఁ గాంచి
యగ్నిఁ గోరివెంట ♦ నరుగుమాడ్కిఁ
గాంచనంబు గోరి ♦ కల వారి యిండ్ల పం
చలను దిరుగు నరుఁడు ♦ చలన మంది. 166

ఆ. బహు కుటుంబియగుచు ♦ బహుధనాపేక్ష చే
నెండమావులఁ గని ♦ యేఁగు మృగము
కరణిఁ బ్రేమఁ జేసి ♦ గురువులు వాఱుచు
నొక్కచోట నిలువ ♦ కుండు నెపుడు. 167

ఆ. మఱియు నొక్క చోట ♦ మత్తుఁడై ప[3]వనర
జోహతాక్షుఁడగుచుఁ ♦ జూపుదప్పి

1. నరబస్తము= మనుష్యమాంసము లేక రక్తము 2. సంసృతి........మందిరములు= కుటుంబమనెడు భయంకరమైన యడవియందలి యిండ్లు 3. పవన.......క్షుఁడు= గాలిదుమ్ము దెబ్బదిన్న కన్నులు గలవాఁడు.

దిక్కెఱుంగ కొందు ♦ దిశ కేఁగు పురుషుని
కరణిఁ దిరుగు నరుఁడు ♦ నరవరేణ్య. 168

వ. మఱియు నొక్కచోట ను[1]లూకఝిల్లీస్వనంబులతోడ సమానంబు లయిన శత్రురాజ తిరస్కారంబులకు దుఃఖపడుచు నొక్కచోట క్షుధార్దితుం డై యపుణ్యఫల వృక్షంబుల నాశించుమాడ్కిఁ బాప కర్ములు ద్రవ్యహీనులు నగువారి నాశ్రయించుచు నొక్కయెడం బి[2]పాసాతురుం డై జలహీనం బయిన నదికిఁ జనిన రీతి నిహపర దూరు లైన పాషండుల సేవించుచు మఱియు నొక్కప్రదేశంబునం దగ్నిచేతం దప్తుం డయినవాఁడు దావాగ్నిం జేరి వ్యథ నొందు రీతి నన్నార్థియగుచు దాయాదులం జేరి దుఃఖించుచు మఱియు నొక్కచోటఁ బరబాధం జేసి మున్ను గానక రాజ్యాభిలాషం బ్రాణసఖు లైన పితృపుత్ర భ్రాతృ జ్యేష్ఠుల నైనను వధియించుచు మఱియు శూరులచేతం గొట్టువడి సర్వధనంబును బోనాడి చింతాపరవశుం డై దుఃఖించుచును స్వాంత గంధర్వనగరప్రాయం బైన సంసారసుఖంబు ననుభవించి మోదించుచు మఱియు నగారోహణంబు సేయు నరుండు గంటక పాషాణాదులవలనం బాదపీడితుం డగుచు దుఃఖించు చందంబున గృహాశ్రమోచితమహానుష్ఠానంబునకు నుపక్రమించి వ్యసనకంటకశర్కరాపీడితుం డై దుఃఖించుచు నొక్కచోటఁ జఠరాగ్నిపీడితుం డై కుటుంబంబుమీఁద నాగ్రహించుచు వనంబున నజగరగళితుం డై జీర్ణితుం డైన చందంబున రాత్రిగృహాటవియందు నిద్రాపరవశుం డై యెఱుంగక వర్తించుచు మఱియును వనంబునఁ దృ[3]ణచ్ఛన్నకూపపతితుం డగుచు సర్పదష్టుం డైన తెఱంగున సంసారి యై దుర్జనులచేత వ్యథితహృదయుం డగుచు నంధుం డై యజ్ఞానాంధకూపంబునం బడుచు నొక్కయెడ జుంటితేనియకు నై మక్షికాబాధ నత్యంతదుఃఖితుం డయిన

---

1. ఉలూక ఝిల్లీస్వనము = గుడ్లగూబల, కొండ తేనెటీగల మ్రోఁత 2. పిపాసాతురుఁడు = దప్పికచేతఁ దొందరపెట్టఁబడిన వాఁడు. 3. తృణ........పతితుఁడు = గడ్డిచేత నిండిన నూతిలోఁ బడినవాఁడు.

మాడ్కిని సంసార కాముండై పరదారద్రవ్యాభిలాషి యగుచు భూపాలకులచేత నైనను గృహపతిచేతనైనను దాడితుండై నరకంబునం బడుచు యౌవనంబున సంపాదించిన ద్రవ్యంబులుపరుల చేతం బోనాడిన విధంబున శీతవాతాద్యనేక ప్రయాసలబ్ధంబైన ధనంబు వోనాడి సంసారి యతిచింతాక్రాంతుండై యుండు మఱియును వనంబున లుబ్ధకులు సంసృష్టంబయిన యల్పామిషంబునకు నన్యోన్యవైషమ్యంబునం గలహించిన విధంబున సంసృష్టవ్యవహారియై యల్పద్రవ్యంబులకుం బోరాడు చుండు నని భూపాలునకు విప్రుండు సంసారాటవి తెఱంగెఱింగించి వెండియు నిట్లనియె.

ఆ. అల్పధనుఁడు విశ్ర ♦ మస్థానములఁ దృప్తిఁ
బొంద కొరులధనముఁ ♦ బొందఁగోరి
యరిగి వారివలన ♦ నవమానములఁ బొంది
యధిక మైనదుఃఖ ♦ మనుభవించు. 170

ఆ. అంతఁ గొందఱల్ల ♦ నన్యోన్యవిత్తాది
వినిమయమునఁ గడుఁ బ్ర ♦ వృద్ధమైన
వైరములను బొంది ♦ పోరాట వొందుదు
రా[1]త్మ చింతలేక ♦ యనుదినంబు. 171

సీ. సంసారమార్గసం ♦ చారుఁడై యధిక ప్ర
యాసంబునను గూర్చు ♦ నర్థములను
విహరించుచును గొంద ♦ ఱిహలోకఫలములఁ
గోరుచు మోక్షంబు ♦ గోర రంతఁ
జెడిపోవుచుండు రెప్పుడు గాని యందుకుఁ
గడపటియోగంబుఁ ♦ గానలేరు
మానవంతులు నన ♦ మానశౌర్యులు నగు
వారు మిక్కిలి యైన ♦ వైరబుద్ధి
తే. నాహవంబున మడియుదు ♦ రంతె కాని
మోక్షమార్గంబు గానరు ♦ మూఢవృత్తి.

1. ఆత్మచింత = తనను తానం తెలిసికొనుటయందలి దిగులు.

ననుచు సంసారగహన వి ♦ హార మెల్లఁ
దెలిపి క్రమ్మఱ ననియె ధా ♦ త్రీసురుండు. 172

వ. మఱియుం గాలచక్రనియంత్రితుం డై చక్రాయుధునిం గొల్వక కాకగృధ్ర బక సమానులైన పాషండులతోడి సఖ్యంబునం జేసి వారలచేత వంచితుం డై బ్రాహ్మణకులంబునం జేసి శ్రౌ[1]తస్మా[2]ర్తకర్మాను[3]ష్ఠానపరుం డై విషయసుఖంబులందుఁ దగులువడి కాలంబుతుద నెఱుంగక వృక్షంబులుంబోలె నైహికార్థంబులయందుఁ దృష్ణ గలిగి మైథుననిమిత్తంబున సుతదారాదులయందు స్నేహంబు సేయుచుఁ బధికుండు మాతంగంబులయందు భయంబున [4]దీర్ఘ నిమ్న కూపంబునంబడిన తెఱంగున సంసారమృత్యుగజభయంబున గి[5]రికందరప్రాయం బయినయజ్ఞానతమంబునం బడుం గావున మాయచేత సంసారమార్గం బైన రజోభావంబు విడిచి సర్వభూతమైత్రి గలిగి జితేంద్రియుండ వై [6]జ్ఞానాసిచే మార్గంబుకడపలగను మని పలికిన భూపాలుం డిట్లనియె. 173

క. అక్కట మానుషజన్మము పెక్కువ యై
యుండు నెపు డ ♦ భేదమతిం బెం
పెక్కిన యో[7]గి సమాగమ మక్కజముగఁ
గలిగె నేని ♦ నఖిలాత్ములకున్. 174

క. ధరణీసురవర నీ శ్రీ,
చరణాంబుజయుగళ రే[8]ణు ♦ సంస్పర్శము నా
దురితంబు లడఁచె నింతట హరిభక్తియు
నంత కంత ♦ కధికం బయ్యెన్. 175

1. శ్రౌతము = శ్రుతి (వేద) సంబంధమైన కర్మ. 2. స్మార్తము = స్మృతి (పురాణ) సంబంధమైన కర్మము. 3. అనుష్ఠానపరుఁడు = పై రెండువిధముల కర్మలఁ జేయఁ గోరువాఁడు. 4. దీర్ఘనిమ్న కూపము = మిక్కిలి లోతైన నూయి 5. గిరికందరప్రాయము = కొండగుహలతో సరియైనది. 6. జ్ఞానాసి = తెలివి యనెడికత్తి. 7. యోగి సమాగమము = దేవుని యందు నిలుకడయైన చూపుగల వాని రాకడ. 8. రేణుసంస్పర్శనము = భక్తుల పాదములందలి దుమ్ము తాకుట.

వ. మఱియు విప్రవరులయందు యోగీశ్వరు లవధూత వేషంబునం జరియించుచుందురు గావున విప్రులు పిన్నపెద్ద లనక యందఱకు నమస్కారం బని స్తుతియించిన నా యోగీశ్వరుండును సింధుపతికిం గరుణాన్వితుం డగుచుఁ దత్త్వజ్ఞానం బుపదేశించి యారాజుచేత వందిత చరణుం డై పూ[1]ర్ణార్ణవంబునుంబోలె సంపూర్ణకరుణారస పూర పూరితస్వాంతుం డై వ[2]సుంధరం జరియించు చుండె సింధు భూపతియును సుజనసమాగమంబున లబ్ధత[3]త్త్వజ్ఞానుం డయి దే[4]హాత్మభ్రమంబాసె నని పలికిన శుకయోగీంద్రునకుం బరీక్షిన్న రేంద్రుం డిట్లనియె. 176

చ. అరయఁగ మక్షికంబు వి[5]న ♦ తాత్మజుఁ గూడఁగ లేనిరీతి యీ
భరతుని సచ్చరిత్రములు ♦ ప్రస్తుతి సేయఁగ నీవసుంధరన్
నరపతు లెల్ల నోపరు మ ♦ నంబున నైనను నెంచ నింక నా
భరతుని పు[6]ణ్యవర్తనముఁ ♦ బ్రస్తుతి సేయఁగ నాకు శక్యమే. 177

వ. నరేంద్రా భరతుండు సుతదార రాజ్యాదులను బూర్వకాలంబు నంద విడిచి భగవత్పరుం డగుచు యజ్ఞరూపంబును ధర్మస్వరూపం బును సాంఖ్యయోగంబును బ్రకృతిపురుష స్వరూపంబును నైన నా[7]రాయణునకు నమస్కారంబనుచు మృగరూపంబును బాసె నట్టి భరతుని చరిత్రం బెవ్వరు సెప్పిన నెవ్వరు వినిన నట్టి వారలఁ బుండరీకాక్షుండు రక్షించు నాయురభివృద్ధియగు ధనధాన్యసమృద్ధి యునగు చుండ స్వర్గోపభోగంబులం బొందుదు రని. 178

మ. నర దేవాసురయక్ష రాక్షసమునీం ♦ ద్రస్తుత్య దివ్యాంబరా
భరణాలంకృత భక్తవత్సల కృపా ♦ పారీణ వైకుంఠమం

1. పూర్ణార్ణవము - నదీ నదజలంబుచే నిండిన సముద్రము 2. వసుంధర = బంగారు రతనాల తళుకులందాల్చినది. (భూమి). 3. తత్త్వజ్ఞానము = భగవంతుని దెలిసి కొనుటయందలి తెలివి. 4. దేహాత్మభ్రమ = శరీరమే ఆత్మ (తాను) అను వికారము. 5. వినతాత్మజుఁడు = వినతకొడుకైన గరుత్మంతుడు. 6. పుణ్య వర్తనము = పున్నెపు నడక. 7. నారాయణుఁడు = నీళ్ల (నారముల) యందు శుభముగ నున్నవాఁడు. ఈతఁడే ప్రకృతియైన నీళ్లు,పురుషుడైనఅత్మయైనవాఁడు, జ్ఞానరూపమైనవాఁడు.

దిర బృ[1]ందావన భాసురప్రియ ధరి ♦ శ్రీనాథ గో[2]విందశ్రీ
కర పుణ్యాకర వాసుదేవ త్రిజగ ♦ త్కల్యాణ గోపాలకా. 179

క. పరమపదవాస దుష్కృత
హర కరుణాకర మహాత్మ ♦ హ[3]తదితిసుత భా
సురగోపికామనోహర
సరసిజదళ నేత్ర భక్త ♦ జననుతగాత్రా. 180

మాలిని. సరసహృదయవాసా ♦ చారులక్ష్మీవిలాసా
భరిత శుభచరిత్రా ♦ భాస్కరాంబ్జా[4]రినేత్రా
నిరుపమఘనగాత్రా ♦ నిర్మలజ్ఞానపాత్రా
గురుతర భవదూరా ♦ గో[5]పికాచిత్తచోరా. 181

గద్యము. ఇది సకలసుకవిజనానందకర బొప్పనామాత్యపుత్ర గంగ నార్యప్రణీతంబైన శ్రీమహాభాగవత పురాణమునందుఁ బ్రియవ్రతుని సుజ్ఞానదీక్షయు బ్రహ్మదర్శనంబును నాగ్నీధ్రాదులజన్మంబును నుత్తమతామసరైవతుల జన్మంబును బ్రియవ్రతుండు వనంబునకుం జనుటయు నాగ్నీధ్రుం డప్సరసం బరిగ్రహించుటయు వర్షాధిపతుల జన్మంబును నాగ్నీధ్రుండు వనంబునకుం జనుటయు నాభిప్రముఖుల రాజ్యంబును నాభియజ్ఞంబును ఋషభుని జన్మంబును ఋషభుని రాజ్యాభిషేకంబును భరతుని జన్మంబును ఋషభుండు

1. బృందావన భాసురప్రియ = బృందయను పేరుగల తులసియందు ప్రకాశమగు ప్రేమగలవాఁడా! 2. గోవింద = గోవులకిష్టమైనవాఁడా! భూమికి, ఇంద్రునకు, సరస్వతికిఁ బ్రియమైనవాఁడా! 3. హతదితిసుత = నాశముచేయబడిన రాక్షసులు గలవాఁడా! 4. అబ్జారి = అబ్జ + అరి = తామరపువ్వులకు పగవాఁడు(చంద్రుఁడు) చంద్రోదయము కాగానే పద్మములు ముడుచుకొనునని కవులేర్పరచుకొన్న కట్టుబాటు. ఇట్లేసూర్యుఁడు పొడిచిరాగానే కలువపూవు ముడుచుకొనును. సూర్యచంద్రు లన్నదమ్ములట. బావగారైన సూర్యుఁడురాగానే మఱదలైన కలువ తలవంచి ముడుచుకొనును. కావున "కలువ తొలగుబావ" యని సూర్యుని వేడుక నామమునఁ బిల్తురు. 5. గోపికా చిత్తచోరా = గొల్లపడఁతుల మనస్సులను దొంగిలిన వాఁడా!"

దపంబునకుం జనుచు సుతులకు నతులజ్ఞానం బుపదేశించుటయు భరతునిపట్టాభిషేకంబును భరతుండు వనంబునకుం జనుటయు భరతుండు హరిణపోతంబునందలి ప్రీతిం జేసి హరిణగర్భంబున జనియించుటయు మరలవిప్రసుతుం డై జనియించుటయు విప్రుండు చండికాగృహంబున బ్రదికి వచ్చుటయు సింధుపతి విప్రసంవాదంబును నను కథలం గల పంచమస్కంధంబునందుఁ బ్రథమాశ్వాసము. 182

ఓం తత్సద్బ్రహ్మార్పణ మస్తు.



శ్రీనివాస పరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్ర భాగవతము

## పంచమస్కంధము - ద్వితీయాశ్వాసము

---

శ్రీ [1]కాంతాహృదయప్రియ
లో[2]కాలోకప్రచార ♦ లోకేశ్వర సు
శ్లోక భవభయనివారక
గోకులమందార నంద ♦ గోపకుమారా. 1

వ. సకలపురాణార్థజ్ఞానవిఖ్యాతుం డగు సూతుం డిట్లనియె. 2

క. మునులార బాదరాయణి
యనఘాత్మకుఁ డైనయుత్త[4] ♦ రాత్మజునకు స
ద్వినయోక్తి భరతు చరితము
వినిపించుచు మఱియునిట్లు ♦ వినుపించెఁదగన్. 3

ఆ. పా[5]ర్థివేంద్ర యిట్లు ♦ భరతాత్మజుం డైన
సుమతిధర్మవర్త ♦ నమునఁ దిరుగ
నదియెఱింగి దుష్టు ♦ లైన పాషండులు
దమమతంబుమిగులఁ ♦ దలఁచి పొగడి. 4

క. ధరణీవల్లభ నిన్నును
నిరతంబును బుద్ధ దేవు ♦ నిం గొలిచినయా
తెఱఁగునఁ గొలిచెద మని భా
సురమతిబోధించి రపుడు ♦ సుమతిం బ్రీతిన్. 5

---

1. శ్రీకాంతాహృదయప్రియ = లక్ష్మీదేవికి మనసు నచ్చినవాఁడా! 2. లోకాలోక ప్రచార = జగములందును వానికి వెలుపలను తిరుగువాఁడా! 3. భవభయనివారక= పుట్టుక వలని జడుపు దొలగించెడివాఁడా! 4. అనఘాత్మకుఁడు = పాపరహితమైన మనస్సుగలవాఁడు. 5. పార్థివేంద్ర = పృథివి (భూమి)కి భర్తలైన రాజులలో శ్రేష్ఠుఁడా!

వ. ఇట్లు [1]పాషండబోధితుం డైనసుమతికి ధ్రువసేనయందు దేవతా జిత్తను పుత్త్రుండు జనించె వానికి దేవద్యుమ్నుం డనుసత్పుత్త్రుం డా సురియం దుదయించె నమ్మహాత్మునకు ధేనుమతియందుఁ బ[2]ర మేష్ఠిజనియించె నతనికి సువర్చలయందుఁ బ్రతీహుం డనువాఁడు సుతుం డయ్యె నప్పరమపురుషుండు సకలజనులకు బ్రహ్మోప దేశంబు సేసి తాను శుద్ధాత్ముం డై హరిస్మరణ సేయుచు యజ్ఞ కరణనిపుణులగు ప్రతిహర్త ప్రస్తోత యుద్గాత యను సత్పుత్త్రులం గాంచె నా ప్రతిహర్తకు నుతియందు వ్యోమభూమనామక పుత్త్ర ద్వయం బుత్పన్నం బయ్యె నందు భూమునకు ఋషికుల్యయందు నుద్గీథుం డను సుతుండు జనించె నతనికి దేవకుల్యయందుఁ బ్రస్తోత గలిగె నాప్రస్తోతకు వరరుత్సయందు విభుండను తనయుం డుద్భవించె నతనికి భారతియందుఁ బృథుషేణుం డుదయించె నత నికి నాకూతియందు నక్తుండు గలిగె నానక్తునకు రాజర్షిశ్రేష్ఠుం డగు గయుం డను మహాకీర్తిసంపన్నుం డుదయించె. 6

ఆ. అట్టి గయునివలన ♦ నఖిలజీవులఁ బ్రోవఁ
దలఁచి సాత్త్వికప్ర ♦ ధాన మయిన
యట్టి మేను దాల్చి ♦ యాత్మతత్త్వజ్ఞానుఁ
డగుచు నుండె హరి ని ♦ జాంశమునను. 7

వ. ఇట్టి మహనీయసుగుణాకరుం డగు గయుని గాథానువర్ణనంబు పురావిదు లగు మహాత్ములచే నీ శ్లోకంబున నుతింపంబడు చున్నది సా[3]వధానమనస్కుండ వై యాలకింపు మని యిట్లనియె. 8

సీ. ధర్మమార్గంబున ♦ ధారుణీజనులను
బ్రేమతోఁ బోషణ ♦ ప్రీయరూప
లాలనశాసన ♦ లక్షణాదులచేతఁ
బోషించుచును యజ్ఞ ♦ ములను యజ్ఞ

---

1. పాషండులు = దేవుఁడే లేడనువారు. 2. పరమేష్ఠి = ఒకరాజు. (బ్రహ్మ)
3. సావధాన మనస్కుఁడు = హెచ్చరికతోఁగూడిన మనస్సు గలవాఁడు.

పురుషు నీశ్వరుఁ జిత్త ♦ మున నిల్పి సేవించి
స్వాం[1]తమందున్న యీ ♦ శ్వరునిఁ గాంచి
యఖిలజీవతతికి ♦ నానంద మొసఁగుచు
నిరభిమానత మెయి ♦ ధరణి నేలె

ఆ. సత్యమందు మిగులు ♦ సత్సేవయందును
ధర్మమందు యజ్ఞ ♦ కర్మమందు
గయుఁడు వసుధలోనఁ ♦ గఁజాక్షుఁడే కాని
మానవుండు గాఁడు ♦ మానవేంద్ర. 9

వ. అట్టి మహాపురుష గుణగణ పరిపూర్ణుం డగు గయునికి దక్షకన్యక లగు శ్రద్ధామైత్రీదయాదులు దమయంతన వచ్చి కోరిక లొసంగ నతని ప్రజలకు వసుంధర కామధేనువై పిదుక వేదంబులు సకల కామంబుల నిచ్చుచుండ సంగరంబున భంగంబు నొందిన రాజు లప్పనంబు లొసంగ విప్రులు ధర్మం బాలవ పాలు పంచి యిడ నిరంతర సోమపానంబును శ్రద్ధాభక్తియోగంబులుఁ గలిగి యొనర్చు యజ్ఞంబుల నింద్రాదిదేవతలు దృప్తులై యజ్ఞఫలంబుల నొసంగ బ్రహ్మాది తృ[2]ణగుల్మలతాంతంబుగా సకలలోకంబుల వారినిం దృప్తింబొందించుచు శ్రీహరిం దృప్తిఁ బొందఁ జేయుచు గయుండు పెక్కుకాలంబు రాజ్యంబు సేసె నట్టిగయునికి జయంతి యందుఁ జిత్రరథస్వాత్యవరోధను లను మువ్వురు గొడుకులు పుట్టిరి నాచిత్రరథునికి నూర్ణయందు సామ్రాట్టును వానికి నుత్కళ యందు మరీచియు నామేటికి బిందుమతియందు బిందుమంతుండును నాబిందుమంతునకు సరఘయందు మధువును మధువునకు సుమనస యను దానియందు వీరవ్రతుండును నావీరవ్రతునకు భోజ యందు మన్యుప్రమన్యువులను నిరువురునునందు మన్యువునకు సత్య యందు భువనుండును నతనికి దోషయందుఁ ద్వష్టయు నా త్వష్టకు విరోచనయందు విరజుం డను వాఁడును జనియించి రంత. 10

---

1. స్వాంతమందున్న ఈశ్వరుడు = మనస్సుందు చోటైన అనాహతచక్రాధికారి శివుఁడు. 2. తృణ, గుల్మ, లతాంతంబు = గడ్డి, పొద, పూవు.

క. ఆవిరజున కుదయించిరి
భూవినుత విషూచియందుఁ ♦ బుత్రశతంబుల్
ఆవల నొక కన్యకయును
నావేళ సమస్తజనులు ♦ హర్షం బందన్. 11

క. ఘనుఁడు ప్రియవ్రతువంశం
బునకుం దుద యై విరజుఁడు ♦ భూపతి వంశం
బును దా నలంకరించెను
విను మిం[1]ద్రావరజుఁ డయిన ♦ విష్ణునిమాడ్కిన్. 12

క. అని పలికిన శుకయోగిం
గనుఁగొని యభిమన్యుసుతుఁడు ♦ గడుమోదముతో
వనజదళాక్షుని మహిమలు
విని సంతస మంది యనియె ♦ వేడుక మఱియున్. 13

వ. మునీంద్రా సూర్యరశ్మి యెందాఁకం బ్రవర్తిల్లు సనక్షత్రయుక్తం
బైన చంద్రకిరణంబు లెంత మేరఁ దిరుగు నంతదూరంబు ప్రియ
వ్రతునిరథ నేమిఘట్టనలచేత సప్తద్వీపంబులును సప్తసముద్రం
బులు నయ్యె నని పలికితివి నాద్వీపసముద్రంబుల పరిమాణంబులు
సవిస్తరంబులుగా నెఱింగింపుము గుణమయంబును స్థూలరూపం
బును నయిన శ్రీహరిశరీరం బగు నీలోకంబునందు నిలిపినచిత్తం
బగుణంబును సూక్ష్మంబును నా[2]త్మజ్యోతియు బ్రహ్మంబును నైన
వాసుదేవునియందు నిల్చుం గావున ద్వీపవర్షాది విస్తారంబు విని
పింపు మనిన శుకయోగీంద్రుం డిట్లనియె. 14

క. ధరణీ వల్లభ విను శ్రీ
హరిమాయా గుణవిభూతు ♦ లగు జలనిధులుం
బరఁగిన దీవులు వర్షము
లరయంగాఁ గొలఁదివెట్ట ♦ నలవియె జగతిన్. 15

---

1. ఇంద్రావరజుఁడు = ఇంద్రుని తమ్ముఁడుఁ విష్ణువు అదితికశ్యపులకు, వామనుండై కలుగుటచే దేవేంద్రునకుఁ దమ్ముఁ డయ్యెను. 2. ఆత్మజ్యోతి = తనయందలి వెలుఁగు. (అదే భగవంతుఁడు)

ఆ. తెలిసినంత నేను ♦ దెలిపెద సంక్షేప
ముసను జిత్తగించి ♦ వినుము దెలియ
ననుచుఁ జెప్పఁదొడఁగె ♦ నభిమన్యుసుతునకు
నింపుగాను శుక ము ♦ నీంద్రుఁ డిట్లు. 16

—♦ శుకయోగి యుపదేశరూపమునఁ దెల్పు భూగోళంబు నిర్ణయము ♦—

వ. నరేంద్రా జంబూద్వీపంబు భూపద్మంబునకు మధ్యప్రదేశంబున లక్షయోజనంబుల వెడల్పు నంతియ నిడుపునుం గలిగి కమల పత్త్రంబునుం బోలె వర్తులాకారంబయి నవసహస్రయోజన పరిమితాయామంబు గల నవవర్షంబుల నష్టమర్యాదాగిరులునుం గలిగి విభక్తం బయి యుండు నందు మధ్యవర్షం బిలావృతవర్షం బగు నందు మధ్యమప్రదేశంబున సువర్ణమయంబయి. 17

క. భూపద్మమునకు మేరువు
దీపించుచుఁ గ[1]ర్ణికాకృ ♦ తిని బెంపగుచుం
బ్రాపై కులగిరి రాజుగఁ
జూపట్టును సురగణాళి ♦ చోద్యం బందన్. 18

సీ. మఱియును నామేరు ♦ గిరి లక్షయోజనో
న్నత మగు చుండి యా ♦ నడిమి దళము
విదితమై పదియాఱు ♦ వేల యోజనములు
నంతియ పాఁతు నై ♦ యతిశయిల్లు
నామీఁద విస్తార ♦ మరయ ముప్పదిరెండు
వేల యోజనముల ♦ వెలసి యుండు
నా గిరి కుత్తరం ♦ బందు నీలశ్వేత
శృంగపర్వతములు ♦ నింగి ముట్టి

ఆ. యుండు రెండువేల ♦ యోజనంబులదాఁకఁ
బఱపు గలిగి పూర్వ ♦ పశ్చిమాయ
తంబు దక్షిణోత్త ♦ రంబును విస్తార
మగుచు మిగుల రమ్య ♦ మై నరేంద్ర. 19

1. కర్ణికాకృతి = పువ్వునడిమి దుద్దురూపము.

వ. ఇట్లు పూర్వపశ్చిమంబులు లవణసాగరాంతంబులై యున్న సీమా పర్వతంబుల యందు నీల[1]శ్వేతశృంగవత్పర్వతంబులు నిడివిని యథాక్రమంబుగ దశమాంశన్యూన ప్రమాణయోజనంబులు గల విగానుండు వీని మధ్యప్రదేశంబున రమ్యకహిరణ్మయకురువర్షంబులను నామంబులు గల వర్షంబు లుండు వాని విస్తారంబులు నవ సహస్ర యోజనంబులు గలిగి లవణసముద్రాంతంబులై క్రమంబున నీలాదిపర్వతదీర్ఘపరిమాణంబుల నుండు నిలావృతవర్షంబునకు దక్షిణంబున నిషధహేమకూటహిమవత్పర్వతంబు లను సీమాపర్వతంబులును బూర్వపశ్చిమంబులు నిడుపును దక్షిణోత్తరంబులు విశాలంబును నగుచు నానీలాదిపర్వతంబులతీరున నుండు నాగిరుల మధ్యప్రదేశంబున హరివర్ష కింపురుషవర్ష భారతవర్షంబులను నామంబులు గల వర్షంబు లుండు నా యిలావృత వర్షంబునకుఁ బశ్చిమంబున మాల్యవత్పర్వతంబును బూర్వభాగంబున గంధమాదనంబును సీమాపర్వతంబులు పూర్వపశ్చిమంబులు నిడుపును దక్షిణోత్తరంబులు విశాలంబు నగుచు నీలపర్వత నిషధపర్వతంబులం గదిసి ద్విసహస్ర యోజనంబుల విస్తారంబై యుండు మాల్యవత్పర్వతంబు పశ్చిమసముద్రాంతంబై కేతుమాలవర్షంబును గంధమాదనపర్వతంబునకుఁ బూర్వభాగంబున సముద్రాంతం బగుచు భద్రాశ్వవర్షంబును మేరువునకుం దూర్పున మందరపర్వతంబునుదక్షిణంబున మేరుమందర పర్వతంబులును బడమటిపార్శ్వంబుల నుత్తరమునం గుముదపర్వతంబులు ననునామంబులు గలిగి యయుత యోజనోన్నతంబు లయి మేరునగం బనుమధ్యోన్నతమేధిస్తంభంబునకుం జతుర్ముఖంబుల హ్రస్వస్తంభములుంబోలె నుండు నాచతుస్స్తంభంబుల యందును బర్వతశిఖరంబుల వెలుఁగొందు కేతువులునుంబోలెఁ జూతజంబూకదంబన్యగ్రోధంబు లను వృక్షరాజంబులు క్రమంబున నొండొంటికి నేకాదశశతయోజనా యతంబును శత యోజనవిస్తారంబును గలిగియుండు మఱియు నాపర్వతశిఖరంబు

1. నీల....పర్వతంబులు= నల్లని తెల్లని నెత్తములు గల కొండలు.

లం గ్రమంబునం [1]బయోమధ్విక్షు రసమృష్టజలంబులు గలిగి శతయోజనవిస్తారంబు లయిన సరోవరంబులు దేజరిల్లు నందు సుస్నాతు లగువారలకు యోగైశ్వర్యంబులు స్వభావంబునం గలుగు మఱియు నందన చైత్రరథవైభ్రాజికసర్వతో భద్రంబు లను నామంబులు గలదేవోద్యానంబు లాపర్వతశిఖరంబుల వెలుఁగొందు చుండు నందు దేవతాగణంబులు దేవాంగనలంగూడి గంధర్వుల గీతనృత్యంబులు గనుంగొనుచు విహరింతు రంత. 20

ఉ. మందరపర్వతంబుతుది ♦ మామిడిపం డ్లమృతోపమాన మై
సుందరశైలశృంగ సుస ♦ మానము లై గిరిమీఁద నట్టిమా
కందఫలామృతంబు గలఁ ♦ గంబడి జాఱి మహాప్రవాహ మై
యం దరుణోదనామమున ♦ నద్భుత మై విలసిల్లు నెంతయున్. 21

చ. కడుమధురంబునన్ సురభి ♦ గంధముచే నరుణప్రకాశతన్
వడిగొని మందరాచలము ♦ వ్రంతలచెంతల జాఱి యంతలోఁ
దొడిఁగొడినాయిలావృతముఁ ♦ దోఁచుచువింతగఁ బూ[2]ర్వవాహి యై
యడరుఁ దరంగసంతతుల ♦ నందఱి నచ్చటఁ జేయు ధన్యులన్. 22

ఆ. ఆనదీజలంబు ♦ లా[3]డిన యచ్చటి
యం[4]బికానుచరుల ♦ యం[5]గగంధ
మంది పవ[6]నుఁ డంత ♦ మనుజేశ పదియోజ
నములు సుట్టుఁ బరిమ ♦ ళముల నింపు. 23

ఆ. మేరుమందరముల ♦ మీఁద జంబూఫలం
బులు మహాగజోప ♦ ములుగ వ్రాలి
యవిసి యంతఁ దద్ర ♦ సామృతం బల్లన
యమ్మహానగంబు ♦ నంటుఁ బోడమి. 24

---

1, పయో.........జలంబులు = పాలు, తేనె, చెఱకుపాలు, నీరుతో నిండినవి.
2. పూర్వవాహి = తూరుపుగాఁ బాఱునది. 3. ఆడి = స్నానముచేసి, (పలికి)
4. అంబికానుచరులు = పార్వతితో దిరుగువారు. 5. అంగగంధము = శరీరములందలి వాసన. 6. పవనుఁడు = గాలి.

క. అనుపమ మగు జం[1]బూనది
యను పేరను వెలసి లిల ♦ నరుగుచు నంతన్
ఘనత నిలావృతవర్షము
పనుపడఁ దడపుచును ధరణి ♦ బ్రవహించుఁదగన్. 25

ఉ. ఆనదినీటఁ దోఁగి పద ♦ నై యటు మృ[2]త్తనిలార్కసంగతిం
బూని కడున్ విపాకమునఁ ♦ బొందుచు శుద్ధసువర్ణజాతి జాం
బూనద నామ మొందిసుర ♦ ముఖ్యుల కెల్లను భూషణార్హ మై
మానుగ వన్నె మించి కడు ♦ మంచిదియై విలసిల్లు నెంతయున్.

వ. మఱియు సుపార్శ్వ నగాగ్రంబునందుఁ బంచవ్యాయామ పరిణాహ బంధురంబులగు నైదుమధు[3]ధారా ప్రవాహంబులు పంచముఖంబుల వెడలి సుపార్శ్వనగశృంగంబులం బడి యిలావృతవర్షంబు పశ్చిమ భాగంబుఁ దడుపుచుం బ్రవహించు నాతేనియ ననుభవించువారల ముఖమారుత సుగంధంబు శతయోజన పర్యంతంబు పరిమళించు. 27

సీ. కుముద పర్వతశిఖా ♦ గ్రమున నుత్పన్నమై
కనుపట్టు వటతరు ♦ స్కంధమునను
నుదయించునట్టి ప[4] ♦ యోదధి ఘృతమధు
గుడవిశిష్టాన్నంబు ♦ లుడుగ కెపుడు
నంబరశయ్యాస ♦ నాభరణాదివ
స్తువులఁ గోరికలు దీ ♦ ర్చుచును గుముద
పర్వతాగ్రంబునఁ ♦ బడి యిలావృతవర్ష
మున జనులకు నెల్ల ♦ భోగ్యములను

---

1. జంబూనది = మేరుమందరములను కొండలయందలి (జంబూఫల) నేరేడు పండ్ల రసము నదీరూపమునఁ బాఱుటవలన దీనికి పేరు వచ్చినది. దీని యందలి బురద నీరు బంగారు వికారమైనది. ఆ బురద, గాలి, యెండల తాకుడున శుద్ధమైన (సువర్ణ) బంగారమై నగలు చేయించుట కుపయోగించినది. కావున బంగారునకు జాంబూనదము అను పేరువచ్చినది. 2. మృత్ + అనిల + అర్క + సంగతి = మట్టి, గాలియెండల కూడిక. 3. మధుధారా ప్రవాహము = తేనె సోనజాలు, 4. పయో.........బులు = పాలు, పెఱుగు, నేయి, తేనె, బెల్లముతో గూడిన యన్నములు.

ఆ. పదలఁ గోసఁగువారి ♦ వళిపలితంబులు
దలఁగు దుష్టగంధ ♦ ములుసు బాయు
మరణభయము ముదిమి ♦ పొరయ దెన్నఁడును శీ
తోష్ణబాధ సెంద ♦ కుండునధిప. 28

ఆ. దేవదానవులును ♦ దివ్యమునీంద్ర గం
ధర్వులాది గాఁగఁ ♦ దగిలి యాశ్ర
యించి యుందు రాగి ♦ రీంద్రమూలమునందు
హర్ష మంది ఘనవి ♦ హారలీల. 29

వ. నరేంద్రా మేరునగేంద్రంబునకుఁ బూర్వభాగంబున జఠర దేవకూటంబులును బశ్చిమంబునం బవనపారియాత్రంబులు ననుపర్వతంబులు నాలుఁగు దక్షిణోత్తరంబు లొండొంటికి నష్టాదశసహస్రయోజనంబుల నిడుపును బూర్వపశ్చిమంబులు ద్విసహస్రయోజనంబుల వెడల్పును దక్షిణంబునఁ గైలాస కరవీరంబులు నుత్తరంబున త్రిశృంగమకరంబు లనునామంబులు గలదక్షిణోత్తరంబుల నీపర్వతంబులు నాలుగును బూర్వపశ్చిమంబుల నష్టాదశ సహస్ర యోజనంబుల నిడుపును దక్షిణోత్తరంబుల ద్విసహస్ర యోజనంబుల వెడల్పు నగుచు నగ్నిపురుషునకుం బ్రదక్షిణం బగుచున్న పరిస్తరణంబుల చందంబున మేరువునకుం బ్రదక్షిణంబుగా నష్టనగంబులు నిలిచి యుండు మేరుశిఖరంబున దశసహస్ర యోజనంబుల నిడుపు నంతియ విస్తారంబు నగుచు సువర్ణమయం బైనబ్రహ్మపురంబు దేజరిల్లు చుండు నాపట్టణంబునకు నష్టదిక్కులయందును లోకపాలుర పురంబులుండు. 30

క. పరమేష్ఠి పట్టణంబున
హరి మున్ను త్రి[1]విక్రమణము ♦ లందఁ సర్వే

---

1. త్రివిక్రమణములు = మూడువిధములైన (విజృంభణ) పెరుగుటలు. ఒకటి భూమిని, రెండు ఆకాశమును, మూఁడు పాతాళమును ఆక్రమించుకొనుట విష్ణువు బలిని దానమడిగి మూఁడువిధాల లోకములనిండి వెలుగొందెను.

శ్వర చరణాగ్రనఖాహతిఁ
బరువడి నూర్ధ్వాండ మంతఁ ♦ బగిలె నరేంద్రా. 31

వ. ఇట్లు చరణ నఖస్పర్శంజేసి భేదింపంబడ్డ యూర్ధ్వకటాహవివరంబు వలన నంతఃప్రవేశంబు సేయుచున్న బాహ్యజలధార శ్రీహరి పాద స్పర్శం జేయుచుఁ జనుదెంచి సకలలోకజనంబుల దురితంబులు వాపుచు భగవత్పాదియను పేరం దేజరిల్లుచు దీర్ఘకాలంబు స్వర్గంబున విహరించుచు విష్ణుపదంబున నుత్తానపాద పుత్రుండును బరమ భాగవతుండును నైన ధ్రువుండు దన కులదేవత యైన శ్రీ[1]హరి పాదోదకంబుఁ బ్రతి దినంబును భక్తియోగంబున నిమీలిత నేత్రుండై యానంద బాష్పంబులఁ గోమాంచిత గాత్రుండై యత్యాదరంబున నేఁడును శిరంబున ధరియించుచు నున్నవాఁడు నతనికి నధోభాగంబున నుండు మండలాధిపతులైన సప్తర్షులును హరిపాదోదకప్రభావంబు నెఱింగి తాముపొంకు తపస్సిద్ధి యాకాశ గంగాజలంబుల స్నాతులగుటయే యని సర్వభూతాంతర్యామి యగు నీశ్వరునియందు భక్తి సలిపి యితరపదార్థాపేక్ష సేయక మోక్షార్థి ముక్తిమార్గంబు బహుమానంబు సేయు తెఱంగున బహుమాన యుక్తంబుగాఁ దమ జ[2]టాజూటంబులయందు నేఁడును ధరియించు చుండుదురు. 32

సీ. అంత నసంఖ్యంబు ♦ లైన దివ్యవిమాన
సంకులంబుల సువి ♦ శాల మైన
దేవమార్గంబున ♦ దిగివచ్చి చంద్ర మం
డలముఁ దోఁచుచు మేరు ♦ నగశిఖాగ్ర
మునను నా బ్రహ్మదే ♦ వుని పట్టణమునకు
వచ్చి యందులఁ జతుర్ద్వారములను
వరుసతో దీర్ఘ ప్ర ♦ వాహంబు లగుచును
బ్రవహించి యమల ప్ర ♦ భావములను

1. శ్రీహరి పాదోదకము = విష్ణుపాదమైన ఆకాశమునఁ బుట్టినది (గంగ) ఈ కారణమున విష్ణుపదమన ఆకాశమని తెలియవలెను. 2. జటాజూటములు = జడముళ్లు.

ఆ. నరుగు లవణసాగ ♦ రాంతంబులుగ నాల్గు
మోములందునాల్గు ♦ నామములను
దన్నుఁ గన్న వారిఁ ♦ దనవారిఁ దోఁగిన
వారి కెల్ల నమృత ♦ వారి యగుచు. 33

వ. ఇట్లు సిత యనుపేర వినుతి నొందినయమ్మహానదీప్రవాహంబు బ్రహ్మసదన పూర్వద్వారంబున వెడలి కేసరావలయంబుఁ దడుపుచు గంధమాదనాద్రికిం జని భద్రాశ్వవర్షంబుం బావనంబు సేయుచుఁ బూర్వలవణసాగరంబునం బ్రవేశించుఁ జక్షువనుపేరం దేజరిల్లెడుదీర్ఘప్రవాహంబు పశ్చిమద్వారంబున వెడలి మాల్యవత్పర్వతంబు నుత్తరించి కేతుమాల వర్షంబుం బవిత్రంబు సేయుచుఁ బశ్చిమలవణార్ణవంబునం గలయు భద్ర యనుపేర వెలుఁగొందిన యతుల ప్రవాహం బుత్తరద్వారంబున వెడలి కుముద నీల శ్వేతాఖ్యపర్వత శిఖరంబులం గ్రమంబునఁ బ్రవహించుచు శృంగనగరంబునకుం జని మానసోత్తరంబు లగు నుత్తరకురు భూములఁ బవిత్రంబు సేయుచు నుత్తరలవణసాగరంబుఁ జేరు నలకనంద యనం బ్రఖ్యాతి గాంచిన యమ్మహానదీప్రవాహంబు బ్రహ్మసదనదక్షిణ ద్వారంబున వెడలి యత్యంతదుర్గమంబు లైన భూధరంబులఁ గడచి హేమకూటహిమకూటనగంబుల [1]నుత్తరించి యతివేగంబునఁ గర్మక్షేత్రం బగు భారతవర్షంబుఁ బావనంబు సేయుచు ద[2]క్షిణ లవణాంబుధిం గలయు నంత. 34

సీ. జగతిలో మేరు వా ♦ దిగఁ బర్వతములకుఁ
బుత్రిక లైనట్టి ♦ పుణ్యతీర్థ
ములు వేలసంఖ్యలు ♦ గలవు జంబూద్వీప
మందు భారతవర్ష ♦ మరయఁ గర్మ
భూమి దక్కినవర్ష ♦ ముల దివంబుననుండి
భువికి వచ్చినవారు ♦ పుణ్యశేష

1. ఉత్తరించి = దాటి. 2. దక్షిణలవణాంబుధి = మూఁడవ దిక్కుననుండు నుప్పునీటి సముద్రము.

ములు భుజించుచునుండ్రు ♦ భూస్వర్గ మనఁ దగు
నావర్షములనుండు ♦ నట్టివార

ఆ. లయుతసంఖ్యవత్స ♦ రాయువు లయుత మా
తంగ బలులు దేవ ♦ తా సమాను
లతులవజ్రదేహు ♦ లధిక ప్రమోదితు
లప్రమత్తు లార్యు ♦ లనఘు లధిప. 35

వ. మఱియు సురతసుఖానందంబున మోహంబు నైనం గైకొనక సక్ర
త్ప్రసూతు లగుచు ననవరతంబును త్రేతాయుగకాలంబు గలిగి
ప్రవర్తింతు రీయష్టవర్షంబులయందు దేవతాగణంబులు దమభృ
త్యవర్గంబు లత్యుపచారంబులు సేయుచుండ నెల్లఋతువులయం
దుం గిసలయకుసుమఫలభరితంబులైన లతాదుల శోభితంబు లగు
వనంబులు గలవర్ష నిధిగిరి ద్రోణులయందును గ[1]మలామోదితంబు
లగు రాజహంసకలహంసలు గల సరోవరంబులయందును జల
కుక్కుట కారండవసారసవినోదంబులు గలిగి మ[2]త్తాళిఝంకృతి
మనోహరంబులై నానావిధంబు లయిన కొలంకుల యందును
దేవాంగనలకామోద్రేకజంబు లయిన విలాసహాసలీలావలోక
నంబులం దివియంబడిన మనోదృష్టులు గల దేవగణంబులు విచిత్ర
వినోదంబులు గలిగి యిచ్ఛావిహారంబులు సలుపు చుండుదురు. 36

క. ఈ నవవర్షంబులయం
దా నారాయణుఁడు వచ్చి ♦ యనవరతము లో
కానుగ్రహమునకై సు
జ్ఞానం బీఁ దలఁచి లీలఁ ♦ జరియించుఁ దగన్. 37

సీ. వసుధ నిలావృత ♦ వర్షాధిపతి యైన
పురహరుం డావర్ష ♦ మున వనంబు

---

1. కమలామోదితంబులు = తామరపూవుల వాసనలచేత సంతోషపెట్టఁబడినవి. (హంసలు) లేక లక్ష్మీదేవికి సంతోషము గూర్చునవి. 2. మత్తాళిఝంకృతి= ఝాంగరెక్కి బలిసిన తుమ్మెదల మ్రోఁత.

నందు నుండుటకు నా ♦ యంబికాశాప వ
శంబున నావన ♦ స్థలము లందు
నెవ్వరు వచ్చిన ♦ నింతు లై యుందు రా
వనమందుఁ బార్వతి ♦ యనుదినంబు
నంగనాజనసహ ♦ స్రార్బుదంబులతోడ
న[1]సమలోచనుఁ గొల్చు ♦ నతులభక్తి

ఆ. నట్టిశివునిఁ గోరి ♦ యాయిలావృతవర్ష
మునఁ జరించు జనులు ♦ మోదమునను
గదిసి తత్ప్రకాశ ♦ కము లైన మంత్రతం
త్రములఁ బూజ సేసి ♦ తలఁతు రెపుడు. 38

క. భద్రాశ్వవర్షమందుల
భద్రశ్రవుఁ డనెడి పేరఁ ♦ బరఁగుచుఁ ద[2]పనీ
యాద్రిసమధైర్యుఁ డగుచు స
ముద్రాంతం బైన జగతిఁ ♦ బాలుపుగ నేలున్. 39

క. ఆనరవరునకుఁ బ్రియతముఁ
డైన హయగ్రీవమూర్తి ♦ ననవరతంబున్
ధ్యానస్తోత్రజపాను
ష్ఠానాదులఁ బూజ సేసి ♦ సజ్జను లంతన్. 40

ఆ. తత్ప్రకాశకృత్ప్ర ♦ ధానమంత్రార్థసం
సిద్ధిఁ జేసి ముక్తిఁ ♦ జెంది రప్పు
డట్టి వర్షమందు ♦ నాహయగ్రీవునిఁ
దలఁచి కొలిచి మిగుల ♦ ధన్యు లగుచు. 41

సీ. హరివర్షపతి యైన ♦ నరహరి ననిశంబు
నం దున్న జనులు మ ♦ హాత్ము లయిన
దైత్యదానవ కులో ♦ త్తములు ప్రహ్లాదాది
వృద్ధులఁ గూడి సం ♦ ప్రీతితోడ

1. అసమలోచనుఁడు = బేసికంటివేలుపు (శివుఁడు). 2. తపనీయ+అద్రి బంగరు కొండ.

సుస్నాతులై భక్తిఁ ♦ జూచుచు నుందురు
రమ్యదుకూలాంబ ♦ రములు దాల్చి
తత్ప్రకాశకమంత్ర ♦ తంత్ర జపస్తోత్ర
పఠన సుధ్యానత ♦ పఃప్రధాన

తే. మైనసత్పూజలను జేసి ♦ యచలబుద్ధి
శ్రీనృసింహుని‌ఁ జేరి పూజించి యతని
కరుణ నొందుచు నతుల ప్రకాశు లగుచు
భుక్తిముక్తులఁ గైకొంద్రు ♦ భూపవర్య. 42

వ. మఱియుఁ గేతుమాలవర్షంబునందు భగవంతుండు శ్రీదేవికి సంతోషంబు నొసంగుటకుఁ గామదేవరూపంబున నుండు నమ్మహాపురుషుని యస్త్రతేజఃప్రకాశంబునఁ బ్రజాపతిదుహితలగు రాత్ర్యధిదేవతల గర్భంబులు సంవత్సరాంతంబున నిర్జీవంబులై స్రవించు నాకామదేవుండును దనగతివిలాసలీలావిలోకనసుందర భ్రూమండల సుభగవదనారవింద కాంతులం జేసి శ్రీ[1]రమాదేవిని గమింపం జేయు భగవన్మాయారూపిణి యగు శ్రీదేవియుఁ [2]బ్రజాపతిపుత్రికలును బుత్రులు నైన రాత్రులం బగళ్లం గూడి కామదేవుని స్తోత్రపఠన పూజాధ్యానాదులం బూజించు చుండు మఱియును. 43

క. విమలమతిఁ జిత్తగింపుము
రమణీయం బైన విమల ♦ రమ్యక మనువ
ర్షమునకు నధిదేవత దా
నమరంగా మత్స్యరూపుఁ ♦ డగు హరి దలఁపన్. 44

ఆ. అట్టివర్షమునకు ♦ నధిపతియగు చున్న
మనువు పుత్రపౌత్ర ♦ మంత్రివరులఁ
గూడి మత్స్యమైన ♦ కుం[3]భినీధరుఁ జిత్త
మతులభక్తియుక్తి ♦ హత్[2]త్తఁగొలుచు. 45

1. రమాదేవి = లక్ష్మీసతి. 2. ప్రజాపతి = రాజు, బ్రహ్మ, తండ్రి. 3. కుంభినీధరుఁడు = భూమిని ధరించినవాఁడు (వరాహ రూపమైన విష్ణువు) 4. హత్తు = కవియు.

ఆ. తత్ప్రకాశకప్ర ♦ ధానమంత్రస్తోత్ర
ములను [1]ధర్మకర్మ ♦ ములను హోమ
ములను జనులు సేసి ♦ పుణ్యులై భుక్తి ము
క్తులను బొందుచుండు ♦ రెలమి తోడ. 46

క. వినుము హిరణ్మయవర్షం
బునకుం గూర్మావతార ♦ మునుదాల్చినయా
వనజోదరుఁ డధిదేవత
యనఘుఁడు పితృ[2]పతి మహాత్ముఁ ♦ [3]డర్యముఁడు నృపా. 47

క. ఆవర్షమందు నర్యముఁ
డావర్షజనంబు గూడి ♦ హృదిఁ జిత్తములో
భావించి సంస్తవంబులు
గావించుచుఁ గాంతు రతని ♦ [4]కైవల్యంబుల్. 48

క. అరయఁగ సీతాలక్ష్మణ
పరివృతుఁడై వచ్చి రామ ♦ భద్రుఁడు గడిమిం
బరఁగు నధిదేవతగఁ గిం
పురుషమహావర్ష[5]మునకు ♦ భూపవరేణ్యా. 49

ఆ. అట్టిరామభద్రు ♦ [6]నంజనీసుతుఁడు గిం
పురుషగణముఁ గూడి ♦ పూజ సేసి
తత్ప్రకాశక ప్ర ♦ ధాన మంత్రస్తోత్ర
పఠనములను దగ [7]ను ♦ ప్రాస్తిసేయు. 50

సీ. భారతవర్షాధి ♦ పతి యైన బదరికా
శ్రమమున నున్న నా ♦ రాయణుండు
భూనాథ యామహా ♦ త్ముని నారదాదులు
భారతవర్షంబు ♦ ప్రజలఁ బ్రేమఁ

1. ధర్మకర్మములు = విధిగాఁ జేయఁదగిన పనులు. 2. పితృపతి = యముఁడు. 3. అర్యముఁడు = సూర్యుడు, 4. కైవల్యము = సంసారమునుండి విడుదల. (ముక్తి) 5. వర్షము=సంవత్సరము, భూభాగము, వాన. 6. అంజనీసుతుండు= ఆంజనేయులు. 7. ఉపాస్తి = ఉపాసన సేయుట.

బాయక చేరియు ♦ పాస్తిసేయుచు సాంఖ్య
యోగంబు నుపదేశ ♦ ముచితవృత్తి
నంది యందఱును గృ ♦ తార్థులై యట్టి నా
రాయణదేవు నా ♦ రాధనంబు

ఆ. సేసి యాత్మఁ జాలఁ ♦ జింతించి తత్ప్రకా
శకము లయిన మంత్ర ♦ సంస్తవములఁ
బూజ సేసి ముక్తిఁ ♦ బొందుచు నుండుదు
[1]రచల మైనభక్తి ♦ ననుదినంబు. 51

క. భారతవర్షమునందుల
సారాంశము లైనపుణ్య ♦ శైలంబులు గం
భీర ప్రవాహములుగల
వారయ నెఱిఁగింతు వాని ♦ నవనీనాథా. 52

వ. మలయపర్వతంబును మంగళ ప్రస్థంబును మైనాకంబును త్రికూటంబును ఋషభ పర్వతంబును గూటరంబును గోల్లంబును సహ్యపర్వతంబును వేదగిరియును ఋష్యమూక పర్వతంబును శ్రీశైలంబును [2]వేంకటాద్రియును మహేంద్రంబును వారి ధరంబును వింధ్యపర్వతంబును శుక్తిమత్పర్వతంబును ఋక్షగిరియును బారియాత్రంబును ద్రోణపర్వతంబును జిత్రకూటంబును గోవర్ధనాద్రియును రైవతకంబును గుకుంభంబును నీలగిరియును గాకముఖంబును నింద్రకీలంబును రామగిరియును నాదిగాఁగల పుణ్యపర్వతంబులనేకంబులు గల వాపర్వతపుత్రిక లైన చంద్రవటయుఁ దామ్రపర్ణియు నవటోదయుఁ గృతమాలయు వైహాయసియుఁ గావేరియు వేణియుఁ బయస్వినియుఁ బయోదయు శర్కరావర్తయుఁ దుంగభద్రయుఁ గృష్ణవేణియు భీమరథియు గోదావరియు నిర్వింధ్యయుఁ బయోష్ణియుఁ దాపియు రేవానదియు శిలానదియు సురసయుఁ

1. అచలభక్తి = నిలుకడయైన యనురాగము. 2. వేంకటాద్రి = పాపములం బోగొట్టు కొండ.

జర్మణ్వతియు వేదస్మృతియు ఋషికుల్యయుఁ ద్రిసామయు కౌశికియు [1]మందాకినియు యమునయు సరస్వతియుఁ దృషద్వతియు గోమతియు సరయువును భోగవతియు సుషుమయు శతద్రువును జంద్రభాగయు మరుద్వృధయు వితస్తయు నసిక్నియు విశ్వయు నను నీ మహానదులును సింధుశోణంబు లనునదంబులు నిట్టి మహాప్రవాహంబు లీ భారత వర్షంబునఁ గల వందు సుస్నాతు లైన మానవులు ముక్తిం జెందుదురు మఱియు నీ భారతవర్షంబున జన్మించిన పురుషులు [2]శుక్ల లోహిత కృష్ణవర్ణరూపంబు లగు త్రివిధకర్మంబులం జేసి క్రమంబుగ దేవమనుష్య నరకగతు లను త్రివిధ గతులం బొందుదురు వినుము [3]రాగద్వేషాదిశూన్యుండు [4]నవాఙ్మనస గోచరుండు ననాధారుండు నగు శ్రీవాసుదేవమూర్తియందుఁ జిత్తంబు నిలిపి భక్తియోగంబున నారాధించెడు మహాత్ముల విద్యాగ్రంథి దహనంబు గావించుటం జేసి పరమ భాగవతోత్తములు పొందెడు నుత్తమగతిం జెందుదురు కావున భారతవర్షంబు మిగుల నుత్తమం బని మహాపురుషులిట్లు స్తుతించుచుందురు. 53

ఉ. భారతవర్షజంతువుల ♦ భాగ్యము లే మని చెప్ప వచ్చు నీ
భారతవర్షమందు హరి ♦ పల్మఱుఁ బుట్టుచు జీవకోటికిన్
ధీరతతోడఁ దత్త్వముప ♦ దేశము సేయుచుఁ జెల్మి సేయుచు
న్నారయ బాంధవాకృతిఁ గృ♦తార్థులఁ జేయుచునుండు నెంతయున్

క. తనజన్మకర్మములనుం
గొనియాడెడి వారికెల్లఁ ♦ గోరిన వెల్లం
దనియఁగ నొసఁగుచు మోక్షం
బనయముఁ గృపసేయుఁ గృష్ణుఁ ♦ డవనీనాథా. 55

వ. ఇట్లు భారతవర్షంబునందుల జనంబులకు నెద్దియు నసాధ్యంబు లేదు నారాయణస్మరణంబు సకలదురితంబుల నడంచుఁ దన్నామస్మరణ

1. మందాకిని = గంగ. 2. శుక్లలోహిత కృష్ణవర్ణములు = తెల్లని, యెఱ్ఱని నల్లని, రంగులు. 3. రాగద్వేషాదులు = ప్రేమయు, బగతనము, మొదలైనవి, 4. అవాఙ్మనస గోచరుఁడు = పలుకుటకుఁ దలఁచుటకు నలవిగానివాఁడు.

హితంబులైన తపోదానాదులు దురితంబుల నడంపలేవు బ్రహ్మకల్పాంతంబు బ్రదికెడియితరస్థానంబునం [1]బునర్జన్మ భయంబున భీతిల్లుచు నుండుటకన్న భారత వర్షంబునందు క్షణమాత్రంబు మనంబున [2]సర్వసంగపరిత్యాగంబు సేసిన పురుషశ్రేష్ఠునకు శ్రీమన్నారాయణ పదప్రాప్తి యతి సులభంబుగ సంభవించుం గావున నట్టి యుత్తమం బగు నీ భారతవర్షంబె కోరు చుందురు మఱియు నెక్కడ వై[3]కుంఠుని కథా వాసన లేకుండు నే దేశంబున సత్పురుషు లైన పరమ భాగవతులు లే కుండుదు రేభూమిని యజ్ఞేశ్వరుని మహోత్సవంబులు లేక యుండు నది సురేంద్ర లోకంబైన నుండం దగదు జ్ఞానానుష్ఠాన ద్రవ్య కలాపంబుల చేత మనుష్యజాతిం బొంది తపంబున ముక్తిం బొంద కుండెనేని మృగంబులమాడ్కి నతండు దనకుం దానె బంధనంబు నొందు భారతవర్షంబునందుఁ బ్రజలచేత శ్రద్ధాయుక్తంబుగా ననుష్ఠింపం బడిన యజ్ఞంబులయందు వేల్పుంబడుహవిస్సులను బెక్కు నామంబులం బుండరీకాక్షుం డంది తనమీఁదిభక్తి యధికంబుగాఁ జేయు నట్టి భారతవర్షంబు నందలి ప్రజలమీఁదం గరుణించి సర్వేశ్వరుం డిహపరసౌఖ్యంబుల నొసంగు చుండు జంబూద్వీపంబున సగరాత్మజు ల[4]శ్వమేధాశ్వంబు నన్వేషింపం బూని భూ[5]ఖననంబు సేయుటంజేసి స్వర్ణప్రస్థ చంద్ర శుక్లావర్తన రమణక మందేహారుణ పాంచజన్య సింహళ లంకాద్వీపంబు లన నెనిమిదియుపద్వీపంబులు గలిగె. 56

సీ. లక్షయోజనముల ♦ లవణాబ్ధి పరివృత
మగుచు జంబూద్వీప ♦ మతిశయిల్లు
విను రెండులక్షల ♦ విస్తృతముగను బ్ల
క్షద్వీప ముండు నా ♦ క్షారసాగ

1. పునర్జన్మ = తిరిగిపుట్టుట. 2. సర్వసంగ పరిత్యాగము = అన్నితగులములు వదలుట. 3. వైకుంఠుని కథావాసన = విష్ణుకథలయందలి జ్ఞానము. 4. అశ్వమేధము = గుఱ్ఱపుఁజన్నము. 5. ఖననంబు = త్రవ్వుట. పూడ్చుట.

రముఁ జుట్టి యందుల ♦ రష్యమై యొప్పెడు
వృక్షంబు ప్లక్షంబు ♦ విదితముగను
దనరు నా ద్వీపంబు ♦ దరునామమహిమచే
మిగులఁ బ్లక్షం బన ♦ మించి రహిని

ఆ. నందు సంచరించు ♦ నట్టి వారల కగ్ని
దేవుఁ డమరు నాది ♦ దేవతయుఁగ
నందులోన నా ప్రి ♦ య వ్రత పుత్రుండు
ని[1]ధ్మజిహ్వుఁ డగు మ ♦ హీవరుండు. 57

వ. నరేంద్రా యాయిధ్మజిహ్వుం డాప్లక్షద్వీపంబు నేడువర్షంబులుగ విభజించి యందు నావర్ష నామధారులుగా నుండు తన పుత్రులగు శివ యశస్య సుభద్ర శాంత క్షేమాభయామృతు లనియెడు నేడు గుర నేడువర్షంబుల కధిపతులం గావించి తపంబునకుం జనియె నా వర్షంబులయందు మణికూట వజ్రకూట నింద్రసేన జ్యోతిష్మ ద్ధూమ్రవర్ణ హిరణ్యగ్రీవ మేఘమాల లను నామంబులు గల సప్తకులపర్వతంబులును నరుణయు నృమణయు నాంగిరసయు సావిత్రియు సుప్రభాతయు ఋతంభరయు సత్యంభరయు నన సప్త మహానదులును నానదులయందు సుస్నాతులగుచు గతపాపు లైన హంసపతంగోర్ధ్వాయనసత్యాంగు లను నామంబులు గల చాతుర్వర్ణ్యంబును గలిగి యుండు నందుఁ బురుషులు సహస్ర వత్సరజీవులును దేవతాసములును దృష్టిమాత్రంబునం గ్లమస్వే దాదిరహితంబగు నపత్యో త్పాదనంబు గలవార లగుచు [2]వేదత్ర యాత్మకుండును స్వర్గద్వార భూతుండును భగవత్స్వరూపియు నగు సూర్యుని వేదత్రయమ్మున సేవింపుచుండు ప్లక్షద్వీపం బాదిగా మీఁదటి ద్వీపపంచకంబు నందలి పురుషులకు నాయురింద్రియ పటు త్వంబులును దేజోబలంబులును నొడనె జనియించుచుండు. 58

---

1. ఇధ్మజిహ్వుఁడు = పుడకపలె గట్టిపొడుగు నాలుకగలవాఁడు. 2. వేదత్రయాత్మకుఁడు = ఋగ్, యజుస్సు, సామ వేదములచే నిండినవాఁడు (సూర్యుఁడు)

క. ప్లక్షద్వీపము ద్విగుణిత
లక్షేక్షురసాబ్ధి నుట్టి • రా విలసిల్లు
న్నిక్షురసోదద్విగుణం
బక్షయముగ శాల్మలీ మ • హాద్వీప మిలన్. 59

వ. అందు శాల్మలీవృక్షంబు ప్లక్షాయామం బై తేజరిల్లు నావృక్ష రాజంబునకు సహస్రభాగంబునం [1]పతత్త్రిరాజుగా నుండు గరుత్మంతుండు నిలుకడగా వసించు నాశాల్మలీవృక్షంబు పేర నాద్వీపంబు శాల్మలీద్వీపం బన విలసిల్లు నాద్వీప పతి యైనప్రియవ్రతాత్మజుం డగు యజ్ఞబాహువు దనపుత్త్రు లగు సురోచన సౌమనస్య రమణక దేవబర్హ పారిభద్రాప్యాయ నాభిజ్ఞాతు లనియెడు వారి పేర నేడువర్షంబుల నేర్పఱిచి యావర్షంబులకుం దేవ్వారిఁ గుమారుల నభిషిక్తులం జేసె నావర్షంబులయందు స్వరస శతశృంగ వామదేవ కుముద ముకుంద పుష్పవర్ష శతశ్రుతు లను పర్వత సప్తకంబును ననుమతియు సినీవాలియు సరస్వతియుఁ గుహూవును రజనియు నందయు రాకయు ననుసప్తమహానదులును గల వందు శ్రుతధర విద్యాధర వసుంధర రేధ్మధర సంజ్ఞ లగు నావర్షపురుషులు భగవత్స్వరూపుండు వేదమయుండు నాత్మస్వరూపుండు నగు సోముని వేదమంత్రంబులచే నారాధింపుదు రాద్వీపంబు లక్షచతుష్టయ పరిమితయోజనవిస్తృతం బయిన సురాసముద్రంబుచే [2]నావృత్తం బై తేజరిల్లు నుండు. 60

సీ. భూనాథ యీసురాం • భోధికిఁ జుట్టుగా
నుండు కుశద్వీప • ముర్వి మీఁదఁ
దోరమై తా ద్విచ • తుర్లక్ష యోజనం
బులను విస్తారమై • పొలుపు మిగుల
నందుఁ గుశస్తంభ • మనిశంబు దేవతా
కల్పితం బైనట్టి • కాంతిచేత

1. పతత్త్రిరాజు = పులుగులఱేఁడు (గరుత్మంతుఁడు). 2. ఆవృతము = కూడినది.

దిక్కులు వెలిఁగించు ♦ ద్వీపంబునకుఁ దన
పేరను సత్కీర్తి ♦ పెంపుసేయు
తే. నట్టి దీవికి యధిపతి ♦ యగు ప్రియవ్ర
తతనయుండు హిరణ్యరేతసుఁ డనం ద
నరెడి భూపతి తనసుత ♦ నామములను
వర్షములు సేసె నత్యంత ♦ హర్షమునను. 61

వ. ఇట్లు హిరణ్యరేతసుండు వసుదాన దృఢరుచి నాభిగుప్త సత్యవ్రత విప్ర వామదేవు లను నామంబులు గల పుత్రుల నామంబుల సప్త వర్షంబులం గావించి యా కుమారుల నందు నిలిపి తాను దపంబు నకుం జనియె నావర్షంబునందు బభ్రుచతుశ్శృంగ కపిల చిత్ర కూట దేవానీ కోర్ధ్వరోమ ద్రవిణంబు లను నామంబులు గల సప్తగిరులును రసకుల్యయు మధుకుల్యయు శ్రుతవిందయు మిత్ర విందయు దేవగర్భయు ఘృతచ్యుతయు మంత్రమాలయు నను సప్తమహానదులును గల వానదీజలంబులఁ [1]కృతమజ్జను లగుచు భగవంతుం డగు యజ్ఞపురుషునిఁ గుశల కోవిదాభియుక్తు లను కులంబులు గల వర్షపురుషు లారాధించు చుందురు. 62

సీ. ఆ కుశద్వీపంబు ♦ నరికట్టుకొని యుండు
నెనిమిదిలక్షల ♦ ఘనఘృతాబ్ధి
యా ఘృతసాగరం ♦ బవ్వల షోడశ
లక్షయోజనముల ♦ లలిత మగుచు
నుండుఁ గ్రౌంచద్వీప ♦ మువ్వీశ యందు మ
ధ్య ప్రదేశంబున ♦ నట్టిదీవి
పేరుగాఁ దనపేరఁ ♦ బెద్దగాఁ జేసిన
క్రౌంచాద్రిగల దాన ♦ గంబు మున్ను
ఆ. [2]షణ్ముఖుండు దివ్య ♦ శరమున ఘన[3]నితం
బంబు దూయ సేయఁ ♦ [4]పాలవెల్లి

1. కృతమజ్జనులు = స్నానముచేసినవారు. 2 షణ్ముఖుఁడు = ఆఱుమొగములవాఁడు (కుమారస్వామి). 3. నితంబము = పిఱుదు. 4. పాలవెల్లి = పాలసంద్రము.

గరిమఁ దడుపుచుండు ♦ వరుణుండు రక్షింప
నందు మిగుల భయము ♦ నొంద కుండె. 63

వ. నరేంద్రా యా క్రౌంచద్వీపపతి యగు ఘృతపృష్ఠుండు దన కుమారుల నాపేళ్లుగల యామోద మధువహ మేఘపృష్ఠ సుదామ ఋషిజ్య లోహితార్ణ వనస్పతు లను వర్షంబుల కభిషిక్తులం జేసి పరమకల్యాణగుణయుక్తుం డయిన శ్రీ హరిచరణారవిందంబుల సేవించుచుం దపంబునకుం జనియె నావర్షంబులయందు శుక్లవర్ధమాన భోజనోపబర్హణానంద నందన సర్వతోభద్రంబు లను సప్తసీమాపర్వతంబులును నభయయు నమృతౌఘయు నార్యకయుఁ దీర్థవతియుఁ దృప్తిరూపయుఁ బవిత్రవతియు శుక్లయు నను సప్తనదులును గల సందులఁ బవిత్రోదకంబు లనుభవించుచు గురు ఋషభ ద్రవిణక దేవక సంజ్ఞలు గలిగి వరుణదేవుని [1]నుదకాంజలులం బూజించు చున్న [2]చాతుర్వర్ణ్యంబు గలిగియుండు. 64

సీ. జగతీశ వినుము క్రౌం ♦ చద్వీపమును జుట్టి
యుండు షోడశలక్ష ♦ యోజనముల
విస్తార మై పాల ♦ వెల్లియందునను శా
కద్వీప మతుల ప్ర ♦ కాశ మొందు
దండిమై ముప్పది ♦ రెండులక్షల యోజ
నముల విస్తారమై ♦ యమరి యుండు
నందులశాకవృ ♦ క్షామోద మాద్వీప
మును సుగంధంబునఁ ♦ బెనఁగఁ జేసి

తే. యంతఁ దనపేర దీవి ప్ర ♦ ఖ్యాత మగుటఁ
జేసి యందుల మిగులఁ బ్ర ♦ సిద్ధికెక్కె
నందు మేధాతిథియుఁ గర్త ♦ యగుచు నుండెఁ
దవిలి వేడుకఁ దనకు నందనులఁ జూచి. 65

వ. మఱియు నా ప్రియవ్రత పుత్త్రుం డయిన మేధాతిథి దనపుత్త్రులపేరం గల పురోజవ మనోజవ వేపమాన ధూమ్రానీక చిత్రరథ బహు

1. ఉదక + అంజలులు = నీళ్లదోసిళ్లు. 2. చాతుర్వర్ణ్యములు = నాలుగుజాతులు

రూప విశ్వాచారంబులను సంజ్ఞలు గల సప్తవర్షంబులయందు వార
లకుఁ బట్టంబు గట్టి శ్రీ హరిపాదసేవ సేయుచుఁ దపోవనంబునకుం
జనియె నాశాకద్వీపంబునందు నీశా నోరుశృంగ బలభద్ర శతకే
సర [1]సహస్రస్రోతో దేవపాల మహానస నామంబులు గలసీమాగిరు
లును ననఘాయుర్దోభయస్పృష్ట్యపరాజిత పంచపదీ సహస్ర
స్రుతి నిజధృతు లను సప్తనదులును గల వా నదీజలంబు లుపయో
గించి యచ్చటివారలు ప్రాణాయామంబు సేసి విధ్వస్తరజస్తమో
గుణు లయి పరమసమాధిని వాయురూపం బైన భగవంతుని
సేవింతురు ఋతవ్రత సత్యవ్రత దానవ్రత సువ్రత నామంబులు
గల చాతుర్వర్ణ్యం బందుఁ గలిగి యుండు. 66

సీ. అట్టిశాకద్వీప ♦ మరికట్టి తత్ప్రమా
ణంబున దధిసము ♦ ద్రంబు వెలుఁగు
నందుకుఁ బరివత్సం ♦ బయి పుష్కరద్వీప
మిలఁ జతుష్షష్టి ల ♦ క్షల విశాల
మమ్మహాద్వీపమం ♦ [2]దయుతకాంచనపత్త్ర
ములు గల్గి కమలగ ♦ ర్భునకు నాస
నం బగు పంకేరు ♦ హం బుండు నాద్వీప
మధ్యంబునను నొక్క ♦ మానసోత్త

ఆ. రం బనంగఁ బర్వ ♦ తం బుండుఁ దనకుఁ బూ
ర్వాపరముల నుండు ♦ నట్టివర్ష
ములకు రెంటి కట్లు ♦ నిలిచిన మర్యాద
నగ మనంగఁ జాలఁ ♦ బొగడ నెగడు. 67

వ. ఇట్లు దనకు లోపలి వెలుపలి వర్షంబులు రెంటికి మర్యాదాచలంబు
నుంబోలె నున్న మానసోత్తరపర్వతంబయుతయోజనవిస్తారంబు
ను నంతియయౌన్నత్యంబునుం గలిగియుండు నానగంబునకు నలు
దిక్కులయందు నాలుగు లోకపాలుర పురంబు లుండు నామాన

---

1. సహస్రస్రోత = వేయిపాయలుగలది. 2. అయుత కాంచన పత్రములు = పదివేల తామరపూలు.

నోత్తర పర్వతంబుతుద సూర్యరథచక్రంబు సంవత్సరాత్మకం
బయి యహోరాత్రంబులయందు మేరుప్రదక్షిణంబు సేయునందు
నాపుష్కరద్వీపాధిపతి యగు వీతిహోత్రుండు రమణకధాతకనా
మంబులు గల పుత్రుల నిరువుర వర్షద్వయంబునం దభిషిక్తులం జేసి
తాను బూర్వజు లేఁగిన తెఱంగున భగవత్కర్మశీలుం డగుచుఁ
దపంబునకుం జనియె నంత. 68

క. మనుజేశ్వర యావర్షం బున నప్పుడు
సంచరించు ♦ పురుషులు పద్మా
సనునిఁ దగ నర్చనారాధన సేయుదు
రచలబుద్ధి ♦ తాత్పర్యమునన్. 69

క. ధరణీవల్లభ విను పుష్కర
మనుద్వీపమున లేరు ♦ చాతుర్వర్ణ్యుల్
పరగఁగ భేదము లేకే సరసత సము
లగుదు రందు ♦ సకలజనములున్. 70

వ. మఱియు పుష్కరద్వీపంబు [1]చతుష్షష్టి లక్షయోజనవిస్తారం బైన శుద్ధోదక సముద్రముద్రితం బగు చుండు నవ్వల లోకాలోకపర్వతంబుండు శుద్ధోదకసముద్రలోకాలోక పర్వతంబుల నడుమ రెండుకోట్లయోజన విస్తారం బయిన సర్జనభూమి దర్పణోదర సమానంబై దేవతా వాసయోగ్యంబుగా నుండు నాభూమిం జేరిన పదార్థంబు మరలఁ బొంద నశక్యంబుగా నుండు నటఁమీద లోకాలోక పర్వతం బెనిమిదికోట్ల యోజనంబులు సువర్ణభూమియు సూర్యాది ధ్రువాంతంబులగు జ్యోతిర్గణంబులమధ్యంబున నుండుటం జేసి లోకాలోక పర్వతం బనం దగియుండుఁ బంచాశత్కోటియోజన విస్తృతం బగు భూమండల మానంబునకుఁ దురీయాంశప్రమాణంబుగల యాలోకాలోక పర్వతంబుమీఁద నఖిల జగద్గురు వగు బ్రహ్మచేతఁ జతుర్దిశలయందు ఋషభపుష్కర చూడవా

1. చతుష్షష్టి లక్షయోజనవిస్తారము = అరువదినాలుగులక్షల ఆమడల విశాలము.

మ నాపరాజిత సంజ్ఞలు గలదిగ్గజంబులు నాలుగును లోకరక్షణా
ర్థంబు నిర్మితంబై యుండు మఱియును. 71

సీ. తనను [1]విభూతులై ♦ తనరియాదేవ
బృంద తేజశ్శౌర్య ♦ బృంహణార్థ
మై భగవంతుండు ♦ నాది దేవుండును
నైన జగద్గురుం ♦ డచ్యుతుండు
సరిలేనిధర్మ వి ♦ జ్ఞానవైరాగ్యాదు
లయిన విభూతుల ♦ నలరియున్న
యట్టివిష్వక్సేను ♦ డాదిగాఁ గలుగు పా
ర్షదులతోఁ గూడి ప్ర ♦ శస్తమైన

తే. నిజవరాయుధదోర్దండ ♦ నిత్యసత్త్వుఁ
డగుచు నాపర్వతంబుపై ♦ నఖిలలోక
రక్షణార్థంబు కల్ప ప ♦ ర్యంత మతఁడు
యోగమాయా విరచితుఁడై ♦ యొప్పుచుండు. 72

వ. ఇట్లు వివిధ[2]మంత్రగోపనార్థం బానగాగ్రంబున నున్న భగవం
తుండు దక్క లోకాలోకపర్వతంబునకు నవ్వల నోరులకు సంచ
రింప నశక్యంబయి యుండు బ్రహ్మాండంబునకు సూర్యుండు మధ్య
గతుండై యుండు నాసూర్యునకు నుభయపక్షంబులయందు నిరువ
దేనుకోట్ల యోజనపరిమాణంబున నండకటాహం బుండు నట్టి
సూర్యునిచేత నాకాశదిక్స్వర్గాపవర్గంబులును నరకంబులును నిర్ణ
యింపంబడు దేవతిర్యఙ్మనుష్య నాగపక్షితృణగుల్మలతాది సర్వ
జీవులకును సూర్యుం డాత్మ యగుచు నుండు. 73

క. కర మను రాగంబున నీ
ధరణీమండలము సంవి ♦ ధానం బెల్ల

---

1. విభూతులు: అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము వశిత్వము (ప్రకృతి యందలి శ్రేష్ఠములైన వస్తువులన్నియు విభూతులగును.)
2. మంత్రగోపనము = మంత్రము దాచుట.

న్నెఱిఁగించితి నింతియ కా
దెఱిఁగించెద సర్గమాన ♦ మెల్ల నరేంద్రా. 74

—[1]భ గ ణ వి ష య ము—

ఆ. [2]కమల జాండ మధ్య ♦ గతుఁ డైన సూర్యుండు
భరిత మైన యాత ♦ పంబుచేత
మూఁడు లోకము లను ♦ ముంచి తపింపఁగఁ
జేసి కాంతి నొందఁ ♦ జేయుచుండు. 75

వ. ఇట్లు భాస్కరుం డుత్తరాయణ దక్షిణాయ విషువు లను నామంబులు గల [3]మాంద్య తీవ్రసమానగతుల నారోహణావరోహణ స్థానంబులయందు దీర్ఘహ్రస్వ సమానంబులుగాఁ జేయుచుండు. 76

ఆ. మేష తులల యందు ♦ మిహిరుం డహోరాత్ర
మందుఁ దిరుగు సమ వి ♦ హారములను
బరఁగఁగ వృషభాది ♦ పంచమాసముల నొ
క్కొక్క గడియ రాత్రి ♦ దక్కినడచు. 77

ఆ. మించి [4]వృశ్చికాది ♦ పంచమాసముల నొ
క్కొక్క గడియ రాత్రి ♦ నిక్కి నడచు
దివము లందు నెల్ల ♦ దిగజారు నొక్కొక్క
గడియ నెలకుఁ దప్పి ♦ కారమునను. 78

వ. మఱియు నివ్విధంబున దివసంబు లుత్తరాయణ దక్షిణాయనంబుల వృద్ధిక్షయంబుల నొంద నొక్క యహోరాత్రంబున నేక పంచాశదుత్తర నవకోటి యోజనంబుల పరిమాణంబు గల మానసోత్తర పర్వతంబున సూర్యరథంబు దిరుగుచుండు నా మానసోత్తర పర్వతంబునఁదుఁ దూర్పున దేవధాని యను నింద్రపురంబును దక్షిణంబున సంయమని యను యమనగరంబును పశ్చిమంబున నిమ్లోచని యను వరుణపట్టణంబును నుత్తరంబున విభావరి యను

1. భగణము = చుక్కలగుంపు. 2. కమలజ + అండము = బ్రహ్మాండము. 3. మాంద్య తీవ్రమానములు = నెమ్మది తొందర మెరలు. 4. వృశ్చికాది పంచ మాసములు = కార్తీకముమొదలు ఫాల్గుణము చివరకుగల నెలలు.

సోముని పుటభేదనంబును దేజరిల్లుచుండు నా పట్టణంబుల యందు నుదయ మధ్యాహ్నాస్తమయ నిశీథంబు లనియెడు కాలభేదంబులను భూత[1]ప్రవృత్తి [2]నివృత్తి[3]నిమిత్తం బచ్చట జనులకుఁ బుట్టించుచుండు సూర్యుం డెప్పుడు నింద్రనగరంబున నుండి గమనించు నది యాదిగాఁ బదినేను గడియలను రెండుకోట్ల ముప్పదియేడు లక్షల డెబ్బదియైదువేల యోజనంబులు నడచు నివ్విధంబున నింద్ర యమవరుణ పురంబుల మీఁదఁ జంద్రాది గ్రహ నక్షత్రంబులం గూడి సంచరించుచుఁ బండ్రెండంచులు నాలుగమ్మలును మూఁడు దొంటులుం గలిగి సంవత్సరాత్మకంబయి యేకచక్రంబయిన సూర్యుని రథంబు ముహూర్త మాత్రంబున ముప్పది నాలుగు లక్షలు నెన మన్నూఱు యోజనంబులు సంచరించు. 79

సీ. [4]ఇనురథంబున కున్న ♦ యిరుసు కొక్కటియు మేరు
శిఖరంబు నందును ♦ జేరి యుండు
నొనరఁ జక్రము మాన ♦ సోత్తర పర్వతం
బందులఁ దిరిగెడు ♦ నా రథంబు
నిరుసున నున్న రెం ♦ డిరుసులు దగులంగఁ
బ[5]వన పాశంబుల ♦ బద్ధ మగుచు
ధ్రువమండలంబు నం ♦ దుల నంటి యుండఁగా
సంచరించుచు నుండు ♦ సంతతంబు

తే. నట్టి యరదంబు ముప్పది ♦ యాఱులక్ష
లందు నంటిన కాఁడియు ♦ నన్ని యోజ
నముల విస్తార మైతురం ♦ గముల కంధ
రములఁ దగులుచు వెలుఁగొందు ♦ రమణతోడ. 80

వ. ఆరథంబునకు గాయత్రీచ్ఛందం బాదిగా సప్తచ్ఛందంబులు నశ్వంబులై సంచరించు భాస్కరునకు నగ్రభాగంబున నరుణుండు

1. ప్రవృత్తి = గుణ సహితమైనది. 2. నివృత్తి = గుణ రహితమైనది. 3. నిమిత్తము = కారణము. 4. ఇనురథము = సూర్యునితేరు. 5. పవనపాశంబులు = గాలికట్లు.

నియుక్తుండై రథంబు గడపుచుండు వెండియు నం[1]గుష్ఠ పర్వ మాత్ర శరీరంబులు గల యఱువదివేల వాలఖిల్యాఖ్యు లగు ఋషివరులు సూర్యుని ముందట సౌరసూక్తంబుల స్తుతియింప మఱియు ననేకములును గంధర్వ కిన్నర కింపురుష నాగాప్సరః పతంగాదులును నెల నెల వరుసక్రమంబున సేవింపం దొమ్మిది కోట్లు నేఁబది యొకలక్ష యోజనంబుల పరిమాణంబు గల భూమండలంబునం దొక క్షణంబున సూర్యుండు రెండు వేల యేఁబది యోజనంబులు సంచరించుచు నొక యహోరాత్రంబు నందె యీ భూమండలం బంతయు సంచరించు ననిన శుక యోగీంద్రునకుఁ బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె. 81

క. మునివర మేరుధ్రువులకు
నొనరఁ బ్రదక్షిణము దిరుగు ♦ చుండెడు[2]నజుఁ డా
యినుఁ డభిముఖుఁడై [3]రాసుల
కనుకూలత నేఁగు నంటి ♦ వది యెట్లొప్పున్. 82

క. అని పలికిన భూవరునిం
గనుఁగొని శుకయోగి మిగులఁ ♦ గరుణాన్వితుఁడై
మనమున శ్రీహరిఁ దలఁచుచు
విను మని క్రమ్మఱఁగ నిట్లు ♦ వినిపించెఁ దగన్. 83

వ. నరేంద్రా యతి వేగంబునఁ దిరుగుచుండు కులాల చక్రంబునందు [4]చక్రభ్రమణంబునకు వేఱైనగతి నొంది బంతి సాగి తిరిగెడు పిపీలికాదుల చందంబున నక్షత్ర రాసుల తోడం గూడిన కాలచక్రంబు ధ్రువమేరువులం బ్రదక్షిణంబు దిరుగు నప్పుడా కాలచక్రంబు నెదుర సంచరించు సూర్యాది గ్రహంబులకు నక్షత్రాంతరంబుల

1. అంగుష్ఠపర్వమాత్ర శరీరులు = బొటనవేలి కణిపెడు మేరగల శరీరము గలవారు. (వాలఖిల్యులు) 2. అజుఁడు = పుట్టుకలేనివాఁడు. (బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు) 3. రాసులు=మేషము మొదలైనవి 12. ఇవే సౌరమానమువారికి మాసములగును. 4. చక్రభ్రమణము = బండికంటి తిరుగుడు.

యందును రాశ్యంతరంబుల యందును నునికి గలుగుటం జేసి సూర్యాది గ్రహంబులకుఁ జక్రగతిస్వగతులవలన గతిద్వయంబు గలుగుచుండు మఱియు నా సూర్యుండాదినారాయణమూర్తి యగుచు లోకంబుల యోగక్షేమంబులకు వేదత్రయాత్మకంబై కర్మసిద్ధి నిమిత్తంబై దేవర్షి గణంబులచేత వేదాంతార్థంబుల ననవరతంబు వితర్క్యమాణం బగుచున్న తనస్వరూపంబును ద్వాదశ విధంబులుగ విభజించి వసంతాది ఋతువుల నా యా కాల విశేషంబులయందుఁ గలుగఁ జేయుచుండు నట్టి పరమ పురుషుని మహిమ నీ లోకంబున మహాత్ములగు పురుషులు దమ తమ వర్ణాశ్రమాచారముల చొప్పున వేదోక్త ప్రకారంబుగా భక్త్యతిశయంబున నారాధించుచు క్షేమంబు నొందుచుందు రట్టి యాదినారాయణమూర్తి [1]జ్యోతిశ్చక్రాంతర్వర్తియై స్వకీయ తేజః పుంజదీపితాఖిల జ్యోతిర్గణంబులుగలవాఁడై ద్వాదశ రాసులయందు నొక సంవత్సరంబున సంచరించుచుండు నట్టి యాదిపురుషుని గమన విశేష కాలంబును లోకులయిన ఋతుమాసపక్ష తిథ్యాదులచే వ్యవహరించుచుందురు మఱియు నప్పరమపురుషుం డా రాసులయందు [2]షష్ఠాంశసంచారంబు నొందినసమయంబును ఋతువని వ్యవహరింపుదు రా రాసులయందు నర్థాంశసంచారమ్మున [3]రాశిషట్కభోగం బొందినతఱి యయనం బని చెప్పుదురు సమగ్రంబుగా రాసులయందు సంచారమొందిన యెడల నట్టికాలంబును సంవత్సరంబని నిర్ణయింపుదు రిట్టి సమగ్ర రాశి సంచారంబునందు శీఘ్రగతి మందగతి సమగతు లనియెడు త్రివిధ గతివిశేషంబుల వలన వేఱుపడెడు నావత్సరంబును సంవత్సరంబు పరివత్సరం బిడావత్సరం బను వత్సరం బిద్వత్సరం బని పంచవిధంబులఁ జెప్పుదురు చంద్రుండు నీ

1. జ్యోతిశ్చక్రాంతర్వర్తి = వెలుగుల చక్రమందుఁ దిరుగువాఁడు (సూర్యుఁడను నారాయణుఁడు) ఆ జ్యోతిశ్చక్రమే మాసరూపకమైన కాలచక్రము. 2. షష్ఠాంశము = ఆఱవవంతు. 3. రాశిషట్కభోగము = ఆఱురాసులందుఁ దిరుగు కాలమే యొక్క అయనము.

తెఱంగున నా సూర్యమండలంబు మీఁద లక్షయోజనంబులనుండి సంవత్సర పక్షరాశినక్షత్రభుక్తులు గ్రహించుచు నగ్రచారియై శీఘ్రగతిం జరించు నంత వృద్ధిక్షయరూపంబునం బితృగణంబులకుఁ బూర్వపక్షాపరపక్షంబులచేత నహోరాత్రంబులఁ గలుగఁ జేయుచు సకలజీవ ప్రాణంబై యొక్కనక్షత్రంబు త్రింశన్ముహూర్తంబు లనుభవించుచు షోడశకళలు గలిగి మనోమయాన్నమయామృతమయ దేహుండై దేవ పితృ మనుష్య భూత పశు పక్షి సరీసృప వీరుత్ప్రభృతులకుఁ బ్రాణాప్యాయశీలుం డగుటం జేసి సర్వసముండనం బడు. 84

క. [1]చందురునకు మీఁదై యా
నందంబున లక్షయోజ ♦ నంబులఁ దారల్
గ్రందుకొని మేరుశైలం
బంది ప్రదక్షిణము దిరుగు ♦ [2]నభిజిద్భముతోన్. 85

సీ. అటమీఁదఁ దారల ♦ కన్నిటి కుపరియై
రెండులక్షల శుక్రుఁ ♦ డుండి భాస్క
రునిముందఱంబిఱుఁ ♦ దను సామ్య మృదుశీఘ్ర
సంచారములను భా ♦ స్కరునిమాడ్కిఁ
జరియించుచుండును ♦ జనులకు ననుకూలుఁ
డై వృష్టి కొసఁగుచు ♦ నంతనంతఁ
జతురత వృష్టివి ♦ ష్కంభక గ్రహశాంతి
నొనరించువారల ♦ కొసఁగు శుభము

తే. లుండు నామీఁద [3]సౌమ్యుండు ♦ రెండు లక్ష
లను  రించుచు రవిమండ ♦ లంబుఁ బాసి
కానఁబడినను జనులకు ♦ క్షామడాంబ
రాదిభయములఁ బుట్టించు ♦ నతులమహిమ. 86

1. చందురునకు = చంద్రునకు. అభిజిత్ + భము = అభిజిత్తు లగ్నముందెల్పు నక్షత్రము. 3. సౌమ్యుఁడు = సోము(చంద్రు)ని కొడుకు. (బుధుఁడు.)

సీ. [1]ధరణీతనూజుఁ డం ♦ తటిమీఁద రెండు ల
క్షలనుండి మూఁడు ప ♦ క్షముల నొక్క
రాశిదాఁటుచు నుండుఁ ♦ గ్రమమున ద్వాదశ
రాసులు భుజియించు ♦ రాజసమున
వక్రించియైన న ♦ వక్రత నైనను
దఱచుగాఁ బీడలు ♦ నరుల కొసఁగు
నంగారకుని మీఁది ♦ కావల రెండు ల
క్షల యోజనంబుల ♦ ఘనత మించి

ఆ. యొక్క రాశినుండి ♦ యొక్కొక్క వత్సరం
బనుభవించుచుండు ♦ నమరగురుఁడు.
వక్రమందునైన ♦ [2]వసుధామరులకును
శుభము నొసఁగు నెపుడు ♦ నభినవముగ. 87

క. [3]సురగురునకు మీఁదై [4]భా
స్కరసుతుఁ డిరులక్షలను జ ♦ గములకు బీడల్
జరపుచుఁ [5]ద్రింశన్మాసము
లరుదుగ నొక్కొక్క [6]రాశి ♦ యందు వసించున్. 88

క. ప్రాకటముగ [7]రవిసుతునకు
నేకాదశ లక్షలను [8]మహీసురులకు నీ
లోకులకు మేలు గోరుచుఁ
జోకగ మునిసప్తకంబు ♦ సొంపువహించున్. 89

క. మునిసప్తకమున కెగువం
దనరుచు నామీఁదఁ [9]ద్రియుత ♦ దశలక్షలఁ బెం

1. ధరణీతనూజుఁడు = భూదేవికొడుకు; = అంగారకుఁడు. 2. వసుధామరులు = బ్రాహ్మణులు. 3. సురగురుఁడు = బృహస్పతి. 4. భాస్కరసుతుఁడు = సూర్యపుత్రుఁడు = శని. 5. త్రింశన్మాసములు = ముప్పదినెలలు. 6. రాశి = నక్షత్రభాగములసమూహము. 7. రవిసుతునకు = సూర్యునికొడుకైన శనికి. 8. మహీసురులు = పుడమివేల్పులు = బాహ్మణులు. 9. త్రియుత........లు = పదమూఁడులక్షలు.

పున శింశుమారచక్రం
బనఁగా నన్నిటికి నుపరి ♦ యగు చుండు నృపా. 90

సీ. ఆ శింశుమారాఖ్య ♦ మగు చక్రమున భాగ
వతుఁ డైన ధ్రువుఁ డింద్రవరుణకశ్య
పప్రజాపతి యమ ♦ ప్రముఖులతోఁ గూడి
బహుమానముగ [1]విష్ణు ♦ పదముఁ జేరి
కణఁకనిచ్చలుఁ బ్రద ♦ క్షిణముగాఁ దిరుగుచుఁ
జెలఁగియుండును గల్ప ♦ జీవి యగుచు
ననఘుఁ డుత్తానపా ♦ దాత్మజుఁ డార్యుఁడు
నయిన యాధ్రువుని మ ♦ హత్త్వ మెల్లఁ

తే. దెలిసి వర్ణింప బ్రహ్మకు ♦ నలవిగాదు
నే నెఱింగినయంతియు ♦ నీకు మున్న
తెలయఁ బలికితిఁ గమ్మఱఁ ♦ దలఁచికొనుము
[2]జితరిపువ్రాత శ్రీపరీ ♦ క్షిన్నరేంద్ర. 91

వ. మఱియు నాధ్రువుండు నిమిషమాత్రం బెడలేక సంచరించు జ్యోతి
ర్గ్రహనక్షత్రంబులకు నీశ్వరునిచేత ధ్యానాక్రమణంబునఁ బశు
వులకై యేర్పఱిచిన [3]మేధిస్తంభంబు తెఱంగున మేటిగాఁ గల్పిం
పంబడి ప్రకాశించుచుండు గగనంబునందు మేఘంబులును శ్యేనాది
పక్షులును వాయువశంబునం గర్మసారథులై చరించు తెఱం
గున జ్యోతిర్గణంబులును బ్రకృతి పురుషయోగ గృహీతాశులై
కర్మనిమిత్తగతి గలిగి వసుంధరం బడుదురు. 92

క. పొందుగ జ్యోతిర్గణముల
నందముగా శింశుమార ♦ మందుల నుండం
గొందఱు దఱచుగఁ జెప్పుదు
నుండురు వినిపింతు విను [4]ప ♦ నూనచరిత్రా. 93

1. విష్ణుపదము = వామనుఁడు పెరిగి, పదముచేత గొల్చుకొనినది. (ఆకాశము) 2. జితరిపువ్రాత = శత్రుసమూహమును గెలిచినవాఁడా! 3. మేధిస్తంభము = కట్టుగొయ్య. 4. అనూనచరిత్రుఁడు = కొఱఁతఁబడని కథాభాగము గలవాఁడు.

క. తలక్రిందై వర్తులమై
సలలిత మగు శింశుమార ♦ చక్రమునందున్
నెలకొని [1]పుచ్ఛాగ్రంబున
నిలిచి ధ్రువుం డుండు నెపుడు ♦ నిర్మలచరితా. 94

వ. మఱియు నాశింశుమారచక్రపుచ్ఛంబునఁ బ్రజాపతియు నగ్నీంద్ర ధర్ములును [2]బుచ్ఛమూలంబున ధాతృవిధాతలును గటిప్రదేశంబున బుషిసప్తకంబును [3]దక్షిణావర్తకుండలీభూతశరీరంబునకు నుదగయననక్షత్రంబులును దక్షిణపార్శ్వంబున దక్షిణాయననక్షత్రంబులును బృష్ఠంబున దేవమార్గంబును నాకాశగంగయు నుత్తరభాగంబునఁ బునర్వసు పుష్యంబులును దక్షిణభాగంబున నార్ద్రాశ్లేషలును దక్షిణవామపాదంబుల నభిజిదుత్తరాషాఢలును దక్షిణవామనాసారంధ్రంబుల శ్రవణపూర్వాషాఢలును దక్షిణవామలోచనంబుల ధనిష్ఠామూలలును దక్షిణవామకర్ణంబుల మఘాదినక్షత్రంబులును వామపార్శ్వంబున దక్షిణాయనంబును దక్షిణపార్శ్వంబునఁ గృత్తికాదినక్షత్రత్రయంబును నుత్తరాయణంబును వామదక్షిణస్కంధంబుల శతభిజ్జ్యేష్ఠలును నుత్తరహనువున నగస్త్యుడును నపరహనువున యముండును ముఖంబున నంగారకుండును గుహ్యంబున శనైశ్చరుండును మేఢ్రంబున బృహస్పతియును వక్షంబున నాదిత్యుండును నాభిని శుక్రుండును మనంబునఁ జంద్రుండును స్తనంబుల నాశ్వినులును బ్రాణాపానంబుల బుధుండును గళంబున రాహువును సర్వాంగంబులఁ గేతుగ్రహంబును రోమంబులఁ దారలును నుండు నది సర్వదేవతామయంబైన పుండరీకాక్షుని దివ్యదేహంబు ధ్రువునింగా నెఱుంగుము. 95

సీ. ఇట్టి దివ్యశరీర ♦ మెవ్వఁడు ప్రతిదినం
బందు సంధ్యాకాల ♦ మతులభక్తి

1. పుచ్ఛాగ్రము = తోఁకచివర. 2. పుచ్ఛమూలము = తోఁకమొదలు. 3. దక్షిణా.... శరీరము = కుడివైపునకు గుండ్రముగఁ దిరిగిన శరీరములు.

మనమందు నిలిపి యే ♦ మఱక మిక్కిలి ప్రయ
త్నంబున నియతుఁడై ♦ తత్త్వబుద్ధి
మౌనవ్రతంబునఁ ♦ బూని వీక్షించుచు
నీసంస్తవంబు దా ♦ నెంతొ ప్రేమ
జపియించి కడుఁ బ్రశ ♦ స్తమును మునీంద్ర సే
వ్యమును జ్యోతిస్వరూ ♦ పమున వెలుఁగు
ఆ. విపులశింశుమార ♦ విగ్రహంబునకు వం
దనము వందనంబు ♦ లనుచు నిలిచి
సన్నుతించె నేని ♦ సకలార్థసిద్ధులఁ
బొందు మీఁద ముక్తిఁ ♦ జెందు నధిప. 96
క. ఇనమండలంబునకుఁ గ్రిం
దను దశసాహస్ర యోజ ♦ నంబుల స్వర్భా
నుని మండలంబు గ్రహ మై
ఘనముగ నపసవ్యమార్గ ♦ గతి నుండు నృపా. 97
క. అసురాధముఁ డగు రాహువు
[1]బిసరుహసంభవుని వరము ♦ పెంపున నెంతో
పస యగు నమరత్వంబున
నసమానం బైనగ్రహ వి ♦ హారముఁ బొందెన్. 98
సీ. జననాథ రాహువు ♦ జన్మకర్మంబులు
వినిపింతు ముందఱ ♦ విస్తరించి
యయుత యోజనవిస్తృ ♦ తార్కమండలము ద్వి
షట్సహస్రవిశాల ♦ చంద్రమండ
లముఁ బర్వకాలంబు ♦ లను త్రయోదశసహ
స్రవిశాలమై మీఁద ♦ రాహుగప్పు
నది నూఁచి యుపరాగ ♦ మనుచును బలుకుదు
రెల్లవారును స్వ[2]ధ ♦ ర్మేచ్ఛు లగుచు

1. బిసరుహ సంభవుఁడు = విష్ణువుబొడ్డుదమ్మియందుఁ బుట్టినవాఁడు. (బ్రహ్మ)
2. స్వధర్మేచ్ఛులు = తాము చేయఁదగిన పనులయందుఁ గోరికగలవారు.

ఆ. నంతలోన [1]నిన శ ♦ శాంక మండలములఁ
గరుణఁ బోవఁ దలఁచి ♦ హరి సుదర్శ
నంబు వచ్చునను భ ♦ యంబున నైదాఱు
గడియలకును రాహు ♦ నడఁకి తొలఁగు. 99

2. నరవర యా రాహువునకు
నరసత నాక్రింద సిద్ధ ♦ చారణవిద్యా
ధరు లయుత యోజనంబులఁ
దిరముగ వసియించి లీలఁ ♦ దిరుగుదు రచటన్ 100

క. పరికింప సిద్ధవిద్యా
ధరులకుఁ బది వేలుక్రిందఁ ♦ దరలక యక్షుల్
మఱియును భూతప్రేతులు
జరియింతురు రాక్షసులు పి ♦ శాచులు గొలువన్. 101

ఆ. వారిక్రిందఁ దగిలి ♦ వాయువశంబున
మలయు చుండు మేఘ ♦ మండలంబు
మేఘమండలంబు ♦ మీ దగుచుండు భూ
మండలంబు క్రింద ♦ నుండు నధిప. 102

వ. అట్టిభూమండలంబుక్రింద యోజనాయుతాంతరంబున నండకటాహా యామంబు గలిగి క్రమంబున నొండొంటికిం గ్రిందగుచు నతల వితల సుతల రసాతల తలాతల మహాతల పాతాళలోకంబు లుండు నట్టి బిలస్వర్గంబులయందు నుపరిస్వర్గంబున కధికం బైన కామ భోగంబుల నైశ్వర్యానందంబులను సుసమృద్ధవనోద్యాన క్రీడా విహారస్థానంబుల ననుభవించుచు దైత్యదానవకాద్రవేయాది దేవ యోనులు నిత్యప్రముదితాను రక్తులగుచుఁ గ[2]ళత్రాపత్యసుహృ ద్బంధు దాసీదాసపరిజనులతోఁ జేరుకొని మణిగణఖచితంబు లగు నతిరమణీయగృహంబులయందు నీశ్వరునివలనం జేటు లేని

1. ఇనశశాంకమండలములు = సూర్యచంద్ర మండలములు. 2. కళ........ జనులతో=పెండ్లము, బిడ్డలు, చెలికాండ్రు, చుట్టములు, పనికత్తెలు పనివాండ్రు దగ్గరివారితో

కాయంబులు గలిగి వివిధమాయావిశేషవినిర్మిత నూతనకేళీసదన విహారణమండపవిచిత్రోద్యానాదులయందుఁ గేళీ వినోదంబులు సలుపుచుఁ జరియింతు రంత. 103

సీ. అట్టి పాతాళంబు ♦ లందును మయకల్పి
తము లగు [1]పుటభేద ♦ నముల యందు
బహురత్ననిర్మిత ♦ ప్రాకారభవన గో
పుర సభా చైత్యచ ♦ త్వరవిశేష
ములయందు నాసురా ♦ దుల మిథునములచే
శుకపికశారికా ♦ నికరసంకు
లముల శోభిల్లు కృ ♦ త్రిమ భూములను గల
గృహములచే నలం ♦ కృతములగుచు

ఆ. కుసుమచయసుగంధి ♦ కిసలయ స్తబకసం
తతులచేత ఫలవి ♦ తతులచేత
నతులరుచిరనవ[2]ల ♦ తాంగనాలింగిత
[3]విటపములను గలుగు ♦ విభవములను. 104

వ. మఱియు నానావిధజలవిహంగమమిథునంబులు గలిగి నిర్మలజలపూరితంబులై మత్స్యకులసంచారక్షుభితంబు లైన కుముదకువలయకహ్లారలోహితశతపత్త్రాదికంబులఁ దేజరిల్లెడుసరోవరంబులు గల యుద్యానవనంబులయందుఁ గృతనికేతనులై స్వర్గభూముల నతిశయించిన వివిధ విహారంబులు గలిగి యహోరాత్రాది కాల విభాగభయంబులు లేక మహాహిప్రవరుం డయిన శేషుని [4]శిరోమణిదీధితులచే నంధకారోపద్రవంబు లేక యెల్లప్పుడు దివసాయమానంబుగా నుండు నాలోకంబునందు నఖిలజనులు దివ్యౌషధిరసరసాయనంబుల ననవరతంబు నన్నపానంబులుగా సేవించుటం జేసి యచ్చటివారలకు నాధివ్యాధులును వలితపలితంబులును

1. పుటభేదనము = పట్టణము, 2. లతాంగనాలింగత = తీగెకలుకుల కౌగిళ్లతో గూడిన. 3. విటపములు = చెట్లు. 4. శిరోమణిదీధితులు = తలల యందలి మణులకాంతులు.

జరారోగంబులును శరీరవైవర్ణ్యంబులును [1]స్వేదదౌర్గంధ్యంబులును
గలుగక పరమకల్యాణమూర్తు లగుచు హరిచక్రభయంబు దక్క-
నన్యం బగు మృత్యుభయంబు నొందక యుందు రదియునుం గాక.

తే. అట్టి పాతాళలోకంబు ♦ నందు విష్ణు
చక్ర మెప్పుడేనిని బ్రవే ♦ శంబు నొందు
నప్పు డెల్లను దైత్యా కు ♦ లాంగనలకు
గర్భసంపద లందంద ♦ కరఁగు చుండు. 106

చ. అతలమునందు నమ్మయుని ♦ యాత్మజుఁడైన బలాసురుండు స
మ్మతిఁ జరియించు [2]షణ్ణవతి♦మాయలఁ గూడి వినోద మందుచుం
గుతలములందు నేఁడు నొక♦కొందఱు నచ్చటిమాయఁ జెంది సం
తతముఁ జరించు చుందురు ♦ దప్పక మోహనిబద్ధచిత్తులై. 107

వ. అట్టి బలుని యావలింతలను [3]స్వైరిణులు కామినులు [4]పురిశ్చలు
లను స్త్రీగణంబులు జనియించి రా కామినీజనంబులు పాతాళం
బుఁ బ్రవేశించిన పురుషునికి హాటకరసం బనియెడు సిద్ధరసఘుటిక
నిచ్చి రససిద్ధునిం గావించి యతని యందు స్వవిలాసావలోక
నానురాగస్మిత సల్లాపోపగూహనాదుల నిచ్ఛా విహారంబులు
సలుపుచుండ నాపురుషుండు మదాంధుండై తానె సిద్ధుండ నని
యును నాగాయుతబలుండ ననియును దలంచి నానావిధరతిక్రీడలఁ
బరమానందంబు నొందుచుండు. 108

సీ. [5]హాటకేశ్వరుఁ డైన ♦ [6]యంభికాధీశుండు
వితలంబునందుల ♦ వేడ్క నిలిచి
తనదుపార్షద భూత ♦ తతులతో బ్రహ్మాస
ర్గోపబృంహణమున ♦ నొక్కచోటఁ

1. స్వేదదౌర్గంధ్యము=చెమటవాసన 2. షట్ + నవతి + మాయలు= తొంబదియాఱు గారడీలు. 3. స్వైరిణులు=ఇష్టము వచ్చినట్లు తిరుగు నాడు వాండ్రు. 4. పురిశ్చలులు = రంకుటాండ్రు. 5. హాటకేశ్వరుఁడు = బంగరులింగము. 6. అంభికాధిశుఁడు= పార్వతీభర్త-శివుఁడు.

పార్వతీసంభోగ ♦ పరుఁ డగు చుండఁగా
వారలవీర్యంబు ♦ వలనఁ బుట్టి
నట్టిది హాటకి ♦ యని మొడిసినది యని
లాగ్నులు భక్షించి ♦ యందు నుమియ
తే. నదియు హాటక మనుపేర ♦ నతిశయిల్లి
వన్నె మీఱుచు శుద్ధసు ♦ వర్ణ మయ్యె
నా సువర్ణంబు నాలోక ♦ మందు నున్న
జనుల కెల్లను వినుత భూ ♦ షణము లయ్యె. 109
సీ. ఆ క్రింద సుతలంబు ♦ నందు మహాపుణ్యుఁ
డగు విరోచనపుత్రుఁ ♦ డైనయట్టి
బలిచక్రవర్తి యా ♦ పాకశాసనునకు
ముద మొసంగఁగఁ గోరి ♦ యదితిగర్భ
మున వామనాకృతిఁ ♦ బుట్టి యంతటఁ ద్రివి
క్రమురూపమునను లో ♦ కత్రయంబు
నాక్రమించిన దాన ♦ వారాతిచేత ముం
దటన యాఁచబడినయుం ♦ ద్రత్వ మిట్లు
ఆ. గలుగువాఁడు పుణ్య ♦ కర్మసంధానుండు
హరిపదాంబుజార్చ ♦ నాభిలాషుఁ
డగుచు శ్రీరమేశు ♦ నారాధనము సేయు
చుండు నెపుడు నతిమ ♦ హోత్సవమున. 110

వ. నరేంద్రా సకలభూతాంతర్యామియు దీర్ఘభూతుండును నయిన వాసుదేవునియందుఁ జిత్తంబు గలిగి యిచ్చిన భూదానంబునకు సాక్షాత్కరించిన మోక్షంబు ఫలం బగుం గాని పాతాళస్వర్గ రాజ్యంబులు ఫలంబులు గానేర వయిన నెవ్వరికిని మోక్షంబు సాక్షాత్కృతంబు గాకుండుటం జేసి లోక ప్రదర్శనార్థంబు పాతాళ స్వర్గరాజ్యంబుల నిచ్చె [1]క్షుతపతన ప్రస్ఖలనాదులందును వివశుం డైన మొడల నామస్మరణంబు సేయుపురుషుండు గర్మబంధంబువ

---

1. క్షుత......నాదులు = తుమ్ముట, వీర్యముజారుట మొదలైనవి.

లన విముక్తుండగుచు సుజ్ఞానంబునం బొందునట్టి వాసుదేవుం డాత్మజ్ఞానప్రపోషణంబుసేయు మాయామయంబు లైన భోగై శ్వర్యంబుల నెల్ల నెట్లొసంగు నన వలవదు భగవంతుండు యాచ నసేసి సకల సంపదలం జేకొని శరీరమాత్రావశిష్టునిం జేసి వారుణ పాశంబులం గట్టి విడిచినప్పుడు బలీంద్రుం డిట్లనియె. 111

సీ. పరమేశ్వరునకు నె ♦ ప్పటిపదార్థంములందుఁ
[1]తృష్ణ లేకుండుట ♦ దెలిసినాఁడ
నిందాదు లెల్ల [2]ను ♦ పేంద్రునిఁ బ్రార్థించి
యడిగిరి గాని శ్రీ ♦ హరికిఁ గోరి
కలు లేవు మిక్కిలి ♦ గంభీర మగు మహా
కాలస్వభావంబు ♦ గలుగు చుండు
నరయంగ మన్వంత ♦ రాధిపత్యమును లో
కత్రయంబును నెంత ♦ గాన తలఁప

ఆ. మత్పితామహుండు ♦ మానవంతుండు ప్ర
హ్లాదవిభునిఁ జూచి ♦ హర్షమంది
యెద్దియైనఁ గోరు ♦ మిచ్చెద ననుటకు
నంతలోన నీశ్వ ♦ రాజ్ఞఁ దెలిసి. 112

వ. ఇట్లు కృతార్థుండై [3]పిత్ర్యం బయిన రాజ్యంబు నొల్లక పరమే శ్వరుదాస్యంబ కోరె నా ప్రహ్లాద చరిత్రకథ నావసరమ్మున నీ తం డ్రికిని నీకును విశేషంబుగా నే పురుషుండు భగవదను గ్రహంబుఁ బొంద నోపు నని పుండరీకాక్షుం డానతిచ్చిన వాక్యంబులు వక్ష్య మాణగ్రంథంబున విస్తరించెద నా బలిచక్రవర్తి గృహద్వారం బున నఖిలలోక గురుండయిన శ్రీ మన్నారాయణుండు [4]గదాపాణి యును నిజజనానుకంపితుండును శంఖచక్రాద్యాయుధ ధరుండును నగుచు నిప్పుడును దేజ రిల్లుచుండు నట్టి బలిద్వారంబున లోకం

---

1. తృష్ణ = ఆశ. 2. ఉపేంద్రుఁడు = రెండవయింద్రుఁడు - హిమనుఁడైనవిష్ణువు. 3. పిత్ర్యంబు = తండ్రి సంబంధమైనది. 4. గదాపాణి = చేతియందు గద గలవాఁడు.

బుల గెలువ నిచ్చగొన్నదశగ్రీవుం డుల్లంఘిత శాసనుండై ప్రవే
శంబు గావింప న య్యాది పురుషుండు దన పా[1]దాంగుష్ఠంబున యో
జనాయుతాయుతంబులం బాఱం జిమ్మె వినుము. 113

క. ఆసుతలమునకుఁ గ్రిందై భాసిల్లుఁ దలాతలంబు♦ప్రభువందు మయుం
డా[2]సుర పురనిర్మాతగ వాసికెఁ బొగ డొందియేలు♦ వసుధాధీశా.

చ. [3]పురహరుచే [4]రమేశ్వరుఁడు ♦ భూతహితార్థముగాఁ బురత్రయం
బరుదుగ నీఱు సేసె శర ♦ ణాగతు నామయుఁ గాచి యెంతయుం
గరుణఁ దలాతలంబునకుఁ ♦ గర్తగ నిల్పిన నున్నవాఁడు శ్రీ
ధరుని సుదర్శనంబునకుఁ ♦ దప్పి విముక్తభయుండు గాఁ దగన్.

క. తలఁపఁగ నాక్రింద మహా
తలమునఁ గద్రూవధూటి ♦ తనయులు సర్పం
బులు గలవు పెక్కు శిరములు
నలరంగాఁ గ్రోధవశగ ♦ ణావళి యనఁగన్. 116

వ. మఱియును గుహక తక్షక కాళియ సుషేణాదిప్రధాను లయిన
వార లతుల శరీరంబులు గలిగి యాదిపురుషుని వాహనం బైన
పతగరాజభయంబున ననవరతంబు నుద్వేజితు లగుచు స్వకళత్రా
పత్యసుహృద్బాంధవసమేతు లయి యుండుదు రాక్రింద రసాతలం
బున దైత్యులు దానవులు నగు నివాతకవచ కాలకేయు లను
హిరణ్యపురనివాసు లగు దేవతా శత్రువులు మహాసాహసులును
దేజోధికులును నగుచు సకలలోకాధీశ్వరుం డైన శ్రీహరి తేజంబు
నం బ్రతిహతు లై వ[5]ల్మీకంబు నందు నడంగి యున్న సర్పంబుల
చందంబున నింద్రదూత యగు సరమచేఁ జెప్పఁబడెడు మంత్రా
త్మక వాక్యంబులకు భయంబు నొందుచుందురు. 117

---

1. పాదాంగుష్ఠము= కాలిబ్రేలు. 2. ఆ సురపురనిర్మాత= రాక్షస పట్టణము తయారు చేసినవాఁడు. 3. పురహరుఁడు=ముగ్గురు పట్టణరూపములతోనుండు రక్కసుల జంపినవాఁడు; శివుఁడు. 4. రమేశ్వరుఁడు = లక్ష్మీభర్త (నారాయణుఁడు) 5. వల్మీకము = పుట్ట.

క. [1]ఇందు కులోద్భవ వినుమా
క్రిందటి పాతాళమునను ♦ క్రీడించుచు నా
నందము నొందుచు నుండును
సందడిఁబడి నాగకులము ♦ చతురత తోడన్. 118

వ. ఇట్లు వాసుకిప్రముఖు లైన శంఖ కుళిక మహాశంఖ శ్వేత ధనంజయ ధృతరాష్ట్ర శంఖచూడ కంబ ళాశ్వతర దేవదత్తాదులయిన మహానాగంబు లైదు నేడు పది నూఱు వేయి శిరంబులుఁగలిగి ఫణామణికాంతులం జేసి పాతాళతిమిరంబును బాపుచుండుదురు.

సీ. పాతాళలోకంబు ♦ పాఁతున శేషుండు
వెలయంగ ముప్పది ♦ వేల యోజ
నంబుల వెడలుపు ♦ నను దోఁకఁ జుట్టగా
జుట్టుక యుండు వి ♦ ష్ణుని మహోగ్ర
మైన తాను శరీర ♦ మైన యనంతాఖ్య
[2]సంకర్షణుం డుండు ♦ సంతతంబు
నట్టి యనంతనా ♦ మాభిధానుని [3]మస్త
కమున సిద్ధార్థంబు ♦ కరణి ధరణి

ఆ. యంత నావిభుండు ♦ నఖిల లోకంబుల
సంహరింపఁ గోరి ♦ చండకోప
వశత సృజనఁజేయు ♦ వరుస [4]నేకాదశ
రుద్రమూర్తు లనెడు ♦ రౌద్రమతుల. 120

ఆ. అట్టిరుద్రమూర్తు ♦ లతుల త్రినేత్రులు
నఖిలశూలహస్తు ♦ లగుచు నుందు
రందు నున్న ఫణికు ♦ లాధిపుల్ శేషుని
పాదపంకజముల ♦ భక్తిఁ జేరి. 121

---

1. ఇందుకులోద్భవుఁడు = చంద్రవంశమున బుట్టినవాఁడు. 2. సంకర్షణుఁడు = ఒకతల్లి కడుపునఁ గొన్నాళ్లు, మఱొక తల్లి కడుపునఁ గొన్నాళ్లు పెంపొందిన వాఁడు. (బలరాముఁడు) 3. మస్తకము = శిరస్సు. 4. ఏకాదశరుద్రులు = పదు నొకండగు శివమూర్తులు.

ఆ. నమ్రులగుచు సనుదిఁ ♦ నంబును [1]మౌళిర
త్నముల చేతఁ గడు ము ♦ దంబు నొంది
కోరికలు దలిర్ప ♦ నీరాజనంబుల
నిచ్చుచుండు రెపుడు ♦ మచ్చికలను. 122

వ. మరియు నా సంకర్షణమూర్తిం జేరి నాగకన్యకలు కోరికలు గల వార లగుచు నొప్పెడిశరీర విలాసంబులం జేసి యగరు చందన కుంకుమ పంకంబులను లేపనంబులు సేయుచు సంకర్షణమూర్తి దర్శన స్పర్శనాదుల నుద్బోధిత మకరధ్వజావేశిత చిత్తంబులు గలిగి చిఱునవ్వు లొలయ నధికాభిలాషం జేసి [2]స్మితావలోకనం బుల [3]సవ్రీడితలై యవలోకించు చుండ ననంతగుణంబులు గల యనంత దేవుం డుపసంహరింపం బడిన క్రోధంబు గలిగి లోకంబు లకు క్షేమంబుగోరుచు సురాసుర సిద్ధ గంధర్వ విద్యాధర మునిగ ణంబు లనవరతంబు ధ్యానంబు సేయ సంతత సంతోషాతి శయం బున మ్రాఁగన్ను వెట్టుచు సలలిత గీతవాద్యంబుల నానందంబు నొందుచుఁ దన పరిజనంబుల నతిస్నేహంబున నవలోకించుచు నవ తులసీగంధపుష్ప రసామోదిత మధుకర వ్రాతమధుర గీతం బులు గల వైజయంతీ వనమాలికల ధరియించుచు [4]నీలాంబరధరుం డును [5]హలధరుండును నగుచు నితండు మహేంద్రుండో హరుండో యనుచు జనంబులు వలుకుచుండఁ గాంచనాంబరధరుండై ముము క్షువులు ధ్యానంబులు సేయ నధ్యాత్మ విద్యాయుక్తం బయిన యానంద హృదయగ్రంథిని భేదించునట్టి శేషుని స్వాయంభువుం డగు నారదుండు తుంబురు ప్రభృతు లగు ఋషిశ్రేష్ఠులతోఁ జేరుకొని కమలాసనుని సభాస్థానంబునందు నిట్లు స్తుతియించు చుండు. 123

---

1. మౌళిరత్నములు= (శిఖ) సిగముడి యందలి మణులు. 2. స్మితావలోకనములు= చిఱునవ్వుతోడి చూపులు. 3. సవ్రీడితలు = సిగ్గుతోఁగూడినవారు. 4. నీలాంబ రధరుఁడు = నల్లవలువ దాల్చినవాఁడు. 5. హలధరుఁడు = నాగలిదాల్చినవాఁడు (అనంతుఁడు)

సీ. ఓలిమై నెవ్వని ♦ లీలావినోదముల్
జన్మ సంరక్షణ ♦ క్షయములకును
హేతువు లగు చుండు ♦ నెవ్వని చూపుల
జనియించె సత్త్వ ర ♦ జస్తమంబు
లెవ్వని రూపంబు ♦ లేకమై బహువిధం
బులను జగత్తులఁ ♦ బ్రోచు చుండు
నెవ్వని నామంబు ♦ లెఱుఁగక తలఁచిన
యంతన దురితంబు ♦ లడఁగు చుండు

తే. నట్టి సంకర్షణాఖ్యుండు ♦ నవ్యయుండు
నైన శేషుని వినుతి సే ♦ యంగఁ దరమె
తలఁప నెప్పుడు వాఙ్మనం ♦ బులకు నింక
మూఁడు లోకంబు లందును ♦ భూత తతికి. 124

ఆ. మఱియుఁ బెక్కు గతుల ♦ మాబోటివారలఁ
బ్రోవఁ దలఁచి శేష ♦ మూర్తి సాత్త్వి
క స్వభావ మొందెఁ ♦ గడఁకతో నట్టి శే
షునకు మ్రొక్కు చుందు ♦ ననుదినంబు. 125

వ. మఱియు నా శేషుని నెవ్వం డేని నాకస్మికంబుగ నయినను నార్తుం డగుచు నయినను స్మరించిన మాత్రన యఖిలపాపంబులం బాసి సకల [1]శ్రేయస్సులం బొందు నట్టి శేషునినే ముముక్షువు లాశ్రయించి ధ్యానం బొనర్చి భవబంధ నిర్ముక్తు లగుదు రతని ఫణంబులయందు భూగోళం బణుమాత్రం బగుచునుండు నతని మహిమలు గణుతింప [2]సహస్రజిహ్వులు గల పురుషుండైన నోపం డని పలుకు చుందురా యనంతుండు పాతాళంబుననుండి సకలలోక హితార్థంబు భూమిని ధరియించు నని లోకతిర్యఙ్మనుష్య గతులను లోకస్థితియును శుకయోగీంద్రుండు వినిపించి యింక నేమి విని పింతు నెఱింగింపు మనినం బరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రున కిట్లనియె. 126

1. శ్రేయస్సులు = మేలులు. 2. సహస్రజిహ్వులు = వేయినాలుకలు గలవారు.

క. మునివర లోకచరిత్రం
బనుపమము మహావిచిత్ర ♦ మగునట్లుగ నా
కును వినిపించితి వంతయుఁ
బనుపడి నా చిత్తమందుఁ ♦ బాయక నిలిచెన్. 127

వ. అనిన శుకయోగీంద్రుం డిట్లనియె. 128

ఆ. జంతుజాలములకు ♦ శ్రద్ధలు త్రిగుణాత్మ
కములు గాన వారి ♦ కర్మగతుల
తారతమ్యములును ♦ దగిలి యిన్నియు వివి
ధంబు లగుచు నంత ♦ తంబు నుండు. 129

వ. నరేంద్రా ప్రతిషిద్ధలక్షణం బగు నధర్మం బాచరించు నరుని శ్రద్ధ విపరీతంబుగాఁ బ్రవర్తిల్లు నట్టి వానికిఁ గలిగెడి కర్మఫలంబును విపరీతంబు గానె యుండుం గావున ననాద్యకామ ప్రవర్తనల వలనఁ బెక్కు తెఱంగులఁ గలిగెడు కర్మగతుల సంగ్రహంబుగ నెఱింగించెద ననిన శుకునితోఁ బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె. 130

ఆ. మునివరేణ్య నరక ♦ ములు ముజ్జగంబుల
యందొ యంతరాళ ♦ మందొ వెలిపొ
యదియుఁ గాక దేశ ♦ మందుండు భూవి శే
షములయందొ తెలుపు ♦ సంతసమున 131

వ. అనిన శుకయోగీంద్రం డిట్లనియె. 132

—శుకయోగి పరీక్షిత్తునకు దెలిపెడి నరకలోక వర్ణనము—

క. ఎడ తెగక ముజ్జగంబుల
కడపల న[1]యామ్య దిశను ♦ గదలక నిలుచుం
గడుఘోరములుగ నరకము
లడరంగా నంతరాళ ♦ మందుల నధిపా. 133

వ. మఱియును దక్షిణంబున నగ్నిష్వాత్తాది పితృగణంబులు దమ గోత్రజులకు మేలు గలుగుట కొఱకు సత్యంబులగు నాశీర్వాదంబుల

1. యామ్యదిశ = దక్షిణదిక్కు.

నొసంగుచుండును రచ్చటి పితృపతి యగు శమనుండు దనలోకంబు నకుం జనుదెంచు జంతువుల కర్మంబులకుం దగినఫలంబుల నిచ్చి శిక్షించుచునుండు నందుఁ దామిస్రంబును నంధతామిస్రంబును రౌరవంబును మహారౌరవంబును గుంభీపాకంబును గాలసూత్రం బును నసిపత్త్రవనంబును సూకరముఖంబును నంధకూపంబును గ్రిమి భోజనంబును సందంశంబును [1]తప్తోర్మియు వజ్రకంటక శాల్మలియు [2]వైతరణియుఁ బూయోదంబును బ్రాణరోధంబును విశసనంబును [3]లాలాభక్షంబును సారమేయాదనంబును నవీచిరయంబును రేతః పానంబును నను నేకవిశంతి మహానరకంబులును మఱియును క్షారక ర్దమంబును రక్షోగణ భోజనంబును శూలప్రోతంబును దండశూకం బును నవట నిరోధనంబును బర్యావర్తనంబును [4]సూచీముఖంబును నన సప్తవిధనరకంబులతోడం గూడి యష్టావింశతి నరకంబులు గల వని కొందఱు నొడువుదు రందు. 134

క. పర పుత్ర కళత్రంబులఁ
బరికింపక యపహరించు ♦ పాపాత్ముఁడు దు
ష్కర పాశబద్ధుఁ డై యమ
పురుషులచే నధిక బాధఁ ♦ బొందుచు నుండున్. 135

వ. మఱియు నివ్విధంబున బాధితుం డగుచుఁ దా[5]మిస్రనరకంబునం బడి యనశనాద్రి పాతనదండ తాడనతర్జనాది బాధలం జెంది కడుభయంబున మూర్ఛలం బొందు చుండు. 136

క. పరకాంత నెవ్వఁడేనిం
బురుషుం డుండంగ మొఱఁగి ♦ పొందిన యమకిం
కరు లతనిఁ బట్టి వడిఁ ద
త్తఱమునఁ బడ వైతు రంధ ♦ తామిస్రమునన్. 137

---

1.తప్తోర్మి = కాగినయలలు గలది. (నది) 2. వైతరణి = నిప్పులయేఱు. (నది) 3. లాలాభక్షణంబు = చొంగనీరు త్రాగుట. 4. సూచీముఖము = సూదులబావి. (ఇదొకనరకము) 5. తామిస్రము = చీఁకటితోఁగూడిన నరకము.

వ. నరేంద్రా! యెవ్వఁడేనిం గుటుంబపోషణార్థంబు పరులకు ద్రోహంబు సేయు నానరుండు రౌరవనరకంబునం బడు నెవ్వం డిహలోకంబునందు స్వేచ్ఛావిహారంబున సంచరించుచుఁ బరోపద్రవపరాఙ్ముఖంబు లయి యుండు పశుపక్షిమృగాదుల బాధించు నాయామృగంబులు రురురూపంబులఁ దాల్చి యట్టిపాపజనుల నానావిధయాతనల బాధింపుటం జేసి రౌరవమహారౌరవనరకంబు లనం బడు నెవ్వండేని దేహపోషణార్థంబు మూషకాదుల బిలనిరోధంబు సేసి వధించు నానిష్కరుణుండైన పురుషునిం గుంభీపాక నరకంబులయందుఁ గల[1]తప్తతైలంబులం బెక్కుబాధలం బొందింతురు. 138

సీ. తల్లిదండ్రులకును ♦ ధరణీసురులకును
నహితంబు సేసిన ♦ యట్టివాఁడు
కాలసూత్రం బను కడుఁ ♦ దీవ్ర నరకంబు
నందును నందంద ♦ యయుతయోజ
నాయతపాత్రాదు ♦ లందుల సూర్యుఁడా
మీఁద గ్రిందను వహ్ని ♦ మిగుల మండ
నత్యంత క్షుత్పిపా ♦ సాదుల చేతను
బాధితుం డగుచుండుఁ ♦ బాయ కెపుడుఁ

ఆ. బరువు వెట్టుచున్నఁ ♦ బడి యున్న నిలిచినఁ
గదల కున్నఁ జాల ♦ నొదిఁ గియున్న
బాధఁబొందుచుండుఁ ♦ బశురోమముల లెక్క
వరుస నపరిమేయ ♦ వత్సరములు. 139

వ. మఱియు వేదమార్గంబు విడిచి పాషండమార్గంబు లాదరించుపురుషుని [2]నసిపత్త్రవనంబునందు యమకింకరులు తఱట్ల నడుచుచుఁ బరిహసించుచుం దోలు నెడ నాయసిపత్త్రంబు లిరుగెలంకుల శరీరంబుఁ ద్రెంచుచుండ నడుగడుగున మొఱవెట్టుచుండ బాధించుచుండుదురు. 140

1. తప్తతైలము = కాగిననూనె. 2. అసిపత్త్రవనము = కత్తివంటి యాకులుగల తోఁట.

క. దండింపఁ దగనివారల
దండించిన విప్రవరుల ♦ తనువులు ముట్టం
దండించిన మర్త్యులం
దండింతురు కాలసూత్ర ♦ నరకములందున్. 141

ఆ. మఱియు నట్టిదుష్ట ♦ మానవుఁ గింకరుల్
విఱిచి చెఱకుఁగోల ♦ విఱిచినట్లు
బాధపెట్టుచుండఁ ♦ బడి మూర్ఛఁ జెందుచు
మొఱలు పెట్టుచుండు ♦ భూపవర్య. 142

వ. నరేంద్రా యెవ్వండేని యీశ్వర కల్పితవృత్తి గలజంతువుల హింసిం
చు నట్టివాని నంధకూపం బను నరకంబునం బడవైచిన నందు నతం
డు దొల్లి తాను జేసిన భూతద్రోహంబున నచ్చట వివిధక్రూర
పక్షిమృగపశుసర్ప [1]మశకమత్కుణమక్షికాదుల చేత హింసం
బొందుచు మహాంధకారంబునందు నిద్రానుభవసుఖలేశంబును లేక
కుశరీరంబునందుల జీవుండునుంబోలె మృతప్రాయుం డై యుండు
నంత. 143

క. తనకలిమి నెవ్వఁడేనిం
దనబాంధవవరులఁ గూడి ♦ తగఁ గుడువక తా
నును [2]వాయసంబు భక్షిం
చిన మాడ్కిం దిన్నవాని ♦ శీఘ్రమె యచటన్. 144

క. [3]క్రిమిభోజన మనియెడి నర
కమునం బడి క్రిములె కూడు ♦ గాఁ గుడుచుచుఁ దాఁ
గ్రిమి యగుచు లక్షపరిమా
ణముఁ గల క్రిమిగుండమందు ♦ నాఁటుక యుండున్. 145

వ. మఱియు నీభూలోకంబున నెవ్వఁడేని నవిపన్నుం డై చౌర్యవృత్తిచే
బ్రాహ్మణాదుల హిరణ్యరత్నాదిద్రవ్యంబు లపహరించు నట్టి
పురుషుని నగ్నివర్ణంబు లగు నయఃపిండంబుల నగ్నితప్తంబు లగు

1. మశక.........దులు = దోమలు, నల్లులు, ఈగలు మొదలైనవి. 2. వాయసము = కాకి. 3. క్రిమిభోజనము = పురుగుల తిండి

శూలంబుల నతని శరీరంబునం దివియుచుందురు మఱియును మదనాతురు లగుచు స్త్రీపురుషు లగమ్యాగమనంబు సేసి రేని నట్టివారిని యమలోకంబున నతి[1] తీక్ష్ణకశాతాడితులం జేసి యగ్నిమయంబు లయిన యుక్కుప్రతిమల నాలింగనంబు సేయింతురు.

ఆ. సర్వజంతుజాల ♦ సంగమ మొందెడు
వానిఁ బట్టి కట్టి ♦ వజ్రదంష్ట్రి
కములు గలుగునట్టి ♦ ఘనతరశాల్మలీ
తరువులందుఁ జేర్చి ♦ దంతు రెపుడు. 147

ఆ. పార్థివేంద్ర నరుఁడు పాషండదర్శనుఁ
డగుచు ధర్మమార్గ ♦ మడఁచె నేని
వాఁడు నరకమందు ♦ వైతరణీనది
నుడుగ కెపుడుఁ బొరలి ♦ పడుచు నుండు. 148

వ. మఱియు నట్టి వైతరణీనదియందు జలగ్రాహంబులు దిగిచి భక్షింపఁ బ్రాణంబులు నిర్గమింపఁ దన పాపంబు లుచ్చరించుచు విణ్మూత్ర[2]పూయశోణితకేశనఖాస్థిమేదోమాంసవసావాహిని యగు నందుఁ దప్తుం డగుచు నుండు విప్రుండు శూద్రకామినులం బొంది శౌచాచారంబులం బాసి గతలజ్జుం డై పశువుంబోలెఁ జరియించె నేని నతండు నరకంబునుం బొంది యందుఁ బూయవిణ్మూత్రలాలాశ్లేష్మపూర్ణార్ణవమందు [3]ద్రొబ్బంబడి యతి[4]భీభత్సితంబు లగు నాద్రవ్యంబుల భుజియించుచుండు. 149

క. శునకములఁ బెంచి యెవ్వం
డనయంబును వేఁట సలిపి ♦ యాత్మార్థము గా
వనమృగములఁ జంపును నా
మనుజాధము నస్త్రములను ♦ మర్దింతు రొగిన్. 150

1. తీక్ష్ణ.........తులు = చురుకైన చబుకులచేత దెబ్బలు తిన్నవారు. 2. పూయ.... మందు = చెడుపెంట, నీరుడు, చొంగ, కళ్లె తో నిండిన సముద్రములందు. 3. ద్రొబ్బు = త్రోయు. 4. భీభత్సము = చూడ శక్యముగాని రూపముగలది.

ఆ. ద్రవ్యలోభమునను దంభార్థమై పశు
వులను జంపి జన్న ♦ ములను జేయు
వానిఁ బట్టి యముని ♦ వారలు గోయుచు
నుందు రెపుడు మిగుల ♦ సంద డిలుచు. 151

వ. కామమోహితుం డై యెవ్వండేనిఁ దన భార్యచేత రేతఃపానంబు సేయించు నాపాపాత్ముని రేతోహ్రదంబునం ద్రోచి యా రేతంబునె పానంబు సేయింపుదురు రాజపుత్త్రులైనను జోరులైనను ధనికుల గ్రామంబుపైఁ బడి యందు [1]గృహదాహంబు సేయు వారలను విషాదులవలన నన్యులఁ జంపెడువారలను వజ్రదంష్ట్రలు గల వింశత్యుత్తర సప్తశతశునకంబు లెడ తెగక తిగిచి భక్షించుచుండు. 152

సీ. లంచంబుఁ గొని సాక్షి ♦ వంచించి యనృతంబు
వలికెడు పాపాత్ముఁ ♦ బట్టి కట్టి
యంతమాన కవీచి ♦ యను నరకమునందు
శతయోజనోన్నత ♦ శైలశిఖర
మునఁ దలక్రిందుగా ♦ నునిచి [2]యధోముఖం
బుగఁ బడద్రొబ్బిన ♦ బొబ్బలిడుచుఁ
గల్లోలములు లేని ♦ [3]కమలాకరముఁ బోలెఁ
జటులమై యున్న పా ♦ షాణ మందుఁ

తే. బడిన యంతన దేహంబు ♦ పగిలి పెక్కు
తునుకలై పాసి యదిగూడి ♦ కొనుచు నుండ
నుండి యాకులతను బొందు ♦ చుండుఁగాని
చావు లేకుండు నా దుష్ట ♦ జంతువునకు. 153

ఆ. సోమయాజిభార్యఁ ♦ గామించి పొందిన
వానిఁ గపట మద్య ♦ పాన సోమ

1. గృహదాహము = ఇండ్లతగులంబెట్టుట. 2. అధోముఖము = తలక్రిందు.
3. కమలాకరము = తామరల కిల్లు (లక్ష్మీహస్తము).

పాన మనుదినంబుఁ ♦ బానంబుసేయు [1]వి
ట్క్షత్త్రియులను బట్టి ♦ సంభ్రమమున. 154

ఆ. ఱొమ్ముఁ ద్రొక్కి మోము ♦ ఱిమ్మవట్టఁగి మోఁది
యనలముఖమునందు ♦ నగ్నివర్ణ
ముగను గాఁచి వక్త్రి ♦ మున నిండఁగా నుక్కు
నీరు వోఁతు రేచి ♦ నిష్ఠురముగ. 155

వ. మఱియు నీచవర్ణుండు నిష్ఠ సలుపుచుఁ దపోదానవిద్యాచారంబులఁ బెద్దల కవమానంబు సేయువాఁడు క్షారకర్దమం బను నరకంబునందు నధోముఖుం డగుచు బాధలం బొందు స్త్రీపురుషు లెవ్వరేని శరీరరక్షణార్థంబు పశువుల మానవుల బలి యిచ్చి రేని వారల నిరయంబునందు యమకింకరులు సురియలం దునిమి తద్రక్తంబు పానంబు సేయుచుం బాఱాడు చుందురు గ్రామారణ్యంబులయందు జంతువుల శూలప్రోతంబులం గావించి హింసించుచు హర్షించుచున్న వారలను శూలసూత్రంబను నరంకబునందు శూలప్రోతులం జేసిన [2]క్షుత్పిపాసాపరవశు లగుచుండఁ గంకగృధ్రాదులు దీక్ష్ణతుండాగ్రంబులం దిగిచి భక్షించుచుండు మఱియు ధూర్తస్వభావంబున జంతుపీడనంబుఁ గావించెడు పాపాత్ముల దండశూకం బను నరకంబునందు నైదు నేడు ముఖంబుల సర్పంబులు గఱచుచుండు. 156

ఆ. ఎనయ దొడ్డిలోన ♦ నిండ్లలో నైనను
బశుపతంగ హరిణ ♦ పంక్తి నెల్లఁ
బట్టి హింససేయు ♦ పాపాత్ము విషవహ్ని
ధూమశిఖల ద్రొబ్బు ♦ దురు నృపాల. 157

క. తనయింటికి వచ్చిన మను
జుని నతిథిం గ్రోధదృష్టిఁ ♦ జూచిన వానిం

---

1. విట్ + క్షత్రియులు = కోమటులరాజులు. 2. క్షుత్ + పిపాసలు = ఆకలిదప్పికలు

గనుఁగవల వజ్రదంష్ట్రలఁ
దనరినయాకంక[1]గృధ్ర ♦ తతి భక్షించున్. 158

మ. ధనవంతుం డగుమానవుండు గడఁకన్ ♦ ధర్మోపకారంబులన్
ఘనతం జేయక యుండెనేని యమలో ♦ కంబుకు సూచీముఖం
బనునాదుర్గతిఁ బట్టి త్రోచి యిది తా ♦ పై యున్నభూతం బట
న్చును బాశంబులఁ బట్టి కట్టి వడితో ♦ నొప్పింతు రత్యుగ్రులై. 159

ఆ. నరవరేణ్య యిట్టి ♦ నరకముల్ యమలోక
మందుఁ గలవు మఱి స ♦ హస్రసంఖ్య
లందు [2]శమనదూత ♦ లనిశంబు బాధింతు
రవని ధర్మ దూరు ♦ లయినవరుల. 160

ఆ. ధర్మవంతులెల్ల ♦ దప్పక స్వర్గంబు
నందు భోగసమితిఁ ♦ బొందు చుందు
రెలమిఁ బుణ్యపాప ♦ ముల శేషములవల్లఁ
బుట్టు చుందు రవనిఁ ♦ బుణ్యచరిత. 161

వ. నరేంద్రా మోక్షమార్గంబు మున్నె వినిపించితి నిప్పుడు నీ కెఱిం గించిన వెల్లను బ్రహ్మాండకోశంబునం గల వని పురాణంబులు వలుకు చుండు నట్టిబ్రహ్మాండంబు శ్రీ మన్నారాయణుని స్థూలశరీరం బగు టం జేసి బ్రహ్మాండం బెవ్వరు వర్ణింతు రెవ్వరు విందురు వారలకు సకల శ్రేయస్సులుం గలుగు నీశ్వరస్థూలశరీరంబుఁ దెలిసినవారికి శ్రద్ధాభక్తు లం జేసి స్థూలదేహంబు నెఱుఁగ వచ్చు భూద్వీపవర్ష సరిద ద్రినభస్సముద్రపాతాళ దిఙ్నరక తారాగణలోకసంస్థితం బయి సకలజీవ నికాయ్యం బై యద్భుతం బైన శ్రీహరిస్థూలశరీరంబు వినిపించితి నని. 162

చ. జలజభవాది దేవముని ♦ సన్నుత [3]తీర్థపదాంబుజాత ని
ర్మలనవరత్న[4]నూపురవి ♦ రాజిత కౌస్తుభభూషణాంగ యు

1. గృధ్రతతి = గ్రద్దలగుంపు. 2. శమనదూతలు = యమభటులు. 3. తీర్థపదాంబు జాతుఁడు=గంగాజలము గలపాద కమలము వాఁడు. (విష్ణువు) 4. నూపురము = అందె.

జ్వలతులసీకురంగమద ♦ వాసనవాసితదివ్య దేహ శ్రీ
నిలయశరీర కృష్ణ ధర ♦ ణీధర భానుశశాంకలోచనా. 163

క. శ్రీతరుణీహృదయస్థిత
పాతకహర సర్వలోక ♦ పావన భువనా
తీతగుణాశ్రయ యతివి
ఖ్యాతసురార్చితపదాబ్జ ♦ కంసవిదారీ. 164

మత్తకోకిలము. దండితారిసమూహ భక్తని ♦ ధాన దానవిహార [1]మా
ర్తాండమండలమధ్యసంస్థిత ♦ తత్త్వరూప గదాసికో
దండశంఖసుదర్శనాంక [2]సు ♦ ధాకరార్కసునేత్ర భూ
మండలోద్ధరణార్తపోషణ ♦ [3]మత్తదైత్యనివారణా. 165

గద్యము. ఇది శ్రీసకలసుకవిజనానందకర బొప్పనామాత్యపుత్ర గంగ
నార్య ప్రణీతంబైన శ్రీమద్భాగవత మహాపురాణంబునందు భర
తాత్మజుండైన సుమతికి రాజ్యాభిషేకంబును పాషండదర్శనంబును
సుమతిపుత్ర జన్మ విస్తారంబును గయుని చరిత్రంబును గయుని
సంస్తుతియు భూద్వీపవర్ష సరిదద్రినభస్సముద్రపాతాళ దిఙ్నరక
తారాగణ సంస్థితియు ననుకథలం గలపంచ మస్కంధంబునందు
ద్వితీయాశ్వాసము. 166

---

1. మార్తాండ మండల మధ్యస్థితుండు = సూర్యమండలము నడుమనుండువాఁడు. 2. సుధాకరార్కసునేత్రుఁడు = చంద్ర సూర్య నేత్రుఁడు. 3. మత్త దైత్య నివారణుఁడు = పొగరెక్కిన రక్కసులఁ జక్కాడినవాఁడు. } విష్ణువు

ఓం తత్సద్బ్రహ్మార్పణ మస్తు.

---

# పీఠిక.

## పంచమస్కంధము.

బంధుర పద్య పుష్పచయ భాసురమై చెలువొందె ద్వాదశ స్కంధము లొప్పు భాగవత కల్ప కుంజంబును పోతరాట్సుతానందుఁడు సృష్టిచేసి చనినన్ బెనుగాలికి నందుఁ బంచమస్కంధము గూలఁగా నిలిపి గంగన నాగమృత ప్రసక్తితోన ఆంధ్ర భాగవతమున పబ్రిమృష్టమైన పంచమస్కంధమును దిరుగ రచించి కూర్చినవాఁడు గంగనకవి. ఈయన నియోగి బ్రాహ్మణుఁడు. తండ్రి బొప్పనామాత్యుఁడు. తాను సుకవిజనానందకరుఁడనని చెప్పుకొనినాఁడు. కూచిమంచి తిమ్మకవిసార్వభౌముఁడీతనిని బొప్పరాజు గంగన యనినాఁడు అందుచే ఇంటిపేరు బొప్పరాజు వారనుకొనవచ్చును. స్కంధాది యందుఁ గని తన కులగోత్రములు వంశవర్ణనము గావింపలేదు. గంగనకవి పోతనామాత్యునకు ఒక తరము తరువాతవాఁడు. ఈయన ఇతర గ్రంథములు లిఖింపకపోవుటచే జీవిత విశేషములు మరుగు పడినవి. పంచమస్కంధము రచించుటవలననే అజరామరమగు కీర్తిగడింపఁగలిగినాఁడు.

పంచమ స్కంధము లిఖిత గ్రంథములలోనే కాశ్వాసముగనే కలదు. ముద్రిత ప్రతులలోను, గొన్ని తాళపత్ర గ్రంథయులందును రెండాశ్వాసములుగా విభజింపఁబడినవి. 353 పద్యములుగల ఈ చిన్నస్కంధము తొలుత నేకాశ్వాసముగా నుండి యుండును. పాఠకులాశ్వాసవిభాగముగ వ్రాసికొనియుందురు. ప్రథమాశ్వాసమునందలి 179 వచనమున స్వర్గోపభోగములఁ బొందుదురని సకల పురాణార్థ విజ్ఞాతుండగు సూతుం డిట్లనియె. కం॥ మునులార బాదరాయణి॥ అను పద్యము గలసి చాల వ్రాత ప్రతులలోఁ బంచమ స్కంధము ఏకాశ్వాసముగనే గలదు. భిన్నదేశ ప్రతులవి శేషించి పరిశోధించినచోఁ బంచమస్కంధమునుగూర్చిన విశేషములు తెలియ గలవు.

గంగనామాత్యుఁడు అద్వైతపరముగా శ్రీధర వ్యాఖ్యాను సారముగాఁ బంచమ స్కంధమును దెలిగించినాఁడు. పోతరాజు కవితలోఁ గానవచ్చు నిరర్గళధారాశుద్ధియు స్వకపోల కల్పిత విచిత్ర వర్ణనాపాటవము భక్తిపారవశ్యము పంచమ స్కంధమునఁగాన రాదు. మూలముకంటెఁ బంచమస్కంధము సంక్షిప్తీకరింపఁబడినది. భాగవత రచనమునఁ బోతన శక్తియనుపమానము. రెండవ తరగతి వాఁడు ఏర్చూరి సింగన. మూఁడవ తరగతిలోనివాఁడు గంగన. నాలుగవ తరగతివాఁడు నారన గంగన. కవితలోఁ బదలాలిత్యము మృదుమధుర ధార కలదు. కథాంశమును మృదు మధుర కల్పన ములతోడను శ్రవణానందకరములగు సంత్యనియమాది శబ్దాలంకార ములతోడను బెంచి వ్రాయక గంగన మూలములోని మాధుర్యము నుసైతము తెలిగింపులో లుప్తమొనరించు చుండును. ఈతని కవిత లో స్వతంత్రభావములు కల్పనములు అంతగాఁ గానరాకున్నను బదలాలిత్యము మృదుమధురధారయు నుంటచేఁ బాఠకుల హృదయ మున కానందకరముగ నుండును.

పూర్వచిత్తి అగ్నీంధ్రుల చరిత్రము రసవత్తరముగా మూలమునందుఁ గలదు. పూర్వ చిత్తితో నాగ్నీంధ్రుఁడు భాషించు ఘట్ట మునందు రసవంతములు హృదయంగమములగు శ్లోకములు పెక్కు లు రసవత్తరములగు శ్లోకములు గలవు. అందలి స్వారస్యము తెలుఁ గులోఁ గానరాదు. ఆంధ్రించిన శ్లోకములను మూల వ్యతిరిక్తములు భరతుని చరిత్రము జడభరతుని కథ ఋషభయోగిజీవితము పోతనా మాత్యుఁడు వ్రాసినచో నాయాసందర్భములలో నెంతేని ప్రతిభాతిశ యము జూపియుండును. ఋషభయోగి యవధూత చర్యపైన మత వ్యాప్తి కారణమయ్యెనను నంశము మూలము నందింకను స్పష్టము గా విపులము గాగలదు. ఇట్టి తత్త్వవిషయములు గూడ నేలకో గంగన సంగ్రహము గావించినాఁడు. హరిణముతో భరతుఁడు వర్తించువిషయమున గంగన కొన్ని రసవంతములగు పద్యములను వ్రాసినాడు. అవి మూలానుసారములైనను అర్థవంతములగు విశేష ణములు విశేషాంశములు విడువబడినవి.

గంగన ఆంధ్రీకరణము మూలమునకు దూరముగానుండునను టకు రసవత్తరమగు మూలశ్లోకమును బరివర్తనము చేసిన విధము పాఠకులకు, దెలియుటకు నిట నుదహరించెదము.

## అంగపరిమళా గత భృంగవర్ణనము

శ్లో॥ శిష్యా ఇమే భగవత: పఠిత; పఠన్తి
గాయన్తి సామసర హాస్య మజ స్రిమీశ
యుష్మచ్ఛిఖా విలువితాస్సు మనోభి వృష్టి
సర్వేభజన్త్యృషి గణా ఇవవేద శాఖాః.

ఆంధ్రీకరణము.

చం॥ చెదరగ వేదముల్ చదువు శిష్యులపైఁ దగఁభుష్పవృష్టి స
మ్మదము ననంతలోఁ గురియు మాడ్కిని (చూ)స్కం 5 ఆశ్వా॥ పద్య 30

పంచమస్కంధమున లోకపరిపాలన మనఁబడు స్థానము వివరింపఁ బడెను. భూలోకములోని యేడు ద్వీపములను స్వాయంభువ మను వంశజులు పరిపాలించిన విధము దేవపాతళ లోకముల వివరములు పేర్కొనఁబడినవి. అధ్యాత్మిక పరిజ్ఞాతయయ్యు గృహస్థుఁడై ప్రజల సన్మార్గమునకు ద్రిప్పిన ప్రియవ్రత చరిత్రము, రాజై, అధ్యాత్మ బోధకుఁడై అవధూతయై లోకోద్ధరణ మొనరించిన భగవదవతారమూర్తి యగు ఋషభ దేవచరిత్రము, తొలుతరాజై అజనాభవర్షము నేలి దానికి భరతవర్షమను నామము ప్రసాదించి తపస్వియై సంగదోషమున హరిణముగనుద్భవించి పిదప బ్రాహ్మణుఁడుగ జనించి లోక సంగదూరుఁడై జడ భరతుఁడని పేర్గొన్న జడభరతుని చరిత్రము, సౌవీరరాజగు రహూగణునకుఁ బల్లకి మోసి యనంతరము తత్త్వోపదేశముచే నతనిఁ దరింపఁ జేసిన జడభరతుని పవిత్రాచరణము భారతాది వర్షవర్ణనము సూర్యాది లోకముల వివరములు ఈ స్కంధము నందుఁగల ముఖ్యాంశములు. స్వతంత్రకల్పనముల కనుకూలములగు తావులలోఁ బోతరాజు మనోజ్ఞములు వ్రాయుచుండును. గంగన కవిత్రయము వారివలెఁ గథాంశము నె క్లుప్తీకరించుటచే నీ స్కంధము కవితా కళకును ఉపజ్ఞాభి రామ మగు భావనా శక్తికిని కొఱంత వడి యున్నదని చెప్పుటలో సాహస ముండఁ జాలదు.

ప్రథమ ముద్రణమున సంస్కరణము గావించిన పండితులు పంచమస్కంధమునఁ జాలమార్పులు గావించిరి. వచనములలో మూలానుసారములగు భాగములు చేర్చిరి. ఈ మార్పులు ఆనంద ముద్రణాలయము వారి ప్రతిలోగుండలీ కరణ రూపముననుబాహ్యాంతరరూపమునను సూచింపఁబడినవి. గంగనకవితా పాటవము గూర్చి కొంతచెప్పుట యవసరము. ఇతని కవితలోఁ గవిత్రయేతరములగు ప్రయోగములు దోషములు గాన వచ్చుచున్నవి.

కొనికి కాదేశము.

ఆగ్రయించుక-నాటుక- చుట్టుక. ఇత్యాదులు

అందున్ అను సప్తమీ విభక్త్యర్థమున అందుల అని ప్రయోగించును. ఇట్టి ప్రయోగములు రెండా శ్వాసములందును దాదాపు పది తావులందుఁగలదు

అఖండయతి-

నటనంబొందెడి గండుమీనములతో నాసన్న నీలాలకో
గరి మంగోరిన రీతి లెంతయు నహంకారాహి దష్టుండనై

ప్రాసదోషము

ఉ॥ వచ్చిన వారియందు ............ అచ్యుత భావముంచి-

ఉకారాంత శబ్దములకు, కు షష్టియందు నకారాగమంబు రాకుండుటకు-

అందుకు, సుతుకు, ఆశ్రమముకు

ఇట్లె యింకను దోషములుగలవు గాని సంస్కర్తలు వానిని యథేష్టముగా సవరించినారు. మొత్తము మీఁద గంగన లాక్షణికుడు కాఁడు. కవితలో వ్యర్థపదములున్నను మృదుమధురము శబ్దాలంకారములు, మూలాంశ విపులీకరణము, స్వతంత్రకల్పనములు కల్పనా చమత్కారము. ఈతని కవితలోఁ గానరాదు

బహుధాన్య మాఘశు॥౨
హనుమకొండ.

భాషా సేవకులు.
శేషాద్రి రమణ కవులు



ఓం

# శ్రీమదాంధ్ర భాగవతము

బమ్మెర పోతనామాత్య విరచితము

## షష్ఠస్కంధము

పీఠిక


శ్రీ శేషాద్రి రమణకవులు

శతావధానులు - హనుమకొండ


ప్రవేశము - లఘుటీకలు


శ్రీ నాగలింగం వేంకటేశ్వరశాస్త్రిగారు

విద్వాన్ - అమృతలూరు



ప్రకాశకులు

వాణీనికేతనము

గాంధీనగరం — బెజవాడ

బ్రాంచి — తెనాలి

మా సభ్యులకు రు. 0-8-0 లు ఇతరులకు రు. 1-0-0

# ప్రవేశము

అమృతమయ కవితావిలాసుఁడు, భక్త్యావేశసముపంచితచిత్తుఁడు, ఆంధ్ర సారస్వతగగనాంగణరవి పోతనకవి తెలుఁగులుకూర్చి, మెఱుఁగులు చేర్చి, శ్రీభాగవతమును నిరవధిక సేవధిగా — అమృతవాహినిగా — ఆంధ్రావళికి ప్రసాదించినాఁడు. కారణవివేచన కిదియవసరము కాదు కాని — ఏలాగుననో తన్నిర్మిత గ్రంథరత్నమున — కొన్ని భాగములుత్సన్నములయినవి. అట్టిలుప్తభాగములను నారయ,గంగన,సింగనకవులు మువుర యథాశక్తి పూరించిరి. మన ప్రస్తావనా విషయమగు షష్ఠస్కంధమునకు కర్త సింగన్న.

గోల్కొండదేశము నందలి నల్లగొండ మండలములోని ఏర్చూరు ఈతని జన్మస్థానము. ఆపస్తంబసూత్రుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. ఏర్చూరి శాసనుఁడగు నెట్టన కుమారుఁడు వీరన ఈతని ముత్తాత. అతని పుత్రుఁడారయ ఈతని తాత. కసువనయు ముమ్మడమ్మయు నీతని తల్లిదండ్రులు. వీరికువురు కుమారులు. పెద్దవాఁడు సింగన. రెండవవాఁడు తెలగన్న. 'శివపూజం దనరినవాఁడ, విష్ణు చరితామృతనిష్యంది పటువాగ్విలాసానందోచితమానసుండ' అని తన్ను గుఱించి చెప్పుకొనెను.

ఈతఁడు పోతన కవితామార్గము ననుసరించియే తనరచనను సాఁగింపనెంచెను. దానికి లక్ష్యములుగా ననేక పద్యములనుదహరింప వచ్చును.

కం. మోదంబై, పరిదూషిత, ఖేదంబై, శాంబరీద్ధ కిలికించిత దృ
గ్భేదంబై,బహుసౌఖ్యా, పాదంబై యొప్పువింధ్యపాదంబునకున్.ష.స్క

కం.పుణ్యాంబై, మునివల్లభ, గణ్యంబై, కుసుమఫలనికాయోత్థితిసా
ద్గుణ్యమయినైమిశాఖ్యారణ్యంబునుతింపఁదగు నరణ్యంబులలోన్
[ప్రి. స్కం.

కం. పుట్టితివజుతనువునఁ జే,పట్టితివి పురాణపురుషుభజనము పదముల్
నెట్టితివి దిక్కులందుదిముట్టితివిమహాప్రబోధమునమునినాథా! ష.స్క

కం. విడిచితిభవబంధంబుల నడఁచితి మాయావిమోహమైనతముంబున్
నొడిచితి నరివర్గంబుల గడచితినాజన్మదుఃఖ కర్మార్ణవమున్. ప్రి.స్క

పైపద్యముల పోలికల నరసితిమేని, పోతనకవిత సింగన రచనయందు తన ప్రాభవము ప్రదల నెట్లంకిత మొనర్చుకొన్నదో తెలియఁగలము. ఈతనిది పోతనవలె నిసర్గమధురమగు ధార కాదు. ఈతని యనుప్రాసములు పోతన వాని వోలె రసావేశతరంగితము లై, తఱతీపులకు, నందచందములకు తావలములు కాక ప్రయత్నసాధ్యములును, శోభాపరిహీయమాణములును నైయున్నవి.

ఇందలి వర్ణనములు కొన్ని మూలముకన్న పెంచి, వ్రాయఁబడి, తెలుఁగు నుడికారమును, కూర్పునేర్పును, లోకజ్ఞానమును వెలార్చుచు, రసికజన ప్రేణనములుగా నున్నవి. మధురములగు నిట్టిపట్టులు అజామిళచరితాదుల యందుఁ గన్పట్టును. మఱి కొన్నియెడల — మూలమునందలి సంగ్రహావర్ణనములను అతి దీర్ఘ సాంస్కృతిక

సమాస భూయిష్ఠములగు విశేషణములతో విరివిచేసెను. కాని, వానియందు కవిపాండితీ విశేషమే కాని — మాధురీ సాధురీతులు గోచరింపవు.

వేదాంతవిషయములను తెలిఁగించినపుడు ఈతఁడెక్కుడుగా నద్వైతమార్గమునే అవలంభించినాఁడు. కావున, శ్రీధరవ్యాఖ్యానమే ఈ తెలిఁగింపున కాధారమై యుండనోపును. కాని, అందునఁగూడ పోతనవలె వ్యాఖ్యా విశేషముల జారవిడువక, నాతివిపులముగా, విస్పష్టార్థ రమణీయముగాఁ బరివర్తింప లేకపోయెను. తెలిఁగింపు మూలముకన్న భిన్నముకూడను. అంతియకాక, మూలమునందలి తత్త్వఘట్టములలోని సమాసములను అట్టులనే తెలుఁగున నిలిపియుంచుటచే భావవిస్పష్టత కొఱవడినది. అక్కడక్కడ సాంఖ్యాదిమతవివృతియును కలదుకాని అయ్యది సునిరూపితము గాదు; సుసంపన్నముగాదు.

భాగాంతరముల వ్రాసిన సింగన నారనల కన్న నీతని కవితగుణవత్తరమని చెప్పుటకేమాత్రమును సందేహములేదు. స్వకల్పిత వర్ణన విశేషములుకూడ చాలవఱకు విషయ స్వరూప వివరణచణములయి, రసభావ విభాసురములయి, లలితములయి యున్నవి. ధారకూడ కుంటువడక లలితగతులు దిద్దుకొనుచున్నది.

సమంజస సంస్కృతసాహితీ సంపన్నుఁడగు నీతని కవితయందు ఏలనో ఈ యలఁతి నెఱసులు కానవచ్చుచున్నవి.

క్రిక్కిరిసీజగంబునను 174. ప

చండబ్రహ్మాండ భేదోగ్రచ్ఛయజయరవముల్ 272

మత్తేజోపబృంహితంబయి 347. దానవవిద్వేడంశజనితంబులమయ్యు 501

మున్నగునవి యున్నను - అలఁతులగు నీనెఱసుల పలఁతులగు సరసులు ఈమహాప్రబంధ సారస్యమున పరిగణింపరు. కొన్ని వర్ణనములు కవియొక్క శ్రమను, శక్తియుక్తులను తెలియచేయుచు, రమణీయములై పోతన వర్ణనముల రూపురేఖలను పుడికిపుచ్చుకొన్నవి. తన సహజమార్గముననే - ఇతరుల తెన్నులకు ఆసలు చూపక - ఈకవిత తన నడకను సాగించినచో, ఇంతకన్న నందగించెడిదేమో!

సీ. మానిత తారుణ్యమదనతురంగులు కందర్ప విజయైక ఖడ్గలతలు.

సీ. తారహారపటీరధవళ దేహమువాని రమణీయ నీలాంబరంబువాని.

సీ. తగు శంఖచక్రగదాధరుండగువాని శ్రీవత్సకౌస్తుభ శ్రీలవాని.

సీ. సముచితశ్రుతిచర్చఁ జర్చింపనొల్లకసతికుచద్వయచర్చఁజర్చచేయు.

శా. ఆ లీలావతి గండపాళికలపై హాసప్రసాదంబుపై.

మున్నగునవి యీతని మేలిరచనకు తార్కాణలు; రసావేశ పరిణామములు; రసికజన భాగధేయములును.

అమృతలూరు, }
శ్రీ ప్రమాది ఆషాఢ శుద్ధపూర్ణిమ. }

ఇట్లు,
వేంకటేశ్వర శాస్త్రి.

# పీ ఠి క.

## భాగవతము షష్ఠస్కంధము:

చక్కని కైతతోడ నెఱ ♦ జాణతనంబునఁ గావ్యరత్నముల్
జెక్కులొనర్పఁజాలినక ♦ విత్వవిదుండయి, పోతరాజవాక్
ప్రక్కలితాష్టమప్రసవ ♦ సౌరభముల్ పునరుద్ధరించి పే
రెక్కిన సత్కవి ప్రవరు ♦ నేర్చూరి సింగన నెంతు నెమ్మదిన్.

ఎవ రెన్నికథలు చెప్పినను గారణ మేదైనను బమ్మెరపోతరాజు రచించిన సంపూర్ణభాగవతము ఖిలమై పలువురుపూర్తిచేయవలసిన యవస్థ తటస్థించినది సత్యము. సంస్కరించి పూర్తిచేసిన నారయ, గంగన, సింగన, హరిభట్టు మున్నగువారు ఏకకాలమువారుకారు. ఏకప్రదేశవాసులు గారు. వీరిలో నొకరగు ఏర్చూరి సింగనకవి భాగవతములో ఆఱవస్కంధము రచించెను కృత్యవతరణిక కవివంశవృత్తముతో నిది ప్రత్యేకకవికర్తృత్వ మనఁదగియున్నది. ఇట్లె హరిభట్టారకుఁడుగూడ షష్ఠస్కంధమును బ్రత్యేక కృత్యాదితో రచించినాఁడు. శృంగారషష్ఠమనుపేర నొక షష్ఠస్కంధములోనిపద్యములు లక్షణగ్రంథములలోఁగనిపించుచున్నవి వీరెవరిరచనములకు సంబంధింపని షష్ఠస్కంధము ఆంధ్రసాహిత్య పరిషత్తులోనున్నటుల నొకానొక నివేదికలోఁ జదివియుంటిమి. తాళపత్ర గ్రంథములలోఁ గొన్నింటియందు ఏర్చూరి సింగన వ్యక్తిత్వము దెలుపు పద్యములు గానరావు. ముద్రిత గ్రంథములకతన ఏర్చూరి సింగన నామము దిగంతవిశ్రాంతమైయున్నది.

ఏర్చూరి సింగన నియోగి బ్రాహ్మణుఁడు. శ్రీవత్స గోత్రుఁడు ఆపస్తంబ సూత్రుఁడు. ఈ కవిపూర్వుఁడగు ఎఱ్ఱన ఏర్చూరి శాసనుఁడు. ఆంధ్రదేశమునఁ బలు తావుల ఎర్చూరు అను గ్రామములు కలవు కవి నివాసమందేదియో యింతవఱకు నిర్ణయము కాలేదు. సింగనామాత్యుఁడు కసువయమంత్రి ముమ్మడమ్మల కుమారుఁడు. శివకేశవులయందు సమానభక్తిప్రపత్తులు గలవాఁడు. కవిపూర్వులలోఁ జరిత్రమునకు సంబంధించినవారు లేరు. సింగనామాత్యుఁడు కవిస్తుతిలో శ్రీనాథుని, బమ్మెర పోతరాజును స్మరించినాఁడు. అంతియగాదు పోతరాజును "పన్నగశాయికి సొమ్ములుగ వాక్యసంపదలు మాలలుచేసిన వాఁడనియు భక్తితో నమ్మినవాఁడనియు భాగవతనైష్ఠికుఁడనియుఁ గవిపట్టపురాజనియుఁ బ్రశంసించినాఁడు. ఈ ప్రశంసాపద్ధతిఁజూడఁ బోతరాజుతో నీకవికేదేని సన్నిహిత సంబంధముండునని తోఁచుచున్నది. పోతన కవిపట్టపురాజని సింగనామాత్యుఁడు జెప్పుట సార్థకము సరసతరము.

సింగనామాత్యుఁడు తనకు భారతి "కల్లతనంబులేక పొడకట్టి"నదని చెప్పినాఁడు. సమస్తభోగపరాయణుఁడగు నీకవి సుఖనిద్రలోనుండ సరస్వతి ప్రత్యక్షమయ్యెను. అపుడు కవి విష్ణుస్తుతిశ్లోకము రచించి చదువఁగా నానందించెను. నాఁటనుండి నారాయణాంకితమగు కవిత్వతత్త్వజ్ఞానము గోచరమయ్యెను. ఈయంశము కవియే చెప్పుకొన్నాఁడు. సింగకవి, వివిధనాట్యములందును, వాద్యములందును, సాములందును

చేర్పరి. వానికి మెఱుఁగువచ్చునట్లు కవిత్వముగూడఁ జెప్పనేర్చినవాఁడు. ఈతని కవిత అంత్యానియమాదులందును, సమాసకల్పనమునందును, వర్ణనసందర్భమునను బోతన కవితను దలపింపఁ జేయును. మొత్తముమీఁద భాగవత భాగములు పూరించిన యితర కవులకంటెఁ బ్రౌఢుఁడు. శృంగార షష్ఠము. హరిభట్టు షష్ఠస్కంధములతోఁ బోల్చిన నీతనికవిత యెంతవరకుఁ బయిచేయియగునో నిర్ణయింప నవకాశము చిక్కకున్నది. సింగనామాత్యుఁడు కువలయాశ్వచరిత్రము రచించినట్లు మానవల్లి కృష్ణకవి ఎం. ఏ గారు బేర్కొనిరి. ఇతరత్రయు గ్రంథనామము గోచరించుచున్నది. కాని ఈ గ్రంథరాజ మెట మఱుగుపడియున్నదో తెలియదు. హరిభట్టు షష్ఠస్కంధమే గాక యేకాదశ ద్వాదశ స్కంధములుగూడ రచించినాఁడు. ప్రౌఢకవి. ఈతఁడు క్రీ. శ. 1650 ప్రాంతములలో నుండెను. శృంగారషష్ఠమునకు రాచమల్లునారి షష్ఠస్కంధమని నామాంతరమున్నట్లు అప్పకవివ్యవహరించుటచే రాచమల్లు అనునింటిపేరుగల సోదరులు దానిరచించియుందురు. కవిసంశయ విచ్ఛేదములో నీక్రిందిపద్యముదాహరింపఁ బడినది.

"చండాంశు ప్రభ! చిక్కతిమ్మయ తనూజా! తిమ్మ! సిద్ధాస్త్రపా
షండంబైన త్రిలింగ భాగవత షష్ఠస్కంధ కార్యంబు నీ
కుండక్కెన్ జతురాననత్వగుణయుక్తుల్ మీఱ, వాణీమనో
భాండారోద్ధత చూఱకార బిరుదప్రఖ్యాతి సార్థంబుగన్.

దీనిచే చిక్కయ తిమ్మరాజ కుమారుఁడగు తిమ్మయ దీనికిఁ గృతిపతి. ఈ తిమ్మయ, వీరేశలింగము పంతులువారుతెలంచినట్లు అచ్యుతదేవరాయల మంత్రివర్గములోనివాఁడై యైనచో క్రీ. శ. 1540 ప్రాంతమునని రచింపఁబడియుండును. కాని యీవిషయము శృంగారషష్ఠము సంపూర్ణముగ లభించినఁగాని నిర్ణీతము కాఁజాలదు. మొత్తముమీఁద షష్ఠస్కంధమును రచించిన ముగ్గురు ప్రౌఢకవులె. వీరుముగ్గురు నొక కాలమునం దుంటచే నెవరికివారు షష్ఠస్కంధరచనమునకుఁ బూనుకొనియుందురని తోఁచుచున్నది. పోతరాజుకవితను వరవడిగాఁ బెట్టుకొని భాగవతరచనము సింగనామాత్యుఁడు పూనుకొనినటుల షష్ఠస్కంధములోని 2, 3, 70, 97, 98 పద్యములుజూచిన గోచరించును. ఇంతియగాక యిందలి 23వ పద్యము పోతరాజకృతమగు "భాగవతముఁ దెలియఁ బల్కుట కష్టంబు." అనుపద్యమునకుఁ బూర్తిగాననుకరణము. ఇది గ్రంథచౌర్యమన వలనుపడదు. పోతనామాత్యుని రసవద్రచనములపైఁగల యభిమానమె అప్రయత్నానుకరణకారణము.

సింగన కవిత్వము రసవంతముగా నుండి వర్ణనాంశములందును భగవద్గుణానువర్ణనమునను గథాకల్పనమునను నూతన కల్పనములతో నింపుసొంపుగనుండి సామాన్యజనులకుఁ బోతన కవితయే యనిపించును. 96 నుండి 105 వఱకుఁగల పద్యములఁ జూచినచో శృంగార రస కవితలో నీతఁడు మిగులఁ బ్రౌఢుఁడని తోఁచును. ఈతని స్వతంత్రగ్రంథమనఁదగు బహులాశ్వచరిత్రము ఆంధ్రులు పఠింపగల్గుభాగ్య మేనాఁటికైనను గల్గుచోఁ గవితాకౌశలమున నెంత గడుసరియో యెఱుంగవచ్చును.

అజామిళోపాఖ్యానములోని వసంతవర్ణనము దాశీకాద్రసంగమ వర్ణనము శృంగారవిహారవర్ణనము మూలములోని సంగ్రహరూపమగు కథ ననువుగనుండు స్వకపోలకల్పనము. ఇందుఁ గవికిఁ గలయుపజ్ఞయుఁ గల్పనాపాటవము వెల్లడియగుచున్నది. మూలమున అజామిళుని భార్య

"విప్రస్స్వభార్యామప్రౌఢాం కులే మహతిలంభితాం
విససర్జాచిరాత్పాపస్స్వైరిణ్యాపాంగవిద్ధధీః॥"

అని బాలనుగా వ్యాసులు వర్ణింప సింగన అజామిళుని పతివ్రత్వమింకను దృఢముగాఁ జేయుట క్రిందివిధముగా నామెను యౌవనవతిగా వర్ణించెను.

కం. శ్యామను సుమాత్రఖేలన
కామను సుగుణాభిరామఁ గమనీయగుణ
స్తోమ నిజభామ నొల్లక
ధామమున నటించెఁ గ్రించుఁదనమునఁ జనుఁడై.

మూలమున లేని వసంతమును వర్ణించుచు నాతఁడు నవయౌవనోదయవిలాసినియు నాతని పత్నిసురతయోగ్యయు నడిమిప్రాయంపుఁ బ్రోడకత్తెయనియు వర్ణించుట కవికిఁగల యుచిత రచనావివేచనమునకుఁ దార్కాణము. ఇట్లే పలుచోట్ల తెనిగింపులోఁ గమ్మదనము మార్పుగూడఁగలదు. ఇంకఁ జర్చించిన గ్రంథవిస్తృతి యగునని వదలుచున్నారము.

ఆఱవస్కంధము నందు సమస్తలోకములందున్న దనభక్తుల భగవానుఁడు పోషించు క్రమము పేర్కొనఁబడినది. నామకీర్తనముచే నిఖిలపాపములు విముక్తిఁ జెందునను రహస్యము అజామిళ కథవలనఁ దెలిసికొననగును.

శ్లో. సకృన్మనః కృష్ణపదారవిందయోర్నివేశితం తద్గుణరాగియైరిహ
న తేయమం పాశభృతశ్చతద్భటాన్ స్వప్నేపిపశ్యంతిహిచీర
(నిష్కృతాః- భాగ. 6-1-19

మఱియు నిందలి "భాగవతుల లోకపాలనము" వలన భగవానుఁడు భగవద్భక్తులు అవ్యక్తదేహధారులై లోకములలోఁ జరించుచు లోకోపకారమునకు భక్తిజ్ఞానవైరాగ్యము లుపదేశింతురని తెలియనగును. దక్షోపాఖ్యానము వలనఁ బ్రవృత్తిరతులకు నివృత్తిమార్గముపదేశింపఁ జనదని తేలును. ఇంద్రోపాఖ్యానమువలన గురుధిక్కారము కూడదనియు భగవంతుని భగవద్భక్తులను స్మరించుటవలన విప్లవములు తొలఁగుననియుఁ దెలియును. చిత్రకేతూపాఖ్యానమువలన భగవద్ధర్మనిష్ఠులఁ బరిహసింపరాదనియుఁ జిత్తవికారము నొందకుంట యుత్తమగతుల సమకూర్చు ననియుఁ దెలియును.

ఈస్కంధమున నిట్లే భగవంతుఁడు తన భక్తుఁ బోషించు కథలేగాక సవితృఁడు మున్నగు వారల వంశక్రమము మరుద్గణము యొక్క జనన పద్ధతి పుంసవనవ్రత విధానము వివరింపఁ బడినది.

పవిత్రకథాంశములు గల నీషష్ఠస్కంధమును ఏర్చూరి సింగన సులలితముగఁ దెలిగించి "కృష్ణపాదారవిందసందర్శనాదర్శాయమాన చిత్తుండయి" ఆంధ్రలోకము నకుఁ బరమోపకారము గావించినాఁడు.

కవితావిలాసము,
హనుమకొండ.
ది. 15-7-1939.

ఇట్లు భాషాసేవకులు
శేషాద్రి రమణకవులు,
శతావధానులు.

# విషయసూచిక

## షష్ఠస్కంధము


| | |
|---|---|
| షష్ఠ్యంతములు ... ... | 6 |
| అజామిళోపాఖ్యానము ... ... | 11 |
| విష్ణుదూతయమదూతలసంవాదము ... | 14 |
| దక్షుఁడు స్తుతియించినహంసగుహ్యాంబనుస్తవరాజము | 45 |
| దానవులు దేవతలతో యుద్ధముసేసి దేవతల నోడించుట | 64 |
| శ్రీమన్నారాయణకవచ ప్రారంభము ... | 69 |
| చిత్రకేతూపాఖ్యానము ... ... | 107 |
| చిత్రకేతుండు తపంబాచరించి భగవత్ప్రసాదము నొందుట | 114 |
| చిత్రకేతుండీశ్వర ధిక్కారంబున గౌరిచే శాపమొందుట | 120 |
| సవితృవంశప్రవచనాదికథ ... ... | 125 |

శ్రీరస్తు.

శ్రీరామచంద్రాయ పరబ్రహ్మణేనమః.

# శ్రీమదాంధ్రభాగవతము

## షష్ఠస్కంధము.



1వత్సాంకితకౌస్తుభస్ఫురితలక్ష్మీచారువక్షస్స్థల
శ్రీవిభ్రాజితు నీలవర్ణు శుభరాజీవాక్షు 2కంజాతభూ
దేవేంద్రాదిసమస్తదేవమకుటోద్దీప్తోరురత్నప్రభా
వ్యావిద్ధాంఘ్రిసరోజు నచ్యుతుఁ గృపావాసుం
బ్రశంసించెదన్.

ఉ. నిండుమతిం దలంతుఁ 3కమనీయభుజంగమరాజమండలీ
మండనుఁ జంద్రఖండపరిమండితమస్తకుఁ దారమల్లికా
పాండురవర్ణుఁ జండతరభండను హేమగిరీంద్రచారుకో
దండు మహేశు గంధగజదానవభంజను భక్తరంజనున్. 2

ఉ. హంసతురంగముం బరమహంసము నంచితదేవతాకులో
త్తంసము నాగమాంతవిదితధ్రువపుణ్యరమావతంసముం

---

1. శ్రీవత్సాంకిత ... ... విభ్రాజితు=శ్రీవత్సమనెడు పుట్టుమచ్చచే చిహ్నితమైనట్టియు, కౌస్తుభమను మణిచే వెలుఁగొందునట్టియు, శ్రీదేవిచే నందమైనట్టియు, తొమ్మెయొక్క సొబగుచే ప్రకాశించువానిని.

2. కంజాతభూ......సరోజు=బ్రహ్మ, దేవేంద్రుఁడు మొదలగు సమస్తదేవతల యొక్కయు కిరీటములయందలి మిక్కిలి వెలుఁగొందు గొప్పరత్నముల కాంతులతో కూడుకొన్న అడుగుతామరలు కలవానిని.

3. కమనీయ ... ... మండను = అందమగు సర్పరాజముల సమూహము నగలుగా కలవానిని.

గంసజిఘాంసునంశమును ♦ గర్బురసూత్రసమాన్వితాంసమున్
హింస నడంచు బ్రహ్మము న♦హీనశుభంబులకై భజించెదన్. 3

ఉ. మోదకహస్తునిన్ సమద♦మూషకవాహను నేకదంతు లం
బోదరు నంబికాతనయు ♦ నూర్జితపుణ్యు గణేశు దేవతా
హ్లాదగరిష్ఠు దంతిముఖు ♦ నంచితభక్తఫలప్రదాయకున్
మోదముతోడ హస్తములు ♦ మోడ్చి భజించెద నిష్టసిద్ధికిన్. 4

ఉ. కల్లతనంబు గాక పొడ♦గట్టినపూర్వపురీతి నేఁడు నా
యుల్లమునందు నుండుము సమున్నతతేజముతోడ భక్తి రం
జిల్లినచూపు గూడ విధిఁ ♦ జెందినప్రోడ బుధాళినీడ మా
తల్లి దయామతల్లి ప్రణ♦తద్రుమకల్పకవల్లి భారతీ. 5

క. విలసత్కంకణరవరవ, కలితంబగునభయవరద♦కరముల బెరయున్
జెలరేఁగిభక్తులకు నల,కలుముల దయసేయుజలధి♦కన్యకఁ దలఁతున్

క. కాళికి బహుసన్నుతలో, కాళికిఁ గమనీయవలయ♦కరకీలితకం
కాళికిఁ దాపసమానస, కేళికి వందనము సేసి ♦ కీర్తింతుమదిన్. 7

వ. అని యిష్టదేవతాప్రార్థనంబు సేసి.

చ. పరమసమాధిధుర్యుఁ బటు పావనకర్మవిధేయు దేవతా
వరనరవంద్యు సద్విమల♦వాక్యు జనార్దనకీర్తనక్రియా
భరణసమర్థు వేదచయ♦పారగు భవ్యుఁద్రికాలవేది భా
సురమతిఁ గొల్చుటొప్పు బుధ♦శోభితుఁబుణ్యుఁబరాశరాత్మజున్.

క. వ్యాసుఁడు భగవత్పదసం వాసుండాగమపురాణ♦వరవిష్ణుకథా
వాసుఁడునిర్మలకవితా,భ్యాసునిపదపద్మయుగము♦భావింతుమదిన్

సీ. వరకవితోద్రేకి ♦ వాల్మీకిఁ గొనియాడి
భాగవతార్థవైభవముఁ బలుకు
శుకమంజులాలాపు ♦ శుకయోగిఁ బ్రార్థించి,
బాణమయూరుల ♦ ప్రతిభ నొడివి

ఆగమాంత ... ... వతంసమున్ = ఉపనిషత్తులచేఁ తెలియబడిన శాశ్వతమగు మోక్షలక్ష్మికి శిరోభూషణమైనవానిని. (Iవ పేజీ చివరపంక్తిలో)

భాససౌమిల్లిక • భారవిమాఘుల
ఘనసుధామధురవాక్యములఁ దలఁచి
కాళిదాసుఁ గవీంద్ర•కల్పవృక్షముఁ గొల్చి
నన్నపాచార్యు వర్ణనలఁ బొగడి
తే. వెలయఁదిక్కనసోమయాజుల భజించి
యెఱ్ఱనామాత్యుభాస్కరు•నిచ్చఁగొల్చి
సుకవి సోముని నాచన•సోము నెఱిఁగి
కవిమనోనాథు శ్రీనాథు • ఘనత మెచ్చి. 11

ఉ. [1]ఎమ్మెలు సెప్ప నేల జగ • మెన్నఁగఁ బన్నగరాజశాయికిన్
సొమ్ముగ వాక్యసంపదలు • సూఱలు సేసినవాని భక్తిలో
నమ్మినవాని భాగవత•నైష్ఠికుఁడై తగువానిఁ బేర్మితో
బమ్మెరపోతరాజుఁ గవి•పట్టపురాజుఁ దలంచి మ్రొక్కెదన్. 12

వ. అని సకలసుకవినికరంబులకు ముకుళితకరకమలుండ నై. 13

ఉ. ఎయ్యది కర్మబంధముల • నెల్లహరించు [2]విభూతికారణం
బెయ్యది సన్మునీంద్రులకు • నెల్లఁ గవిత్వసమాశ్రయంబు ము
న్నెయ్యది సర్వమంత్రముల • నేలిన దెయ్యది మోక్షలక్ష్మిరూ
పెయ్యది దానిఁబల్కెద సు•హృద్యముభాగవతాఖ్యమంత్రమున్

వ. అని శ్రీమహాభాగవతపురాణంబునందు షష్ఠస్కంధం బాంధ్ర
భాష రచియింపంబూని యాకృతికిం బతిగా నద్దేవుండు గలండని
వితర్కించి నాకుం గవిత్వమహత్త్వంబు సంప్రాప్తంబగు కాలంబు
దలంచి నారాయణుండె దైవంబని యెఱింగి మనోరథంబు సఫలం
బయ్యె నని యాకృతిఁ గృష్ణార్పణంబు చేసితి నదియెట్లనిన నేను
విద్యాభ్యాసంబునం దగిలి కొండొక నైయుండ నొక్కనాఁడు
దైవంబున.

చ. కలిత విశేషవస్త్రములు • గట్టి హిమాంబుసుగంధచందనం
బలఁది వినూత్నభూషణము • లారఁగఁ దాల్చి వినోదలీల నిం

1 ఎమ్మెలు=విలాసపుమాటలు.
2 విభూతికారణంబు = ఐశ్వర్యమునకు హేతువైనది.

పుల మృదుశయ్య నిద్రఁదగఁ ♦ బొందినచోఁ గనుపట్టెఁ బల్లవాం
చలమునఁ గమ్మక్రొమ్మెఱుఁగు♦దండము రూపున నిల్చుపోలికన్.

సీ. ఉరవడిఁ బ్రాగ్వార్ధి ♦ నుదయించుమార్తాండ
కోటిబింబచ్ఛాయ ♦ గూడినట్లు
హరిహరబ్రహ్మల♦యాత్మలలో నుబ్బి
కరుణ యొక్కట [1]మూర్తి♦ బెరసినట్లు
ఖరకరకరతీవ్ర♦గతిని గరఁగుచు
హేమాద్రి చెంతఁ బె♦ల్లెగసినట్లు
[2]ఫణిరాజఫణరాజి♦మణిగణవిస్ఫూర్తి
సుషిరంపువెలిఁ దల♦చూపినట్లు

తే. లొట్టిపడ్డట్లు కట్టెట్టి♦నూఁదినట్లు
తేజ మెసఁగంగ నామ్రోల♦దివ్యవాణి
పూని సాక్షాత్కరించి సం♦పూర్ణదృష్టిఁ
జూచి యిట్లని పలికె మం♦జులముగాను. 17

ఉ. ఆటలుఁ బాటలుం జదువు♦లద్భుతముల్ విన నొప్పువాద్యముల్
సాటి దలంప రానిబలు♦సాములు మున్నగువిద్యలెల్ల నీ
కాటలుఁ బాట లయ్యె విను♦మన్నిటికిన్ మెఱుఁగిడ్డభంగి నా
చాటునఁ జాటుకారపద♦ సాధుకవిత్వముఁ జెప్పు మింపుగన్. 18

వ. అని యానతిచ్చు[3]జగన్మాతృకృపావలోకనసుశ్లోకుండనైన యేనొక్క
శ్లోకంబు నాక్షణంబ నుడివితి నది యెట్టి దనిన. 19

శ్లో. హంసాయ సత్త్వనిలయాయ సదాశ్రయాయ
నారాయణాయ నిఖిలాయ నిరాశ్రయాయ
సత్సంగ్రహాయ సగుణాయ సదీశ్వరాయ
సంపూర్ణపుణ్యపతయే హరయే నమస్తే. 20

---

17. 1మూర్తి బెరసినట్లు= రూపొందినట్లు. 2ఫణిరాజ......విస్ఫూర్తి = ఆదిశేషుని పడగల జారునందలి రత్నాలసమూహముయొక్క కాంతి.

19. 3జగన్మాతృ ...... శ్లోకుండను = లోకజననియొక్క దయాగలచూపులచే చక్కని ప్రశస్తికలవాఁడను.

వ. ఈశ్లోకం బద్దేవి యంగీకరించె నంత మేలుకాంచి యానంద
భరితుండ నై నాఁటనుండి సంప్రదాయానుగత మగుచంద్రికే యుంబోలె
నారాయణాంకితం బయిన కవిత్వతత్త్వజ్ఞానంబు గోచరం బయ్యె
దానికి ఫలంబుగా గోపికావల్లభుని నుల్లంబున నిడుకొని. 21

ఆ. పలుకఁ గలిగె మొదల • భాగవతార్థంబు
భర్త కృష్ణుఁ డయ్యె • భాగ్య మొదవె
నమృతరసముఁ గోర • నలరుచింతామణి
పాత్ర సంభవించు • భంగి నిపుడు. 22

ఆ. భాగవతము దేట • పఱుప నెవ్వఁడు సాలు
శుకుఁడు దక్క నరుని • సఖుఁడు దక్క
బుద్ధిఁ దోఁచినంత • బుధులచే విన్నంత
భక్తి నిగిడినంత • పలుకువాఁడ. 23

ఉ. పుట్టిననాఁటనుండియును • బుట్టద యెట్టియు దట్టు నైనఁ జే
పట్టి నుతింపఁ జిత్తము శు • భం బగు మద్వరవాక్యసీమకుం
బట్టము గట్టినాఁడ హరిఁ • బాయక తత్కథనామృతంబు నే
నుట్టిపడంగఁ జెప్పెదఁ బు • ధోత్తము లానుఁడు శ్రోత్రపద్ధతిన్. 24

వ. అని. 25

సీ. శ్రీవత్సగోత్రుండు • శివభక్తియుక్తుఁడా
పస్తంబసూత్రుఁడు • పారగుణుఁడు
నేకూరిశాసనుం • డెఱ్ఱనప్రెగ్గడ
పుత్రుండు వీరన • పుణ్యమూర్తి
కాత్మజుం డగునాద • యామాత్యునకుఁ బోల
మాంబకునందను • లమితయశులు
కసువనామాత్యుండు • ఘనుఁడువీరనమంత్రి
సింగధీమణియునం • చితగుణాఢ్యు
తే. లుద్భవించిరి తేజంబు • లూర్జితముగ
సొరిదిమూర్తిత్రయం బన • శుభ్రకీర్తిఁ

బరఁగి రండులఁ గసువన♦ప్రభువునకును
ముమ్మడమ్మనసాధ్వియి♦మ్ముల వెలసె. 26

ఉ. ఆడదు భర్తమాట కెదు♦రాడదు వచ్చినవారి వీడఁగా
నాడదు పెక్కుభాష లెడ♦నాడదు వాకిలి వెళ్ళి కల్ల మా
టాడదు మిన్న కేని సుగు♦ణావళి కిందిర గాక సాటి యే
చేడియ లేదు చూరికుల♦శేఖరుకస్వయముమ్మడమ్మకున్. 27

క. ఆకసువయమంత్రికిఁ బు
ణ్యాకల్పశుభాంగి ముమ్మ♦డమ్మమను న్న
వ్యాకులచిత్తుల నిరువుర
శ్రీకరగుణగణులఁబుణ్య♦శీలురఁ గాంచెన్. 28

క. [1]అంగజసమలావణ్యశు
భాంగులు [2]హరిదివ్య పదయు♦గాంబుజవిలస
ద్భృంగాయమానచిత్తులు
సింగయ తెలగయలుమంత్రి♦శేఖరు లనఁగన్. 29

క. అందగ్రజుండ శివపూ, జం దనరినవాఁడ [3]విష్ణు♦చరితామృతని
ష్యందిపటువాగ్విలాసా, నందోచితమానసుండ♦నయకోవిదుఁడన్.

వ. కావునంగృష్ణపాదారవిందసందర్శనాదర్శతలాయమానచిత్తుండనయి

—♦ షష్ఠ్యంతములు ♦—

క. శ్రీపతికి మత్పతికి నుత, గోపతికిఁ ద్రిలోకపతికి ♦ గురుజనబుధసం
తాపనివారణమతికిని, ప్రాపితసనకాదితతికి ♦ బహుతరధృతికిన్. 32

క. హరికి [4]గురుకలుషకుంజర, హరికి బలాభీలహరికి ♦ సంతస్నిత గ
హ్వరికి నరహరికి రక్షిత, కరికిఁగరాగ్రస్థగిరికి♦ ఘనతరకిరికిన్. 33

క. గుణికి సమాశ్రితచింతా, మణికి మహేంద్రాదిదివిజ♦మండలచూడా

---

1 అంగజ ... శుభాంగులు = మన్మథునితో సరియగునందముకల చక్కని శరీరముకలవారు. 2 హరి ...... చిత్తులు = విష్ణువుయొక్క పూజ్యమగు నడుగు దోయియను తామరయందు ఒప్పులొలుకు తుమ్మెదలగుచున్న డెందములుకలవారు.

3 విష్ణు ... ... మానసుండ = విష్ణుకథలనెడి అమృతమును స్రవించుచున్న ప్రశస్తమగు పలుకుబడులచే కలిగిన సంతసమునకు తగినమనసుకలవాడను.

4 గురు ... హరికి = గొప్పపాపములను ఏనుఁగులకు సింహమైన వానిని.

మణికిఁ 1ప్రకల్పితశయ్యా, ఫణికి నురోభాగకౌస్తు♦భప్రియమణికిన్.

క. కంసాసురసంహారున, కంసాంచితకర్ణకుండ♦లాభరణునకున్
2హింసాపరపరమస్తక, మాంసకరాళితగదాభి♦మతహస్తునకున్. 35

క. 3వరయోగిమానసాంతః, కరణసుధాంభోధిభావ♦కల్లోలలస
త్పరతత్త్వశేషశాయికిఁ, జిరదాయికి సకలభక్త♦చింతామణికిన్.

వ. సమర్పితంబుగా నాయొనర్పం బూనినషష్ఠస్కంధంబునకుఁ గథాప్రారంభక్రమం బెట్టి దనిన హరిచరణస్మరణపరిణామవినోదులయిన శౌనకాదులకు నిఖిల పురాణేతిహాసనిర్ణయవిఖ్యాతుం డైన సూతుం డి ట్లనియె. 37

క. శ్రీరమణీరమణకథా
పారాయణచిత్తుఁడగుచుఁ ♦బలికెఁ బరీక్షి
ద్భూరమణుఁ డాదరంబున
సూరిజనానందసాంద్రు ♦శుకయోగీంద్రున్. 38

సీ. షడ్గుణైశ్వర్యశా♦శ్వతమూర్తి వయినట్టి
మునినాథ దయతోడ ♦ ముక్తిపదము
మున్నుగా నేమార్గ♦మున వినిపించితి
వారయ నపవర్గభూరిమహిమఁ
గ్రమయోగసంభవ♦బ్రహ్మంబుతోఁ గూడ
నను వొంద నగు నని ♦వినుతి కెక్క
మఱియు సత్త్వరజస్త♦మఃప్రభావంబులఁ
గడిఁది యై యున్నట్టి♦కర్మచయము

తే. నప్పటప్పటి కడఁగని♦యట్టిప్రకృతి
గలుగుపురుషునిభోగార్థ♦ఘటన దేహ

---

1 ప్రకల్పిత ... ఫణికి = కూర్పఁబడిన పడుకయైన పాముకలవానికిని.

2 హింసా ... హస్తునకున్ = హింసయందు ఆసక్తికల శత్రువులయొక్క తలలయందలిమాంసముచే భయంకరముగా చేయఁబడిన గదయందు యిచ్ఛకలిగి చేయికలవానిని.

3 వర ... శాయికి = శ్రేష్ఠులగు యోగీశ్వరులయొక్క మానసాంతరము అను పాలసంద్రముయొక్క తలఁపులనెడి అలలయందు చెలువొందు గొప్పజ్ఞానమను శేషునిపై పవళించినవానికి.

కారణారంభరూపమా♦ర్గంబు మొదలు
మాటిమాటికినన్ని యుఁ♦ దేటపడఁగ.

వ. మఱియు ననేకపాపలక్షణంబులగు నానావిధనరకంబులును వానికా ద్యంతంబులును స్వాయంభువ సంబంధి యగు మన్వంతరంబును బ్రియవ్రతోత్తానపాదులవంశంబును దచ్చరిత్రంబును దీపవర్షసము ద్రాదినద్యుద్యానవనస్పతులును భూమండలసంస్థాపనంబును వాని పరిమాణంబును జ్యోతిశ్చక్రచలన ప్రకారంబును విభుండయినపర మేశ్వరుండెవ్విధంబున నిర్మించె నావిధం బంతయు నెఱింగించి నాఁడ విప్పుడు. 40

ఆ. కడఁదివేదనలకుఁ♦ గారణం బైయుండు,
గుఱుతు లేనినరక♦కూపరాశి
పాలుగాక నరుఁడు ♦ బ్రదికెడుమార్గంబు
పరమపుణ్య తెలియఁ♦బలుకవయ్య. 41

వ. అనినఁ బరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె. 42

క. కట్టా! [1]త్రికరణమెఱుఁగక, పుట్టినదురితములనపుడ♦ పొలియింపనియా
కట్టెఁడిదేహం బుడిగినఁ, గొట్టాడును బిట్టునరక♦కూపంబులలోన్.

ఉ. కావునఁ గాలకింకరవి♦కారము గానకమున్న మృత్యుదు
ర్భావనఁ జిత్తముల్ వెడఁగు♦పాటును జెందకమున్న మేనిలో
జీవము వెల్లుచుండఁ దన♦చెల్వము దప్పకమున్న పన్నుగాఁ
బావనచిత్తుఁడై యఘముఁ ♦ బాయుతెఱంగొనరింపఁగాఁ దగున్.

క. కాలం బెడగని పాపము
మూలముఁ జెఱుపంగ వలయు ♦ మును రోగములం
[2]దేలినదోషము నెఱుఁగుచు
వాలాయము దాని నడఁచు♦ వైద్యునిభంగిన్. 45

సీ. అనవుడు నాతని ♦ కనియె భూకాంతుండు
కనుకలి వినుకలి ♦ గలిగినట్టి

---

43. 1త్రికరణము = మూఁడుసాధనములసమూహము. (వాఙ్మనః కాయములనుట)
45. 2తేలినదోషము = ఏర్పడినవాత, పిత్త, కఫములయందలియొకదానిని.

పాపము దనకు నొప్పని దని కని చాలఁ
బరితప్పుఁ డయ్యుఁ గ్రమ్మఱ నొనర్చు
మూఢాత్మునకు దోష మోచనం బెయ్యది
యారయ నెఱిఁగింపు మదియుఁ గాక
కలుష మొక్కొకచోటఁ గావించు నొకచోటఁ
గావింపకుండుఁ దత్కర్మ మెఱిఁగి
ఆ. యిట్టిజనుఁడు పుణ్య మేరీతిఁ జేసిన
నది ఫలింప నేర దని తలంతు
సలిలమందు మేని మలినంబు వోకుండ
గజము గ్రుంకు వెట్టు గతియుఁ బోలె. 46
వ. అనిన శుకుం డిట్లనియె. 47
క. కర్మము గర్మముచేతను, నిర్మూలము గాదు తెలియ నేరక తానే
కర్మము సేసినఁ [1]దత్ప్రతి, కర్మంబొనరింప వలయుఁ గలుష విదూరా.
క. [2]హితవుగల కుడుపు మఱిరు, గ్ర్వితతులఁ బొడమంగ సీని విధమున నతిస
ద్వ్రితుఁడైనవాఁడు నిర్మల, మతిచే నఘరాశి నెల్ల మట్టము సేయున్.
చ. తపమున బ్రహ్మచర్యమున దానమునన్ శమసద్దమంబులన్
జపమున సత్యశౌచముల సన్నియమాదియమంబులం గృపా
నిపుణులు ధర్మవర్తనులు నిక్కము హృత్తనువాక్యజంపుపా
పపుగుది ద్రుంతు రగ్ని శత పర్వవనంబుల నేర్చు కైవడిన్. 50
వ. అదియునుం గాక. 51
ఉ. కొందఱు పుణ్యవర్తనులు [3]గోపకుమారపదారవిందజా
నందమరందపానకల నారతషట్పద చిత్తులౌచు నో
విందపరాయణుల్ విమల వేషులు దోషమడంతు రాత్మలం
జెందిన భక్తిచేత రవి చేకొని మంచు నడంచు కైవడిన్. 52

---

1 ప్రతికర్మము = ప్రతిక్రియ

2 హితవుగల కుడుపు = తనకు సరిపడిన భోజనము (హిత మితభోజనము రోగములు వారించును)

3 గోప ... చిత్తులు = గొల్లపిల్లవాని అడుగుతామరలచే కలిగిన సంతోసమను పూదేనెను త్రావుపనియందు తుమ్మెదలగుచున్న డెందములు కలవారు.

క. హరిభక్తిచేతఁ గొందఱు
పరిమార్తురు మొదలు ముట్ట • పాపంబుల ని
ష్ఠురతరకరముల సూర్యుం
డరుదుగఁ బెనుమంచుఁ బించ•మడఁచినభంగిన్. 53

క. దంతిపురనాథ విను మొక,
మంతన మెఱిఁగింతు శమదమంబులు 1నంహో
వంతు శుభవంతుఁ జేయవు,
2కంతుని గురుభక్తి ముక్తిఁ • గలిగించుగతిన్. 54

సీ. హరికి నర్థముఁ బ్రాణ • మర్పితంబుగ నుండు
వానికైవల్య మె•వ్వనికి లేదు
వనజలోచనుభక్త•వరుల సేవించిన
వానికైవల్య మె•వ్వనికి లేదు
వైకుంఠనిర్మల•వ్రతపరుం డైనట్టి
వానికైవల్య మె*వ్వనికి లేదు
సరసిజోదరుకథా•శ్రవణలోలుం డైన
వానికైవల్య మె•వ్వనికి లేదు

తే. లేదు తపముల • బ్రహ్మచర్యాదినియతి
శమదమాదుల సత్యశౌ•చముల దాన
ధర్మ మఖముల సుస్థిర•స్థానమైన
వైష్ణవజ్ఞానజనితని•ర్వాణపదము 55

తే. అరయ నెన్నఁడుఁ జేటు లే•నట్టిముక్తి
వర్త్మ మీలోకమందు నె•వ్వరికిఁగలదు
సాధులును బుణ్యశీలురు • సజ్జనులును
హరిపరాయణచిత్తురు • లయినఁ గాక. 56

క. అరుదుగ నరహరిభక్తిం
బొరయనియాపురుషుసుకృత•పుంజంబులు వే

1 అంహోవంతు = పాపముకలవానిని. 2 కంతునిగురుభక్తి = విష్ణుభక్తి

మఱిఁ బుణ్యుఁ జేయ నేరవు
నరవర మధుఘటముఁ బెక్కు నదులుం బోలెన్. 57

చ. సతతముఁ గృష్ణపాదజల♦జంబులయందు మనంబు నిల్పు సు
వ్రతులుఁ 1తదీయశుద్ధగుణ♦రాగులుఁ గాలునియుగ్రపాశసం
హతుల ధరించుతత్సుభట♦కోఘములం గలలోనఁ గాన రే
గతులను దుష్టకర్మములు ♦ గైకొని వారలఁ జెంద నేర్చునే. 58

వ. కావున నీయర్థంబునకుం బురాతనం బగు నొక్క యితిహాసంబు
గల దది విష్ణుదూతయమదూతసంవాదం బనంబడు దాని నెఱిం
గింతు నాకర్ణింపుము. 59

—♦ అజామిళోపాఖ్యానము. ♦—

సీ. నరనాథ వినుము క♦న్యాకుబ్జపురమునఁ
గలఁడు బ్రాహ్మణుఁడజా♦మిళుఁడనంగఁ
బాతకుం డతులనిర్భాగ్యుం డవజ్ఞుండు
నష్టసదాచారి ♦ కష్టరతుఁడు
జూదంబులందు దు♦ర్వాదంబులందును
శౌర్యంబునందు మచ్చరము గలిగి
తొత్తాత్మపత్నిగా♦మత్తుఁడై వరియించి
కొడుకులఁ బదుగురఁ ♦ బడసి చాల

ఆ. మోహజలధిలోన ♦ మునిఁగి ముచ్చట దీఱ
బాలలాలనాది♦లీలఁ దగిలి
పెద్దకాల మతఁడు ♦ పెంపార సుఖయించి
ఫలిత మెల్ల వదలి ♦ పతితుఁడయ్యె. 60

సీ. నిర్మలం బనఁ జాల ♦ నెఱయుచిత్తం బన
నల్లని వెంట్రుకల్ ♦ దెల్ల వయ్యెఁ
దగుమోహపాశ బం♦ధంబు జాఱినమాడ్కిఁ
బొదలిన యంగముల్ ♦ వదలి వ్రేలె

---

1 తదీయ... రాగులు = విష్ణుసంబంధములగు కళ్యాణగుణములయందు నిక్కపుఁ
ప్రేమకలవారు. (రాగమూలమగు భక్తియే మిగుల ప్రశస్తము)

నింద్రియంబుల కోర్కు ♦ లిఁక నొల్ల ననుభంగి
నుడుగక తలచాల ♦ వడఁకఁజొచ్చెఁ
దమకంబు ప్రాయంబుఁ ♦ దగిలిపోయినమాడ్కి
లోచనంబులచూడ్కి ♦ నీచమయ్యె

ఆ. వగరు పుట్టె నంతఁ ♦ బెగ లె దంతంబులు
నుక్కిసయును దగ్గుఁ ♦ బిక్కటిల్లె
శిరసు నొవ్వఁదొడఁగెఁ ♦ జెదరె మనంబంతఁ
గడిఁది యైనముప్పు ♦ కాలమునకు. 61

ఆ. ఎనయ నతని కెనుబ ♦ దెనిమిది వర్షంబు
లంతనరుగుటయును ♦ భ్రాంతుఁడగుచుఁ
గోరి పిన్నకొడుకు ♦ నారాయణాఖ్యుండు
బాలుఁ డగుట మిగుల ♦ భక్తిఁజేసి. 62

క. తనసతియుఁ దానుఁ గూరిమి
మనమునఁ బెనఁగొనఁగ నక్కు ♦ మారుని ననిశం
బును ముద్దుసేయుచుండెను
జనవర వాత్సల్య మాత్మ ♦ సందడిగొనఁగన్. 63

క. బాలుని 1ముగ్ధవచోబుజు
ఫాలుని నిజజనకబంధు ♦ పరిణామకళా
శీలుని లోలతఁ గనుఁగొని
యాలరి బ్రాహ్మణుఁడు నంది ♦ తాత్మ్యం దగుచున్. 64

క. అత్యంతపానభోజన
కృత్యంబులఁ బొత్తు గలిగి ♦ క్రీడలఁ దత్సాం
గత్యంబు వదల కాగత
మృత్యువుఁ గన నేరఁ డయ్యె ♦ మిక్కిలి జడుఁడై. 65

తే. తెలియ కీరీతి నతఁడువ ♦ ర్తించుచుండ
భయదమగుమృత్యుకాలంబు ♦ ప్రాప్తమైన

---

1. ముగ్ధ ... ఫాలుని = తొక్కుపల్కులతో నొప్పి, [illegible].

భూరివాత్సల్యవృత్తి న ♦ ప్పుత్రుఁదలఁచి
యాత్మఁ బ్రలపించె నారాయ ♦ ణాయటంచు. 66

వ. అప్పుడు. 67

క. కింకరుల ధర్మరాజ వ
శంకరుల 1దురంత దురిత ♦ సమధిక జననా
శంకరుల సకలలోక భ
యంకరులం గనియె నింద్రి ♦ యాకులుఁ డగుచున్. 68

క. ఘాతుకుల దండదండిత
పాతకుల మహోగ్రకర్మ ♦ భరనిష్కరుణా
జాతకులఁ బ్రేతనాయక
దూతకసంతతుల నతఁడు ♦ దూరమునందున్ 69

మ. కనియెన్ బ్రాహ్మణుఁ డంత్యకాలమునవీఁ♦కన్ రోషనిష్ఠ్యూతులన్
2ఘనపీనోష్ఠవికారవక్త్రవిలస ♦ ద్గర్వేక్షణోపేతులన్
3జనసంత్రాసకరోద్యతాయత సుపా ♦ శశ్రేణికాహేతులన్
హననవ్యాప్తివిభీతులన్ మువ్వుర నా ♦ త్మానేతలన్ దూతలన్. 70

వ. ఇట్లతి4వికృతతుండగండాభోగవిభాగవిషమవివృత్తనేత్రులు5నతిపుష్ట
నిష్ఠురతను యష్టిసంవేష్టితమహోర్ధ్వరోములు 6నభ్యస్తసమస్త
జీవాపహరణకరణ ప్రశస్తహస్తవిన్యస్తపాశధారులు నగు యమ

1 దురంత ... కరుల = అంతములేని పాపములచే పెంపెక్కిన జనులను నాశనమొనర్చువారిని.

2 ఘన ... పేతులన్ = పెద్దవై, లావగు పెదవులచే వికారములగు మొగములయందు గర్వముగల చూపులతో కూడినవారిని.

3 జన ... హేతులన్ = లోకములకు భయమునుకూర్చునట్టియు, తగుల్పఁబడినట్టియు, పొడవగుపాశముల బారులనెడి ఆయుధములు కలవారిని.

4 వికృత... నేత్రులు=వికారముగల నోళ్ళయొక్కయు, చెక్కిళ్ళయొక్కయు విస్తృతములగు భాగములుకలవారును, విపరీతముగా త్రిప్పబడిన చూపులుగలవారును.

5 అతి ... రోములు = మిక్కిలిబలసిన మొఱటగు కట్టెవంటి శరీరములయందు గుబుర్కొని నిక్కబొడుచుకొన్న వెంట్రుకలుకలవారు.

6 అభ్యస్త ... ధారులు = నేర్వబడిన సమస్తజనుల జీవముల నపహరించు పనియందు నేర్చుగల చేతులయందుంపబడిన పాశములధరించినవారు.

భటుల మువ్వురం గనుంగొని యజామిళుండు వికలేంద్రియుండును వికంపితప్రాణుండును వికృతలోచనుండును విహ్వలాత్మకుండునునై.

క. దూరమున నాడుబాలుఁడు
బోరనఁ దనచిత్తసీమఁ ♦ బొడగట్టిన నో
నారాయణ నారాయణ
నారాయణ యనుచు నాత్మ ♦ నందను నొడివెన్. 72

చ. మరణపువేళ నద్దనుజ ♦ మర్దనుసంస్మరణంబు సేయఁ ద
త్పరిసరవర్తు లాత్మపరి ♦ పాలకునామము నాలకించి ని
ష్ఠురగతి నేఁగుదెంచి పొడ ♦ చూపి యదల్చిరి కాలుదాసులన్
ఖరతరభాషులన్ వికట ♦ కల్పితవేషుల దీర్ఘరోషులన్. 73

క. దాసీభర్త నజామిళ
భూసురుఁ దత్తనువువలన ♦ బోరన వెలికిం
దీసినయమభటులఁ బోలఁగఁ
ద్రోసిరి శ్రీవరునికూర్మి ♦ దూతలు కడిమిన్. 74

—♦ విష్ణుదూత యమదూతల సంవాదము. ♦—

వ. ఇట్లు విష్ణుదూతలవలన 1నిర్ఘాతప్రయత్నులై యమదూత లిట్లనిరి.

క. ఎవ్వనివారలు మాతోఁ
2జివ్వకుఁ గతమేమి యిట్లు ♦ చిక్కినవానిం
గ్రొవ్వున విడిపించితి రిఁక
నెవ్వలకో 3జముని శాస ♦ నంబులు జగతిన్ 76

వ. అదియునుంగాక. 77

సీ. ఎవ్వరు మీ రయ్య ♦ యీభవ్యరూపముల్
గన్నుల కద్భుత ♦ క్రమ మొనర్చె
దివిజులో భువిజులో ♦ దేవతాప్రవరులో
సిద్ధులో సాధ్యులో ♦ చెప్పరయ్య

---

1 నిర్ఘాతప్రయత్నులై = చెదరఁగొట్టబడినప్రయత్నములు కలవారై.
2 చివ్వ = యుద్ధము.
3 జముని శాసనంబులు = యముని యానతులు.

1దళితపాండురపద్మ ♦ దళదీర్ఘనేత్రులు
వరపీతకౌశేయ♦వాసు లరయ
గండమండలనట♦త్కుండలద్వయులును,
బటుకిరీటప్రభా♦భాసితులును
తే. భూరిపుష్కరమాలికా♦చారువక్షు,
లమితకోమలనవయావ♦నాధికులును
బాహుకేయూరమణిగణ♦భ్రాజమాన,
ఘనచతుర్భుజు 2లభ్రసం♦కాశరుచులు. 78

క. ధనువులు 3నిషంగచయములుఁ,
గనదంబుజశంఖచక్ర♦ఖడ్గగదాసా
ధనములు ధరియించినమీఁ,
తనువులు లోకముల కద్భు♦తం బొనరించెన్. 79

క. శాంతంబు లయినమీఁతను,
గాంతులు జగములను దిశలఁ♦గలిగిన 4బహుళ
ధ్వాంతములఁ బాఱఁ దోలుచు
సంతస మొనరించె నిపుడు ♦ సర్వాంకషమై. 80

వ. ఇట్లఖిలలోకానందకరక్రమాకారులు 5నఖిలవిభ్రాజమాన తేజోదుర్నిరీక్ష్యమాణులును నిఖిలధర్మపాలురును నగుమీరు ధర్మపరిపాలుర మమ్ము నడ్డపెట్టం గతం బేమి యనిన వారు ధర్మరాజానుచరులు గారను తలంపున 6మందస్మితకందళితముఖారవిందు లయి గోవిందుని కందువముందిరంబుకావలివారలు 7వారివాహగంభీరనిర్ఘోషపరిపోషణంబు లైనవిశేషభాషణంబుల నిట్లనిరి. 81

1 దళిత ... నేత్రులు = విచ్చిన తెల్లతామరరేకులవంటి పొడవగునేత్రములు కలవారు. 2 అభ్ర......రుచులు = మేఘముతోసమానమైన కాంతికలవారు. 3 నిషంగచయములు = అమ్ములపొదులసమూహములు. 4 బహుళధ్వాంతములు = గొప్పచీకట్లు. 5 అఖిల ... మాణులు = మిక్కిలి వెలుగొందచున్న ప్రకాశముచే తేరిచూడఁబడకున్నవారు. 6 మంద ... విందులయి=చిరునగవువెలకెత్తిన మోముతామరలు కలవారు. 7 వారి ... పోషణంబులు = మేఘములయొక్కగంభీరమగుధ్వనిని పోషించుచున్నవి.

ఉ. మీరు పరేతనాయకుని ♦ మేలిమిదూత లటేని( బల్కు(డా
తోరపుఁబుణ్యలక్షణము ♦ దుష్కృతభావము దండకృత్యముల్
బీరముతోడ నీతని క ♦ భీష్టనివాసము నోలి దండ్య లె
వ్వారలొ సర్వభూతములొ ♦ వా రొకకొందఱు పాపకర్ములో.
వ. అనిన యమభటు లి ట్లనిరి. 83

క. [1]వేదప్రణిహితమే యను
మోదంబుగ ధర్మ మయ్యె ♦ మున్ను తదన్యం
బేది యగు నది యధర్మం
బాదియు హరిరూపు వేద ♦ మని వినుకతనన్. 84

సీ॥ ఎవ్వనిచేఁ దన ♦ యిర వొందు త్రిగుణ స్వ
భావ మైనట్టి యీ ♦ ప్రాణిచయము
లను గుణనామ కి♦య్యా రూపములచేత
నేర్పడుగతిఁ దాన ♦ యెఱుఁగఁబడును
[2]సర్యముం డనలంబు ♦ నాకాశమును బ్రభం
జనుఁడు గోచయమును♦శశధరుండు
సంధ్యలు దివములు ♦ శర్వరీచయములుఁ
గాలంబు వసుమతీ♦జాలములును

తే. దేహధారికి సాక్షులై ♦ తెలుపుచుండు
దండనస్థానవిధము స♦ద్ధర్మగతియుఁ
దగులుమీ రిక్రమానురో♦ధనము సేసి
యఖిలకర్ములు దండార్హు ♦ లరయ నెపుడు. 85

తే. కోరికర్మంబునడపెడు♦వారికెల్లఁ
గలితశుభములు నశుభముల్ ♦ గలుగుచుండు
నరయఁగా దేహి గుణసంగి ♦ యైనయప్పు డొ
పూని కర్మంబు సేయక♦మాన రాదు. 86

---

1 వేదప్రణిహితము = వేదముచే విధింపబడినది.

2 అర్యముండు = సూర్యుఁడు.

క. ప్రకృతమునఁ దా నొనర్చిన
సుకృతము దుష్కృతము నెంత • చూడఁగ నంతే
వికృతి గని యనుభవించును
నకృతమతిం దత్ఫలంబు • నతినిపుణుండై. 87

వ. మఱియు వినుండు జన్మంబు శాంతఘోరమూఢగుణంబులచేత నైనను సుఖదుఃఖగుణంబులచేత నైనను ధార్మికాదిగుణంబుల చేత నైనను సకలభూతంబులుఁ ద్రైవిధ్యంబు నేప్రకారంబునం బొందు నాప్రకారంబున జన్మాంతరంబు నంబొందుచుండు దేవుండైన యముండు సర్వ జీవాంతర్యామియై ధర్మాధర్మ యుక్తంబైన పూర్వరూపంబుల విశేషరూపంబుల చేతం జూచుచుండి వాని కనురూపంబులఁ జింతించుచుండు నవిద్యోపాధి జీవుండు తమోగుణయుక్తుండై ప్రాచీన కర్మంబులచేత నేర్పడిన వర్తమాన దేహంబు నేనని తలంచుచుండి నష్టజన్మస్మృతి గల వాఁడై పూర్వాపరంబు లెఱుంగం జాలకుండు మఱియుఁ గర్మేంద్రియంబులచేతఁ గర్మంబులం జేయుచుండి జ్ఞానేంద్రియములచేతఁ దమోవిషయంబులైన శబ్దస్పర్శరూపరసగంధంబుల నెఱుంగుచుండి పదియాఱవది యైనమనంబుతోఁగూడి పదియేడవవాఁడగు చుండి [1]షోడశోపాధ్యంతర్గతుండై యొక్కరుండైన జీవుండు సర్వేంద్రియ విషయప్రతిసంధానంబుకొఱకు జ్ఞానేంద్రియకర్మేంద్రియ మనోవిషయంబులఁ బొందుచుండి షోడశకళలు గలిగి లింగశరీరం బనం బరఁగి గుణత్రయకార్యం బనునిమిత్తంబున హర్ష శోకభయంబుల నిచ్చుచున్న సంసారంబు ధరియించుచుండు [2]విజితషడ్వర్గుండైన దేహి కర్మంబులొల్లని బుద్ధినెఱింగియు వినియుఁ గర్మంబులు సేయుచుండి తనసంచారకర్మంబునం జుట్టుకొన్న పసిరికాయపురువునుంబోలె నిర్గమోపాయం బెఱుంగక నాశంబు నొందుచుండు వర్తమాన వసంతాదికాలంబు భూతభావివసంతాదికాలయోగ్యంబైన పుష్ప

---

1 షోడశ ... గతుండై = పదనారు ఉపాధులమధ్యయందున్నవాఁడై.
2 విజితషడ్వర్గుండై=జయింపఁబడిన కామము మొదలగు నరిషడ్వర్గము కలవాఁడై.

ఫలాదులు తత్కాలజ్ఞాపకంబు నెట్లు సేయు నట్లు భూతభావిజన్మంబులకు ధర్మాధర్మంబులు నిదర్శనంబులు సేయుచుండు నొక్కనరుండు నొకక్షణంబును [1]గర్మంబు సేయకుండువాఁడు లేఁడు పూర్వసంస్కారంబులం గలగుణంబులచేతఁ బురుషుం డవశుండు గావున బలిమిఁ గర్మంబు సేయింపం బడుచుండు నవ్యక్తనిమిత్తంబునొంది తదను రూపంబు లైన స్థూలసూక్ష్మశరీరంబులు మాతాపితృసదృశంబులగు చుండు నిట్టివిపర్యయంబు పురుషునికిఁ బ్రకృతిసంగమంబునం గలుగుచుండు నాప్రకృతి పురాణపురుషుం డైన యప్పరమేశ్వరుని సేవించినం దలంగుచుండు. ౪౪

సీ. కావున నితఁడు స♦త్కర్మవర్తనమున
భూదేవకులమునఁ ♦ బుట్టినాఁడు
దాంతుఁడై శాంతుఁడై ♦ ధర్మసంశీలుఁడై
సకలవేదంబులఁ ♦ జదివినాఁడు
అనయంబు గురువుల ♦ నతిథులఁ బెద్దలఁ
జేరి శుశ్రూషలఁ ♦ జేసినాఁడు
సర్వభూతములకు ♦ సమబుద్ధియై చాల
బహుమంత్రసిద్ధులఁ ♦ బడసినాఁడు

తే. సత్యభాషణనియమంబు ♦ జరపినాఁడు
నిత్యనైమిత్తికాదుల ♦ నెరపినాఁడు
దండిలోభాదిగుణములఁ♦దరపినాఁడు
మంచిగుణములు దనయందు♦మరపినాఁడు ౪౫

క. సతతాచారసముంచిత, మతియై సుజ్ఞానమునకు ♦ మునిగెనుశక్తి నా
యతగతి నాతనికంగజ,మతమై [2]నవయౌవనాగ♦మంబెడసొచ్చెన్

సీ. కడకంట యౌవన♦గర్వంబు వొడగట్టు
మదిలోన నుద్రేక♦మదము దొట్టఁ

1 కర్మంబు ... ... (నజాతు తిష్ఠత్యకర్మకృత్ అనిగీతలు)
2 నవయౌవనాగమంబు = క్రొత్తజవ్వనపురాక.

గడు మేనఁ గామవి♦కారంబు దలచూపె
ముఖమునఁ జిరునవ్వు ♦ మొలకలెత్తె
నతిపుష్టి నిష్ఠురం ♦ బయ్యె దేహంబెల్లఁ
గచభారమున 1నెఱి ♦ కప్పు మెఱసెఁ
గటిభారమున నూరు♦కాండముల్ జిగి మీఱె
బాహుశాఖలు దీర్ఘ♦భంగి దోఁచె

ఆ. నురము విపులమయ్యె ♦ నుల్లసద్వరకాంతి
పూరమంగకమునఁ ♦ బొందుపడియె
భూరితేజుఁ డయిన♦భూసురాన్వయునకు
నభినవైకయావ♦నాగమమున. 91

క. హృదయమునఁ బొడముయావన
మదము వెలిందోఁచుభంగి♦మానితరుచిఁ ద
ద్వదనమున నూఁగుమీసలు
వొదలుచుఁ గప్పడరి చూడఁ ♦ బొంకంబయ్యెన్. 92

వ. మఱియును. 93

క. తమ్మివిదిమీఁద వ్రాలిన
తుమ్మెదపంక్తియునుబోలెఁ ♦ దొరవులీలం
గ్రిమ్ముకొని విప్రతనయుని,
నెమ్మొగమునఁ గానబడియె ♦ నెరిమీసంబుల్ 94

వ. అంత ననంగ బ్రహ్మతంత్రబునకు వసంతుం డొనర్చునంకురార్పణారంభంబునుంబోలె 2లలితకిసలయవిసరప్రసార భాసుర బహుపాదపాదిపురోపవన పవనజవన ప్రభావ పరికంపిత విటవిటీజనహృ

1 నెఱికప్పు అందమగునల్లదనము.

2 లలిత ... భల్లంబును = అందములగు చిగురుటాకుమొత్తముల కదలికచేత ప్రకాశించుచున్న అనేకవిధములగు వృక్షములు మొదలగునవి కల పట్టణోద్యానముల యంచలిగాడ్పులయొక్క వేగాతిశయముచే చలించిన కాముకీ కాముకులయొక్క మానసములను విప్పారిన చిగురులకు ఈటె యైనది.

దయు ప్రఫుల్ల పల్లవభల్లంబును [1]ననూనప్రసూన నిర్భరగర్భావి
ర్భూత సురభిపరాగపటల పటఘటితనభోమండలంబును [2]నమందని
ష్యంద మరంద బిందుసందోహకందళిత చిత్తమత్తమధుప సంకుల
ఝుంకారముఖరితసకలదిశావలయంబును [3]నిరంతరధారాళరసభరి
త పరిపక్వఫలానుభవ ప్రభవ సమ్మోద వాదశుకప్రముఖ పతంగ
కోలాహలంబును నై కుసుమాసంబు సర్వజనమనోహరంబును నై నిఖి
ల వనపాదపంబుల నలంకరించె నయ్యవసరంబున నజామిళుండుపితృ
నిర్దేశంబునం గుశసమిత్పుష్పఫలార్థంబు వనంబునం కరిగి తిరిగి వచ్చు
సమయంబున నొక్కలతాభవనంబున 95

క. బద్ధానురాగయై స్మర
యుద్ధంబున కలరుబుద్ధి నురుకామకళా
సిద్ధి యగు [4]వృషలితో బ్రియ
వర్ధిం దగఁగూడియున్న విటు నొరుఁగాంచెన్ 96

క. ఘటునిన్ రతిశాస్త్రకళా
ర్భటునిన్ [5]నవయౌవనానుభవమదవిభవో
ద్భటునిన్ సురతేచ్ఛాసం
ఘటునిన్ విగతాంబరోరు కటునిన్ విటునిన్. 97

శా. [6]హాలాఘూర్ణితనేత్రతో మదనతంత్రారంభసంరంభతో
ఖేలాపాలన యోగ్యభూవిభవతోఁ [7]గీర్ణాలకాజాలతో

1 అనూన ... మండలంబును = ప్రశస్తములగు పూవులయొక్క పఱ్ఱపైని మధ్యమునఁ బుట్టిన పరిమళముగల ధూళి మొత్తము కడు వస్త్రముచేఁ గప్పఁబడిన యాకాశ భాగము కలిగినది. 2 అమంద ... వలయంబును = వేగముగా ప్రవహించుచున్న తేనె చుక్కల మొత్తముచే నుత్సాహముకల మనస్సులతో నొప్పిన మదించిన తుమ్మెదల యొక్క తీవరించిన ఝుంకారముచేత ధ్వనితములగు సమస్తదిక్కులయొక్క మండలము కలది. 3 నిరంతర ... కోలాహలంబు = ఎడతెగక ధారగా బడుచున్న రసముచే నిండిన, పండిన, పండ్లనుతినుటచేకలిగిన సంతసపుఁబలుకులతో నొప్పు చిలుకలు మొదలగు పక్షులయొక్క సందడికలది. 4 వృషలి = శూద్రస్త్రీ. 5 నవ ... భటునిన్ = శ్రేష్ఠమగు యౌవనమును అనుభవించుటచే కలిగినమదాతిశయముచే క్రీడించినవానిని. 6 హాలా ... నేత్రతో = మద్యముచే తిరుగుడువడిన కన్నులు కలదానితో. 7 కీర్ణా ... జాలతో = చెదరిన ముంగురుల సమూహముకలదానితో.

హేలాలింగనభంగివేషవతితోఁ ♦ నిచ్ఛావతీమూర్తితోఁ
గేలిం దేలుచునున్నవానిఁ గనెఁ [illegible] ♦ ఖీభూతరోమాంచుఁడై. 98

క. కలికి వగుమదనకదనపుఁ
బలుకులకలకలము బెడఁగు ♦ వ[illegible][1] మేఖలము
వ్వలరవళిఁ దగిలి గతిగానఁ
గలకంఠి రతంబు సలుపు ♦ గమకముఁ గనియెన్. 99

క. కవకవ నై పదనూపుర
రవరవ లాగుబ్బుకొన్న ♦ రతిపతిగతులం
జివచివ నె విటుచెవులకు
రవళిన్ రతిసల్పురతుల ♦ రవరవ గనియెన్. 100

చ. కురు లళికంబుపై నెగయఁ ♦ గ్రొమ్ముడి వీడఁగ గుబ్బదోయిపై
సరములు [2]చౌకళింపఁ గటి ♦ సంగతి మేఖల తాళగింప స
త్కరవరకంకణావళులు ♦ గర్జిలఁ [3]గౌ నసియాడ మీఁదుగా
మరునివినోదముల్ సలిపె ♦ మానిని యౌవనగర్వరేఖతోన్.

క. మవ్వపుసుకుమారాంగిని
జవ్వని నుపగూహనాది ♦ సముచితరతులన్
నివ్వటిలుదానిఁ గని మది
నువ్విళ్లూరంగ మన్మ ♦ థోద్దీపనుఁడై. 102

తరలము. [4]బహుళదృక్పరిపాకమోహని ♦ బద్ధుఁ డౌచు మనంబులో
సహజకర్మము వేదశాస్త్రము ♦ సాత్త్వికంబుఁ దలంచి త
న్నిహితచిత్తము వట్టి పట్టఁగ ♦ నేరఁ డయ్యె సదా[5]మనో
గహనమందు మరుండు పావకు ♦ ౖడై వడిం జరియింపగాన్. 103

---

1 మేఖలమువ్వలరవళి = మొలనూలి చిరుగంటల ధ్వని
2 చౌకళింపన్ = ఎగురుచుండఁగా. 3 కౌను = నడుము
4 బహుళ ... నిబద్ధుఁడు = అత్యంతమగు విలోకన పరిణామము చేత (చూపు తమకము చేననుట) కలిగిన మోహముచే కట్టఁబడినవాఁడై.
5. మనోగహనము = మనస్సనునడవి.

శా. ఆలీలావతిగండపాళికలపై ♦ 1హాసప్రసాదంబుపై
నాలోలాలకపంక్తిపై నళికపై ♦ 2నాకర్ణదృగ్భాతిపై
హేలాపాదికుచద్వయోరుకటిపై ♦ నిచ్చల్ పిసాళింపఁగా
జాలిం బొందుచు నాత్మఁ గుందుచు మనో♦జాతానలోపేతుఁడై.

తే. మఱి కులాచారవర్తన ♦ మాటుచేసి
పరఁగుపిత్రర్థములు దాని♦పాలుచేసి
సాధులక్షణగుణవృత్తిఁ ♦ జాలుచేసి
3లోలలోచనపసఁ జెంది♦లోలుఁడయ్యె. 105

క. 4శ్యామను సుమాస్త్రఖేలన
కామను సుగుణాభిరామఁ ♦ గమనీయగుణ
స్తోమ నిజభామ నొల్లక
ధామమున నటించెఁ 5గ్రించు♦దనమున జడుఁడై. 106

ఉ. బంధులఁ దిట్టి సజ్జనులఁ ♦ బాధలఁ బెట్టి యనాథకోటిఁ బెం
బందెలు సుట్టి 6యూరములు ♦ వట్టిపథంబులు గొట్టి దిట్టయై
నిందలకోర్చి సాధులకు ♦ నిందితుఁడై గడియించువిత్తమా
సుందరి కిచ్చి మచ్చికలు ♦ సొంపెదఁ గూర్చి వసించెఁ దత్కృపన్.

సీ. సముచితశ్రుతిచర్చఁ ♦ జర్చింప నొల్లక
7సతికుచద్వయచర్చఁ ♦ జర్చ సేయుఁ
8దర్కకర్కశపాఠ♦తర్కంబు గాదని
కలికితోఁ బ్రణయత♦ర్కంబు సేయు

---

1 హాసప్రసాదంబుపై = చిరునగవుయొక్క యొప్పిదముపై.
2 ఆకర్ణదృగ్భాతిపై – చెవులవఱకు విరిసిన కన్నుల యందముపై
3 లోలలోచనపస = వనిత యొక్క తగులము
4 శ్యామను = యౌవన మధ్యస్థను (నడిజవ్వని దానిని)
5 క్రించుదనము = అల్పత్వము
6 ఊరములు = ఇండ్లు
7 సతికుచద్వయచర్చ = పూబోఁడి పాలిండ్లజంటపై గంధపుఁబూఁతను.
8 తర్కకర్కశపాఠతర్కంబు = న్యాయశాస్త్రము యొక్క కఠినములగు విషయములపై విచారణ.

1స్మృతిపదవాక్యసంగతి గాక తత్స్మృతి
పదవాక్యసంగతి పరఁగఁ జేయు
నాటకాలంకార నైపుణం బుడిగి త
న్నాటకాలంకార పాటిఁ దిరుగుఁ
తే. బరఁగఁ జిరకాల మీరీతిఁ బాపనియతి
రమణ దాసీకుటుంబభారము వహించి
యదికుటుంబినిగాఁగ బాపాత్ముఁ డగుచు
నశుచియునుదుష్టవర్తనుఁ డై మెలంగె. 108
క. అటు గాన పాపకర్ముని
గుటిలుని నుజనార్తు ధూర్తుఁ గ్రూరుని నే మా
రటమునఁ గొని యేఁగెద మం
తట దండమువలన నితఁడు ధన్యత నొందున్. 109
వ. ఇట్లు వలుకు చున్న యమదూతల వారించి 2నయకోవిదు లైన
భగవద్దూత లిట్లనిరి. 110
క. ఇవురా ధర్మ వివేక
ప్రవరులపస గానఁబడియెఁ బాపము పుణ్యో
ద్భవుల యదండ్యులదండన
వివరం బొనరింపఁ బడియె విధి యెఱుఁగమిచేన్. 111
చ. సములునుసాధులున్ విహితశాసనులున్ సుదయాళురున్ శుభో
త్తమగుణు లైనయట్టితలిదండ్రులు బిడ్డలకు కెగ్గు సేయుచోఁ
గ్రమమున వార లెవ్వరికిఁ గై కొని కుయ్యిడఁ జాలువారు సం
భ్రమమున మీమనంబులఁ దిరంబుగఁ జర్చ యొనర్చి చూడుఁడా
ఆ. ఎఱుక గలుగునాతఁ డేది యొనర్చిన
నదియొనర్చు నితరు లైనవార
లతఁడు సత్య మిట్టిదనిరేని లోకంబు
దత్ప్రవర్తనమునఁ దగిలి యుండు, 113

1 స్మృతిపదవాక్యసంగతి = స్మృతులయొక్కయు, వ్యాకరణముయొక్కయు, మీమాంసయొక్కయు సంబంధము. 2 నయకోవిదులు = నీతిశాస్త్రము చక్కఁ దెలిసినవారు.

ఆ. నెమ్మిఁ దొడలమీఁద ♦ నిద్రించు చెలికాని
నమ్మఁదగినవాఁడు ♦ నయము విడిచి
ద్రోహబుద్ధిఁ జంప ♦ [1]దొడరునే యెంతైనఁ
బ్రీతి లేక ధర్మ♦దూతలార. 114

ఆ. చిత్త మెల్ల నిచ్చి ♦ చెలితనంబున వచ్చి
నచ్చి కలయ మెచ్చి ♦ నమ్మువానిఁ
గరుణ గలుగువాఁడు♦కడుసౌమ్యుఁడగువాఁడు
చింత సేయ కెట్లు♦ నెఱుప నేర్చు.

వ. అదియునుం గాక. 116

ఉ. ఈతఁడు కోటిసంఖ్యలకు ♦ నెక్కుడుపుట్టువులందుఁ జెంది యీ
యాతము లైనపాపనివ♦హంబుల నన్నిటిఁ బాఱఁ దోలి ప్ర
ఖ్యాతిమతిన్ మహామరణ♦కాలమునన్ [2]హరిపుణ్యనామసం
భూతసుధామయాద్భుతవి♦భూతికరాక్షరసంగ్రహంబునన్. 117

సీ. [3]బ్రహ్మహత్యానేక♦పాపాటవుల కగ్ని
కీలలు హరినామ♦కీర్తనములు
గురుతల్పకల్మష♦క్రూరసర్పములకుఁ
గేకులు హరినామ♦కీర్తనములు
[4]తపనీయచౌర్యసం♦తమసంబునకు సూర్య
కిరణముల్ హరినామ♦కీర్తనములు
మధుపాన కిల్బిష♦మదనాగసమితికిఁ
గేసరుల్ హరినామ♦కీర్తనములు

---

1 తొడరునే = ప్రయత్నించునా. 2 హరి ... సంగ్రహంబునన్ = విష్ణువు యొక్క పవిత్రములగు నామధేయములందున్న అమృతమయగుణమును, ఆశ్చర్యకరమగు నైశ్వర్యమును చేయునట్టియు, నక్షరములను కూర్చుటచేత. 3. బ్రహ్మహత్యానేక పాపాటవులకు = బ్రాహ్మణహత్యచేసైన లెక్కింపరాని పాపము లను నడవులకు. 4. తపనీయ...సంతమసంబునకు = తపింపచేయదగిన చౌర్యమను దొంగతనపు చీకటికి.

తే. [1]మహితయోగోగ్రనిత్యస♦మాధివిధుల
నలరుబ్రహ్మాదిసురులకు ♦ నందరాని
[2]భూరినిర్వాణసామ్రాజ్య♦భోగభాగ్య
ఖేలనంబులు హరినామకీర్తనములు 118

సీ. ముక్తికాంతాకాంత♦ మోహనకృత్యముల్
గేలిసేయు హరినామ♦కీర్తనములు
సత్యలోకానంద ♦ సౌభాగ్యయుక్తముల్
గేలిసేయు హరినామ♦కీర్తనములు
మహితనిర్వాణసా♦మ్రాజ్యాభిషిక్తముల్
గేలిసేయు హరినామ♦కీర్తనములు
[3]బహుకాలజనితత♦పఃఫలసారముల్
గేలిసేయు హరినామ♦కీర్తనములు

తే. పుణ్యమూలంబు లనపాయ♦పోషకంబు
లభిమతార్థంబు లజ్ఞాన♦హరణకరము
[4]లాగమాంతోపలబ్ధంబు ♦ లమృతసేవ
లార్తశుభములు హరినామకీర్తనములు. 119

క. కామంబు పుణ్యమార్గ, స్థేమంబు మునీంద్రసాంద్ర♦చేతోసరసీ
ధామంబు విష్ణునిర్మల, నామంబుఁదలంచువాఁడు♦నాథుఁడు గాఁడే

క. డెందంబు పుత్త్రువలనం
జెందిన దని తలఁప వలదు ♦ శ్రీపతిపేరే
చందమున నైనఁ బలికిన
నందకధరుఁ డందుఁ గలఁడు ♦ [5]నాథుండగుచున్. 121

---

1. మహిత ... ... విధుల = గొప్పవగు యోగమునకు సంబంధించిన తీవ్రములును, శాశ్వతములునైన సమాధికార్యముల. 2 భూరి... ఖేలనంబులు = అత్యంతమగు మోక్షరాజ్యమును అనుభవించుటకైన యదృష్టవిలాసములు. 3 బహు ... సారముల్ = చాలకాలమునుండి ఒనర్పఁబడిన తపస్సుయొక్కసిద్ధియందలి నిగ్గులు. 4 ఆగమాంతోపలబ్ధములు = ఉపనిషత్తులయందుఁ బొందఁబడినవి. 5 నాథుడు = సర్వశక్తిమంతుఁడు.

ఆ. బిడ్డపేరు పెట్టి • పిలుచుట విశ్రామ
కేళి నైన మిగులఁ • గేలి నయినఁ
బద్యగద్యగీత • భావార్థముల నైనఁ
గమలనయనుఁ దలఁపఁ • గలుషహరము 122

ఉ. కూలినచోటఁ గొట్టుపడి • కుందినచోట మహాజ్వరాదులం
బ్రేలినచోట సర్పముఖ • పీడల నందినచోట నార్తి నై
తూలినచోట విష్ణు భగ • దూరునిఁ బేర్కొని రేని [illegible]
క్కాలునియాతనావితతిఁ • గానరు పొందరు దుఃఖభావముల్. 123

సీ. అతిపాపములకుఁ బ్ర • యత్నపూర్వకముగఁ
దనుపాపముల శమి • తంబు గాఁగ
సన్మునివరులచే • సంపాద్యమై యుండు
నిర్మలం బగు పాప • నిష్కృతములు
గ్రమరూపమున నుప • శమనంబు లగుఁ గాని
తత్పాపచయములు • దలఁప లేవు
సర్వకర్మంబుల సంహార మొనరించి
చిత్తంబునకుఁ దత్త్వ • సిద్ధి నొసఁగు

ఆ. నొనర నీశుసేవ • ²యోగిమానససరో
వాసుసేవ హేమ • వాసు సేవ
వేదవేద్యుసేవ • వేదాంతవిభుసేవ
పరమపురుష పాద • పద్మసేవ. 125

క. హరి నెఱుఁగనియాబాలుఁడు
హరిభక్తులతోడఁ గూడి • హరి యనువాఁడున్
సరియై దోషము లడఁచును
³గరువలితో నగ్ని తృణముఁ • గాల్చినభంగిన్. 125

---

1 కాలుని...వితతిక = యమునియొక్క బాధాపరంపర యందు. 2 యోగి... సేవ = యోగులయొక్క మనస్సను సరస్సునందు నివసించువాని సేవ. 3 కరువలి = గాలి.

ఉ. అరయ ¹వీర్యవంతమగు • నౌషధ మెట్లు ²యదృచ్ఛఁ గొన్నఁ బ్ర
చారుగుణంబు రోగములఁ • జయ్యనఁ బాపెడుమాడ్కిఁ బుణ్యవి
స్ఫారుని నంబుజోదరునిఁ • బామరుఁ డజ్ఞుఁ డవజ్ఞఁ బల్కినన్
వారక తత్ప్రభావము ధ్రువంబుగ నాత్మగుణంబుఁ జూపదే. 126

క. ధృతి దప్పినతఱిని బుధా
కృతమునఁ గాకెట్లు దోఁచుఁ • గేశవుఁడు మదిన్
మితి లేనిజగముఁ దాల్చిన
యతఁ డొక్కనిమనములోన • నడఁగెడువాఁడే. 127

మ. నిరతంబై నిరవద్యమై నిఖిలచి • న్మార్గమై నిత్యమై
³నిరహంకారగుణాఢ్యమై నియమమై • నిర్దోష మైనట్టిశ్రీ
హరినామస్మరణామృతం బితఁడు ప్రత్యక్షంబు సేవించెఁ దా
మరణాంతంబున నిట్టిసజ్జనునిధర్మం బేల వ్యర్థంబగున్. 128

వ. అని యిట్లు భగవద్దూతలు ⁴భాగవతధర్మంబు నిర్ణయించి బ్రాహ్మ
ణుని నతిఘోరం బయిన ⁵యామ్యపాశబంధనిర్ముక్తునిం గావించి
యమభటులవలని ⁶యదటువాపి రంత నాయమదూత లాభగవ
ద్దూతలసంభాషణప్రభావంబునఁ దమమనంబుల శాంతినొంది ⁷భగ
వత్తత్త్వజిజ్ఞాసు లయి చేయునది లేక నిరాకృతులై యమలోకంబు
నకుం జని ⁸పితృపతికి సర్వంబును నెఱింగించి రంత. 129

క. అతఁడును పాశచ్యుతుఁడై
గతభయుఁడై ప్రకృతినొంది • కడునుత్సవసం
గతిఁ జూచి మ్రొక్కి మదిలో
నతులితముద మొదవి పొదలి • హరిదాసులకున్. 130

---

1 వీర్యవంతము = బలముకలిగినది. 2 యదృచ్ఛన్ = ఇచ్చ చొప్పున.
3 నిర ... ... ఢ్యమై = అహంకారము లేనిదియు, గుణములతోఁ గూడినదియు నైన.
4 భాగవతధర్మంబు = భగవంతునియందు భక్తి గలవానియొక్క ధర్మము.
5 యామ్య...నిర్ముక్తుని = యమునిసంబంధమగు పాశముఁ గట్లనుండి విడిపింపఁబడిన వానిని. 6 అదటు = అదరు (భయమువలనకలిగిన కంపము). 7 భగవత్తత్త్వజిజ్ఞాసువులు = భగవంతునియొక్క యథార్థస్వరూపమును తెలియ గోరినవారు.
7 పితృపతి = యముఁడు.

ఆ. నిలిచి కేలు 1మొగిచి ♦ పలుక 2నుద్యోగించి
చెలఁగుచున్న లోని♦తలఁపు దెలిసి
చక్రధరునికూర్మి♦సహచరు లరిగి ర
దృశ్యు లగుచు దేవ♦దేవుకడకు. 131

క. 3వేదత్రయసంపాద్యము
మోదంబు గుణాశ్రయంబు♦మొగి 4భగవద్ధ
ర్మాదేశం బగుతద్భట
వాదంబు నజామిళుండు♦వదలక వినుచున్ 132

క. 5శ్రీమన్నారాయణపద, తామరసధ్యానసలిల♦ధౌతమహాఘ
స్తోముం డై సద్భక్తికి, ధామం బగు నంతఁ దెలిసి♦తత్క్షణమాత్రన్.

క. 6బరవసమున నరికట్టిన
దురితంబులఁ దలఁచి దలఁచి♦తుదిఁ బాపమునన్
హరి నీశు నాశ్రయించుచుఁ
బరితాపము నొంది పలికె♦బ్రాహ్మణుఁ డంతన్ 134

సీ. వృషలియం దనురాగ♦వృద్ధిఁ బెద్దలఁ గని
కులము గోదావరిఁ గూలఁ ద్రోచి
నచ్చుల కెక్కి పెన్♦7ఁబజ్జుసేఁతల సరి
వారిలోపలఁ దల♦వంపు చేసి
కట్టెఁడి ముసుక నై ♦ కర్మబాధంబుల
పుట్ట నై నిందల♦ప్రోవ నగుచుఁ
దరుణులలోఁతలఁ♦దవిలి భోగించిన
కడిఁదినాజన్మంబు♦గాలి పోయెఁ

1 మొగిచి=ముడిచి. 2 ఉద్యోగించి=ప్రయత్నించి. 3 వేదత్రయసంపాద్యము = మూడువేదములచే పొందఁదగినది. 4 భగ... ఆదేశంబు = భగవంతుని ధర్మములయొక్క యుపదేశములుకలది. 5 శ్రీమత్ ... స్తోముండై=లక్ష్మియుక్తుఁడగు నారాయణమూర్తి యడుగు తామరలను ధ్యానించుటయను నీటిచే కడిగివేయఁబడిన గొప్పపాపములయొక్క సమూహముకలవాఁడై. 6 బరవసము=ధైర్యము. 7 గజ్జసేఁతలు = వ్యర్థభాషణములు చేయుటలు.

ఆ. జదువు చట్టువడియె ♦ శాస్త్రంబు మన్నయ్యె
బుద్ధి పురువుమేసెఁ♦బుణ్యుఁడఁగ
నీతి మట్టువడియె ♦ నిర్మలజ్ఞానంబు
మొదలి కుడిగె బోధ ♦ [1]మూరిఁబోయె 135

క. చిక్కనిచక్కనిచన్నుల
మక్కువయిల్లాలి విడిచి ♦ మాయలుగలయా
[2]వెక్కసపుమద్యపానపు
డొక్కపసం దగిలి దుర్వి ♦ టుండనై చెడితిన్ 136

ఉ. అక్కట [3]ఘోరదుష్కృతమ♦హానలకీలలు నన్ను ముట్టి పే
రుక్కడఁగింప కిట్టు ధృతి ♦ నుండఁగ నిచ్చె నహాహా దురాత్మునిన్
గ్రక్కునఁ దల్లిదండ్రుల న♦కల్మషచిత్తులఁ బెద్దలన్ మఱే
దిక్కును లేనివారిఁ బలు♦[4]త్రిక్కులఁ బెట్టుచుఁ బాఱఁదోలితిన్.

క. అకృతజ్ఞుఁడనై విడిచితిఁ
బ్రకృతింగలబంధువులను ♦ బాల్యమున ననున్
వికృతిఁ గనకుండఁ బెంచిన
సుకృతుల మజ్జనకవరుల ♦ శోభనకరులన్. 13‹

వ. అప్పుడు. 139

ఆ. పెక్కుపాతకముల ♦ భృశదారుణంబైన
దొడ్డనరకమందుఁ ♦ బడ్డనన్ను
నాపదలకుఁ బాపి ♦ యరికట్టి రక్షించి
రిట్టిధర్మ పురుషు ♦ లెవ్వరొకో. 140

శా. చోద్యంబై కలవోలె నీక్షణమునం ♦ జూడంగఁ బ్రత్యక్షమై
వేద్యం బయ్యెను నన్ను నీడ్చిసమహో ♦ పీనుల్ భృశోదగ్రులా
యుద్యోగంబులవారు పాశధరు లీ♦యుత్సాహముల్ మాని సం
పాద్యానేకవికారరూపకుటిల♦ప్రఖ్యాతు లెవ్వారలో 141

---

1 మూరిఁబోయె = నశించెను. 2 వెక్కసము = అసహ్యము. 3 ఘోరదుష్కృతమహానలకీలలు = భయంకరములగుపాపములనెడి గొప్ప యగ్నిజ్వాలలు. 4 త్రిక్కులు = బాధలు.

ఉ. దారుణపాశబంధనవి♦ధానములన్ [1]నరకార్ణవంబులోఁ
గూరిననన్ను నేఁడు చెడ♦కుండ నొనర్చినపుణ్యమూర్తు లం
భోరుహనేత్రు [2]లుజ్జ్వలన భోమణితేజులు లోచనోత్సవుల్
చారుదయాసమంచితవి♦చారులు నల్వురు నెందు నేఁగిరో 142

మ. నను రక్షించినపుణ్యవంతులు [3]కన♦న్నాళీకపత్త్రాక్షు లం
జనసంకాశులు శంఖచక్రధరు లా♦జానూరుబాహుల్ స్మితా
నను [4]లాలంబితకర్ణ వేష్టనసువ♦ర్ణచ్ఛాయదివ్యాంబరుల్
ఘనకారుణ్యరసైకపూర్ణులు సమ♦గ్రస్ఫూర్తి నెం దేఁగిరో 143

వ. పాతకుండ నగునాకు న [5]విబుధోత్తమదర్శనంబు పురాకృతం బగుమదీయపుణ్యవిశేషంబునం గాని పొంద శక్యంబు గాదు తత్సందర్శనం బాత్మకు నతిసుప్రసన్నం బయి యొప్పె నట్లు గాకుండెనేనిఁ గలుషవర్తనంబున వృషలీభర్తనై యుండి మృతిఁబొందుచున్న నాదుజిహ్వకు శ్రీమన్నారాయణ నామగ్రహణంబు సంభవింప నేరదు మఱియును. 144

ఆ. పాతకుండ జడుఁడ ♦ బ్రహ్మఘాతుకుఁడను
మానలోభమోహ ♦ మత్సరుండ
నాకు నెట్లు దొరకు ♦ నారాయణునిదివ్య
నామవిమలకీర్త ♦ నంబు మదికి. 145

సీ. దారుణమోహాంధ ♦ కారపూరితుఁడను
[6]హరివిస్మయస్మర ♦ ణార్హమతినె
పంచమహాతీవ్ర♦పాతకోపేతుఁడ
హరివిస్మయస్మరణార్హమతినె

1 నరకార్ణవంబు = నరకమనుసముద్రము. 2 ఉజ్జ్వలన్భోమణితేజులు = ప్రకాశించుచున్న సూర్యునివంటి తేజస్సుకలవారు. 3 కనత్ ... అక్షులు = ప్రకాశించుచున్న తామరరేకులవంటి కన్నులు కలవాడు. 4 ఆలంబిత ... బరుల్ = వ్రేలాడుచున్న కుండలములును, బంగరురంగుకల ప్రశస్తములగువస్త్రములును కలవారు. 5 విబుధోత్తమదర్శనంబు = దేవతాశ్రేష్ఠులనుజూచుట. 6 హరి ... మతినె = నారాయణమూర్తియొక్క యాశ్చర్యకరములగు విషయములను స్మరించుటకు తగిన మనస్సు కలవాఁడనా?

కౌటిల్యకితవవి ♦ కారపారీణుండ
హరివిస్మయస్మర ♦ ణార్హమతినె
యఖిలదుఃఖైకఘో ♦ రార్ణవమగ్నుండ
హరివిస్మయస్మర ♦ ణార్హమతినె

తే. నిందలకు నెల్ల నెలవైన ♦ నిర్గుణుండ
మందభాగ్యుండ నే నేడ ♦ 1మధువిదారి
దివ్యగుణనామకీర్తన ♦ తెలుఁగ నేఁడుఁ
బూర్వసుకృతంబు లేకెట్లు ♦ పొందఁగలుగు. 146

వ. అని వితర్కించి. 147

మ. 2యతచిత్తేంద్రియమారుతుండ నగుచున్ ♦ యత్నంబొనర్తున్ హరి
వ్రతసంపత్తికిఁ బుణ్యవృత్తికిఁ జిదా ♦ వాసోన్ముఖాసక్తికిన్
యుతనిర్వాణపదానురక్తికి సుఖో ♦ ద్యోగక్రియాశక్తికిన్
ధృతిలబ్ధోత్తమమూర్తికిన్ సకలధా ♦ త్రీధుర్యసద్భక్తికిన్. 148

క. విడిచితి భవబంధంబుల
నడఁచితి మాయావిమోహ ♦ మైనతమంబు
న్నొడిచితి నరివర్గంబులఁ,
గడచితి నాజన్మదుఃఖ ♦ కర్మార్ణవమున్. 149

క. యోషిద్రూపంబున నను
3నేషణముఖగహ్వరమున ♦ నెగ్రమింగికడున్
ద్వేషమున గోఁతి సేసిన
దోషద యగునాత్మమాయఁ ♦ దొలఁగం గంటిన్. 150

వ. అని యిట్లు 4వైష్ణవజ్ఞానదీపం బాత్మస్నేహంబునం దోఁచిన నా బ్రాహ్మణుండు. 151

---

1 మధు ... తెలుఁగు = విష్ణువుయొక్క ప్రశస్తములగుగుణములను, నామమును, సంకీర్తించుచోవ్వు. 2 యత ... మారుతుండను = అరికట్టఁబడిన మనస్సు, ఇంద్రియములు, వాయువునుకలవాఁడనై. 3 ఈషణముఖగహ్వరమునన్ = దారేషణ, ధనేషణ, పుత్రేషణ అను నీషణత్రయముయొక్క నోరనెడిగుహయందు. 4 వైష్ణవ ... దీపంబు = విష్ణు సంబంధమగుజ్ఞానమనెడు దివ్వె.

మ. భగవద్ధర్మపరాయణోత్తములసం ♦ భాషైకసన్మంత్రంబులన్
మిగులన్ జ్ఞానము పుట్ట 1మోహాభినవ ♦ స్నిగ్ధాత్మబంధంబులం
దెగ ఖండించి సబంధుమిత్రసుతతాప ♦ స్త్రీ మోహావిభ్రాంతుఁడై
జగతీనాథు రమేశు స్వేష్టనివహై ♦ శ్వర్యంబులం గోరుచున్. 152

క. హరిభక్తులతో మాటలు
ధర నెన్నఁగఁ జేయనిపుణ్య ♦ ధనములమూటల్
వరముక్తికాంత తేటలు,
2అరిషడ్వర్గంబు వారని ♦ యురవగుకోటల్ 153

సీ. అనుచు నా బ్రాహ్మణుం ♦ డతితత్త్వవేదియై
భవబంధములనెల్లఁ ♦ బాయఁద్రోలి
మొనసి గంగాద్వార ♦ మున కేఁగి యచ్చటఁ
*బ్రబ్బిన దేవతా ♦ భవనమునను
నాసీనుఁడై యోగ ♦ మాశ్రయించి పొంగు
దేహేంద్రియాదుల ♦ [illegible]
దనుఁ బాపుకొని పర ♦ తత్త్వంబుతోఁ గూర్చి
మానుగా నాత్మస ♦ మాధిచేసి

ఆ. గుణగణంబుఁ బాసి ♦ కామరూపిభగవ
దనుభవాత్మ యందు ♦ నాత్మఁ గలిపి
రమణఁ దన్ను మొదల ♦ రక్షించినట్టియా
పురుషవరులఁ గాంచి ♦ పొసఁగ మ్రొక్కె. 154

వ. అట్లజామిళుండు యోగమార్గంబున దేహంబు విడిచి పుణ్య శరీరుండై యగ్రభాగంబున బ్రాగుపలబ్ధులైన 3మహాపురుషకింకరులం గాంచి సముంచితరోమాంచితాంచలచ్ఛటాపింజరిత స్వేదబిందు సందోహామిషనిష్యంద మహానందవల్లీకామతల్లికాంకురసంకుల పరిశోభిత తనుండును హర్ష నికర్ష మాణమాన సోద్యోగయోగ

1 మోహ ... బంధంబులన్ = అజ్ఞానముచేఁ గలిగి, తగులొత్తుకొన్న తన కట్లను. 2 అరిషడ్వర్గంబు = కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములనెడి శత్రువుల సమూహమును. 3 మహాపురుషకింకరుల్ = పురుషోత్తముని యొక్క సేవకులను. * పంబిన దేవాలయంబునందు:—అని పాఠాంతరము.

ప్రభావోత్సాహవిస్మయమందస్మిత కందళితముఖారవిందుండును [1]నిఖిల జగజ్జేగీయ మానాఖండశుభప్రదశుభాకార సందర్శన సమాసాదిత కుతూహల మానసుండును నై ప్రణామంబు లాచరించుచు భాగీరథీతీరంబునఁ గళేబరంబు విడిచి తత్క్షణంబ హరిపార్శ్వవర్తులైన దాసవరులస్వరూపంబుఁ దాల్చి యావిష్ణుసేవకులతోడం గూడి [2]దివ్యమణిగణఖచితంబై సువర్ణమయం బైన యసమానవిమానం బెక్కి [3]నిఖిలానందభోగభాగ్యానుభవాకుంఠితం బైనవైకుంఠ నగరంబునకు శ్రీమన్నారాయణ పదారవింద సేవాచరణపరిణామస్థితికిం జనియె నిట్లు విప్లావితసర్వధర్ముం డైనదాసీపతి గర్హితకర్మంబులచేతఁ బతితుండును హతవ్రతుండును నై నరకంబునం గూలుచుండి భగవన్నామగ్రహణంబున సద్యోముక్తుం డయ్యెఁ గావున. 155

క. కర్మంబు లెల్లఁ బాయును, వర్మము
దెలియంగ లేదు ♦ మధురిపు పే రే
పేర్మిని నొడువుటకంటెను
దుర్మదమునఁ జిత్త మెన్ని ♦ త్రోవలఁ జన్నన్. 156

ఉ. పాండవవంశపావన నృ ♦ పాలక యీయితిహాస మెవ్వఁడే
నొండొకభక్తి లేక విను ♦ నోర్పు మెయిం బఠియించు నాతఁడు
ద్దండత ముక్తికామినికిఁ ♦ [4]దానక మై దనుజారిలోకమం
దుండు మహావిభూతి యమ ♦ దూతలచూడ్కి కగోచరాకృతిన్.

తే. అరయఁ [5]బుత్రోపచారిత ♦ మైనవిష్ణు
నామ మవసానకాలంబు ♦ నను భజించి

---

1 నిఖిల ... మానసుండును=సమస్తలోకముల చేతను మిగుల కీర్తింపఁబడుచున్నట్టియు, అసామాన్యములగు శుభములను కలుగఁ జేయుచున్నట్టియు పవిత్రమగు నాకారమును చూచుటయందు కలిగినకుతూహలముతో కూడిన మనస్సు కలవాఁడై 2 దివ్య ... ఖచితంబైన = ప్రశస్తములగు రతనాలసమూహముచే కూర్పంబడిన. 3నిఖిల ... అకుంఠితంబైన = సమస్తమగు నానందములకు సంబంధించిన సౌఖ్యధనమును (సౌఖ్యాతిశయమున నుట) అనుభవించుటయందు మొక్కపోవనిదియగు. 4 తానకము = స్థానము 5 పుత్రోపచారితమైన = పుత్రునియందుపచరింపఁ జేయఁబడిన

శార్ఙ్గనిలయంబుఁ జేరె న ♦ జామిళుండు
నిట్లు సద్భక్తిఁ దలఁచిన ♦ నేమిసెప్ప. 158

క. శౌరినవారల కెల్లను
జేగువ కైవల్యపదము ♦ శ్రీవరుని మదిం
గోరనివారల కెల్లను
దూరము మోక్షాప్తి యెన్ని ♦ త్రోవల నైనన్. 159

వ. అనినం బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె మునీంద్రా యాజ్ఞాభ్రష్టుండై
యమధర్మరాజు శ్రీవిష్ణునిర్దేశకులచే విహతులైన భటులచేత
వర్ణింపంబడిన నారాయణుని నామప్రభావం బాకర్ణించి వారల
కేమనియె మఱియు నెన్నఁడేని యమదండంబు విఫలంబై పోయిన
తెఱంగు గల దేని వినవలయు నీసందేహంబుఁ బాపుమహాత్మ
నీవు దక్కఁ దక్కినవారలు సమర్థులుగారని తలంచుచున్నవాఁడ
చిత్తంబును బ్రసాదాయత్తంబుగా 1భవదీయవచన సుధాధారలం
బ్రసాదింప వలయుననిన శుకుండిట్లనియె. 160

క. శ్రీకృష్ణభటులచేత ని
రాకృతులై యామ్యభటులు ♦ యమునకు2నాత్మ
స్వీకృతవిప్రకథాక్రమ
మీక్రియ మున్ దెలిపి రదియు ♦ నెఱిఁగింతుఁ దగన్. 161

తే. చేరి త్రైవిధ్యమున మించు ♦ జీవతతికిఁ
గర్మఫలములఁ దెలిపెడు ♦ కారణంబు
లగుచు శిక్షించువారలీ ♦ యవనిమీఁద
దేవ యొందఱు గలరయ్య ♦ తెలియవలయు. 162

క. దక్షిణదిశాధినాయక
శిక్ష దగం జేయువారు ♦ క్షితిఁ బెక్కండ్రే
సాక్షియును నక్షయమును
సాక్షాత్తుగ నెందు రెండు ♦ సంపన్న మగున్. 163

1 భవదీయ ... ... ధారలచే = నీసంబంధమైన మాటలనెడి యమృతధారలచే
2 ఆత్మ ... క్రమము=తమచే స్వీకరింపఁబడిన బ్రాహ్మణునియొక్క. కథావిధానమును

తే. దట్టమైనట్టికర్మబం • ధములనెల్ల
నాజ్ఞనెట్టెడువారు పె • క్కైట నచ్చోట
నకట [1]శాస్తృత్వ[2]ముపచార • మయ్యెఁగాదె
శూరులైనట్టి మండలే • శులకుఁబోలె. 164

ఉ. కావున నీవ యొక్కఁడవ • కర్తవు మూఁడుజగంబులందు సం
భావితభూతకోటిఁ [3]బరి • పాకవశంబున శిక్ష సేయఁగా
నీవరశాసనం బఖిల • నిర్ణయమై తనరారుచుండ నే
డీవలఁ [4]గ్రమ్మఱింప మఱి • యెవ్వఁడు శక్తుఁడు ధర్మపాలనా. 165

క. [5]చండకరతనయ యొరులకు, దండధరత్వంబుగలదె•తగ జగమున ను
ద్దండధరవృత్తి నొత్తిలి, దండింతువు నిన్ను దండధరుఁడనిపొగడన్

సీ. ఇట్టినీదండంబ • యీమూఁడుజగములఁ
దెగువ మై నేఁడు వ•ర్తిల్లు చుండ
మనుజలోకంబున • మహితాద్భుతాకార
సిద్ధుల మిగులఁ బ్రసిద్ధులైన
వారు నల్వురు వేగ • వచ్చి [6]నిర్దేశంబు
భంగించి మమ్మంత • చెంగఁ దోలి
నీశాసనంబున • నేమీఁడ్చికొనివచ్చు
క్రూరచిత్తునిఁ బుచ్చి • కొని [7]యదల్చి
తే. పాశబంధంబు లీసునఁ • బట్టి త్రెంచి
బలిమి మిగులంగ మమ్మును • బాఱఁ దోలి
యిచ్చఁ జనినారు వారు దా•మెచటివార
లాదరమ్మున మాకు నేఁ • డానతిమ్ము 167

వ. అని రని మఱియు శుకుండిట్లనియె నట్లుదూతలు పరితాపసమేతు
లై పలికిన దండధరుండు పుండరీకాక్షుని చరణకమలంబులు దన

1 శాస్తృత్వము = పరిపాలకత్వము 2 ఉపచారము = వ్యవహారము (అయ
థారమనుట) 3 పరిపాకవశంబున = కర్మపరిపక్వతననుసరించి 4 క్రమ్మరింపన్ =
త్రిప్పివేయుటకున్ 5 చండకరతనయ = సూర్యునికుమారుఁడా! 6 నిర్దేశంబు =
ఆజ్ఞ 7 అదల్చి = భయపెట్టి.

మానసంబున సన్నిహితంబులుగఁ జేసికొని వందనం బాచరించి
పరమభక్తిపరులై వారల కిట్లనియె 168

సీ. కలఁడు మదన్వయుండు ♦ ఘనుఁ డొక్కఁ డతఁ డెందు
వెలికిఁ గానఁగ రాక ♦ విశ్వమెల్ల
నతిలీలమై [1]మహా♦ద్భుతసమగ్రస్ఫూర్తి
నుండును [2]కోక నూ♦లున్నభంగి
[3]దామెనఁ బశువులు ♦ దగిలి యుండెడుమాడ్కి
నామసంకీర్తన స్థేమగతుల
విహరించు నెవ్వఁడు ♦ విలసితమత్వాజ
లెవ్వనిపదముల ♦ నివ్వటిల్లుఁ

ఆ. గనుట మనుట చనుట ♦ గల్గు నెవ్వనిలీల
లందు లోక మెవని♦యందుఁ బొందు
నెన్నఁబడుచుఁ బుడమి నెవ్వనినామముల్
గర్మబంధనముల ♦ పేర్మి నడఁచు 169

తరలము. వినుఁడు నేను మహేంద్రుఁ [4]డప్పతి ♦ వీతిహోత్రుఁడు రాక్షసుం
డనిలుఁ డర్కుఁడు చంద్రుఁడుం గమ♦లాసనుండు మరుద్గణం
బును మహేశుఁడు రుద్రవర్గము ♦ భూరిసంయమిసిద్ధులున్
మొనసి కన్గొనఁజాల రెవ్వని♦మూర్తి విశ్రుతకీర్తిమై 170

క. సత్త్వేతరగుణపాశవ, శత్త్వంబునఁ బొంద వీరు ♦ జలజాక్షునసై
కత్త్వంబు గాన నోపరు, సత్త్వప్రాధాన్యులితర ♦ జనములతరమే.

చ. అభవు నమేయు నవ్యయు న♦నంతు ననారతుఁ బూని మేనిలో
నుభయమునై వెలుంగుపురు♦షోత్తముఁ గానరు చిత్తకర్మవా
గ్విభవగరిష్ఠులై వెదకి ♦ [5]వీఁజీడి ప్రాణులు సర్వవస్తువుల్
శుభగతిఁ జూడ నేర్చి తనుఁ ♦ జూడఁగ నేరనికంటిపోలికన్. 172

---

1 మహా ... స్ఫూర్తి = గొప్పఅచ్చెరువునుగొల్పు సంపూర్ణప్రకాశముతో
2 కోకనూలున్నభంగి = వస్త్రమునందు సూత్రములున్న పగిదిని (నూలుపోగులకూర్పే కదా వస్త్రమగుట) 3 దామెన = పెక్కుపలుపులుగల నిడుపుత్రాడు 4 అప్పతి = వరుణుఁడు 5 వీఁజీడిప్రాణులు = వెఱ్ఱిజీవులు

చ. పరముని భక్తలోకపరి♦పాలనశీలుని దుష్టలోకసం
హారుని 1పతంగపుంగవవి♦హారునిఁగూరిమిదూత లామనో
హరులు సురేంద్రవందితులు ♦ నా2హరిరూపగుణస్వభావు లై
తిరుగుచు నుందు రెల్లెడలఁ ♦ దిక్కులఁ దేజము పిక్కటిల్లఁగన్.

ఉ. లెక్కకు నెక్కువై 3కసటు ♦ లేని మహాద్భుత తేజ మెల్లెడం
బిక్కటిలం జరింతు రతి♦భీమబలాఢ్యులు విష్ణుదూత లా
చక్రినిధర్మశాంతు లతి♦సాహసవంతులు దేవపూజితుల్
గ్రిక్కిఱియంగ జగంబునను ♦ గేశవసేవకరక్షణార్థమై 174

క. నావలనను మీవలనను దేవాసురగణమువలనఁ ♦ ద్రిజగంబులలో
నేవగలఁబొందకుండఁగఁ, గావంగలవారు పుడమిఁ♦గలవైష్ణవులన్

క. 4భగవత్ప్రణిహితధర్మం, బగపడ దెవ్వారిమతికి ♦ ననిమిషగరుడో
రగసిద్ధసాధ్యనరసుర, ఖగ తాపసయక్షదివిజ♦ఖచరుల కైనన్.

క. ఎన్నఁడుఁ దెలియఁగనేరరు, పన్నగపతిశాయితత్త్వ♦భావము5మేనం
గన్నులవేల్పును6డాపలఁ, జన్నమరినవేల్పు7ముదుక♦చదువులవేల్పున్

సీ. వరమహాద్భుత మైన♦వైష్ణవజ్ఞానంబుఁ
దిరముగా నెవ్వరు ♦ దెలియఁ గలరు
దేవాదిదేవుండు ♦ త్రిపురసంహారుఁ డొండెఁ
గమలసంభవుఁడొండెఁ ♦ గార్తికేయ
కపిలనారదులొండె♦గంగాత్మజుండొండె
మనువొండెబలియొండె♦జనకుఁడొండెఁ
బ్రహ్లాదుఁడొండె నే♦ర్పాటుగా శుకుఁడొండె
భాసురతరమతి ♦ వ్యాసుఁడొండెఁ

తే. గాక యన్యులతరమె యీ♦లోకమందు
నీనుబోధంబు సద్బోధ ♦ మీపదార్థ

---

1 పతంగ ... విహారుని = పక్షిశ్రేష్ఠమగు గరుత్మంతునిపై విహరించువానిని 2హరి ... స్వభావులై = విష్ణువుయొక్క యాకారము, గుణములు, శీలమునుకల వారై (సారూప్యముక్తియన్న నట్టిదేకదా) 3 కసటు=మాలిన్యము 4 భగవత్ ... ధర్మంబు = భగవంతుఁడు నిర్దేశించిన ధర్మము 5 మేనంగన్నులవేల్పు = ఇంద్రుఁడు 6 డాపలజన్నమరినవేల్పు = ఈశ్వరుఁడు 7ముదుకచెవులవేల్పు = బ్రహ్మ

మీ సదానంద చిన్మయ ♦ మీ యగమ్య,
మీ విశుద్ధంబు గుహ్యంబు ♦ నీశుభంబు 178

క. ఈ పన్నిద్దఱు దక్కఁగ
నోపరు తక్కొరులు దెలియ ♦ [1]నుపనిషదుచిత
శ్రీపతినామమహాద్భుత
దీపితభాగవతధర్మ ♦ దివ్యక్రమమున్ 179

తే. ఏదిజపియింప నమృతమై ♦ యెసఁగుఁ జుండు
నేది సద్ధర్మపథమని ♦ యెఱుఁగఁదగిన
దదియె సద్భక్తియోగంబు ♦ నావహించు
మూరి మంత్రంబు దాహరి ♦ కీర్తనంబు 180

తే. కంటిరే మీరు సుతులార ♦ కమలనేత్రు
భవ్యగుణనామకీర్తన♦ఫలము నేఁడు
దవిలి మృత్యువు పాశబం♦ధములవలన
[2]జాణతనమున నూడె న♦జామిళుండు. 181

ఉ. ఏటికి [3]జాలిఁ బొంద నరు♦లే క్రియఁ గృష్ణునికీర్తనంబు పా
పాటవులన్ దహింపఁ గల♦దాటకు నందియు మేలె యిప్పు డీ
[4]తూఁటరి దోసకారి పెను♦దోసి యజామిళుఁ డంత మోందుచుం
బాటిగ విష్ణునామనుతుఁ♦బల్కుచుఁ గేవలముక్తిఁ గేఁగఁడే 183

క. ఇంతయును దథ్యమని మది
నింతయుఁ దెలియంగ లేరు ♦ హీనాత్ములు [5]దు
ర్దాంతతరఘటితమాయా
క్రాంతాత్యంతప్రకాశ♦గారవజడులై. 183

---

1 ఉపనిషత్ ... క్రమమున్ = ఉపనిషత్తులకు సముచితమైన నారాయణుని నామముయొక్క గొప్పయాశ్చర్యములచే వెలుఁగొందఁజేయఁబడిన భగవద్భక్తులయొక్క ధర్మమునకు సంబంధించిన ప్రశస్తమగు విధానమును. 2 జాణతనము = నైపుణ్యము 3 జాలిఁ = మనఃఖేదము 4 తూఁటరి = దుష్టుఁడు 5 దుర్దాంత... జడులై = మిగులఁ అణపరాని, కూర్పఁబడిన మాయచే నాక్రమింపఁబడిన గొప్పదైన (జ్ఞాన) ప్రకాశము యొక్క యతిశయముగలవారగుట. —జడత్వమునొందినవారై 6 ఏకతమచిత్తములన్ = మిగుల ప్రధానములైన మనస్సులన్ (తదేకలగ్నములగు మానసములందనుట

మంగళమహాశ్రీవృత్తము.

ఈవిధమునన్ విబుధు♦లే[1]కతమచిత్తముల♦నే[2]కతము లేక హరి సేవన్
భావమున నిల్పితగు♦భాగవతయోగపరి♦పాకమున నొందుదురు వారిం
దే వలదు దండనగ♦తిం జనదు మాకు గుఱి♦తింప నఘముల్ దలఁగఁగా
మీఁదన్, శ్రీవరునిచక్రము వి♦శేషగతిఁ గాచు సుర♦సేవితులు ముక్తిఁ
గడుఁబెద్దల్ 184

ఉ. ఎవ్వరు సిద్ధసాధ్యఖచ♦గేశలసత్పరిగీతగాథలం
దెవ్వరు [3]ముక్తిభోగతల♦హేమమనోహరచంద్రశాలలం
దెవ్వరు [4]శంఖచక్రగురు♦హేతిగదారుచిరోగ్రపాణులా
మవ్వపురూపవంతు లస♦మానులు వో ధరలోనివైష్ణవుల్. 185

సీ. [5]శ్రుత్యంతవిశ్రాంత♦మత్యనుక్రమణీయ
భగవత్ప్రసంగతుల్ ♦ భాగవతులు
సకలసన్ముఖయోగి ♦ జనసదానందైక
పరమభాగ్యోదయుల్ ♦ భాగవతులు
[6]కృష్ణపదధ్యాన ♦ కేవలామృతపాన
పరిణామయుతులు శ్రీ ♦ భాగవతులు
బహుపాతకానీక ♦ పరిభవప్రక్రియా
పరుషోగ్రమూర్తులు ♦ భాగవతులు

తే. భావతత్త్వార్థవేదులు భాగవతులు
బ్రహ్మవాదానువాదులు ♦ భాగవతులు
సిరులు దనరంగ నెన్నఁడుఁ ♦ జేటులేని
పదవి నొప్పారువారు వో♦భాగవతులు 186

1 ఏకతమచిత్తములన్ = మిగుల ప్రధానములైన మనస్సులన్ (తదేక లగ్నము లగు మానసములందనుట) 2 ఏకతము = ఏకారణమును 3 ముక్తి...శాలలన్ = ముక్తియొక్క యనుభవ ప్రదేశమునందలి బంగారుతో చేసిన యందమైన యుప్పరిగల యందు. 4 శంఖ ... పాణులు = శంఖము, చక్రము, గొప్పదగు ఖడ్గము, గద— వీనిచే నొప్పారు భయంకరములగు హస్తములు కలవారు. 5 శ్రుత్యంత...సంగతుల్ = ఉపనిషత్తులయందు విశ్రమించిన బుద్ధిచే పొందఁదగిన భగవంతునియొక్క ప్రసక్తికలవారు. 6 కృష్ణ ... యుతులు = కృష్ణునిపాదములను ధ్యానించుట యనెడి నిర్మలమగు నమృతపానముయొక్క పరిపాకముతో కూడినవారు.

క. అది గాన విష్ణుభక్తులఁ
గదియఁగఁ జన వలదు మీరు ♦ [1]కరివరదుల స
త్పాదపద్మవినతివిముఖులఁ
దుది నంటఁగఁ గట్టి తెండు ♦ ధూర్తులు వారల్ 187

సీ. [2]ఏకసక్క్యమున నైన ♦ నిందిరారమణునిఁ
బలుకంగ లేనిదు ♦ ర్భాషితులను
గలలోన నైన శ్రీ ♦ కాంతునిసత్పాద
కమలముల్ సూడని ♦ [3]కర్మరతుల
నవ్వుచు నైనఁ గృష్ణప్రశంసకుఁ జెవిఁ
దార్ప నేరనిదుష్ట ♦ తాప్రవణుల
యాత్రోత్సవంబుల ♦ నైన నీశునిగుడి
త్రోవఁ ద్రొక్కఁగ లేని ♦ దుష్పదులను

ఆ. బరమభాగవతుల ♦ పాదదూళిసమస్త
తీర్థసార మనుచుఁ ♦ దెలియలేని
వారి వారివారి ♦ వారిఁ జేరినవారిఁ
దోలుతఁ గట్టి తెండు ♦ దూతలార. 188

ఆ. ఎల్లపాపములకు ♦ నిల్లైనయింటిలో
[4]బద్ధతృష్ణు లగుచు ♦ బుద్ధి దలఁగి
పరమహంసకులము ♦ గుఱిఁ దప్పి వర్తించు
ధూర్తజనులఁ దెండు ♦ దూతలార. 189

ఆ. అరయఁ దనదుజిహ్వ ♦ హరిపేరు నుడువదు
చిత్త మతనిపాద ♦ చింతఁ జనదు

---

1 కరి ... ముఖుల = విష్ణువుయొక్క యందమగు నడుగుతామరలకు మ్రొక్కుటయందు పెడమోమైన వారిని   2 ఏకసక్క్యము = పరిహాసము
3 కర్మదృశులు = కర్మమునందుమాత్రము చూపుకలవారు.   4 బద్ధతృష్ణులు = ఏర్పడిన యాశకలవారు.

తలఁపఁ దమకు ముక్తి ♦ [1]తంగేటిజున్నుఁగో
సకలవిష్ణుభక్తు ♦ లనుచుఁ బోరె. 190

తే. పద్మనయనుమీఁది ♦ [2]భక్తియోగం బెల్ల
ముక్తియోగమనుచు ♦ మొదల దెలియు
వారి వారివారి ♦ వారిఁ జేరినవారి
ద్రోవఁ బోవ వలదు ♦ దూతలారా 191

వ. అని పలికె నని చెప్పి మఱియు శుకుం డిట్లనియె శ్రీకృష్ణనామకీర్తనంబు జగన్మంగళంబనియును జగన్మోహనంబనియును జగజ్జేగీయమానం బనియును [3]నిఖిల పాపైకనిష్కృతి యనియును నిఖిలదుఃఖ నివారణం బనియును నిఖిలదారిద్ర్య నిర్మూలనంబనియును నిఖిలమాయాగుణవిచ్ఛేదకం బనియును నుద్దామంబులగు హరివీర్యంబుల నాకర్ణించువారలచిత్తంబు లతినిర్మలంబు లగుభంగిం దక్కిన వ్రతాచరణంబులం గావనియును శ్రీకృష్ణపదపద్మంబులు హృత్పద్మంబుల నిలుపువారలన్యపాపకర్మంబులగు [4]నవిద్యావ్యసనంబులం బొరయ నేర రనియును నిజస్వామి యైనయమధర్మరాజుచేతం గీర్తింపంబడినభగవన్మాహాత్మ్యంబు నాకర్ణించి విస్మితులై కాలకింకరులు నాఁటనుండియు వైష్ణవజనంబులం దేఱి చూడ వెఱతురు నరేంద్రా పరమగుహ్యం బగునీయితిహాసంబును బూర్వకాలంబున సకలవిజ్ఞానగోచరుండైన కుంభసంభవుండు సకలదుఃఖవిలయంబును సకలపుణ్యనిలయంబును నైన మలయంబునం బురాణపురుషుం డైన పురుషోత్తము నారాధనంబు సేయుచుండి నాకెఱింగించె నని చెప్పిన విని విస్మయానందహృదయుండై పరీక్షిజ్జనపాలుం డిట్లనియె. 192

---

1 తంగేటిజున్ను = తంగేటి చెట్టునందలి తేనె (తెచ్చుకొనుటకు మిగుల సులువైనదనుట). 2 భక్తియోగమే ముక్తిచేరికయని. 3 నిఖిల ... నిష్కృతి=సమస్త పాపములకు ప్రధానమైన ప్రతిక్రియ. 4 విద్యావ్యసనంబులన్ అజ్ఞానమునందును, ఇంద్రియకాంక్షలయందును.

క. స్వాయంభువమను వేళల
నోయయ్య 1సురాసురాండ ♦ జోరగనరవ
ర్గాయతసర్గము దెలిపితి
పాయక యది విస్తరించి ♦ పలుకం గదవే. 193

క. ఉత్తరకోడు కిట్లడిగిన
నుత్తరమును సమ్మనీందుస్రుం ♦ డుత్తమచేతో
వృత్తి ముద మంది పలికెను
దత్తఱపా టుడిగి వినుఁడు ♦ తాపసవర్యా! 194

సీ. పూని ప్రచేతసు ♦ పుత్రులు పదుగురు
ప్రాచీనబర్హిష ♦ ప్రాఖ్య గలుగు
వారు మహాంభోధి♦వలన వెల్వడి వచ్చి
తగ వృక్షవృతమైన♦ధరణిఁ జూచి
మేదినీజములపై ♦ మిక్కిలి కోపించి
మదిలోన 2దీపిత♦మన్యులగుచు
వక్త్రింబులను మహా♦వాయుసంయుతమైన
యనలంబుఁ గల్పించి♦యవనిజములఁ

తే. బెల్లు వడఁ గాల్పఁ దొడఁగినఁ ♦ దల్లడిల్లి
వారికోపంబు వారించు♦వాఁడ పోలెఁ
బలికెఁ జంద్రుండ యోమహా♦భాగులార
దీనమగువృక్షములమీఁదఁ♦3దెగుటదగునె. 195

తే. మొదల పరిష్ఠు లగుమిమ్ము ♦ నదయుహృదయు
లగుప్రజాపతు లనుచు స♦ర్వాత్ముఁ డనియె
నట్టిమీరు ప్రజాసృష్టి ♦ కైనవార
లీవనస్పతితతుల ద♦హింపఁ దగునె. 196

సీ. ఆదికాలంబున ♦ నాప్రజాపతి పతి
యైనలోకేశ్వరుం ♦ డచ్యుతుండు

---

1 సురా ... సర్గము = దేవతలు, రాక్షసులు, పక్షులు, పాములు, మనుష్యులు—వీరిసమూహములయొక్క దీర్ఘ సృష్టిని. 2 దీపితమన్యులు = పెంపెక్కిన కోపముకలవారు. 3 తెగుట = సాహసించుట

పద్మనేత్రుఁడు 1వన♦స్పతుల నోషధిముఖ్య
జాతంబు నిషము 2నూ♦ర్జంబుఁ గోరి
కల్పించె నందు ము♦ఖ్యంబై నయన్నంబు
నచరంబు లైనట్టి ♦ యాపదములఁ
బాదచారులకును ♦ బాల్వెట్టి యిరుగాళ్లు
చేతులు గలిగిన♦జీవతతికి

తే. పాణు లొగిలేనియాచతు♦ష్పాత్తులెల్ల
నన్నముగఁ బూని గావించె♦నదియుఁగాక
నామహాభాగుఁ డచ్యుతుఁ ♦ డాదరమున
మీకునఘాఖ్యవిఖ్యాతి♦జోకపఱిచె. 197

క. నిజముగ దేశాధీశ్వరుఁ, డజుఁడు ప్రజాసర్గమునకు♦ననఘులమిమ్మున్
సృజియించె నిట్టివారికిఁ, 3గుజదహనము సేయ నెట్లు♦గోరిక వొడమెన్

చ. 4సతతమహత్త్వసత్త్వగుణ♦సత్పురుషస్రుతిఁ బొందరయ్య మీ
పితరులునుం బితామహులుఁ ♦ బెద్దలు నెన్నఁడుఁ బొందనట్టి దు
ష్కృతమత మైనకోపమునఁ ♦ గిల్బిషభావము మానరయ్య సం
భృతకరుణావలోకమున ♦ భీతతరుప్రకరంబుఁ జూచుచున్. 199

ఉ. తప్పక యర్భకావళికిఁ ♦ దల్లియుఁ దండ్రియు నేత్రపంక్తికిన్
ఱెప్పలు నాతికిం బతియు ♦ ఱేఁడు ప్రజావలి కెల్ల నర్థికిం
బొప్ప గృహస్థు మూఢులకు ♦ నుత్తము లెన్న సమస్తబాంధవుల్
ముప్పునఁ గావ లేనికడు♦మూర్ఖులు గారు నిజాలచుట్టముల్. 200

సీ. అఖిలభూతముల దేహాంతస్థమగు నాత్మ
యీశుఁ డచ్యుతుఁడని♦ యెఱుఁగవలయు
నెఱిఁగి సర్వం బైన♦యిందిరారమణు 5లోఁ
జూపులఁ 6దనివిగాఁ ♦ జూడ వలయుఁ

1 వనస్పతులు = పూవక కాచెడుచెట్లు 2 ఊర్జంబు = బలము) 3 కుజదహనము = చెట్లనుగాల్చుట 4 సతత ... స్మృతి = అత్యంతమగు మహత్త్వముగల సత్త్వగుణముచే నొప్పు సత్పురుషుల స్మరణమును 5 లోఁజూపులన్ = జ్ఞానచక్షుస్సులతో. 6 తనివి = తృప్తి.

జూచినచిద్రూప♦శుద్ధాత్ము లగుమిమ్ము
నెలసిన వేడ్కతో నిచ్చ మెచ్చి
మెచ్చినసర్వాత్ము మీ రెఱింగినచోటఁ
గోపగుణంబులఁ ♦ బాప వలయుఁ

ఆ. బాపి 1దగ్ధశేష♦పాదపజాలంబు
దియ్య మెసఁగ బ్రదుక ♦ నియ్యవలయు
ననఘులార మీర ♦ లస్మదీయప్రార్థ
నంబు పరఁగఁ జేకొ♦నంగ వలయు. 201

క. ఇదె వృక్షసముద్భవ యగు
మదిరేక్షణ 2నాప్సరసిఁ గుమారిక నిస్తుల్
వదలక పత్నిఁగఁ జేకొని
ముద మందుఁడు పాదపముల♦మోసము వాయున్. 202

వ. అని యిట్లామంత్రణంబు సేసి మారిష యను కన్యకను వారలకిచ్చి
చంద్రుండు సనియె నప్పుడు. 203

క. వారలు పర్యాయంబున, నీరేజముఖిన్ వరించి♦నెఱి రమియింపన్
ధీరుఁడు ప్రాచేతసుఁడై, వారిక దక్షుండు పుట్టె ♦ ననజజసముఁడై.

క. ఎవ్వనిసంతానంబులు, నివ్వటిలెన్ వసుధ నెల్ల ♦ నెఱి నా దక్షుం
డెవ్వాలన జగములన్నిటఁ, బ్రవ్వ జలము నిలిపినట్టు♦ప్రపఁ బుట్టించెన్

ఉ. వారసివేడ్కతో 3దుహితృ♦వత్సలదక్షుఁడు దక్షుఁ డాత్మ జేఁ
గోరి సృజించెఁ గొన్నిటి 4న♦కుంఠితవీర్యముచేతఁ గొన్నిటిన్
బోరన ఖేచరంబులను ♦ భూచరముఖ్యవనేచరంబులన్
నీరచరవ్రజంబు రజ♦నీచరజాలదివాచరంబులన్. 206

క. నరసురగరుడోరగకి, న్నరదానవయక్షపక్షి♦నగవృక్షములన్
దరమిడి సృష్టి యొనర్చెను, దిరముగ దక్షప్రజాప♦తి వితతకీర్తిన్.

---

1 దగ్ధశేషపాదపజాలంబు = కాలఁగామిగిలిన వృక్షసమూహమును
2 ఆప్సరసి = అప్సరస్సంభవ (అచ్చరనుండి పుట్టువొందినది.) 3 దుహితృవత్సల దక్షుఁడు = కూఁతులయందు ప్రేమఁడిగలవాఁడు, సమర్థుఁడును. 4 అకుంఠిత వీర్యము = మొక్కవోని శక్తి.

క. బహువిధముల బహుముఖముల
బహురూపములైన ప్రజల ♦ బహులోకములన్
బహుళముగఁ జేసి మదిలో
బహుమానము నొందఁ దయ్యెఁ ♦ బ్రఖ్యాతముగన్. 208

తే. ఆ[1] ప్రజాసర్గబృంహితం ♦ బయినజగము
దక్షుఁ డీక్షించి మదిలోనఁ ♦ దాప మొంది
మఱియు జననంబు నొందించు ♦ మతము రోసి
పరమపురుషుని నాశ్రయిం ♦ పంగఁ దలఁచె. 209

వ. ఇట్లు దక్షప్రజాపతి ప్రజాసర్గంబు సాలక చింతించి మానసంబున లక్ష్మీకాంతుని సంతుష్టస్వాంతుం జేయువాఁడై. 210

క. మోదంబై [2]పరిదూషిత, ఖేదంబై [3]శాబరీద్ధ ♦ కిలికించితదృ
గ్భేదంబై బహుసౌఖ్యా, పాదంబై యొప్పు వింధ్య ♦ పాదంబునకున్

వ. ఇట్లు వింధ్యపాదంబున కరిగి యందఘమర్షణం బను తీర్థంబు సర్వదురితహారంబయి యొప్పుదాని [4]ననుసవనంబు సేవించి యతిఘోరంబైనతపంబు సేయుచు హరిం బ్రసన్నుం జేసి హంసగుహ్యం బనుస్తవరాజంబున నిట్లని స్తుతియించె. 212

—♦ దక్షుఁడు స్తుతియించిన హంసగుహ్యంబను స్తవరాజము ♦—

తే. పరమునికి వందన మొనర్తుఁ ♦ బరిఢవించి
ము[5]న్నవితథానుభూతికి మ్రొక్కికొందు
మెఱయ గుణములఁ దేలుసి ♦ మిత్త్రమాత్ర
బంధు వైనట్టివానికిఁ ♦ బ్రణతు లిడుదు. 213

ఆ. తవిలి గుణులచేతఁ ♦ దత్త్వబుద్ధులచేత
నిగిడి కాన రాని ♦ నెలవువాని

---

1 ప్రజా ... హితంబు = ప్రజలయొక్క సృష్టిచే నఖివ్యాప్తమయిన
2 పరిదూషిత ఖేదంబై=పోగొట్టఁబడిన దుఃఖములుకలదై 3 శాబరీ ... భేదంబై = మాయయొక్క కాంతిమంతమగు కిలికించితముతోడి చూపుభేదమై (హర్షము, అశ్రువు, రోషము, భీతి—మొదలగు భావముల చేరిక కిలికించితము) 4 అనుసవనము = అన్ని నిష్ఠలయందును. 5 అవితథానుభూతికిన్ = సత్యమగు ననుభవము కలవానికిన్.

మొదలఁ దాన కలిగి ♦ ముక్తిమానావధి
రూప మైనవాని ♦ ప్రాపుఁ గందు. 214

ఆ. ఎల్లతనువులందు ♦ నిరవొంది తనతోడఁ
బొందు సేసినట్టి ♦ పొందు గాని
పొందువొంద లేఁడు ♦ పురుషుండు గుణములు
గుణిని బోలునట్టి గుణి భజింతు. 215

ఉ. పూని మనంబునుం దనువు ♦ భూతములుం మఱి యింద్రియంబులుం
బ్రాణములుం వివేకగతిఁ ♦ బాయక యన్యముఁ దమ్ము నెమ్మియిం
గానఁగనేర వాగుణ ♦ కాయములం బరికించునట్టిస
ర్వానుగతుండ సమస్త హితుఁ ♦ డైన పురుషు నాశ్రయించెదన్

వ. మఱియు ననేకవిధనామరూపనిరూపణ్యం బగుమనంబునకు దృష్టస్మృతులనాశంబువలనఁ గలిగెడు [1]ఉపరామం బగుసమాధియందుఁ గేవలజ్ఞానస్వరూపంబునఁ దోఁచునిర్మలప్రతీతిస్థానం బైనహంస స్వరూపికి నమస్కరింతుఁ దారువందు నతిగూఢం బైనవీతిహోత్రుని బుద్ధిచేతఁ బ్రకాశంబు నొందించు భంగి బుద్ధిమంతులు హృదంతరంబున సన్నివేశం బయినపరమపురుషుని నాత్మశక్తిత్రయంబుచేతం దేజరిల్లఁ జేయుదు రట్టిదేవుండు సకలమాయావిచ్ఛేదకం బయిననిర్వాణసుఖానుభవంబునం గూడి యుచ్చరింపం గొలంది గానిశక్తి గలవిశ్వరూపుండు నాకుం బ్రసన్నుం డగుం గాక వాగ్బుద్ధీంద్రియమానసంబులచేతం జెప్పను నిట్టిదని నిరూపింపను నలవిగాక యెవ్వనిగుణరూపంబులు వర్తించు నెవ్వండు నిర్గుణుండు సర్వంబు నెవ్వనివలన నుత్పన్నం బగు నెవ్వనివలన స్థితిం బొందు నెవ్వనివలన లయంబగు నట్టిపరాపరంబులకుం బరమం బై యనన్యం బై ప్రాక్ప్రసిద్ధం బై సర్వవ్యాపకం బై యాదికారణం బై యున్నతత్త్వంబు నాశ్రయింతు నెవ్వని ప్రభావంబు మాటలాడెడువారలకు వాదంబు సేయువారలకు వివాదసంవాదస్థలంబులగుచు నప్పటప్పటికి మోహంబు నొందించు చుండు నట్టియనంత

1 ఉపరామము = విషయవిరామముకలది.

గుణంబులు గలమహాత్మునకుఁ బ్రణామంబు సేయుదు నస్తి నాస్తి యనువస్తుద్వయనిష్ఠలం గలిగి యొక్కటన యుండి విరుద్ధధర్మంబులుగఁ గనంబడునుపాసనాశాస్త్రసాంఖ్యశాస్త్రంబులకు సమంబై వీక్షింపఁ దగినపరమంబు నాకు ననుకూలంబగుంగాక యెవ్వఁడు జగదనుగ్రహంబుకొఱకు జన్మకర్మంబులచేత నామ రూపంబు లెఱుంగంబడకుండియు నామరూపంబులు గలిగి తేజరిల్లు నట్టి యనంతుం డయినభగవంతుండు ప్రసన్నుం డగుంగాక యెవ్వండు జనులకుఁ బురాకృతజ్ఞానపదంబులచేత నంతర్గతుం డై మేదినిం గలుగుగంధాది గుణంబుల నాశ్రయించినవాయువుభంగి మెలంగుచుండు నాపరమేశ్వరుండు మదీయమనోరథంబు సఫలంబు సేయుంగాక యనుచు భక్తిపరవశుం డయి [1]యుక్తివిశేషంబున స్తుతియించు చున్నదక్షునికి భక్తవత్సలుం డైనశ్రీవత్సలాంఛనుండు ప్రాదుర్భావంబు నొందె నప్పుడు. 217

సీ. [2]భర్మాచలేంద్రప్రపాతద్వయంబునఁ
గలిగిననీలంపుఁగను లనంగ
మొనసి తార్క్ష్యునియిరుమూఁపుపై నిడినట్టి
పదములకాంతులు పరిఢవిల్లఁ
[3]చండదిజ్మండలశుండాలకరముల
కైవడి నెనిమిదికరము లమరఁ
జక్రకోదండాసిశంఖనందకపాశ
చర్మగదాదుల సరవిఁ బూని

ఆ. నల్లమేను మెఱయ నగుమొగం బలరంగఁ
జల్లచూపు విబుధసమితిఁ బ్రోవ
బసిఁడికాసెఁ బూని బహుభూషణకిరీట
కుండలములకాంతి మెండుకొనఁగ 218

---

1 ఉక్తివిశేషములు = చక్కనిమాటలు. 2 భర్మా ... ద్వయంబున = మేరుపర్వతముయొక్క చఱియల జంటయందు. 3 చండ ... కరముల = భయంకరములగు దిగ్గజములయొక్క తొండములు

సీ. [1]కుండలమణిదీప్తి ♦ గండస్థలంబుల
బూర్ణేందురాగంబుఁ ♦ [2]బాండుపఱుప
దివ్యకిరీటప్ర♦దీపులంబరరమా
సతికి [3]గౌసుంభవస్త్రంబు గాఁగ
వక్షస్థలంబుపై ♦ వనమాలికాళులు
శ్రీవత్సకౌస్తుభ ♦ శ్రీల నొఱయ
నీలాద్రిఁ బెనఁగొని ♦ నిలిచిన సద్వల్లి
తలభాతిఁ గనకాంగదంబు మెఱయ

ఆ. నఖిలలోకమోహ♦నాకారయుక్తుఁడై
నారదాదిమునులు ♦ సేరి కొలువఁ
గదిసి మునులు వొగడ ♦ గంధర్వకిన్నర
సిద్ధగానరవము సెవులనలర. 219

క. సర్వేశుఁడు సర్వాత్ముఁడు
సర్వగతుం డచ్యుతుండు ♦ సర్వమయుండై
సర్వంబుఁ జేరి కొలువఁగ
సర్వగుఁడై దక్షసుతకుఁ బ్ర♦సన్నుం డయ్యెన్. 220

వ. ఇట్లు ప్రసన్నుం డయిన సర్వేశ్వరుని సర్వాంగకమంబును మహైశ్వర్యధుర్యంబును నయి తేజరిల్లు దివ్యరూపంబుఁ గాంచి భయంబును హర్షంబును విస్మయంబును జిత్తంబున ముప్పిరిగొని చొప్పు దప్పింపం దెప్పిఱి [4]కప్పరపాటునం బుడమిపైఁ జాఁగిలంబడి దండప్రణామంబు లాచరించి కరకమలంబులు మొగిడ్చి సెలయేఱుల [5]తొట్టునఁ గొట్టువడి యిట్టట్టుఁ బట్టుచాలక [6]నిట్టవొడిచి [7]మున్నీరు దన్ని నిలచిన పెన్నీరునుంబోలె సర్వాంగంబులుం దొంగలింపఁ జిత్తంబు నాత్మాయత్తంబు సేసి పిక్కటిల్లిన సంతోషంబుచేత భగ

---

1 కుండల ... స్థలంబులు = చెవిపోగులయందలి రతనాలచే మెఱుఁగెక్కిన చెక్కిళ్ళు. 2 పాండుపఱుపఁగా = నిస్తేజము చేయఁగా. 3 కౌసుంభవస్త్రంబు = కుసుంబవన్నె కోక. 4 కప్పరపాటు = సంభ్రమము. 5 తొట్టు = ప్రవాహము. 6 నిట్టవొడిచి = ఉప్పొంగి. 6 మున్నీరు = సముద్రము.

వంతుం బలుకను నత్యంతమంగళసందోహపాదకంబులైన తన్నా మంబులుగ్గడింపను నతినిర్మలంబులయిన తదీయ కర్మంబులు దడవను విబుధహర్షకరంబులయిన తత్పౌరుషంబులు వొగడను నాత్మీయ మనోరథంబు వాక్రువ్వను నోపక 1ప్రజాకాముండై యూరకున్న ప్రజాపతింజూచి సర్వజీవదయాపరుండును 2సర్వసత్త్వహృదంత రస్థుండును సర్వజ్ఞుండునుం గావున నతనిభావంబు దెలిసి జగన్నా థుండార్తపోషణంబులైన భాషణంబుల నిట్లనియె. 221

క. మెచ్చితిఁ బ్రాచేతస తవ
మిచ్చట ఫలసిద్ధియయ్యె ♦ నిట్లతిభక్తిన్
హెచ్చగు మద్వరవిభవము
నచ్చుపడంబొంద నెవ్వఁ ♦ డర్హుఁడు జగతిన్ 222

ఆ. తపము సాలునింకఁ దగభూతతతికి వి
భూతులొనరుఁగాక ♦ పొందుపడఁగ
నిగియుసుమ్ము మాకు ♦ నిచ్చలొఁగలకోర్కి
పొసఁగ నీదువలనఁ ♦ బొందుపడియె. 223

వ వినుము బ్రహ్మయు భర్గుండును బ్రజాపతులును మనువులును నింద్రులును నిఖలభూతంబులకు భూతిహేతువులయిన మద్భూతి విభవంబులు మఱియు నాకు యమనియమాదిసహితసంధ్యావంద నాదిరూపం బగు తపంబు హృదయంబు సాంగజపవద్ధ్యానరూపం బగువిద్య శరీరంబు 3ధ్యానాదివిషయప్రవ్యాపారంబు నానుండు భావనాదిశబ్దవాచ్యంబగు క్రియ యాకృతి క్రతుజాతంబు లంగం బులు ధర్మం బాత్మ దేవతలు ప్రాణంబులు నిగమంబు మత్స్వ రూపంబు జగదుత్పత్తికి నాదియందు నే నొక్కండన తేజరిల్లు చుంటి బహిరంతరంబుల వే ఱొక్కటిలేక సుషుప్త్యవస్థయందు సర్వంబు లీనం బగుటంజేసి సంజ్ఞామాత్రుండును నవ్యక్తుండును గా

1 ప్రజకాముండు=సంతతియందు కోరిక కలవాఁడు. 2 సర్వ...స్థుండు = సమస్త జీవుల యొక్క మనో మధ్యము నందున్నవాఁడు. 3 ధ్యానాది...వ్యాపారంబు = ధ్యానాదులు విషయముగా కలిగిన పురుషప్రవృత్తి (మానవుని క్రియాకలాపము)

నుండు జీవునిభంగి నొక్కండన యుండుదు ననంతుండనై యనంత
గుణంబులు గలమాయాగుణంబువలన గుణవిగ్రహుం బగు బ్ర
హ్మాండంబును నయోనిజుండు స్వయంభువు నగు బ్రహ్మయును
నుదయించిరి మదీయవీర్యోపబృంహితుం డయి మహాదేవుండగు
నా బ్రహ్మ యసమర్థుండునుం బోలె 1నకృతార్థమ్మన్యమాన మన
స్కుండయి సృజింప నుద్యమించుతఱి తపం బాచరింపు మని
నాచేత బోధితుండై ఘోరం బైనతపం బాచరించు తొలుత
సృష్టికర్తృత్వంబు వహించినమిమ్ము సృజియించె నంతఁ బంచజన
ప్రజాపతి తనూజ యగుయసిక్ని యను పేరిట వినుతి నొంది యున్న
యిక్కన్యకను నీకిచ్చితి దీనిం బత్నిఁగాఁ గైకొని 2మిథునవ్యవాయ
ధర్మంబు గలవాఁడవై మిథునవ్యవాయ ధర్మంబు గలయీ
నాతియందుఁ బ్రజాసర్గంబు నతివిపులంబుగఁ గావింపం గలవాఁ
డవు మఱియు నీకుఁబిదప నీక్రమంబున నిఖిల ప్రజలును మన్మా
యామోహితు లయి మిథునవ్యవాయ ధర్మంబునఁ బ్రజావృద్ధి
నొందించి మదారాధనపరులై యుండఁ గలవారని పలికి విశ్వ
భావనుండైనహరి స్వప్నోపలబ్ధార్థంబునుం బోలె నంతర్ధా
నంబు నొందె నప్పుడు దక్షుండు విష్ణుమాయోపబృంహితుండై
పాంచజని యగునసిక్నియందు హర్యశ్వసంజ్ఞుల వినుతిఁ జెంది
యున్న 3అయుతసంఖ్యాపరిగణితు లైనపుత్రులం గాంచె నప్పు
డాధర్మశీలు రైనదాక్షాయణులు పితృనిర్దేశంబునం బ్రజాసర్గంబు
కొఱకుఁ దపంబు సేయువారై పశ్చిమదిశకుం జనియచ్చట సింధు
సముద్రసంగమంబున సమస్తదేవముని సిద్ధగణసేవితం బై దర్శన
మాత్రంబున 4నిర్ధూతకల్మషులను నిర్మలచిత్తులనుం జేయు చున్న
నారాయణ సరస్సనం బరఁగుతీర్థరాజంబున నవగాహనంబు సేసి

---

1 అకృతా...మనస్కుండయి = అకృతార్థునిగా తన్నుతలఁచుచున్న మనస్సు కలవాఁడై. 2 మిథునవ్యవాయ ధర్మంబు = దంపతుల సంయోగవ్యాపారము. 3 అయుతసంఖ్యాపరిగణితులు=పదివేలసంఖ్యచే లెక్కింపఁబడినవారు. 4 నిర్ధూత కల్మషులు = ఎగురఁగొట్టఁబడిన పాపములుకలవారు.

నిర్మలాంతరంగులై పరమహంస ధర్మంబునందు నుత్పన్నమతులై
ప్రజాసర్గంబుకొఱకుఁ దండ్రియనుమతంబున నుగ్రతపంబు సేయు
చుండ వారికడకు నారదుండు వచ్చి యిట్లనియె. 224

సీ. మీరు రతిమూఢులు ♦ మీఁదటిగతి గాన
రెన్నంగఁ బసిబిడ్డ ♦ లన్నలార
పుడమి దా నింతని ♦ [1]కడఁ బరికింపరు
ప్రజలఁ బుట్టింప నే♦ప్రతిభ గలదు
అట్టైన నొక్క మ♦హాత్ముఁడు పురుషుండు
బహురూపములుగల♦భామయొకతె
పుంశ్చలి గర్తంబు♦బురణింప నుభయప్ర
వాహంబు గలనది♦వఱలఁ గడల

ఆ. నంచయొకటి [2]యిరువ♦దైదింటిమహిమలఁ
గలిగి యుండు తెరువు♦గానరాక
వజ్రకబిడ మగుచు♦వరుసఁ దనంతన
తిరుగుఁ గాష్ఠబిలము ♦ దేటపడఁగ 225

క. వినుఁ డండుల ననురూపము
నను వొందఁగ నెఱుఁగకాత్మ ♦ నాత్మగురూక్తిం
గొనసాగించెద మను మి
మ్మన నేమియులేదు మూఢు ♦ లని తెలిసి తగన్. 226

వ. అని [3]నారదుండు బోధించిన హర్యశ్వులు సహజబుద్ధిచేత నారద
వాక్యంబులఁ దమలో నిట్లని వితర్కించిరి. 227

తే. సారిది క్షేత్రజ్ఞుఁ డన నతి♦సూక్ష్మబుద్ధి
నరయ నజ్ఞానబంధనం ♦ బగుచు [4]లింగ

---

1 కడ = చివర 2 ఇరువదైదింటి మహిమలు = పంచవింశతి తత్త్వముల యొక్క మహిమలు. (అవ్యక్తము + మహత్తు + అహంకారము + మనస్సు + జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు + తన్మాత్రలు + మహాభూతములు + పురుషుఁడు)

3 నారదుఁడు = జ్ఞానమునొసఁగువాఁడు.

4 లింగదేహము = సూక్ష్మశరీరము.

దేహమున నెద్ది గల దది ♦ దెలియకున్నఁ
గలదె మోక్షంబు దుష్కర్మ ♦ గతులచేత 228

తే. కలఁడు జగదేక సన్నుతి ♦ కారణుండు
స్వామి భగవంతుఁ డభవుండు ♦ స్వాశ్రయుండు
పరముఁ డాతనిఁ జూడక ♦ బ్రహ్మకైనఁ
గలుగు నే ముక్తిపదము దు♦ష్కర్మ గతుల. 229

ఆ. పురుషుఁ డెట్టులేనిఁ ♦ బూని బిలస్వర్గ
గతుఁడుఁబోలె వర్త ♦ కంబుమాను
నట్లె బ్రహ్మ మెఱుఁగ ♦ నయ్యుకు స్వర్భోగ
కర్మగతుల నేమి ♦ గానఁబడును 230

శా. తన్నిష్ఠాగతి లేనివానికి నస♦త్కర్మ ప్రచారంబుచే
మున్నే మయ్యెడి నాత్మ బుద్ధిగుణస♦మ్మోహంబునం దోఁచుచున్
వన్నెల్ వెట్టుక వింత బాగులతఱిన్ ♦ వర్తించు దౌర్గత్య సం
పన్న శ్రీయనుబోలె నెల్లగతులం♦ బ్రఖ్యాతమై యుండఁగన్. 231

సీ. అనువొంద సృష్టిన♦వ్యయముగఁ జేయుచుఁ
బ్రచుర ప్రవాహసం♦పతితమైన
నెఱియుఁ గాలం బను♦నిర్గమస్థానంబు
నందు వేగము గల♦క్రందుమాయ
గదలి యహంకార♦గతివశంబునఁ జాల
వివశుఁడై బోధకు♦విపరీతమైన
వానికి నీరీతి♦వలవంత కర్మప్ర
చారంబులనుమీఁదఁ♦జక్కనైన

ఆ. జన్మ మరణముఖ్య♦జాడ్యంబులతోఁ బాసి
నిఖిలసౌఖ్యపదవి♦నెఱసి క్రమ
మార్గమైనయట్టి♦మహనీయధామంబుఁ
జిత్తమార నెట్లు♦సేరఁ గలఁడు. 232

తే. దానిసంసర్గ గుణములు ♦ దప్పి నడచు
కుచ్చితపుభార్యఁ జేకొన్న♦కుమతివోలెఁ

దివిరి సుఖదుఃఖములఁ గూడి ♦ తిరిగి జీవ
రూప మెఱుఁగనివారికిఁ ♦ బ్రాపుగలదె. 233

మత్తకోకిలము.
పంచవింశతితత్త్వరాశి క ♦ పారదర్పణ మయ్యెఁ దాఁ
గొంచెమై పురుషుండు తత్త్వముఁ ♦ గోరి పట్టఁగ నేరఁ డే
మంచుఁ గించుఁ దలంచువాఁడు క ♦ దధ్వకర్మము సేయఁగా
మంచిలోకము వాని కేటికి ♦ మానుగా సమకూరెడిన్. 234

క. [1]బంధానుమోక్షణక్రమ
సంధానైశ్వర్యధుర్య ♦ శాస్త్రసమగ్ర
గ్రంథంబు మాను చిద్రూ
పాంథునకును గర్మగతుల ♦ నగునే శుభముల్. 235

మత్తకోకిలము.
చూడ నీజగ మంతయుఙ్ వెసఁ ♦ జుట్టి పట్టుక లీల నే
జోదు లేక రయంబునం గుడి♦సుట్టునట్టిస్వతంత్రముం
గూడి యుండినకాలచక్రముఁ ♦ గోరి చూడనివారి కే
జాడఁ గల్గును గర్మసంగతిఁ ♦ జారుమోక్షపదం బిలన్. 236

ఆ. జన్మహేతు వైన ♦ జనకునిర్దేశంబు
తనకుఁ జేయరాని ♦ దనుచుఁ దెలిసి
గుణమయప్రవృత్తి ♦ ఘోరాధ్వనిశ్శ్వాస
నిరతుఁ డగుచుఁ జేయ ♦ నేరఁ డతఁడు 237

వ. అని తమలో వితర్కించి యాకుమారు లప్పుడు. 238

సీ. వినవయ్య భూపాల ♦ మునివరేణ్యునిమాట
లనువొందఁ దలపోసి ♦ వినయ మలర
[2]వలగొని యతనికి ♦ వందనంబు లొనర్చి
తిరిగి యెన్నఁడు రాని ♦ తెరువు వట్టి

---

1 బంధా ... గ్రంధంబు = బంధము దానిననుసరించిన మోక్షము వీనిక్రమమును కూర్చినట్టియు, ఐశ్వర్యముయొక్క భారమును వహించినట్టియు. శాస్త్రముయొక్క సంపూర్ణవిషయమును.

2 వలగొని = ప్రదక్షిణముచేసి.

చయ్యన నేఁగిరి ♦ సహజసత్త్వ బ్రహ్మ
మయ మైనపంకజ ♦ నయనుపాద
పద్మ మరందంబు ♦ పానంబు సేయుచు
మత్తిల్లి నిలిచిన ♦ మానసాళి 239

ఆ. బరిణమింప విష్ణుఁ ♦ బాడుచుఁ దత్కీర్తి
సరణి మ్రోయుమహతి ♦ సంఘటించి
నారదుండు గుణవి♦శారదుం డొం డేసిఁ
జనియెఁ దన్ను జగము ♦సన్నుతింప 239

క. అప్పుడు దక్షుండు దనయులు
దప్పి మహాపథము గనుటఁ ♦ దగ నారదుఁడే
చెప్పినఁ గప్పినశోకము
ముప్పిరిగొని చిత్తవృత్తి ♦ మూరింబోవన్. 240

చ. అడలుచు నున్న వచ్చి కమ♦లాసనుఁ డూఱడిలంగఁ బల్కు-చుకా
పడసినలీలఁ బుత్రుల స♦పాదగుణాఢ్యులఁ గాంచుచున్న నా
పడఁతుకయందుఁ బల్వురను ♦ బన్నుగఁ దా శబళాశ్వసంజ్ఞలన్
బెడఁ గగువారిఁ బుణ్యములఁ♦బేర్చినవారి సహస్రసంఖ్యులన్. 241

క. పుట్టించిన జనకునిమదిఁ, బుట్టినతిలఁ బెటేఁగి వారు♦ పూనికఁ బ్రజలం
బుట్టించువ్రతముఁగైకొనిఁ, గట్టిగఁదపమాచరింపఁ♦గాఁజనిరి వెసన్.

వ. ఇట్లు శబళాశ్వులు ప్రజాసర్గంబుకొఱకుఁ దండ్రిపంపునం దపంబు సేయువారై యేతీర్థంబు తీర్థరాజంబై సకలతీర్థఫలంబుల నాలోకనమాత్రంబున ననుగ్రహించుచు సకలపాపంబుల నిగ్రహించు నేతీర్థప్రభావంబున నగ్రజన్ములు ఫలసిద్ధింబొందుదు రట్టినారాయణసరస్సను పుణ్యతీర్థంబునకుంజని తదుపస్పర్శ మాత్రంబున నిర్ధూతమలాశయులై. 243

శా. బ్రహ్మేంద్రాదులు నందనేరని పర ♦ బ్రహ్మంబుఁ జింతించుచుక్
బ్రహ్మానందముఁ బొంది జిహ్వకలపై ♦ బ్రహ్మణ్య మంత్రంబులక్
బ్రహ్మలోకనవాంఛతో నిలుపుచుక్ ♦ బ్రహ్మంబితండంచు మక్
బ్రహ్మజ్ఞానగురుక్ హరిం దపమునం ♦ బాటించిరబ్బాలకుల్. 244

సీ. ఏకపాదాంగుష్ఠ ♦ మిలమీఁద సవరించి
నిశ్చలకాయులై ♦ నిక్కి నిలిచి
కరములు గీలించి ♦ పరవిమీఁదికెనెత్తి
గుఱుతుగాఁ బెనుబయల్ ♦ గుట్టిపట్టి
నిడివిగా గ్రూరమై ♦ నిగిడినచూడ్కులఁ
గడుఁదీవ్ర భానునిఁ బొడిచిపట్టి
వడిఁగొంతకాలంబు ♦ వాయువుభక్షించి
యంతనుండియు నిరాహారులగుచు
ఆ. సకలలోకములకు ♦ సంహారకరమును
జేర్చి దేవతలకు ♦ భీతికరము
గాఁగ ఘోరతపముఁ ♦ గావింపఁ దొడఁగిరి
మహితచిత్తులక్క ♦ మారవరులు. 245

—: నారదుఁడు శబళాశ్వులకు నివృత్తిమార్గంబు నుపదేశించుట. :—

వ. ఇట్లతిభయంకరంబైన తపంబు సేయుచు నెడతెగక భగవన్మంత్రంబులు నొడువుచుఁ బ్రజాసర్గకాములైయున్న యచ్చిన్నిబాలుర కడకు నారదుండు సనుదెంచి పూర్వవిధంబునం బలుకుచునిట్లనియె భ్రాతృవత్సలులైయున్న మీరలు వేదాంతసారంబోలుకుచున్న నా వచనంబు లాదరించి తోఁబుట్టువులు సనినమార్గంబునఁ జనుండెవ్వరేనిం దమయగ్రజులు సన్నమార్గంబునం దామునుందప్పకవర్తింతురేని నట్టివారిని విశేషధర్మం బెఱింగినవారలంద్రు సతతంబును బుణ్యాబంధువులైన దేవతలంగూడి సుఖంబుండుం డనిపల్కి నారదుండు సనియె వారలును సర్వకర్మంబులయందు నిర్మోహితులై పరమపదంబునకు నాస్పదంబులయిన దేవర్షి వాక్యంబుల నాశ్రయించి.
ఉ. అప్పుడు లజ్జతోడ శబ ♦ లాశ్వులు పూర్వజు లేఁగినట్టి యా
చొప్పున నెన్నఁడుం దిరిగి ♦ చూడనిత్రోవ విశేషపద్ధతిం
దప్పకపోయిరయ్య గుణ ♦ ధాములు నేఁడునువఃశ్శ్రేమి నేఁ
జెప్పెదఁగాక రాక కడ ♦ నేరిన రాత్రులఁబోలి భూవరా. 247
క. దక్షున కాకాలంబున, లక్షితమైయుండెఁ బెక్కు ♦ లాగులనుతాఁ

తత్క్షోభంబులు వానికి, రూక్షవ్యథనొంది యూపు ♦ రుషనాశంబుల్
క. నారదకృతమని యెఱిఁగి మ
హారోషముతోడ నేఁగి ♦ యాతనిఁగని దుః
ఖారూఢచిత్తుఁడై మది
నూఱడిలం దెరువులేక ♦ యుగ్రుండగుచున్ 249
ఆ. మోము 1జేవురింప ♦ ముడివడ 2బొమదోయి
చూపువెంట మంట ♦ 3సుడిగొనంగఁ
బెదవులదరఁబండ్లు ♦ పెటపెటఁగొఱుకుచు
దక్షుఁడాగ్రహించి ♦ తపసి బలికె. 250
చ. నెఱయఁగ సాధురూపమున ♦ నీవతిబాలుర కాత్మజాలికిం
గఱకున భిక్షుమార్గమగు ♦ కందువ సెప్పితివేల ధూర్తవై
మఱుఁగక యుండవచ్చునె కు ♦ మారుల నీదురితంబువొంద ని
న్నొఱలఁగఁద్రోతు నాదు4సమ ♦ దోగ్రమహోగ్రహ శాపవహ్నులన్

—♦ దక్షుండు నారదుని శపియించి ప్రజాసర్గం బొనరించుట ♦—

వ. అదియెట్లంటేని దేవర్షి5పితృఋణంబులు దీర్పక కర్మవిచారంబు సేయని బాలుర మనంబులకు నైహికేచ్ఛలయందు నైరాశ్యంబు గలుగంజేసి నివృత్తిమార్గంబుపదేశించి వారలకు నుభయలోకములయందుఁ జెందఁగల శ్రేయోహాని నొనర్చితి విట్టిపాతకంబున భాగవతోత్తములలో లజ్జాహీనుండవై యశోహానింబొంది చరింపుదుగాక నిరపరాధులై వైరంబులేని నాపుత్రులపట్ల ద్రోహకృత్యం బొనర్చిన నీవు దప్పఁ దక్కినభాగవతోత్తములు సకల భూతానుగ్రహ పరవశులుగావున నిరంతరంబును లోకసంచారివైన నీకు నేలోకంబునను నునికిపట్టు లేకుండుంగాక యనినిర్దయుండై శాపం

1 జేవురించు = ఎఱ్ఱవారు 2 బొమ్మలు = కనుబొమ్మలు 3 సుడిగొనంగన్ = చుట్టుకొనఁగా.

4 సమదో ... వహ్నులన్ = గర్వముతో కూడినట్టియు, తీవ్రమైనట్టియు, గొప్పదైనట్టియు,—కోపముచే కలిగిన శాపమనెడు నగ్నులయందు.

5 పితృదేవర్షిఋణంబు = పితరులయొక్కయు, దేవతలయొక్కయు, ఋషులయొక్కయు, ఋణము (దీనిసేఋణత్రయమందురు.)

ఇచ్చె నంత నారదుండు తత్ప్రతివిధవాక్యంబుల కలుగక యట్లకాని మ్మని సమ్మతించి చనియె నిట్టిశాంతభావం బెవ్వనివలనం గలుగు నతండు సర్వాతీతుం డయిన సర్వేశ్వరుం డనం బడు మఱియు దక్షుండు తనమనోరథంబు విఫలం బగుటం జేసి యతిదుఃఖిత మనస్కుండై పొగులుచున్నఁ బితామహుండు సనుదెంచి మఱియుఁ బ్రజాసర్గోపాయం బుపదేశించిన నాప్రజాపతి ప్రియభామ యైన యసిక్నియందుఁ బితృవత్సల లైనపుత్రికల నఱువదుండ్రఁ బుట్టించి వారిలో ధర్మునకుం బదువురను కశ్యపునకుఁ బదుమువ్వురను జంద్రునకు నిరువదేడ్వురను భూతునకు నాంగిరసునకుఁ గృశాశ్వునకు నిద్దఱేసిచొప్పున నార్వురను తార్క్ష్యుండను నామాంతరంబుఁదాల్చిన కశ్యపునకు మరలఁ గడమనలువురను నీ క్రమంబున నిచ్చె వారి నామంబు లాకర్ణింపుము. 252

ఆ. ఎట్టిపుణ్యవతులొ ♦ యీచేడియలు సెప్ప
[1]సవతు లేనియట్టి ♦ సవతులయ్యుఁ
గడుపు వడసి రెట్టి ♦ కడుపునఁ బుట్టిరో
కడఁదిత్రిజగమెల్లఁ ♦ గడుపు గాఁగ. 253

వ. వారలెవ్వరనిన భానువులంబయుఁగకుబ్జామియు విశ్వయు సాధ్యయు మరుత్వతియు వసువు ముహూర్తయు సంకల్పయు ననంబడు గురుధర్మునకుఁ బత్నులై కొడుకులం బడసిరి వారలెవ్వరంటేని భానువునకు వేదఋషభుండుపుట్టె నతనికి నింద్రసేనుం డుదయించె లంబకు విద్యోతుండుగలిగె నతనికి స్తనయిత్నువు లనువారు పుట్టిరి కకుబ్దేవికి సంకటుండు పుట్టె సంకటునకుం గీటకుండు పుట్టెఁ గీటకునకు దుర్గాభిమానిను లయిన దేవతలు జన్మించిరి జామిదేవికి దుర్గభూముల కధిష్ఠాన దేవతలు జనియించిరి. వారికి స్వర్గుండును నందియు జన్మించిరి విశ్వ యనుదానికి విశ్వేదేవగణంబు జనియించె వార లపుత్రకు లనం బరఁగిరి సాధ్య యనుదానికి సాధ్యగణంబులు పుట్టె వానికి నర్థసిద్ధి యనువాఁడు పుట్టె మరుత్వతి యనుదానికి

1 సవతు = సామ్యము

మరుత్వంతుండు జయంతుం డనువార లుదయించి రందు జయం
తుండు వాసుదేవాంశజుం డైనయుపేంద్రుం డనం బడి వినుతి నొందె
ముహూర్త యను దానికి సకలభూతంబులకు నాయాకాలంబులం
గలిగెడు నాయాఫలాఫలంబుల నిచ్చుమౌహూర్తికు లనియెడు
దేవగణంబులు పుట్టిరి సంకల్ప యనుదానికి సంకల్పుం డుదయించె
నాసంకల్పునకుఁ గాముండు జనియించె వసు వనుదానికి ద్రోణుం
డును ప్రాణుండును ధ్రువుండును నర్కుండును నగ్నియు దోషుం
డును వస్తువును విభావసువును నన నెనమండ్రు వసువు లుదయంబు
నొంది రందు ద్రోణునకు నభిమతి యనుభార్యయందు హర్ష
శోకభయాదులు పుట్టిరి ప్రాణునకు భార్య యైనయూర్జస్వతియందు
సహుండును నాయువును బురోజవుండును ననువారు గలిగిరి
ధ్రువునకు భార్యయగు ధరణియందు వివిధు లగుపురుషు లనువారు
జనించి రర్కునికి భార్య యగువాసనయందుఁ దర్షాదు లుదయించి
రగ్నికి భార్య యైన వసుధారయందు ద్రవిణకాదులు పుట్టిరి
మఱియుఁ గృత్తికలకు స్కందుండు గలిగె నాస్కందునకు విశా
ఖాదు లుదయించిరి దోషునకు శర్వరి యను భార్యయందు హరికళ
శింశుమారుం డుదయించె వస్తువునకు నాంగిరసయందు విశ్వకర్మ
యనుశిల్పాచార్యుం డుదయం బందె నావిశ్వకర్మకు నాకృతి
యనుసతియందుఁ జాక్షుషుం డను మనువు జనియించె నామనువు
వలన విశ్వులు సాధ్యులనువారలు పుట్టిరి విభావసునకు నుష
యనుభార్యయందు వ్యుష్టియు రోచియు నాతపుండును జనించి
రందు నాతపునికిఁ బంచయాముండను దివసాభిమానదేవత జని
యించె శంకరాంశజుండయినభూతునకు సురూప యనుభార్య
యందుఁ గోట్లసంఖ్యలైన రుద్రగణంబు లుదయించిరి మఱియు
రైవతుండు నజుండు భవుండు భీముండు వాముండు నుగ్రుండు
వృషాకపియు నజైకపాత్తు నహిర్బుధ్న్యుండు బహురూపుండు
మహాంతుండు ననువారలును రుద్రపారిషదులును నతిభయంకరు
లయినప్రేతులును వినాయకులును బుట్టి రంగిరసుం డనుప్రజా

పతికి స్వధ యనుభార్యయందుఁ బితృగణంబులు పుట్టిరి సతి
యనుభార్యకు నథర్వవేదాభిమానదేవతలు పుట్టిరి కృశాశ్వునకు
నర్చి యనుభార్యయందు ధూమ్రకేశుం డనుపుత్రుం డుదయించె
వేదశిరునకు ధిషణ యనుభార్యయందు దేవలుడును వయునుం
డును మనువునుం బుట్టిరి తార్క్ష్యునకు వినత కద్రువ పతంగి యామిని
యన నలువురు భార్యలందుఁ బతంగికిఁ బక్షులు పుట్టె యామినికి
శలభంబులు పుట్టె వినతకు సాక్షాత్కరించినయజ్ఞాధిపతికి వాహనం
బయిన గరుడుండును సూర్యునకు సారథియైన యనూరుండును జని
యించిరి కద్రువకుఁ బెక్కుతెఱంగు లగుభుజంగమంబులు పుట్టెఁ
జంద్రునకుఁ గృత్తికాది నక్షత్రంబులు భార్యలయినను వారల
యందుఁ జంద్రుండు రోహిణియందుమాత్రము మోహితుం డగు
టం జేసి దక్షశాపంబున క్షయరోగగ్రస్తుండై సంతానంబు వడయ
నేరఁడయ్యె నంత దక్షప్రసాదంబున క్షయపీడితంబు లగుషోడశ
కళల మరలం బొందె మఱియును. 254

సీ. కామితప్రదుఁ డైన♦కశ్యపుకౌఁగిట,
ముచ్చట దీర్తు రే♦ముద్దరాండ్రు
రఖిల లోకములకు♦నవల నైజగ మెల్లఁ,
బూజింప నుందు రే♦పువ్వుఁబోండ్లు
బలియు రై పుత్రులు♦పౌత్రులు త్రిజగంబు,
లేలంగఁ జూతు రే♦యిందుముఖులు
ముంగొంగుపసిఁడి యై♦మూల్గుపుణ్యంబుల,
విఱ్ఱవీఁగుదు రెట్టి♦వింతరాండ్రు
తే. వారికలగంపకడుపుల♦నేరుపరుల,
నరిదిబిడ్డలఁ బడసిన♦బిరుదు సతుల
నామములు నన్వయంబులు♦నీమనంబు,
పూనఁజెప్పుదు వినవయ్య♦మానవేంద్ర. 255

తరలము. అదితియున్ దితి గాష్ఠయున్ దను♦వయ్యరిష్టయుఁదామ్రయు
న్నదనఁ గ్రోధవశాఖ్యయున్ సుర♦సాఖ్యయున్ సురభిన్ మునిన్

మొదలుగాఁ దిమియు న్నిళాఖ్య సు♦ముఖ్యయాసరమాదిగా
ముదిత లెన్నఁగఁ గన్నసంతతి♦ముజ్జగంబుల భూవరా. 256

సీ. చాలంగఁ దిమికిని♦జలచరంబులు పుట్టె,
మఱి శ్వాపదులు సర♦మకును బ్రజలు
సురభికి మహిషాది♦సురభులు జనియించెఁ,
దామ్రకు శ్యేనగృ♦ధ్రములు గలిగె
మునికి నప్సరసల♦మూఁకలు జనియించె
నిళ గనె భూరుహ♦ములను క్రోధ
వశ కుద్భవిల్లె దు♦ర్వారసర్పంబులు
సరి యాతుధానులు ♦ సురస కరయ

తే. నుప్పతిల్లిరి గంధర్వ♦లోక మొగి న
రిష్టకు సుతుల్ దనువునకుఁ♦ద్రిదశరిపులు
పదియునెనమండ్రు నైనట్టి♦విదితబలులు
వారినామాన్వయంబులఁ ♦ గోరి వినుము 257

వ. ద్విమూర్ధుండును శంబరుండును నరిష్టుండును హయగ్రీవుండును విభావసుండును నయోముఖుండును శంకుశిరుండును స్వర్భానుండును గపిలుండును నరుణియుఁ బులోముండును వృషపర్వుండును నేకచక్రుండును ననుతాపకుండును ధూమ్రకేశుండును విరూపాక్షుండును దుర్జయుండగు విప్రచిత్తియు నను వారలు. వీరలలోన స్వర్భానునకు సుప్రభ యను కన్యక పుట్టె. దాని నముచి వివాహంబయ్యె. వృషపర్వునకు శర్మిష్ఠ యను కూఁతురు పుట్టె దాని నహుష పుత్రుండైన యయాతి పెండ్లియయ్యె. వైశ్వానరునకు నుపదానవి హయశిరస పులోమ కాలక యను నలువురు పుత్రిక లుదయించి రందు నుపదానవి హిరణ్యాక్షునకుం బత్నియయ్యె. హయశిరసను క్రతువు వివాహంబయ్యె. పులోమ కాలక లను నిరువురను గశ్యప ప్రజాపతి చతుర్ముఖుని వాక్యంబునఁ గైకొనియె. నాయిరువురకును సమరకోవిదులయిన దానవులు పౌలోమ కాలకేయులనం బుట్టిరి. మఱియు నా యిరువురకు నఱువదివేలు రాక్షసులు జన్మించిరి.

వారు యజ్ఞకర్మంబులకు విఘాతకులై వర్తింప వారి నిందున్ినకుం బ్రియంబుగా నీ పితామహుండగు నర్జునుండు వధించె. మఱియు విప్రచిత్తి సింహిక యనుదానియందు రాహుప్రముఖంబుగాఁ గల కేతు శతంబును బడసె. వారలు గ్రహత్వంబుఁ గైకొని రి. మఱియుం బురాణపురుషుండైన శ్రీమన్నారాయణుండు దన యంశంబునఁ బరమభాగ్యవతి యయిన యదితిగర్భంబున నుదయించె నాయదితివంశంబును విదితంబుగా వినిపించెద సావధానుండ వయి వినుము వివస్వంతుండును నర్యముండును బూషుండును ద్వష్టయు సవితయు భగుండును ధాతయు విధాతయు వరుణుండును మిత్రుండును శక్రుండును నురుక్రముండును నను మనువులు జన్మించి రందు వివస్వంతునకు శ్రాద్ధదేవుండను మనువు సంజ్ఞాదేవియందు నుదయించె మఱియు యముండు యమియు నను నిరువురు మిథునంబుగా నుదయంబు నొందిరి వెండియు నాసంజ్ఞాదేవి బడబారూపంబునొంది యశ్వి దేవతలం గనియె ఛాయాదేవియందు శనైశ్చరుండును సావర్ణియను మనువును దపతి యనుకన్యకయుం బుట్టె రాతపతిని సంవరుణుండు వరియించె నర్యమునకు మాతృక యను పత్నియందుఁ జర్షణు లుదయించిరి వారిమూలంబున మనుష్యజాతి యీలోకంబున స్థిరంబుగా నుండునట్లు బ్రహ్మదేవునిచేఁ గల్పింపంబడెఁ బూషుండు శర్వునిఁ జూచి దంతంబులు వివృతంబులుగా నగిన నతండు క్రోధించి దంతంబు లూడనడిచిన నాఁటనుండియు భగ్నదంతుండయి యనపత్యుండయి పిష్టాదులు భక్షించుచుండెఁ ద్వష్టకు దైత్యానుజ యైన రచన యనుకన్యకకు నధికబలాఢ్యుండగు విశ్వరూపుండు పుట్టెనంత నా దేవతలు బృహస్పతి గోపించి తలంగి పోయినం దమకు నావిశ్వరూపుని నాచార్యునింగా వరియించిరని చెప్పిన విని శుకయోగీంద్రునకుం బరీక్షిన్న రేంద్రుం డిట్లనియె. 258

సీ. అరయంగ యోగీంద్ర ♦ యద్భుతం బయ్యెడు
సురలపై నేటికి ♦ సురగురుండు

గోపించె సీతండు ♦ గురుభావమున దేవ
తల కేమియూపడఁ ♦ దలఁగఁజేసె
నెఱిఁగింపు మనవుడు ♦ నింద్రుండు త్రిభువనై
శ్వర్యమదంబున ♦ సత్పథంబు
గానక వసురుద్ర ♦ గణములు నాదిత్య
మరుదశ్వి దేవాది ♦ మండలములు

తే. సిద్ధచారణగంధర్వ♦జిహ్మగాది
సురులు మునులును రంభాది♦సుందరాంగు
లాడఁ బాడంగ వినుతి సే♦యంగఁ గొలువఁ
మ్రొక్కభద్రాసనంబున♦నుక్కుమీఱి. 259

సీ. నిండుపున్నమనాఁడు ♦ గండరించినచంద్ర
మండల శ్రీలతో ♦ మాఱుమలయు
భద్రవిద్యోతాత♦పత్రంబు గ్రాలుచు
1మిన్నేటితరఁగల ♦ మేలుకొలుపఁ
గలితదివ్యాంగనా♦కరతలచాతుర్య
చామీకరశ్రేణి ♦ జాడపఱుపఁ
2చింతామణిస్ఫుట ♦ కాంతరత్నా నేక
ఘటితసింహాసనా ♦ గ్రంబునందు

తే. నూరుపీఠంబుపై శచీ♦యుండ నుండి
వరుస దిక్పాలకాదిదే♦వతులు గొలువ
సాటిసెప్పంగ రానిరాజసముతోడ
నింద్రుఁ డొప్పారెవైభవ♦సాంద్రుఁడగుచు. 260

వ. అయ్యవసరంబున. 261

క. గురుతరధర్మక్రియ నయ
3గురుఁడుం గురుమంత్రవిషయ♦గురుఁడు వచశ్శ్రీ

1 మిన్నేటితరగలు=ఆకాశగంగాతరంగములు. 2 చింతా... నాగ్రంబునందు= చింతామణులనెడి స్పష్టములును, సుందరములును నైన రతనములయొక్క పెక్కువచే కూర్పఁబడిన సింగపు గద్దియపై. 3 గురుఁడు=పెద్దవాఁడు, ఆచార్యుఁడు, బృహస్పతి.

గురుఁడు సమస్తామరగణ
గురుఁడు గురుండరుగుదెంచెఁ ♦ గొల్వునకు నృపా. 262

చ. అమితతపఃప్రభావుఁ గరు♦ణాత్ముని గీష్పతిఁ జూచి రాజ్యదు
ర్దమమద రేఖ నింద్రుఁడు వృ♦థా తనగద్దియ లేవకుండె నె
య్యమున నెదుర్కొనం జనక♦యాసనమీయక గౌరవోపచా
రములఁ బ్రసన్నుఁ జేయక తి♦రంబుగ దివ్యసభాంతరంబునన్. 263

క. అప్పుడు సురపతి గన్నుఁ
గప్పిన సురరాజ్యమదవి♦కారంబునకుం
జప్పుడు సేయక గృహమున
కప్పుణ్యుఁడు దిరిగి పోయె ♦ నతిఖిన్నుండై 264

చ. ఎఱుఁగమిఁ జేసినట్టిగురు♦హేళన మంత నెఱింగి యింద్రుఁ డ
చ్చెరువడి భీతి నొంది యతి♦చింతితుఁడై తలపోసి పల్కె న
ప్పరమపవిత్రు లోకనుత♦భవ్యచరిత్రు విశేషపాదపం
కరుహముఁ బూజ సేయక య♦కర్మముఁ జేసితి నల్పబుద్ధినై. 265

క. 1త్రిభువనవిభవమదంబున
సభలో మద్గురువునకుఁ బ్ర♦సన్నునకు లస
త్ప్రభువునకు నెగ్గు సేసితి
శుభములు దొలఁగంగ నే న♦సురభావమునన్. 266

ఆ. 2పారమేష్ఠ్య మయిన♦పదవి నొందినభూపు
లెట్టివారి కైన ♦ లేవ వలదు
విబుధు లిట్లు సెప్పు♦విధ మెన్నవారలు
ధర్మవేత్తలనుచుఁ ♦ దలఁపఁబడరు. 267

ఆ. కుపథవర్తులగుచుఁ♦గుత్సితదుర్వాచో, నిపుణులయినవారునిడివిదెలిసి
తొలఁగలేక వార♦ధోగతిఁ బడుదురు, తప్పులేక రాతి♦తెప్పభంగి

ఉ. కావున లోకవందితుఁడు ♦ కార్యవిచారునియింటి కేఁగి త
త్పావనపాదపద్మముల♦పై మకుటంబు ఘటిల్ల మ్రొక్కి స

1 త్రిభువన ... మదంబున = ముల్లోకముల సిరిచేకలిగిన గర్వమువలన.
2 పారమేష్ఠ్యము = పరమేష్ఠికి సంబంధించిన (పరమేష్ఠి = అత్యున్నతమగుస్థానమునందున్నవాఁడు)

త్సేవ యొనర్చి చిత్తము వసింపఁ బ్రసన్నుఁ డొనర్చునంచు న
ద్దేవవిభుండు వోయె నతి•తీవ్రగతిన్ గురుధామసీమకున్. 269

సీ. ఈరీతిఁ దనయింటి • కేతెంచు దేవతా
పతిరాక యాబృహ•స్పతి యెఱింగి
యధ్యాత్మమాయచే • నడఁగి యదృశ్యుఁ డై
పోయె నప్పుడు దేవ•పుంగవుండు
సకలంబుఁ బరికించి•జాడఁ గానక గురుఁ
జింతించి తలపోసి • చిన్నవోయెఁ
బోయినవిధ మెల్ల • దాయలు రాక్షస
వీరులు వేగుల • వారివలనఁ

తే. దెలిసి మిక్కిలి తమలోనఁ•దెలివి నొంది
యందఱును గూడి భార్గవు•నాశ్రయించి
తత్కృపాదృష్టిఁ దమశక్తి • దట్టమైన
దేవతలమీఁది దాడికిఁ • దెరువు వెట్టె. 270

—: దానవులు దేవతలతో యుద్ధము సేసి దేవతల నోడించుట. :—

క. ధూర్తులు సమస్తకిల్బిష, మూర్తులు[1]వరధర్మకర్మ•మోచితమార్గా
వర్తులు దుర్ణయనిర్మిత, కీర్తులు దానవులు సనిరి • గీర్వాణులపై.

స్రగ్ధర. దండిం[2]గోదండకాండో•ద్ధతరథహయవే•దండదండంబుతోడన్
దండెత్తెన్ మెండుగా న•ద్దనుజనికరముల్ • దైవవర్గంబుమీఁదం
[3]జండబ్రహ్మాండభేదో•చ్ఛ్రయజయరవముల్ • సర్వదిక్క్షోభగాను
ద్దండప్రఖ్యాతలీలం • దలపడిరి సురల్ • దర్పులై వారితోడన్

చ. మదమున దేవదానవులు • మచ్చరముల్ గడుఁ బిచ్చలింప సం
పదలను గోరి పోరునెడ • భార్గవమంత్రకళావిశేషులై

---

1 వర ... వర్తులు = శ్రేష్ఠమగు ధర్మయుక్తమగు కార్యములనుండి విడిపింపబడిన త్రోవనవలంబించి యున్నవారు.

2 కోదండ ... తండంబుతోడన్ = విండ్లచేతను, అమ్ములచేతను, నిష్ఠురములగు. రథములయొక్కయు, గుఱ్ఱములయొక్కయు, ఏనుఁగులయొక్కయు సమూహములతోఁ
3 చండ ...... రవముల్ = తీవ్రములును బ్రహ్మాండమును బ్రద్దలు చేయునవియును (ఈమాట సరిగాదు) అగు పెంపెక్కిన జయాజయ నినాదములు.

యెదురులు వాఁడి నస్త్రముల ♦ నేయ మహాసురు లేచి యేసి పెం
గుదులుగఁ గ్రువ్వ దేవతలు ♦ కోల్తల కోర్వక వీఁగి రయ్యెడన్.

ఆ. దనుజవీరు లేయు ♦ 1దారుణదివ్యాస్త్ర, దళితదేహులగుచుఁ ♦ దలలువీడ
నోడి పాఱి రద్భు ♦ తోపేతబలులైన, త్రిదశవరులు బిట్టు ♦ దిట్టినట్లు

క. ఒకమొగముగాక దివిజులు, తికమకగొని వైరులెల్ల ♦ దీకొనఁ దమ్ముం
బికపికలై నకనకలై, లుకలుకఁ బరువెత్తి రోడి ♦ లోఁగొనుభీతిన్.

చ. దనుజులగర్వరేఖయును ♦ దానవవీరులయుంపజోకయున్
మనుజవిశేషభోజనుల ♦ మచ్చరికంబు నిశాటకోటి యే
చినబలశౌర్యముం దమకు ♦ సిగ్గును హాని మహాభయంబు ని
ర్గుణతను జేయు2నుమ్మలికఁ ♦ గోల్తల కోర్వక పాఱి రార్తులై.

క. అమరులు విసృష్టదానవ
సమరులు శరభిన్నదేహ ♦ సంతాపగుణ
భ్రమరులు దైత్యకిరాతక
చమరులు కమలజునికడకుఁ ♦ జనిరి భయార్తిన్. 277

ఉ. ధాతకు దేవతావిభవ ♦ ధాతకుఁ 3బుణ్యజనానురాగసం
ధాతకు సర్వలోకహిత ♦ దాతకు వైదికధర్మమార్గని
ర్ణేతకు నుల్లసద్విభవ ♦ నేతకు 4సర్వజగజ్జయాంగజ
భ్రాతకుఁ బుణ్యయోగిజన ♦ భావవిధాతకు మ్రొక్కి రయ్యెడన్.

క. ఆఖండలుండు మొదలుగ, 5లేఖానీకముల బ్రహ్మ ♦ లేనగవున ని
త్యాఖండసత్కృపారస, శేఖరవాక్యముల వారి ♦ సేదలు దేర్చెన్.

వ. ఇట్లు బ్రహ్మదేవుండు దేవేంద్రప్రముఖు లయిన దేవతల కనుకంపా
తిశయవిభవంబున నభయం బొసంగి యిట్లనియె. 280

---

1 దారుణ ... దేహులు = తీవ్రములును, ప్రశస్తములునునగు బాణములచే ఖండింపఁబడిన శరీరముకలవారై

2 ఉమ్మలిక = సంతాపము కోల్తలకు = ఎదుట నిల్చి యుద్ధముచేయుటకు

3 పుణ్య ... సంధాతకు = సజ్జనులకు ప్రేముడి కూర్చువానికి 4 సర్వ ... భ్రాతకు = సమస్తలోకములును జయించిన మన్మథుని సోదరునకు

5 లేఖానీకముల = దేవతాసమూహములను

ఉ. నెట్టన పాపకర్మమున • నేరమిఁ జేసితి రేమి సెప్ప మీ
పుట్టిననాఁటనుండియును • బుద్ధులు సెప్పి జగంబు లేలఁగాఁ
బట్టముఁ గట్టి పెంచినకృ•పానిధి బ్రహ్మకళావిధిజ్ఞుఁ జే
పట్టక గుట్టు జాఱి సరి•పట్టునఁ దొట్టినపొట్టక్రొవ్వునన్ 281

వ. బ్రహ్మిష్ఠుం డైన బ్రాహ్మణు నాచార్యుం గైకొనక గురుద్రోహం బు సేసితిరి తద్దోషం బిపుడు మీకుఁ జేసేత శత్రుకృతంబై యను భవింపం జేసె నతిబలవంతు లయినమిమ్ము నతిక్షీణులయిన రా క్షసులు జయించుట దమయాచార్యుం డైనశుక్రు నారాధించి తన్మంత్రప్రభావంబునఁ బునర్లబ్ధవీర్యులై యిప్పుడుమదీయంబైననిల యంబు నాక్రమింపంగలవారు నైమదోద్రేకంబున నెదురు లేక వర్తిల్లుచున్నరక్షోనాయకులకుం ద్రిదివంబుఁ గొనుట తృణప్రా యంబభేద్యమంత్రబలంబు గలభార్గవునకు వారు శిష్యులగుటం జేసి విప్రగోవిందగణేశ్వరానుగ్రహంబు గలవారలకుఁ దక్కం దక్కిన రాజుల కరిష్టం బగుంగావున మీరిప్పుడు త్వష్ట యనుమను పుత్రుం డగువిశ్వరూపుం డనుముని నిశ్చలతపోమహాత్మ్యసత్త్వ స్వభావుం డతని నారాధించిన మీకు నభీష్టార్థంబుల నతండు సంఘటిల్లఁ జేయు నిట్టిదుర్దశల నతం డడంచు నని చెప్పిన దిక్పాల కాదులు డెందంబులు డిందుపడి కమలగర్భుని వీడ్కొని విశ్వరూ పుకడకుం జని యిట్లనిరి. 282

తే. అన్న మే లగునీకు ని•న్నడుగఁ గోరి
వచ్చినారము భవదీయ•వనమునకును
దండ్రులకు నేఁడు సమయోచి•తంబు లైన
కోర్కు లొడఁగూడఁ జేసి చే•కొనుము యశము. 283

క. సుతులకుఁ బితృశుశ్రూషణ
మతిపుణ్యము సేయుచుండు • నాత్మజులు గుణో
న్నతి బ్రహ్మచారు లైనను
మతిలో గురుసేవకన్న • మఱియుం గలదే. 284

వ. అదియునుం గాక. 285

సీ. అరయ నాచార్యుండు ♦ పరతత్త్వరూపంబు
దండ్రి దలంపఁగ ♦ ధాతరూపు
రూపింప భ్రాత మరుత్పతిరూపంబు
దెలియంగఁ దల్లి భూ♦దేవిరూపు
భగిని కరుణరూపు ♦ భావంబు ధర్మ స్వ
రూపంబు దా నర్థి♦రూపు మొదల
నభ్యాగతుఁడు మున్న♦యగ్నిదేవునిరూపు
సర్వభూతములుఁ గే♦శవునిరూపు
ఆ. గాన తండ్రి వేగ ♦ కడు నార్తులగుపిత్రు
జనుల మైనమమ్ముఁ ♦ జల్లఁ జూచి
[1]పరభయంబు వాపి ♦ నిరుపమం బగు తపో
మహిమచేత మెఱసి♦మనుపవయ్య. 289

వ. ఇప్పుడు బ్రహ్మనిష్ఠుండ వైన నిన్నాచార్యునింగా వరియించి భవదీయ తేజోవిశేషంబుచేత వైరివీరులం బరిమార్చెద మాత్మీయార్థం బయిన[2]యుష్మత్పాదాభివందనంబు నిందితంబు గాదని వేదవాక్యంబు గలదు గావున నీకు నమస్కరించుచున్న దేవతలం గైకొని పౌరోహిత్యంబు సేయు మనినం బ్రహసితవదనుండై యమ్మునీశ్వరుండిట్లనియె. 287

తే. బ్రహ్మతేజంబు వోయెడి♦ప్రార్థనంబు
ధర్మగుణగర్హితంబని తా నెఱింగి
సొరిదిననుబోఁటితపసియా♦సురలచేతఁ
బ్రకటమధురోక్తి నేటికిఁ♦బలుకఁబడియె.

వ. విశేషించి. 289

క. గురుధనముఁ గూర్పనేటికి, గురుశిక్షం దగిలి మంత్ర♦కోవిదులై స
ద్గురుధర్మనిరతులేనిఁ, గురువులకునుశిష్యవరులె♦కూర్చినధనముల్

---

1 పరభయంబు = శత్రువులవలని భయము

2 యుష్మత్పాదాభి వందనము = మిగుల చిన్నవానియొక్క అడుగులకు నమస్కరించుట.

సీ. అరయ నకించను ♦ లైనట్టివారికిఁ
దగు 1 శిలోంఛనవృత్తి ♦ ధనము సుమ్ము
దానిచే 2 నిర్వర్తి ♦ తప్రియసాధుస
త్క్రియగలవారలై ♦ ప్రీతినొంది
రది గాన సద్గృహా ♦ తాచార మైనయా
చార్యత్వ మిపుడు మా ♦ శాసనమునఁ
గైకొంటి గురువుల కామంబు 3 ప్రాణార్థ
వంచనములు లేక ♦ వడి నొనర్తు
ఆ. ననుచు విశ్వరూపుఁ ♦ డనియెడు ముని ప్రతి
జ్ఞోక్తిఁ బలికె వారి ♦ నూఱడించి
మహిత మైనతత్స ♦ మాధిచే గురుభాస
మమరఁ జేసె దేవ ♦ సమితి కపుడు. 291

క. 4 భార్గవవిద్యా గుప్త, స్వర్గశ్రీద్విగుణదనుజ ♦ సమధికసంప
ద్వర్గముల విష్ణుమాయా, సర్గిళగతిఁ దెచ్చి యింద్రు ♦ నకు నిచ్చె నృపా.
క. ఏవిద్యచేత రక్షితుఁ, డై వజ్రిదురంబులోన ♦ నసురులఁ ద్రుంచెన్
భావింప నట్టివిద్యను, శ్రీవరమాయామతంబుఁ ♦ జెప్పెను వారికిన్.
ఉ. నావుడు పాండవాన్వయుఁడు ♦ నమ్మికభక్తి జగన్నివాసు రా
జీవదళాక్షుఁ గృష్ణుఁ దన ♦ చిత్తమునన్ భజియించి పల్కె నో
దేవగణార్చితాంఘ్రియుగ ♦ దివ్యమునీశ్వర విశ్వరూపుఁ డ
ప్పావన మైనవిద్య సుర ♦ పాలున కేక్రియ నిచ్చెఁ జెప్పవే 294
ఉ. ఎందును రక్షితుండగుచు ♦ నింద్రుఁడు లీలయపోలె వైరిసే
నం దునుమాడి దేవతలు ♦ నమ్మి సుఖింపఁగ నిష్టసంపదం
జెంది సమస్తలోకములఁ ♦ జేకొని యేలె మునీంద్ర దాని నే
విందు సుఖంబుఁ గందు నిఁక ♦ వీనులు నంతస మందఁ బల్కవే.

---

1 శిలము = క్షేత్రములయందు జాఱిన వెన్నులు మున్నగువానిని జీవనమునకై ఏఱికొనుట. 2 నిర్వర్తిత ... సత్క్రియ = చేయఁబడిన యిష్టమును, సమంజసమును, అయిన మంచిపని. 3 ప్రాణార్థవంచనములు = జీవన, ద్రవ్యవంచనములు.

4 భార్గవ ... వర్గముల = భార్గవవిద్యచే గుప్తములయినట్టియు, స్వర్గశ్రీ కిన్ని రెట్టింపయినవియు, రాక్షసులయొక్క యత్యధికములగు సంపత్సమూహములను,

—♦ శ్రీమన్నారాయణ కవచప్రారంభము. ♦—

క. వరనారాయణకవచము, నరిభీకరవజ్రకవచ ♦ [1]మాశ్రితసంప
త్పరిణామకర్మకవచము, పురుహూతున కెట్లుమాని ♦ బోధించెదగన్ 297

వ. అనినం బరీక్షిజ్జనపాలునకు మునినాథుం డిట్లనియె.

సీ. వినవయ్య నరనాథ ♦ మునినాథుఁ డింద్రున
కను వొంద నారాయ ♦ ణాఖ్యమైన
కవచంబు విజయసం ♦ కల్పంబు నప్రమే
యస్వరూపంబు మ ♦ హాఫలంబు
మంత్రగోప్యము హరి ♦ మాయావిశేషంబు
సాంగతతోడ నె ♦ ఱుంగఁజేసె
దాని నే వినిపింతుఁ ♦ బూని తదేకాగ్ర
చిత్తంబుతోడఁ దేఁ ♦ జిత్తగింపు

తే. మొనర ధౌతాంఘ్రిపాణియై ♦ యుత్తరంబు
ముఖముగానుత్తమాసన ♦ మునవసించి
[2]కృతనిజాంగకరన్యాస ♦ మతిశయిల్ల
మహితనారాయణాఖ్యవ ♦ ర్మము నొనర్చి. 298

వ. ఇట్లు నారాయణకవచంబు ఘటియించి పాదంబులను జానువులను నూరువులను నుదరంబునను హృదయంబునను నురంబునను ముఖంబునను శిరంబునను నిట్లష్టాంగంబులం బ్రణవపూర్వకంబైనయష్టాక్షరీ మంత్రరాజంబుపన్యాసంబు సేసి ద్వాదశాక్షరవిద్యలచేతం గరన్యాసంబు సేసి మంత్రమూర్తియై భగవచ్ఛబ్దవాచ్యంబైన ప్రణవాది యకారాంత మగుమహామంత్రంబుచేత [3]నంగుళ్యంగుష్ఠపర్వసం

1 ఆశ్రిత ... కవచము = ఆశ్రయించిన వారియొక్క విభవ పరిపాకమునకైన కర్మ యనెడి కవచము,

2 కృత ... న్యాసము = చేయఁబడిన తనదైన అంగమన్యాసమును, కరన్యాసము.

3 అంగుళ్యం ... సంధులయందును = వ్రేళ్ళయొక్కయు, బొటన వ్రేలియొక్కయు, అన్నికణుపులయందును.

ధులయం దుపన్యసించి మఱియు హృదయంబున నోంకారంబు వికారంబు మూర్ధంబున షకారంబు భ్రూమధ్యంబునందు ణకారంబు శిఖయందు వేకారంబు నేత్రంబులయందు నకారంబు సర్వసంధులయందు మఱియు నస్త్రము నుద్దేశించి మకారంబు నుపన్యసించెనేని మంత్రమూర్తి యగు మఱియును నస్త్రియషట్కనుమంత్రంబున దిగ్బంధనంబు సేసి పరమేశ్వరునిం దనభావంబున నిల్పి విద్యామూర్తియుఁ దపోమూర్తియు నగు షట్ఛక్తిసంయుతం బయిన నారాయణ కవచాఖ్యమైనమంత్రరాజంబు నిట్లని పఠియించె. 299

చ. గరుడునిమూఁపుపై బదయు♦గంబు ఘటిల్లఁగ శంఖచక్రవ
ర్మరుచిరశార్ఙ్గఖడ్గశర♦రాజితపాశగదాదిసాధనో
త్కరనికరంబు లాత్మకరకంజములన్ ధరియించి భూతిసం
భరితమహాష్టబాహుఁడు కృపామతితో ననుఁ గాచుఁ గావుతన్.

ఆ. ప్రకటమకరవరుణ♦పాశంబులందుల
జలములందు నొందుఁ ♦ బొలియకుండఁ
గాచుఁ గాక నన్ను ♦ ఘనుఁ డొక్కఁ డైనట్టి
మత్స్యమూర్తి విద్య♦మానకీర్తి. 301

క. వటుఁడు సమాశ్రితమాయా
నటుఁడు 1బలిప్రబలశోభన♦ప్రతిఘటనో
ద్భటుఁడు త్రివిక్రమదేవుఁడు
చటులస్థలమందు నన్ను ♦ సంరక్షించున్. 302

చ. అడవుల సంకటస్థలుల ♦ నాజిముఖంబుల నగ్నికీలలం
దెడరుల నెల్ల నాకు నుతి ♦ కెక్కఁగ దిక్కగుఁ గాక శ్రీనృసిం
హుఁడు 2సురశత్రుయూథపవ♦ధోగ్రుఁడు 3విస్ఫురితాట్టహాసవ
క్త్రుఁడు ఘనదంష్ట్రిపావకవి♦ధూతదిగంతరుఁ డప్రమేయుఁడై.

---

1 బలి ... ఉద్భటుఁడు = బలిచక్రవర్తియొక్క గొప్పదను శుభస్థితిని అడ్డగించుటయందు మేటి.

2 సుర ... ఉగ్రుండు = రాక్షసులనెడు గజాధిపతుల చంపుటయందు భయంకరుఁడు. 3 విస్ఫురితాట్టహాస వక్త్రుఁడు = విలసిల్లెడి బొబ్బనవ్వుగల మోముకలవాఁడు.

చ. అరయఁగ నెల్లలోకములు ♦ [1]సంకిలి నొంద మహార్ణవంబులో
నొరగి నిమగ్నమైనధర ♦ నుద్ధతిఁ గొమ్మున నెత్తినట్టియా
కిరిపతి యగ్నికల్పుఁ డురు♦ఖేలుఁడు నూర్జితమేదినీమనో
హరుఁడు గృపావిధేయుఁడు స♦దాధ్వముల నన్నుఁగాచుఁ గావుతన్

క. రాముఁడు [2]రాజకులైకవి
రాముఁడు భృగుసత్కులాభి♦రాముఁడు సుగుణ
స్తోముఁడు నను రక్షించును
శ్రీమహితోన్నతుఁడు నద్రి♦శిఖరములందున్. 305

సీ. తాటక మర్దించి ♦ తపసిజన్నముఁ గాచి
హరువిల్లు విఱిచి ధై♦ర్యమున మెఱసి
ప్రబలులైనట్టివి♦రాధకబంధోగ్ర
ఖరదూషణాదిరా♦క్షసులఁ దునిమి
వానరవిభు నేలి ♦ వాలిఁ గూలఁగ నేసి
జలరాశిగర్వంబుఁ ♦ జక్కఁజేసి
సేతువు బంధించి ♦ చేరి రావణకుంభ
కర్ణాదివీరులఁ గడిమిఁ ద్రుంచి
తే. యలవిభీషణు లంకకు ♦ నధిపుఁ జేసి
భూమిసుతఁ గూడి సాకేత♦పురమునందు
రాజ్యసుఖములు గైకొన్న ♦ రామవిభుఁడు
వరుస నన్నుఁ బ్రోచు చుండుఁ బ్ర♦వాసగతుల. 306

వ. మఱియు నఖిలప్రమాదంబులైన [3]యభిచారకర్మంబులవలన నారాయణుండును గర్వంబువలన నరుండును యోగభ్రంశంబువలన యోగనాథుం డయినదత్తాత్రేయుండును గర్మబంధంబుల వలన

1 అంకిలి = కలత. 2 రాజ ... రాముఁడు = రాజులసమూహమును ముఖ్యముగా కనిమసంగినవాఁడు.

3 అభిచార కర్మంబులు = శత్రువులు మంత్ర తంత్రాదులచే నొనర్చు హింసా కార్యములు (శ్యేనయాగాదులు)

గణేశుం డైన కపిలుండును గామదేవునివలన సనత్కుమారుండును మార్గంబుల దేవహేళనంబు సేయుటవలన శ్రీహయగ్రీవమూర్తియును దేవతానమస్కారతిరస్కార[1]దేవపూజాచ్ఛిద్రంబులవలన నారదుండును నశేషనిరయంబులవలనఁ గూర్మంబును [2]నపథ్యంబువలన భగవంతుం డైన ధన్వంతరియును జనాపవాదంబువలన నగ్నిదేవుండును జననమరణాదులం గలుగఁ జేయుకర్మంబులవలన బలభద్రుండును గాలంబువలన యముండును సర్పగణంబులవలన శేషుండును నప్రబోధంబువలన ద్వైపాయనుండును బాషండసమూహంబువలన బుద్ధదేవుండును శనైశ్చరునివలనఁ గల్కియు నై ధర్మరక్షణపరుం డయిన మహావతారుండు నన్ను రక్షించుం గాతఁ బ్రాహ్ణమధ్యాహ్నాపరాహ్ణసాయంకాలంబులను బ్రదోషార్ధరాత్రాపరరాత్రప్రత్యూషానుసంధ్యలను గదాద్యాయుధంబుల ధరియించి కేశవ నారాయణ గోవింద విష్ణు మధుసంహార త్రివిక్రమ వామన హృషీకేశ పద్మనాభ శ్రీవత్సధామ సర్వేశ్వరేశ జనార్దన విశ్వేశ్వర కాలమూర్తు లను నామరూపంబులు గలదేవుండు నన్ను రక్షించుం గాక ప్రళయకాలానలాతితీక్ష్ణసంభ్రమభ్రమణనిర్వక్రవిక్రమవక్రీకృతదనుజచక్రం బైన సుదర్శననామచక్రంబ మహావాయుప్రేరితుం డై హుతాశనుండు నీరసతృణాటవుల భస్మీభూతంబు సేయుభంగి భగవత్ప్రియుక్తంబ వై మద్వైరిసైన్యంబుల దగ్ధంబు గావింపుము జగత్సంహారకాలపటుఘటితచటులమహోత్పాత గర్జారవ తర్జన దశదిశాభివర్జిత ఘనఘనాంతర నిష్ఠ్యూత నిష్ఠుర కోటిశతకోటిసంస్పర్శస్ఫురద్విస్ఫులింగనిర్గమానర్గళ భుగభుగాయమానమూర్తి విస్ఫూర్తి నారాయణకరకమలవర్తి గదాయుధోత్తమ మదీయవైరిదండోపదండంబుల భండనంబునం జండగతిం బిండిపిండిగాఁ గూశ్మాండవైనాయకరక్షోభూతగ్రహంబులు చూర్ణంబులుగాఁ గొండొకవినోదంబు సలుపుము దరేంద్రంబ వైన

---

1 దేవతాఛిద్రంబులు = దేవతలను, నమస్కరించుట పూజించుటలయందలి లోపములు. 2 అపథ్యము = శరీరమునకు పసికాని, ఆహారము, విహారము మొదలైనది.

పాంచజన్యంబ సర్వలోకజిష్ణుండై నశ్రీకృష్ణునిఁ [1]నిఖిలపుణ్యైకసదన వదననిష్ఠ్యూతనిశ్శ్వాసాధర వేణుపరిపూరితంబ వై యున్మత్తభూత ప్రేతపిశాచ విప్రగ్రహాదిక్రూరదుర్గ్రహంబులు విద్రావణంబులుగా నస్మత్పరవీరమండలంబుల గుండియలతోఁ దదీయమానినీ దుర్భర గర్భంబులు గర్భస్థార్భకవివర్జితంబులుగా నవియ బ్రహ్మాండభాండ భీకరం బయినభూరినాదంబున మోఁదు [2]మతితీవ్రధారాదళితనిశా తకోటి కఠోరకంఠకరాళరక్తధారా ధౌతమలీమసవిసరంబ వైన నందకమహాసిశేఖరంబ జగదీశప్రేరితంబ నై మద్విద్వేషమవ్యూ హంబుల మొదుఖండములుగ ఖండించి చెండాడుము నిష్కళంక నిరాతంకసాంద్రచంద్ర మండలపరిమండితసర్వాంగలక్షణవిచక్షణ ధర్మనిరతంబ వయినచర్మంబ దుర్మదమద్వైరిలోకంబులకు సమా కులనిబిడనీరంధ్రనిష్ఠురతమఃపటలపటుఘటనంబులం గుటిలపఱు పుము నిఖిలపాపగ్రహంబులవలనను సకలమృగసర్పక్రోడభూతా దులవలనను నగుభయంబులు వొందకుండ భగవన్నామరూప యానదివ్యాస్త్రంబులు రక్షించుం గాక బృహద్రథంతరాదిసామం బులచేత స్తోత్రంబు సేయంబడుచున్న ఖగేంద్రుండు రక్షణదక్షుండై నన్ను రక్షించుగాక శ్రీహరి నామరూపవాహన దివ్యాయుధ పారిషదోత్తమప్రముఖంబులగు లస్మదీయ బుద్ధీంద్రియ మనః ప్రాణంబుల సంరక్షించు భగవంతుం డయిన శేషుండు సర్వో పద్రవంబుల నాశంబు సేయు జగదైక్యభావం బయినధ్యానంబు గలవానికి వికల్పరహితుండై భూషణాయుధలింగాఖ్య లగు శక్తు లం దనమాయచేత ధరియించి తేజరిల్లుచుండు లక్ష్మీకాంతుండు వికల్పవిగ్రహంబులవలన నన్ను రక్షించుఁగాక లోకభయంకరాట్ట హాసభాసురవదనగహ్వరుం డగుచు సమస్త తేజోహరణధురీణ

---

1 నిఖిల ... పూరితంబువై = సమస్త పుణ్యములకును ప్రధానస్థానమగు నోటిచే వెల్వఱుపఁబడినగాలిగల యధరవేణు దండముచే పూరింపఁబడినదానివై.

2 అతి ... విసరంబవై = మిక్కిలిపదునుగల వాయిచే ఖండింపఁబడిన రాక్షసుల సమూహముయొక్క మొఱటుకుత్తుకలదైన వెఱపుగొల్పు నెత్తుటిజాలుచే కడుగఁబడిన మలినసమూహము కలదానవై. చర్మము = వేడములేని డాలు

తేజఃపుంజసంజాతదివ్యనృసింహావతారుం డగునప్పరమేశ్వరుండు సర్వదిగ్భాగంబులవలన నన్నురక్షించుచుండుఁ గాక యని నారాయణాత్మకకవచప్రభావం బితిహాసరూపంబున నింద్రుండు దెలిసి కొని ధ్యానంబుసేసి తద్విద్యాధారణమహిమవలన నరాతులనిర్జించెంగావున నెవ్వరేని నిర్మలాత్ము లగువార లేతద్విద్యాధారణులై యనుదినంబును బఠియించిన నతిఘోరరణంబుల నత్యుత్కటసంకటంబులను సర్వగ్రహానిగ్రహాకర్మమారణకర్మాదిదుష్కర్మ జన్యక్లేశంబులను వదలి యవ్యాకులమనస్కులై విజయంబు నొందుదురు మఱియును సర్వరోగంబులకు నగమ్యశరీరులై సుఖంబు నొందుదురదియునుం గాక. 307

సీ. అతిభక్తిఁ గౌశికుం♦డను బ్రాహ్మణుఁడు దొల్లి
యీవిద్య ధరియించి♦ యెలమి మించి
మరుభూమియందు ని♦ర్మలచిత్తుఁడై యోగ
ధారణంబున నిట్టు ♦ తనువు విడిచె
దానిపై నొకఁడు గం♦ధర్వపశ్రేష్ఠుండు
చిత్రరథాఖ్యుఁ డ♦చేయుఁ దొంటి
1చదలఁ జనంగఁ ద♦చ్ఛాయ తదస్థిపైఁ
గదిసిన నాతఁడు ♦ గళవళించి
ఆ. యువిదపిండుతోడ ♦ నవవిమానముతోడఁ
దనదువిద్యతోడ ♦ ధరణిఁ ద్రెళ్లి
తిరిగి లేవలేక ♦ తికమక గుడువంగ
వాలఖిల్యమౌని ♦ వానిఁ జూచి 308

క. 2నారాయణకవచసమా, ధారణపుణ్యాస్థి దీని ♦ దగ్గఱ నీరుం
గూరెడినె విష్ణుభక్తుల, వారక చేరంగ నెట్టి♦వారికిఁ దరమే.

ఇంద్రవజ్రము. సంధించి నీయంగక♦సంధు లెల్లన్
బంధించి తన్మంత్ర♦బలంబు పేర్మి

1 చదలు = ఆకసము
2 నారాయణ ... అస్థి = నారాయణ కవచమను మంత్రమును ధరించుట చేత (జపించుట చేత) పవిత్రుండైన యెముక.

న్నందంబు మాన్పింపఁ ద♦దన్యమేది
సింధుప్రవాహోన్నతి♦ చేతఁ దీరున్. 310

వ. కావున నీపుణ్యాశల్యంబులు భక్తియుక్తుండవై కొనిపోయి ప్రాఙ్ముఖం
బునఁ బ్రవహించెడు సరస్వతీజలంబుల నిక్షేపణంబు సేసి కృతస్నా
నుండవై యాచమనంబు సేసిన నీసర్వాంగబంధనంబులుడుగు ననిన
నతం డట్ల చేసి తనవిమానం బెక్కి నిజస్థానంబున కరిగె గావున.

క. అనుదినము దీని నెవ్వరు
వినిరేనిఁ బఠించిరేని ♦ విస్మయ మొదవన్
ఘనభూతజాల మెల్లను
మునుకొని వారలను గాంచి ♦ మ్రొక్కుచు నుండున్. 312

ఆ. విశ్వరూపువలన ♦ నైశ్వర్యకర మైన
యిట్టివిద్యఁ బాల్చి♦యింద్రుఁ డపుడు
మూఁడులోకములకు ♦ ముఖ్య మైనట్టిశ్రీ
ననుభవించి మించె ♦ నధికమహిమ. 313

సీ. భూపాల యావిశ్వ♦రూపున కరుదైన తలలు
మూఁడనువొందఁ♦గలిగి యుండు
పొరిది సురాపాన ♦ సోమపానంబులు
నన్నాదమనఁగను ♦ నమరవరుల
తోఁ గూడి భుజియించి ♦ తూకొని వారితో
యజ్ఞభాగంబు ప్ర♦త్యక్ష మొంది
కైకొనుచుండి దు♦ష్కర్ముఁడై యాయజ్ఞ
భాగంబు రాక్షస ♦ ప్రవరులకును

ఆ. దల్లిమీఁద గలుగు♦తాత్పర్యవశమున
దివిజవరుల మొఱఁగి ♦ తెచ్చి యిచ్చు
నది యెఱింగి యింద్రుఁ ♦ డతిభీతచిత్తుఁ డై
తనకుఁ గానియతని♦తలలు ద్రుంచె. 314

క. భాసురుఁ డనక మహాత్ము
గ్రేసరుఁ డన కతఁడు పూర్వ♦కృతకర్మగతిన్

1వేసరఁ డనక మహేంద్రుఁడు
భూసురుతల లపుడు రోష♦మునఁ దెగ నడిచెన్. 315

వ. ఇట్లయ్యింద్రుండు క్రోధంబు సహింపం జాలక విశ్వరూపుతలలు ఖడ్గంబునం దెగనడచిన సోమపానంబు సేయుశిరంబు 2కపింజలం బయ్యె సురాపానంబు సేయుశిరంబు కలవింకం బయ్యె నన్నంబు భక్షించుశిరంబు తిత్తిరి యయ్యె నిట్లు త్రివిధపక్షిస్వరూపంబు దాల్చి బ్రహ్మహత్య చేతెంచి యింద్రునిఁ జుట్టుకొని తమ్ము బరిగ్రహింపు మని నిర్బంధింప నపు డింద్రుం డతిభీతచిత్తుండై త్రిలోకనాయకుం డైనను దానిం దప్పించుకొనం జాలక యంజలి యొగ్గి యమ్మహాదోషంబుఁ గైకొని తద్దోషం బొక్కసంవత్సరం బనుభవించి యంతం బాపుకొనువాఁడై భూజలవృక్షస్త్రీలం బ్రార్థించి మద్దురితంబు చతుర్విధంబులం బుచ్చికొనుండనిన భూమి తనయందుఁ జేయంబడినఖాతంబు తనంతన పూఁడునట్టి వరంబును జలంబు సర్వంబు తనయందుఁ బ్రక్షాళితంబైనం బావనం బగునట్టి వరంబును వృక్షంబులు ఛేదింపంబడి పునఃప్రరోహంబు గలుగు వరంబును స్త్రీ లెల్లప్పుడుం దమకుఁ గామసుఖంబు గలుగునట్టి వరంబును గోరిన నతం డట్ల కా నొసంగిన నతనిదుష్కృతంబు ధరణి నెఱియ లూషరక్షేత్రంబులవిధంబునను నుదకంబు బుద్బుద ఫేనరూపంబునను మహీరుహంబులు నిర్యాసభావంబు నను నింతులు రజోవికారంబునను నిట్లుచతుర్భాగంబులం బంచికొని రంత. 316

మ. హతపుత్రుం డగువిశ్వరూపజనకుం ♦ డాత్వష్ట దుఃఖాయత్తో
ద్ధతరోషానలదహ్యమానుఁ డగుచుం ♦ దా నింద్రు పై మారణ
క్రతుహోమం బొనరింప నందుఁబొడమెం ♦ 3గల్పాంతకాళాకారవి
శ్రుతకీలానలనిష్ఠురేక్షణగుణ♦క్షుభ్యత్త్రిలోకోగ్రుఁడై. 317

---

1 వేసరఁడు = విసువుకొనఁడు. 2 కపింజలము = కముజుపిట్ట కలవింకము = ఊరపిచ్చుక ఊషరము = చవుటి నేల నిర్యాసము = బంక

3 కల్పాంత ... ఉగ్రుడై = ప్రళయకాలమునందలి యమునివంటి రూపుచేతను, ప్రశస్తములగు జ్వాలలుగల యగ్నివలె కఠినములగు చూపులయొక్క గుణముచేతను కలఁతపడుచున్న ముల్లోకములుకలవాఁడును, భయంకరుఁడును నై

సీ. యుగముద్రుంగెడునాఁడు • జగములు వొలియించు
నంతకుమూర్తి పై • నింతయగుచుఁ
బలుపును బొడవును • బ్రతిదినంబును నొక్క
శరపాతమంగంబు • విరివిగొనుచుఁ
గడుదగ్ధశైలసం • కాశదేహమునందుఁ
గరము సంధ్యారాగ • కాంతి బెరయ
మునుగాఁక రాగిచేఁ • 1గనుమించుమించులఁ
గఱకుమీసలుకచా • గ్రములు మెఱయఁ

తే. 2చండమధ్యాహ్నమార్తాండ • మండలోగ్ర
చటులనిష్ఠురలోచనాం • చలవిధూత
దశదిశాభాగుఁ 3డుజ్జ్వల • తరకరాళ
భిదురసునిశితదంష్ట్రోరు • వదనగుహుఁడు. 318

ఉ. నింగికి నేలకుం బొడవు • నిచ్చలమై శిఖలందుఁ బర్వను
త్తుంగతరాగ్నిజాలములఁ • దొట్రిలుచుఁ గ్రహపంక్తి జాఱ 4 ని
స్సంగకరాళశాతఘన • సద్ఘృణిమండలచండశూల ము
ప్పొంగుచుఁ గేలఁ లీలఁ గొని • భూమి చలింపఁగ సోలియాడుచున్

సీ. వదలక విరివిగా • వదనంబుఁ దెఱచుచు
నాకాశ మంతయు నప్పళించుఁ
గడనాల్క నిగిడించి • గ్రహతారకంబుల
నయు మెల్ల దిగజాఱ • నాకి విడుచు
నలవోకయునుబోలె • నట్టహాసము సేసి
మెఱసి లోకము లెల్ల • మిగ్రింగఁ జూచుఁ

---

1 కనుమించుమించులు=నేత్రకాంతులలనెడి మెఱపులు 2చండ ... భాగుఁడు = తీవ్రమగు మధ్యాహ్నసమయమందలి సూర్యమండలమువలె తీవ్రములును, భయంకరములును, కఠినములును అగుకనుగొనలచే కంపింపఁజేయఁబడిన పదిదిక్కుల ప్రదేశములుగలవాఁడు 3 ఉజ్జ్వల ... గుహుఁడు=మిగుల ప్రకాశించుచున్నవియు, భయంకరమైనవియు, వజ్రాయుధమువలె, పదనైనవియునైన కోరలచే గొప్పదగు నోరనుగుహ కలవాఁడు.

4 నిస్సంగ ... శూలము = అడ్డులేనట్టియు, భయంకరమైనట్టియు, పదనైనట్టియు, గొప్పకాంతులసమూహము కలినట్టియు, తీవ్రమగుశూలము.

దనరుదిగ్దంతిదం♦తములు సెక్కలు వాఱి
నుగ్రదంష్ట్రలు ద్రిప్ప ♦ నుఱుక మింగిలి

తే. త్వష్టబలితంపుఁదపమునఁ♦బుట్టి నొంది
యఖిలలోకంబులెల్లఁ దా♦నాక్రమించి
వృత్రనామాఖ్య దేవతా♦శత్రుఁడగుచు
దారుణాకారుఁడఖిలదు♦ర్దముఁడు మెఱసె.

మత్తకోకిలము. అట్టివృత్రునిమీఁద దేవత♦లల్కతోఁ బెనుమూఁకలై
చుట్టి ముట్టి మహాస్త్రవిద్యలు ♦ సూపి యేపున నేయ నా
గ్రొట్టువీరుఁడు వారలేసిన♦క్రూరశస్త్రము లన్నియుం
జుట్టి పట్టుక మ్రింగి శూరత♦జోకనార్చె మహోగ్రుఁడై. 321

క. భక్షితదివ్యాస్త్రుండగు, రక్షోనాయకుని సమర♦రాజప్రముఖుల్
వీక్షింప వెఱచి పఱచిరి, రక్షకుఁ జింతించికొనుచు♦రయమొప్పారన్

వ. ఇట్లు సర్వసాధనంబులతోడ సాధుజనంబులవృత్రాసురుండు మ్రింగిన నచ్చెరువడి చేయునది లేక తత్తేజోవిశేషవిభవంబునకు భయంబునొంది కందినడెందంబునం గుందుచుం బురందరప్రముఖులార్తరక్షకుండగుపుండరీకాక్షునకుం గుయ్యిడువారై. 323

లయగ్రాహి. వీఁడు కడు దుర్దముఁడు♦వాఁడిమనకైదువులు
వాఁడి చెడఁగా మెసవి ♦ యీడుగన కున్నా
ఁడెడ బ్రదుకింకఁ బెనుఁ♦గీడు వొడమెన్ మనకుఁ
దోడుపడ నొక్కరుఁడు ♦ లేఁడు హరి దక్కన్
వేఁడుదము శ్రీధరునిఁ ♦ గూడుదము సద్భటులఁ
బాడుదము గీతముల ♦ జాడపడు నంతన్
వీఁడు చెడుత్రోవ దయ♦తోడ నెఱిఁగించు ఘనుఁ
డోడక సురాలయము ♦ పాడువడ దింకన్. 324

క. అని తలపోయుచుఁ దమలో
మునుఁగుచుఁ దికమకలు గొనుచు♦మురరిపుకడకున్

ఈడు = సాదృశ్యము

గునుకుచుఁ దినుకుచుఁ నేఁగిరి
ఘనరాక్షసుఁ గన్నకన్నుఁగవ బెగ్గిలఁగన్.

వ. ఇట్లు భయార్తులై యమభృత్యవ్రాతంబు సని చని ముందట నభంగభంగరంగదుత్తుంగడిండీరమండల సముద్దండాడంబర విడంబిత నారాయణనిరంతర కీర్తిలతా కుసుమగుచ్ఛస్వచ్ఛంబును ననవరతగోవింద చరణారవింద సేవాసమాకులకలకలఫలితమహాపుణ్యఫలాయమాన సముద్దీపితావర్తవర్తిత దక్షిణావర్తరుచిరశంఖమండలమండితంబును నతినిష్ఠురకఠినపాఠీనపృథురోమరాజిసంకుల తిమి తిమింగిల కర్కటకమఠకచ్ఛపమకరనక్ర వక్రగ్రహాగ్రహాణ ఘుమఘుమారావదారుణ గమనవిషమితవిషమతరంగ ఘట్టనఘట్టితసముద్ధూతశీకరనికరనీరంధ్ర తారకిత తారాపథంబును మహోచ్ఛ్రియశిలోచ్చయశిఖరాగ్ర ప్రవహితదుగ్ధ నిర్ఝరసమ్మార్జిత పురాణపురుష విశుద్ధశుద్ధాంత విహరణధురీణ నవసుధాధౌతధావళ్యధగద్ధగాయమానరమ్యహర్మ్య నిర్మాణకర్మంబును నతిపవిత్రగుణవిచిత్ర నిజకళత్రప్రేమానందసందర్శితముకుంద పరిస్రవదంతరంగకరుణారస పరిమిళితభావబంధురవిద్రుమవల్లీమతల్లి కాంకురశోభితంబును ప్రసిద్ధసిద్ధరసాంబువాహ సంగమసముత్థిత గంభీరఘోషపరిదూషిత సకలరోదోంతరాళంబును సముద్రమేఖలాఖిలప్రదేశవిలసిత నవీనదుకూలాయమానంబును హరిహరప్రముఖదేవతానిచయపరిలబ్ధామృత మహైశ్వర్యదానధౌరేయ మహానిధానంబును వైకుంఠపురపౌరవరకామ్య ఫలఫలిత మందారపారిజాత సంతాన కల్పవృక్ష హరిచందన ఘనవనానుకూలంబును నై యొప్పుచుఁ గుబేరభాండాగారంబునుంబోలెఁ బద్మ మహాపద్మ శంఖమకరకచ్ఛపముకుందకుంద నీలవరసమగ్రంబై విష్ణుకరకమలంబునుంబోలె [1]సుదర్శనావర్తప్రగల్భంబై కైలాసమహీధరంబునుం బోలె నమృతకళాస్థాన శేఖరపదార్పణంబై యింద్రవైభ

1 సుదర్శనావర్తప్రగల్భంబై = చూడదగిన సుడులచేతనికడినదై — చక్రము, దక్షిణావర్త శంఖములతో కూడినదై అనియు శ్లేష.

వంబునుం బోలెఁ గల్పవృక్షకామధేను చింతామణి జనితంబై సుగ్రీవసైన్యంబునుంబోలె 1నపరిమితనిబిడ హరిసంచారంబై నారాయణోదరంబునుం బోలె 2నిఖిలభువనభారభరణసమర్థంబై శంకరు జటాజూటంబునుం బోలె గంగాతరంగిణీసమాశ్రయంబై బ్రహ్మలోకంబునుంబోలెఁ 3బరమహంసకుల సేవ్యంబై పాతాళలోకంబునుంబోలె ననంతభోగిభోగయోగ్యంబై నందన వనంబునుంబోలె నైరావతమాధవీ రంభాదిసంజననకారణంబై సౌదామినీనికరంబునుంబోలె నభ్రంకషంబై విష్ణునామకీర్తనంబునుంబోలె నిర్మలస్వభావంబై క్రతుశతగతుండునుంబోలె, హరిపదభాజనంబై యొప్పుచున్నదుగ్ధవారాశిడాసి శ్వేతద్వీపంబున నసియించి యందు సకల దిక్పాలకాది దేవతలు దేవదేవునాశ్రయించియిట్లనిస్తుతియించిరంత.

సీ. పంచమహాభూత♦పరినిర్మితంబైన
ముజ్జగంబుల కెల్ల . నొజ్జయైన
బ్రహ్మయు నేమును♦బరఁగ నందఱుఁ గూడి
యెవ్వని కై పూజ ♦ లిత్తు మెపుడు
నట్టిసర్వేశ్వరుం♦డాగమవినుతుండు
సర్వాత్మకుఁడు మాకు ♦ శరణ మగును
4అతిపూర్ణకాము న♦హంకారదూరుని
సముని శాంతునిఁ గృపా♦స్పదుని గురుని
తే. మాని యన్యుని సేవింప ♦ బూనునట్టి
కపటశీలుని నతిపాప ♦ కర్మబుద్ధి
శునకవాలంబు వట్టుక ♦ ఘనతరాబ్ధి
దరియఁ జూచుట గాదెతాఁ ♦ దామసమున. 327

1 అపరిమిత నిబిడహరి సంచారంబై = కొలఁదియిడరాని గుడతెగని కోఁతుల తిరుగుటకలదై — హరియైన నారాయణుఁడనియును శ్లేష. 2 నిఖిలభువనభారభరణ సమర్థంబు = సమస్త జలములయొక్క పెంపును పూనఁజాలినది అఖిలలోకములయొక్క బరువును మోయ సమర్థమైనదనియును శ్లేష. 3 పరమహంస కులసేవ్యంబు = రాజహంసల సమూహముచే సేవింపఁదగినది -యోగిశ్రేష్ఠుల సమూహముచే పొందఁదగినదనియు శ్లేష. 4 అతిపూర్ణకాము = మిక్కిలి నిండిన కోర్కెలు గలవానిని.

చ. ఉదకమయంబునన్ వసుధ ♦ నోడఁగఁజేసి తనర్చుకొమ్మునన్
వదలక యుంటఁ గట్టి మను♦వల్లభుఁ గాచినమత్స్యమూర్తి స
మ్మదమున మమ్ముఁబ్రోచు నను♦మానముమానఁగ వృత్రుచేతియా
పద దొలఁగించి నేఁడు సుర♦పాలురపాలిటిభాగ్యదైవమై. 328

మత్తకోకిలము. రంతుసేయుచు 1వాతధూతక♦రాళభంగురభంగదు
ర్దాంతసంతతసాగరోదక♦తల్ప మొంది వసించుబ్ర
హ్మంతవానిని బొడ్డుఁదమ్మిని ♦ నాఁచి కాచిననేర్పరిం
తంతవాఁ డనరానియొంటరి ♦ యాదరించు మముం గృపన్. 329

తే. దేవతల మైనమే మిట్టి ♦ దేవదేవు
సర్వలోకశరణ్యుని ♦ శరణు చొచ్చి
బలిత మైనట్టివీనియా♦పదలఁ బాసి
మీఁటి శుభములఁ జేకొను♦వార మిపుడు. 330

వ. ఇట్లు స్తుతియించుచున్న దేవతలకు భక్తవత్సలుండైన వైకుంఠుండు
ప్రసన్నుండయ్యె నప్పుడు. 331

సీ. తగుశంఖచక్రగదాధరుండగువాని
శ్రీవత్సకౌస్తుభ ♦ శ్రీలవానిఁ
2కమనీయమాణిక్య♦ఘనకిరీటమువాని
దివ్యవిభూషణ♦దీప్తివాని
మండితకేయూర♦కుండలంబులవాని
సిరి యురస్స్థలమునఁ ♦ జెలఁగువానిఁ
దనుఁబోలు సేవక♦దండంబు గలవాని
జిలుఁగైనపచ్చని♦వలువవానిఁ
ఆ. దెల్లదమ్మివిరులఁ ♦ దెగడుకన్నులవాని
నవసుధాద్రవంపు♦నవ్వువానిఁ

---

1 వాత ... తల్పము = వాయువుచేఁ జలింపఁ జేయబడి విరివిరియై, విరిగి పడుచున్న యలలచే చేరరాని సముద్రపు నీటిపడుకను

2 కమనీయ ... కిరీటమువాని = అందమైన మాణిక్యముల యొక్క గొప్ప కిరీటముకల వానిని

గనియె వేల్పుపిండు ♦ కప్పురపాటుతోఁ
గన్నులందు నున్న ♦ కఱవు దీఱ. 332

సీ. తనసేవకులలోనఁ ♦ దడఁబడురూపంబు
శ్రీవత్సకౌస్తుభ♦శ్రీలఁ దెలుప
[1]వికచాబ్జములతోడ ♦ వీడ్వడు♦కన్నుల
కడలు దైవాఱెడు♦కరుణఁ దెలుప
నెల్లలోకములకు ♦ నిల్లైనభాగ్యంబుఁ
గాఁ పురం బుండెడు♦కమల దెలుప
మూఁడుమూర్తులకును ♦ మొదలైన తేజంబు
ధాతఁ బుట్టించిన♦తమ్మి దెలుప

ఆ. బుద్ధిఁ బోల్పరాని♦పుణ్యంబుఁ దత్పాద
కమలజనిత మైన♦గంగ దెలుప
నప్రమేయుఁడభవుఁ ♦ డవ్యక్తుఁ డవ్యయుఁ
డాదిపురుషుఁడఖిల♦మోదిరొప్పె. 333

వ. ఇట్లు జగన్మోహనాకారుం డయిననారాయణుని కృపావలోక నాహ్లాదస్వభావచరితులై సాష్టాంగ దండప్రణామంబు లాచరించి ఫాలభాగపరికీలిత కరకమలు లై యిట్లనిరి. 334

ఆ. దుర్గమంబులయిన♦స్వర్గాదిఫలములఁ
బుట్టఁ జేయఁ జాలు♦నట్టిగుణము
గలిగి కొలఁగు చున్న♦ఘనుఁడ వైనట్టిసీ
కరయ మ్రొక్కువార ♦ మాదిపురుష.

సీ. దండంబుయోగీంద్ర♦మండలనుతునకు
దండంబు శార్ఙ్గకో♦దండునకును
దండంబుమండిత♦కుండలద్వయమునకు
దండంబు నిష్ఠుర♦భండనునకు

---

1 వికచా ... కన్నులు = విప్పారిన తామరలతో మారు పడు కనుగొనలు

దండంబు మత్తవే♦దండరక్షకునకు
దండంబు రాక్షస♦ఖండనునకు
దండంబు పూర్ణేందు♦మండలముఖునకు
దండంబు తేజఃప్ర♦చండునకును
తే. దండ మద్భుతపుణ్యప్ర♦ధానునకును
దండ ముత్తమవైకుంఠ♦ధామునకును
దండ మాశ్రితరక్షణ♦తత్పరునకు
దండ మురుభోగినాయక♦తల్పునకును. 336
ఉ. చిక్కిరి దేవతావరులు ♦ చిందఱవందఱ లైరి ఖేచరుల్
స్రుక్కిరి సాధ్యసంఘములు ♦ సోలిరి పన్నగు లాజిభూమిలోఁ
ద్రొక్కిరి దివ్యకోటి గడు ♦ గ్రుగ్గిరి యక్షులు వృత్రుచేత నీ
చిక్కినవారి నైన దయ ♦ సేయుము నోవ్యక యుండ నోహరీ.
క. మొదలాఁటినరకసులకు
మొదలై మాకాపదలకు ♦ మూలం బగుచుం
దుద మొదలు లేనిరక్కసు
తుది చూపఁ గదయ్య తుదకుఁ ♦ దుది వైనహరీ. 338
తే. అకట దిక్కుల కెల్ల ది♦క్కైనమాకు
నొకదిక్కును లేదు కా♦లూఁదఁ నైన
దిక్కు గావయ్య నేఁడు మా♦దిక్కుఁజూచి
దిక్కు లేకున్నవారల ♦ దిక్కు నీవ. 339
క. నీదిక్కు గానివారికి, నేదిక్కును లేదు వెదక♦యిహపరములకున్
మోదింపఁ దలఁచువారికి, నీదిక్కే దిక్కు సుమ్ము♦నీరజనాభా.
తే. అరయ మా తేజములతోడ ♦ నాయుధములు
మ్రింగి భువనత్రయంబును ♦ మ్రింగు చున్న
భీకరాకారు వృత్రునిఁ ♦ బీఁచ మడఁచి
యెల్లభంగుల మాభంగ ♦ మీఁగు మభవ. 441
ఆ. పరమపురుష దుఃఖ♦భంజన పరమేశ
భక్తవరద కృష్ణ ♦ భవవిదూర

జలరుహాక్ష నిన్ను ♦ శరణంబు వేఁడెద
మభయ మిచ్చి కావ ♦ వయ్య మమ్ము. 342

వ. మఱియును భగవన్నారాయణ వాసుదేవ యాదిపురుష మహానుభావ పరమమంగళ పరమకల్యాణ దేవ పరమకారుణికు లయిన పరమహంస లగు పరివ్రాజకులచేత నాచరితంబులగు 1పరమసమాధిభేదంబులఁ బరిస్ఫుటం బయిన పరమహంసధర్మంబుచేత ననువాదితంబగు పరమకపాలద్వారంబున నావృతం బయిన యాత్మలోకంబున నుపలబ్ధమాత్రుండ వై నిజసుఖానుభవుండ వై యున్న నీ వాత్మసమవేతంబులై యుపేక్షింపబడని శరీరంబులకు నుత్పత్తిస్థితిలయకారణుండ వై యుండుదువు. గుణసర్గభావితుండ వై యపరిమిత గుణగణంబులు గల నీవు దేవదత్తునిమాడ్కిఁ బారతంత్ర్యంబున నబ్బినకుశలఫలంబుల ననుభవించి చింతింతువు షడ్గుణైశ్వర్యసంపన్నుండ వైన నీ వాత్మారాముండ వయి యుండుదువు గుణసర్గభావితుండ వయి యపరిమిత గుణగణంబు 2లర్వాచీన వితర్కవిచార ప్రమాణభావంబులగు తర్కశాస్త్రంబులఁ గర్కశంబు లయిన ప్రజ్ఞలు గలిగి దురాగ్రహవాదు లైన విద్వాంసుల వివాదానుసరణంబులయందు నుపరతంబు లగు నస్తినాస్తిత్యాదివాక్యంబుల సమస్తమాయామయుండ వై నిజమాయచేతఁ గానంబడక యుక్తిగోచరుండ వై సమస్తవిషయరూపంబులఁ బ్రవర్తింతువు దేవా రజ్జువునందు సర్పభ్రాంతి గలుగునట్లు వివిధాంతరంబులచేత బ్రహ్మం బయిన నీయందుఁ బ్రపంచభ్రాంతి గలిగెడి నని యిట్లతిమనోహర చతురవచనంబుల భక్తిపరవశులయి వినుతిసేయుచున్న దేవతలం జూచి యప్పరమేశ్వరుండ మృతప్రాయంబులగు గంభీరభాషణంబుల నిట్లనియె. 343

1 పరమ సమాధిభేదములు = ఉత్కృష్టములగు సంప్రజ్ఞాతము, అసంప్రజ్ఞాతము అనుసమాధి భేదములు. 2 అర్వాచీన ... ఆభాసంబులు = క్రొత్తవయిన, భ్రాంతి, ఊహా, సమాలోచనములచే అయథార్థ ప్రమాణములగు (ప్రమాణములవలె భాసించెడియనుట.)

క. మదుపస్థానం బగుమీ, సదమలసుజ్ఞానమునకు ♦ సంతోషమునం
బొదలె మదిఁ బ్రీతినొందితి, వదలక నాభక్తివాఁడమి ♦ వ్యర్థంబగునే.

వ. మఱియును బ్రీతుండ నైననాయందు భక్తులకుం బొందరాని యర్థంబు లేదు విశేషించి నాయందు నేకాంతమతి యైనతత్త్వవిదుం డన్యంబులం గోర కుండుగుణంబులయందుఁ దత్త్వజ్ఞానగోచరుం డైనవాఁడు విషయనివృత్తచిత్తుండై సంసారమార్గంబునిచ్ఛింపండు కావున మీకు శుభం బయ్యెడు దధీచి యనుఋషిసత్తముండు గలండతనిశరీరంబుమద్విద్యాతిశయమహత్త్వంబునను దేజోవిశేషంబునను సారవంతం బై యున్నయం దతని నడిగి తచ్ఛరీరంబుఁబుచ్చికొనుండతండు పూర్వకాలంబున నశ్విదేవతలకు నశ్వశిరోనామంబనుబ్రహ్మస్వరూపంబగునిష్కళంకం బయినవిద్యయుపదేశించిన వారలు జీవన్ముక్తత్వంబు నొందిరి. మఱియు త్వష్ట్రపుత్రుండయిన విశ్వరూపునకు మదాత్మకం బయినయభేద్యకవచంబు నిచ్చెఁగావున నతం డతివదాన్యుండు దేహంబు వంచింపక మీకిచ్చు నతని శల్యంబులు విశ్వకర్మనిర్మితంబు లై శతధారలు గలయాయుధశ్రేష్ఠం బయి మత్తేజోపబృంహితం బయి వృత్రాసురశిరోహరణకారణం బయి యుండు దానంజేసి మీరు పునర్లబ్ధతేజోస్త్రాయుధసంపదలు గలిగి వెలింగెదరు విశేషించియు మద్భక్తవరు లయిన వార లేలోకంబుల నెవ్వరికి నజయ్యులు కావున మీకు భద్రం బయ్యెడు మని భూతభావనుండైన భగవంతుం డదృశ్యుం డయ్యె నప్పుడు దేవతలు దధీచిమునికడకుం జని రత్తఱి నింద్రుండిట్లనియె.

ఆ. దేహి సుఖము గోరి ♦ దేహంబుఘటియించి
దేహివిడువలేఁడు ♦ దేహ మెపుడు
దేహి యస్మదీయ ♦ దేహంబుకొఱకునై
దేహ మీఁగదయ్య ♦ దేవతలకు 346

ఉ. ఎక్కడ నెల్లలోకముల ♦ నెవ్వరు గోరనికోర్కి నేఁడు మా
తెక్కలిపాటు [illegible] తిరిరి ♦ దేహము వేఁడగ వచ్చినార మే

మెక్కడఁ దీవ్రకర్మగతి ♦ యెక్కడ దైనకృతంబు గాక యీ
రొక్కపుదాన మీవరుస ♦ రోయక వేఁడుదురే జగంబులన్.

క. నీచగతి యెల్లభంగుల, యాచనయని తెలిసి తగని♦దడుగుదు రేనిన్
యాచకవర్గములోపల, నీచకులనఁబడరె యెంతనేర్పరులైనన్.

క. అడుగంగ రానివస్తువు, లడుగరు బలిమాలి యెట్టి♦యర్థులు నిను నే
మడిగితిమి దేహమెల్లను, గడు నడిగెడువారి కేడ♦కరుణమహాత్మా.

ఉ. నావుడు నాదధీచియు మ♦నంబున సంతస మంది నవ్వి సం
భావితవాక్యపద్ధతులఁ ♦ బల్కుచు నిట్లనెఁ బేర్మితోడ నో
దేవతలార ప్రాణులకుఁ ♦ దెక్కలిమృత్యుభయంబు పూనుటే
భావములం దలంపరు కృపామతి నెన్నఁడు మీమనంబులన్. 350

ఆ. ఎలమిఁ బ్రదుక నిచ్చ♦నెనసినవారికి, దేహమెల్లభంగిఁ♦దీపుగాదె
యచ్యుతుండు వచ్చి♦యర్థించె నేనిని, దన్ను నిచ్చునట్టి♦దాతగలఁడె

వ. అదియునుం గాక. 352

సీ. యర్థంబు వేఁడెడు ♦ నర్థులు గలరు గా
కంగంబు వేఁడెడి♦యర్థి గలఁడె
తగుకోరికల నిచ్చు♦దానశీలుఁడు గల్గుఁ
దనదేహ మీనేర్చు♦దాత గలఁడె
యీ నేర్చువాఁడు ద♦న్నిచ్చిన రోయక
చంపెడునట్టియా♦చకుఁడు గలఁడె
చంపియుఁ బోవక ♦ శల్యంబు లన్నియు
నేఁటి పంచుకపోవు♦వారు గలరె

ఆ. రమణ లోకమెల్ల ♦ రక్షించువారికి
హింస సేయుబుద్ధి ♦ యెట్లు వొడమె
బ్రాతిమైనయట్టి♦ప్రాణంబుపైఁ దీపు
తమకుఁబోలె నెదిరిఁ ♦ దలఁప వలదె. 353

వ. అనిన నిందుఁడి ట్లనియె. 354

తే. సర్వభూతదయాపర♦స్వాంతులకును
బుణ్యవర్తను లగుమిమ్ము♦బోఁటివారి

కమితసత్కీర్తికాముల ♦ కలఘుమతుల
కియ్యరానిపదార్థంబు ♦ లెవ్వి గలవు. 355

ఆ. అడుగరానిసొమ్ము♦నడుగరాదని మానఁ
డడుగువానిమాట ♦ లడుగనేల
భ్రాంతి నడుగుచోటఁ ♦ బ్రాణంబు లేనిని
నిచ్చువాఁడు దాఁపఁ ♦ డిచ్చుఁగాని. 356

వ. అని పరసంకటంబు దలంపక నిలింపులు గార్యపరతఁ సవినయ వాక్యపరంపరలఁ బ్రార్థించిన నతండు దరహాసితవదనుండై యఖిలలోకధర్మం బెఱింగియు నొక్కింతకాలంబు ప్రతివాక్యం బిచ్చితి దీని సంహింపం దగుదురు మీయట్టివారలకుం బ్రియం బగునేని నెప్పుడైన విడువం దగినశరీరంబు విడుచుటయేమి దుర్లభం బధ్రువం బయిన యీ దేహంబుచేతం గీర్తిసుకృతంబుల నెవ్వం డార్జింపకుండు నతండు పాషాణాదులకంటె నతికఠినుండు మీయట్టిపుణ్యశ్లోకులచేతఁ గాంక్షింపబడిన శరీరం బప్రమేయధర్మార్జితం బేదేహంబుచేత సకలభూతంబులు శోకానుభవంబున శోకించు హర్షానుభవంబున హర్షించునట్టిమహాకష్టదైన్యాకరం బైనశరీరంబు కాకశునక సృగాలాదులపాలు గాకుండ మేలయ్యెనని నిశ్చితాత్ముండయి దధీచి దత్త్వావలోకనంబుచేత నిరసితబంధనుండై బుద్ధీంద్రియమానసంబులతోఁ గూడినక్షేత్రజ్ఞునిఁ బరబ్రహ్మస్వరూపం బైన భగవంతునందు నేకీభూతంబుసేసి యోగజ్ఞానంబున శరీరంబువిడిచె నప్పుడిందుఁ్రండతనిశల్యంబుల విశ్వకర్మనిర్మితం బైనశితశతధారాసమావృతంబై వెలుంగువజ్రాయుధంబుఁ గైకొని భగవత్తేజోపబృంహితుండయి యైరావతారూఢుండై సకలదేవోత్తమగరుడగంధర్వఖచరకిన్నరకింపురుషసిద్ధవిద్యాధర పరిసేవితుండై సకలమునిజనంబులు వినుతింపఁ ద్రిలోకహర్షకారియై భగవదనుగ్రహానంప్రాప్తమహోత్సాహవికసితవదనారవిందుండై వృత్రాసురుపై నడచె నప్పుడు.

ఉ. వృత్రుఁడు మానవాన్వయప♦విత్రుఁడు లోకజిఘాంసకక్రియా
సూత్రుఁడు విగ్రహాగ్రహణ సుస్థిరవాక్యవివేకమానచా
రిత్రుఁడు దేవఘోరగద♦రీకృతనష్టుఁడు రోషదూషితా
మిత్రుఁడు శత్రురాజుఁ గని ♦ మిక్కిలి డాసెయుగాంతకాకృతిన్.

క. మెండు గలదనుజనాయక
మండలములు గొల్వ నడచె ♦ మహితోద్ధతి వే
దండములనడుమఁ జనునడ
గొండయనుంబోలె జంభుఁడు♦ కోపోద్ధతుఁ డై. 359

క. కాలగళుఁ డడరి కడువడిఁ
గాలునిపైఁ గవయుమాడ్కి ♦ ఖరతరరవసం
చాలితపూర్వదిగంతరుఁ
డై లీల మహేంద్రుమీఁద ♦ నతఁ డరిగె నృపా. 360

వ. ఇట్లు రుద్రగణంబులు మరుద్గణంబులు నాదిత్యగణంబులు నశ్వి
దేవతలుఁ బితృదేవతలు విశ్వేదేవులు వహ్నియమ నైరృతివరుణ
వాయుకుబేరేశానాదులు సిద్ధసాధ్యకిన్నరకింపురుష గరుడగంధర్వ
ఖేచరప్రముఖంబులగు నింద్రసైన్యంబులతోడ నముచియు శంబ
రుండును ననుర్వుండును ద్విమూర్ధుండును వృషభుండును నంబ
రుండును హయగ్రీవుండును శంకుశిరుండును విప్రచిత్తియు నయో
ముఖుండును బులోముండును వృషపర్వుండును హేతియుఁ బ్రహే
తియు నుత్కటుండును ధూమ్రకేశుండును విరూపాక్షుండును
గపిలుండును విభావసుండును నిల్వలుండును బల్వలుండును దంద
శూకుండును వృషధ్వజుండును గాలనాభుండును మహానాభుండును
భూతసంతాపనుండును వృకుండును సుమాలియు మాలియు
మున్నగు దైతేయదానవయక్షరాక్షసాద్యసంఖ్యంబు లగు వృత్రా
సురుబలంబు లంతంతం దలపడి సరమంబు సేసిరప్పుడు. 361

చ. అసురులకున్ సురావలికి ♦ నయ్యె మహారణ మప్పు డొండొరుల్
ముసలగదాసికుంతశర ♦ ముద్గర తోమర భిండిపాలప

ట్టినపటుశరాలచక్రముల ♦ తేవలు నూపియదల్చి యార్చుచుక్
మసలక కప్పి రత్రముల ♦ మార్కొని మంటలుమింట నటఁగన్.
క. ఒండొరులఁ గడవ నేసిన
కాండము లాకాశపథముఁ ♦ గప్పి మహోల్కా
దండంబులొలసి నిష్ఠుర
భండనముఖ మొప్పెఁ జూడ ♦ బ్రళయోచితమై.
చ. సురవరు లేయుబాణములు ♦ సూడ్కి కగోచరమై నభస్స్థలం
బెఱిముఱేఁ గప్పి రేసి దివ♦సాంతముఁ జేసినలీల నాసురే
శ్వరబలయూథవీరులను ♦ సాయకపంక్తుల చేత వాని రూ
పఱిశతధూళిఁ జేసి పఱ ♦ పైనతమం బొనరించి రార్చుచున్. 364
చ. సమరమదాంధులై సురని♦శాచరవీరులు 1సైనికాంఘ్రిసం
క్రమితమహీపరాగములు ♦ గ్రమ్మిన నుమ్మలికంపుఁజీకటుల్
దమకనుదోయి కడ్డముగఁ ♦ దార్కొనినం జల మేది పోరి రా
క్రమితనిజాంతరంగపరి♦ఘట్టితరోషమహాగ్ని పెంపునన్. 365
క. అతిగళితర క్తధారా, క్షతములతోఁ గానఁబడిరి♦సైనికులు మహో
ద్ధతరోషవహ్నికీలలు, వితతంబై వెల్లగిల్లి ♦ వెడలెడిభంగిన్. 366
సీ. ఠనణించు 2శింజినీ ♦ టంకారరవములు
భటసింహనాదంబుఁ ♦ బరిభవింప
భీషణోత్తమహాయ♦హేషావిఘోషంబు
కరిబృంహితస్ఫూర్తిఁ ♦ గ్రందుకొలుప
సమరనిశ్శంకాంశ♦శంఖనినాదంబు
నేమిస్వనంబుల ♦ 3నిహ్నవింపఁ
దుముల మై చెలఁగెడు♦దుందుభీధ్వానంబు
లట్టహాసంబుల ♦ నాక్రమింప
తే. ఘటితశస్త్రాస్త్రనిష్ఠుర♦ఘట్టనోత్థ
ఖరకఠోరోరువిస్ఫులిం♦గంబు లడరి

1 సైనికా ... పరాగములు = సైనికులయొక్క పాదముల ఘట్టనచే చేరిన చేఁధూళులు. 2 శింజినీ టంకారరవములు=అల్లెత్రాటియొక్క ఊమ్మను సవ్వడులు
3 నిహ్నవింప = మఱుఁగుపఱుపఁగా.

¹దివ్యకోటీరమణిఘృణి ♦ ధిక్కరింప
సమర మొనరించి రసురులు ♦ నమరవరులు 367

వ. ఇట్లు ప్రళయసంరంభ విజృంభితసముత్తుంగ తరంగితభైరవారావ
నిష్ఠ్యూతనిష్ఠుర మహార్ణవంబునుం బోలె ²యుగాంతసంక్రాంత
ఝంఝాపవనపరికంపిత దీర్ఘనిర్ఘాతనిబిడనిష్ఠురనీరదంబులుంబోలె
నుభయ సైన్యంబులుం గలసి సరమంబు సలుపుసమయంబున
యుగాంతకృతాంతసకలప్రాణిసంహారకారణలీలయుంబోలెఁబదాతి
రాహుత్తమావంతరథిక మహారథికవీరు లొండొరులు చండగతిం
గాండంబులు పఱపుచు గదలం జదుపుచుఁ గత్తులఁ గత్తళంబులఁ
జినుఁగం బొడుచుచు నడిదంబుల నఱకుచుఁ గుంతంబులం గ్రుచ్చు
చుఁ గుఠారంబుల వ్రచ్చుచు ముసలంబుల మోఁదుచు ముద్గ
రంబులం బాఁదుచుఁ జక్రంబులం ద్రుంచుచు సబళంబుల నొంచుచు
సురియల మెఱుముచు శూలంబులఁ దుఱుముచు వాజుల కుఱి
కియు వాలంబుల నఱికియుఁ దోడలు తుండించియుఁ దొండంబులు
ఖండించియు మెడ లెడయించియు మెదళ్లు గెడయించియు
నడుములు ద్రుంచియు నాసికలు ద్రెంచియుఁ బదంబుల విఱిచియుఁ
బార్శ్వంబులం జఱచియు గజంబులఁ బట్టిపియు గాత్రంబుల
మట్రిపియుఁ గుంభంబులఁ బగిలించియుఁ గొమ్ములఁ బెకలించియు
హస్తంబులఁ దుండించియు సంగంబులఁ జించియు రథంబుల సలి
యించియు రథికులం బొలియించియు సారథులంజంపియు సైంధ
వంబులఁ దంపియు శిరంబు నొగిలించియు సీసకంబు లగిలించియు
ఛత్త్రంబుల నుఱుమాడియుఁ జామరంబులం దునుమాడియు సై
న్యంబులఁ జదిపియు సాహసుల మెదిపియు సుభటులు దుమ్రించియు
మఱియును బరస్పరగుణవిచ్ఛేదనంబును నన్యోన్యకోదండఖండన

1 దివ్యకోటీరమణిఘృణి= ప్రశస్తములగు కిరీటముల యందలి రత్నాల కాంతిని.
2 యుగాంత ... నీరదంబులు = ప్రళయ కాలమునందు చేరిన, పెనుగాలిచే కదల్పబడిన, పెద్దపిడుగులచే నిండి కఠోరములగు మేఘములు.

పటుత్వంబును [1]నుభయసైంధవ ధ్వజసారథిరథికరథ వికలనంబును నొం
డొరుల పాదజానుజంఘాహస్తమస్తక నిర్దళనంబును రక్తమాంసమేదః
పంకసంకలితసమరాంగణంబును నై యతిఘోరభంగిం బెనంగి రప్పుడు.

చ. సమజయముఁ సమాపజయ◆సామ్యపరిశ్రమముఁ సమోరువి
క్రమము సమాత్రశత్రుబల◆గర్వము నై కడు ఘోరభంగి నా
[2]నముచివిరోధిసైన్యగణ◆నాథులతోడ నిశాచరేశ్వరో
త్తములు దురంబు సేసి రొగిఁ◆దార్కొనివృత్రుబలంబుప్రాపునన్.

వ. అప్పుడు.

లయగ్రాహి. మొత్తముగఁ బొఱలు పెను◆నెత్తురుమహానదులఁ
దత్తరముతోనుఱికి◆కుత్తుకలు మోవం
జిత్తముల నుబ్బి వెస◆నెత్తుకొనుభూతముల
నత్తుకొనిశాకినులు ◆ జొత్తిలుచు మాంసం
బుత్తలముతోమెసఁగి◆నృత్తములు సేయుమద
మత్తఘనఢాకినులు ◆ వృత్తగతిఁ బ్రేవుల్
బిత్తరములందిగిచి◆మెత్తమెదడుల్మ్రొనసి
గుత్తగొనుచుండభయ◆వృత్తిఁ గలనొప్పెన్. 371

వ. ఇట్లు దేవదానవులు నర్మదాతీరంబునఁ గృతయుగంబునం దలపడి
త్రేతాయుగంబు సొచ్చునంతకాలంబుఁ బోరు దారుణంబుగాఁ
జేయు చుండ నంత వృత్రాసురుభుజబలంబు పెంపునఁ దెంపుసేసి
కంపింపక నిలింపులపై రక్కసులు గుంపులై పెంపుచూపి మహా
వృక్షపాషాణగిరిశిఖరంబులు వర్షించిన. 372

మ. గిరిపాషాణమహీజముల్ గురియఁగా ◆ ర్వాణు లన్నింటి ని
ష్ఠురనారాచపరంపరల్ వఱపుచుం ◆ జూర్ణంబుఁ గావింప ని
ర్భరలీలం దమచేయుసత్త్వములు దో◆ర్భంగంబులై పోవఁగాఁ
దెరలన్ రాక్షసయోధవీరుల మదో◆ద్రేకంబు సంఛిన్నమై. 373

1 ఉభయ...వికలనంబు=ఇరువాగుల యందలి గుఱ్ఱములయొక్కయు, టెక్కె ములయొక్కయు, రథచోదకులయొక్కయు, రథమెక్కినశూరులయొక్కయు, అరద ములయొక్కయుఖండనము. 2 నముచి ... నాథులతోడ = ఇంద్రునియొక్క సేన మొనఁగొన్న దండనాయకులతో.

కం. ప్రచురముగ రాక్షసావళి
ఖచరులపై నేయునిబిడకాండావళి దు
ర్వచనుఁ డెడనాడుమాటలు
సుచరితునియందుఁ బోలెఁ జొరవయ్యె నృపా. 374

వ. అప్పుడు. 375

వనమయూరము. అంత సురలేయునిబిడాస్త్రములపాలై
పంతములు దక్కి హతపౌరుషముతో ని
శ్చింతగతి రక్కసులు సిగ్గుడిగి భూమిం
గంతుగొని పాఱిరపకారపరులార్వన్.

కం. కొండలఁ బోలెడురక్కసు
లొండొరులం గడవఁ బాఱి [1]రుక్కఱి పటుకో
దండముఖసాధనంబులు
భండనమున వైచి దివిజపతు లార్వంగన్. 377

వ. ఇట్లు సమరతలంబు వాసి తనప్రాపుమాని తీసి పఱచుచుండు దండ
నాయకులం జూచి యకుటిలమతిం బకపక నగి వృత్రాసురుం డి
ట్లనియె. 278

ఉ. [2]క్షుల్లకవృత్తి మీకగునె శూరుల కిమ్మెయిఁ గీర్తిభోగముల్
గొల్లగఁ జేయు చావుమదిఁ గోరినవారల కైనఁ గల్గునే
తల్లడ మంది యీసమర ధర్మము మాని తలంగఁ బాడియే
మల్లుఁడు దుర్దమ ప్రథన మత్తుఁడు వృత్రుని పాటెఱుఁగరే. 379

కం. చావు ధ్రువమైనప్రాణికిఁ
జావులు రెం డరసికొనుఁడు [3]సమరమునందుం
భావింప యోగమందును
జావంగా లేని చెడుగుచావుం జావే. 380

వ. అని వాసుదేవ తేజోవిశేషవిశేషితుఁడై దవానలకీలలంబోలె
వెలుంగుచు వెఱచి వెన్నిచ్చి పాఱెడు నసురుల వెనుకొని తఱుము

---

1 ఉక్కఱి=బలమునశించి. 2 క్షుల్లకవృత్తి=నీచవ్యాపారము. 3సంగ్రామమునందు శత్రునిచే, స్వేచ్ఛమెయి యోగముచేమరణించుట శ్రేయము. తక్కినవిచెడుచావులని.

సురవీరులం జూచి హుంకరించి స్వర్గానుభవంబున నిచ్చలేకుండె
నేని మదవలోకనస్పర్శనమాత్రంబు ముందర నిలుతురు గాక
యని యేచికల్పాంతానల్పఘనఘనాటోపంబునుంబోలెఁ గఠోర
కంఠహుంకారతర్జనంబులన్ గర్జిల్లుచుఁ బ్రళయకాలపవనపరిభావిత
మహాశిఖిశిఖావళులఁ దృణీకరించుకుటిలావలోకనంబుల నాలో
కించుచుం గాలపరిపక్వలీలాలోలుం డయిన శూలిపోలిక నాభీల
మూర్తియై [1]సకలజీవభారభరణదుర్భరభగ్న బ్రహ్మాండభాండ
మహాధ్వానంబుభంగి నాస్ఫోటించిన. 381

ఉ. కూలె జగంబు లన్నియును ♦ గ్రుంకిరి సూర్యసుధాంశు లద్రు [2]లూ
టాడె నభస్స్థలం బగిలె ♦ నంబుధు లింకె నుడుగ్రహాళి ప
ట్టూడె వడిం దిశల్ వగిలె ♦ నుర్వర గ్రుంగె నజాండభాండ మ
ల్లాడె విధాత బెగ్గడిలె ♦ నార్చుచు వృత్రుఁడు బొబ్బ వెట్టినన్.

లయగ్రాహి. కూలిరి వియచ్చరలు ♦ సోలిరి దిశాధిపులు
వ్రాలిరమరవ్రజము ♦ దూలిరురగేంద్రుల్
ప్రేలిరి మరుత్తులెద ♦ జాలిగొనిరాశ్వినులు
కాలుడిగి రుద్రులవ ♦ లీలబడిరార్తిన్
వ్రేలిరి దినేశ్వరులు ♦ కీలెడలినట్లు సుర
జాలములు పెన్నిదుర ♦ పాలగుచు ధారా
భీలగతితోడఁ దమ ♦ కేలిధనువుల్ విడిచి
నేలఁబడి మూర్ఛలను ♦ దేలిరి మహాత్మా. 383

వ. ఇట్లు కఠోరకంఠనాదం బొనర్చిన నశనిపాతంబునం గూలుప్రాణి
చయంబుభంగి నంగంబు లెఱుంగక రణరంగంబునం బడి బిట్టు
మూర్ఛిల్లిన దివిజరాజసైన్యంబుల వృత్రాసురుండు సంగరరంగ
దుర్దముండై మహీవలయంబు పదాహతంబుల గడగడ వడంక
నిశితశూలంబు గేల నంకించుచు మదించిన భద్రమాతంగంబు
కమలవనంబు చొచ్చి మట్టి మల్లాడువిధంబున నిమీలితాక్షుం

1 సకల...మహాధ్వానంబు=సమస్తజీవులయొక్క బరువును మోయుటచేమిక్కిలి నవసిన బ్రహ్మాండభాండమొనర్చిన గొప్పధ్వని. 2 లూటాడె = చలించెను.

డయి తనపదతలంబు రూపంబులు మాయం జమురుచు వెక్కసం
బుగఁ గ్రీడించువానింగని వజ్రి [1]వజ్రశతోపమనిష్ఠుర గదాదండం
బాభీలభంగిఁ బ్రళయకాలమార్తాండచండపరివేషప్రేరితంబుగాఁ
ద్రిప్పి వైచిన. 384

మ. అది మింటం బెనుమంట లంటఁ బఱపై ♦ యాభీలవేగంబునం
గదియన్ వచ్చిన లీల వామకరసం ♦ క్రాంతంబు గావించి వె
ట్టిదుఁడై చేరి సురారి దానిఁ గొని కా ♦ ఠిన్యోరుపాతంబులం
జదియన్ మోఁదె గజేంద్రమస్తకము ను♦త్సాహైకసాహాయ్యుఁడై.

ఆ. అగ్గజంబు గులిశ హతిఁ గూలుకులమహీ
ధ్రంబుఁబోలె రక్త♦ధార లురల
మస్తకంబు వగిలి ♦ మదమఱి జిరజిరఁ
దిరిగి భీతితోడఁ ♦ దెరలి పఱచె. 386

ఉత్సాహము. గజము దెరలి దాని కోఱలి ♦ కంప మొంది పాఱఁగా
భజన నింద్రుఁ డంకుశమునఁ ♦ బట్టి బిట్టు నిల్పుచుం
[2]నిజసుధారసైకపాన ♦ నిర్ణయార్ద్రకరమునన్
ఋజుత మీఱ నిమిరె నదియు ♦ రీతి మెఱసి క్రమ్మఱన్. 387

వ. ఇవ్విధంబున నైరావతంబును సేద దేర్చుచు నెదుర నిలుచున్న
భిదురపాణిం గని తోఁబుట్టువుఁ జంపిన తెంపుఁ దలంచి మోహ
శోకంబున విపర్యాసంబుగా నవ్వుచు నాహవకామ్యార్థియై
వృత్రుం డిట్లనియె. 388

శా. నాకుం బెద్దయు నీకు సద్గురువు దీ♦నవ్రాతరక్షున్ శుభా
లోకుం జంపితి విట్లు పాపమతివై ♦ లోభంబుతో నిర్యోడన్
లోకుల్ నవ్వఁగ మద్భుజాపటిమకున్ ♦ లోనైతి వీశూలమం
దాకంపింపఁగ నిన్ను గ్రుచ్చి ఋణము♦క్తాత్ముండ నై పేర్చెదన్.

క. ఎట్టితులు వయినఁ గానీ
తనబ్రదుకుకొఱకు ♦ నీవలె గురువుం

---

1 వజ్ర ... దండంబు = వేయివజ్రాయుధములతో సమానమైన కఠినమైనగదను.

2 నిజ ... కరమునన్ = తనదైన అమృతరసమును ముఖ్యముగా పానముచేయు క్రమముచే ఆర్ద్రమైనహస్తమున.

జుట్టమును బుణ్యు బ్రాహ్మణుఁ
బట్టి వధింపంగఁ గలఁడె ♦ పశువుం బోలెన్. 390

చ. దయయును సత్యమున్ విడిచి ♦ ధర్మముమాని యశంబుఁ బాసి శ్రీ
జయములఁ బారఁదోలి పురు ♦ షత్వము గానక లోకనిందితా
హ్వాయుఁడగువానిచావునకు ♦ నార్యులు గుందుదురే సృగాలముల్
ప్రియమున నంటునే శవముఁ ♦ బ్రేలక చేరునె కంకగృధ్రముల్.

క. నిక్కమగు పాపములచేఁ
జిక్కితివి నిశాతశూల శిఖరాగ్రమునన్
మక్కించి నీదుమాంసము
నక్కలుఁ గుక్కలును జేరి ♦ నమలనొనర్తున్. 392

ఉ. దీనాని నీకు నేఁడిచట ♦ దిక్కని వచ్చినవారు గల్గిరే
నేకమతిం బిశాచముల ♦ కెల్లను దృప్తిగ మన్నిశాత శూ
లైకమహాగ్నికీలల న ♦ నేకవిధంబున సోమయాజినై
మేఁకలజేసి వ్రేల్చెద న ♦ మేయ మదోద్ధతి వ్రాలి యియ్యనిన్.

క. కాకననుఁగులిశధారల, దీనాన నిర్జింపఁ గలిగి ♦ తేనిని భూతో
ద్రేకంబుసేసి శూరుల, ద్రాకట పదపద్మధూళి ♦ భాగంబగుదున్.

సీ. సందేహా మేటికి ♦ జంభారి వేవేగ
భిదురంబు వ్రేయుమా ♦ భీలభంగి
నతిలోభి నడిగిన ♦ యర్థరాశియుఁబోలెఁ
గడవలేనిది వృథ ♦ గాదుసుమ్ము
మురమర్దనుని తేజ ♦ మున నాదధీచివీ
ర్యాతిశయంబున ♦ నధిక మయిన
యదిగాన హరిచేని ♦ యంత్రితోన్నతుఁడవై
గెలువుము శత్రుల ♦ గీటడంచి

ఆ. యెందుఁగలఁడు విష్ణు ♦ డందుజయశ్రీలు
పొందుగాఁగవచ్చి ♦ పొందుచుండు
గాన భక్తవరదు ♦ గమలాక్షు సర్వేశు
పదములందు మనముఁ ♦ బదిలపరతు. 395

వ. ఇపుడు వజ్రధారలఁ ద్రెంపంబడిన విషయభోగంబులు గలవాఁడ
నయిశరీరంబువిడిచి భగవద్ధామంబునొందెద నారాయణునిదాసుం
డనైననాకు స్వర్గమర్త్యపాతాళంబులంగల సంపద్భోగంబులు నిచ్చ
గింపంబడవు త్రైవర్గికాయాస రహితంబయిన మహైశ్వర్యంబు
ప్రసాదించుంగావున ననుపమేయంబైన భగవత్ప్రసాదం బన్యుల
కగోచరంబద్దేవుని పాదైకమూలంబుగానుండు దాసులకు దాసాను
దాసుండ నగుచున్నవాఁడ నని యప్పరమేశ్వరు నుద్దేశించి. 396

చ. అరయఁగ భక్తపాలనము ♦ లైన భవద్గుణజాలమాత్మ సం
స్మరణముసేయవాక్కు నిను ♦ సన్నుతిసేయ శరీర మెల్లఁ గిం
కరపరివృత్తి సేయ మదిఁ ♦ గాంక్షయొనర్చెదఁగాని యొల్ల నే
నరిది ధ్రువోన్నతస్థలము ♦ నబ్జజపట్టణ మింద్రభోగముల్. 397

ఉ. ఆఁకలిగొన్న 1క్రేపులు ర ♦ యంబున నీఁకలురాని పక్షులున్
దీకొని తల్లికిన్ మఱి వి♦ దేశగతుండగు భర్తకుం గజ
వ్యాకులచిత్తయైన జవ ♦ రాలును దత్తఱ మందుభంగి నో
శ్రీకర పంకజాక్ష నినుఁ ♦ జేరఁగ నామది గోరెడుం గదే. 398

క. నాకునుసఖ్యము పుణ్య, శ్లోకులతోఁగాని తప్ప ♦ శూన్యులు సంసా
రైకవిమోహులతోడం, గాకుండనొనర్పుమయ్య ♦ కంజదళాక్షా.

మహా. హరిపై సర్వాత్ముపై న♦త్యగణితగుణుపై♦నంతరంగంబు సర్వేన్
సరిమేనుప్పొంగఁజావున్ ♦జయమును సరిగా ♦ సంతసంబందుచున్ భీ
కరుఁడై కాలాగ్నిపోలెం♦గసలుచుఁగవిసెన్ ♦ గర్వదుర్వారుఁడై దు
ర్భరలీలన్ భూమిగంపిం♦పఁగదిశలద్రువన్ ♦ భండనోద్దండవృత్తిన్.

క. దొరఁకొని ప్రళయోదకమున
హరిపైఁ గైటభుఁడు గవియు ♦ హుంకారమునన్
సురనాథుమీఁద వృత్రా
సురుఁడు మదోద్వృత్తి నడచె ♦ శూలాయుధుఁడై: 401

శా. కల్పాంతాగ్నియుఁబోలె 2నుల్కలెగయం♦గాఁ ద్రిప్పుచున్ దీసనో
యల్పా చావు మటంచు శూలము రయం♦బారంగఁ బైఁ బైచి సం

---

1 క్రేపులు = లేఁగలు. 2 ఉల్కలు=ఆకాశమునుండిపడు రేఖాకారతేజములు.

బోల్పం గోటిరవిప్రకాశత దివింబోవంగ వీక్షించి యా
వేల్పుల్ వొంగఁగ వజ్రధారఁ దునిమెన్‌విన్నాణ మొప్పారఁగన్

ఆ. శూల మప్పుడతఁడు ♦ స్రుక్కక ఖండించి
పూని తోన కదిసి ♦ భుజముద్రుంచె
నసుర గనలి చేక ♦ హస్తిఁ బైపరిఘంబు
గొని మహేంద్రుఁ గిట్టి ♦ 1హనువు లదిచె.

వ. ఇట్లు ప్రళయకాలభీషణపరివేషపోషంబుగా రోషంబునం బరిఘం
బుఁద్రిప్పి కుప్పించి గజకుంభస్థలంబు భగ్నంబు సేసి యింద్రు
హనుప్రదేశంబును నిష్ఠురాహతి నొప్పించిన. 404

క. గజము మద ముడిగి తిరుగుచు
గుజగుజనై గీఁకపెట్ట ♦ గులిశము నేలన్
భుజన చెడి విడిచె నింద్రుఁడు,
గజిబిజితో బెగడెనసుర♦కడిమిజగంబుల్. 405

క. గరుడుఁడు పొదివిననాగము
కరణిన్ వృత్రాసురేంద్రు♦కడిమికి లోనై
తిరుగుడు వడ్డహరిం గని
పురపుర నాహాయటంచుఁ ♦ బొగిలె జగంబుల్. 406

వ. అప్పుడు. 407

ఆ. గజముపాటు సూచి ♦ కడు దీనగతిఁ జూచి
పరికరంబు జాఱి ♦ పడుటఁ జూచి
యుద్ధధర్మ మెఱిఁగి ♦ యున్నశత్రునిఁ జూచి
సిగ్గుతోడ వజ్రి ♦ శిరము వాంచె. 408

వ. ఇట్లు యుద్ధంబున శత్రుసన్నిధిం గరంబు జాఱిపడినవజ్రంబుఁబుచ్చి
కొనక నివ్వెఱపడి లజ్జించి యున్నపాకశాసనుం జూచి వృత్రుండి
ట్లనియె. 409

క. దురమునఁ గై దువ్వ వదలిన
శరణన్నను వైరిజనులఁ ♦ జంపరు వీరుల్

1 హనువులు = చెక్కిలియొక్క పైభాగములు.

వెఱఁ గంద నేలకులిశము
కర మరుదుగఁ బుచ్చికొనుము • కాచితి నింద్రా. 410

సీ. వజ్రంబుఁ గైకొని • వైరి నిర్జింపు మి
ట్లడలంగ వేళ గా•దమరనాథ
యమరదేహాధీను • లైనమూర్తుల కెల్ల
నీశు లక్ష్మీశు స•ర్వేశుఁ బాసి
కడతేఱ జయములు • గల్గునె యొందైనఁ
దలపోసి చూడుమా • తత్త్వబుద్ధి
నీలోకపాలకు • లెవ్వనివశగతి
వలఁ బడ్డపక్షుల•వర్తనమునఁ

తే. జిక్కి చేష్టలు సేయుచుఁ • జింతగాంతు
రట్టిమృత్యుబలంబుల • నాత్మజయము
తమదిగాఁ గోరి యజ్ఞాన•తంత్రులగుచుఁ
గమలలోచనులీలావి•కారములను. 411

తే. మెఱయ యంత్రమయం బైన•మృగముభంగి
దారునిర్మితమైనట్టి•తరుణిపోల్కి
శక్ర యెఱుఁగుము యీభూత•జాల మెల్ల
దళితపంకేరుహాక్షుతం•త్రంబుగాఁగ.

వ. మఱియు భూతంబులచేతను నింద్రియంబులచేతను సవశుం డైనపురుషుండు ప్రకృతిచేత వేఱుసేయంబడినయాత్మం బరమేశ్వరానుగ్రహంబు వాసి సుఖియించుచుండు నవిద్యావశుం డైనవాఁ డనవరతంబుఁ దన్నుస్వతంత్రుంగాఁ దలంచుచుండు భూతంబులవలన భూతంబులు పుట్టుచుండు నాభూతంబులు భూతంబులచేత భక్షింపబడుచుండుఁ బురుషునకాయువు శ్రీయును గీర్తియు నైశ్వర్యంబును మొదలయినవి యనుభవింప నెంతగాలంబు ప్రాప్తం బంతగాలంబు నివసించుఁ బ్రాప్తంబు దీఱినఁ బురుషుండు జాలిం బొందిన నవియుండక పోవుచుండుం గావున గుణంబును నవగుణంబునుఁ గీర్త్యపకీర్తులను జయాపజయంబులును సుఖదుఃఖంబులును జావుబ్రతుకులునుసమం

బులయి కలుగుచుండు నజ్ఞానిస్థమైనవానికి సత్త్వరజస్తమోగుణంబులు గలిగి యుండునట్టివానికి గుణమయంబులైనయింద్రియాదులై యాత్మ యని తోఁచుచుండుం గావున వాఁడాగుణంబులచేత బద్ధుండగు నాగుణంబులకు సాక్షిమాత్రం బగుశరీరంబు వేఱని యెవ్వఁడెఱుంగ నోపు వాఁడాగుణంబులచేత బద్ధుండు గాఁడు గావున గుణంబులును గుణియును భోక్తయును భోగ్యంబును జయంబును నపజయంబును హర్తయును హార్యంబును నుత్పత్తిస్థితిలయకర్తయై సర్వోత్కృష్టుండైన యప్పరమేశ్వరుండె కాని యన్యంబులే దిప్పుడొక్క హస్తంబు నాయుధంబునుం బోయినను భవత్ప్రాణాపహరణంబునకు సమర్థుండ నగుచున్న నన్నుం జూడుమని వృత్రాసురుండు మఱియు నిట్లనియె. 413

తే. వాహనంబులుసారెలు • వాఁడిశరము
[1]లూర్జితాక్షములనువులె • [2]యొడ్డనములు
గాఁగఁబోరెడునీ [3]ద్యూత•కర్మమందు
నెనఁగజయమునునపజయ•మెవ్వఁడెఱుఁగు. 414

చ. అనవుడు వృత్రుమాటలకు • నద్భుతమంది సురేంద్రుఁ డెంతయుం
దనమదిఁ గుత్సితం బుడిగి • దైవముగా నతనిన్ భజించి క్రే-
కొనియెఁ గరంబునన్ దిగువఁ • గూలినవజ్రము నప్పు డాత్మలోఁ
దనరె జగంబు లన్నియు ము•దంబునఁ బొందిరి ఖేచరావళుల్

క. [4]రాహుగ్రహవక్త్రగుహా
గేహాంతము వాసి వచ్చి • కిరణావళి స
ద్బాహుళ్య మొప్ప వెలిఁగెడు
నాహరిదశ్వుండుఁబోలె•హరియొప్పెన్నృపా. 416

---

1 ఊర్జితాయక్షములు = ప్రశస్తములగుపాచికలు

2 ఒడ్డనములు = పందెములు.

3 ద్యూతకర్మమందు = యుద్ధమనెడు నీ జూదమునందనుట.

4 రాహుగ్రహ వక్త్రగుహా గేహాంతము = రాహుగ్రహముయొక్క నోరనెడు గుహా గేహముయొక్క మధ్యమును.

వ. ఇట్లు 1కరకలితవజ్రాయుధరుచిమండలమండితదిఙ్మండలుం డయినజం
భారి గంభీరవాక్యంబుల విస్మయానందస్మితముఖారవిందుం డయి
వృత్రున కిట్లనియె. 417

క. ఓదానవేంద్ర నీమతి, వేదాంతముఁబోలెఁ దత్త్వవిజ్ఞానకళా
మోదము నీవతిభక్తుఁడ, వాదిమపురుషునకు హరికి♦నబ్జాక్షునకున్

ఉ. లోకము లెల్ల నిండి తన♦లోనుగ సర్వముఁ జేసి ప్రాణులన్
దీకులఁ బెట్టి యెల్లెడలఁ ♦ దీపులు సూపెడివిష్ణుమాయ నేఁ
డేకమతిం దలంచి తిది ♦ యేల మహాసురరూపు మాని సు
శ్లోకుఁ బురాణపూరుషుని ♦ శోభనమూర్తి ధరింపు మింపునన్.

ఉ. ఏనియమంబు సల్పితివొ ♦ యెట్టిమహాతప మాచరించితో
పూనిరజోగుణాభిరతిఁ ♦ బొందిననీమతి శాంతిదాంతిస
మ్మానసమానసానుభవ♦మత్తమరాళముఁ జరోషభావస
మ్మానుఁ డమేయుఁ డాదనుజ♦మర్దనుభక్తి పొసంగె నెంతయున్.

క. నారాయణరూపామృత, పారావారమునఁ దేలు♦భక్తుఁడవు దా భూ
దారకరఖాతకోదక, పూరంబులు నేలతృప్తిఁ ♦ బొందుమహాత్మా

వ. ఇట్లు వలుకుచున్న యింద్రు నుపలక్షించి వృత్రాసురుం డాయో
ధనదుర్మర్షణ సంఘృష్టమానమానసుండై వైరం బుడ్కొల్పుకొని
వామహస్తంబునం బరిఘంబుఁ ద్రిప్పుచు నుప్పరంబునం గుప్పిం
చుచు 2బ్రహ్మాండకర్పరంబు నిష్ఠురభైరవారావంబునం బగి
లించుచు సముత్తుంగమత్తమాతంగ పుంగవంబు వృషభంబుపైఁ
గవియుభంగి సురవృషభు పేరురం బుపలక్షించి భీషణాశని నిపాత
వేగంబునం గొట్టిన నింద్రుండు కులిశధార నప్పరిఘంబుఁ దునిమి
తోడన 3శేషఫణావిశేషభాసురం బయిన బాహుదండంబు
ఖండించె నప్పుడు వృత్రుండు భిన్నబాహుద్వయమూలంబులై
రక్తధారలం దొరఁగుచు వజ్రిచేతఁ బక్షహతంబైన దివంబుననుం

1 శ్రీకర ... మండలుండయి = చేతకీలింపఁబడిన వజ్రాయుధముయొక్క
కాంతిసమూహముచే నలంకరింపఁబడిన దిక్సమూహముకలవాఁడు.

2 బ్రహ్మాండకర్పరంబు = బ్రహ్మాండముయొక్క పైపెంకు.

3 శేష ... భాసురంబు = ఆదిశేషునిపడగవలెమిగుల ప్రకాశించునది.

జాఱుచున్న కులపర్వతంబునుం బోలెఁ జూపట్టి ప్రళయకాల సంహారనిటలచ్ఛటచ్ఛటార్భటకఠోరకీలాభీలాగ్నిసమానకూరౌర కుటిలనిరీక్షదుర్నిరీక్షుం డయి భూనభోమండలంబులఁ గ్రిందిమీఁది దౌడల హత్తించి నభోమండలంబునుంబోలెఁ దుదిమొదలెఱుంగరాక వికృతంబుగా వక్త్రంబు దెఱచి [1]మందరమథనమథ్యమానవిషమజిహ్వాభీలం బగునాలుక నభంబు నాకుచుఁ గాలసంహారకారణుం డయిన కాలునిభుజదండమండితంబగు దండంబునుంబోని దంష్ట్రలచేత జగత్త్రయంబును మ్రింగెడువాఁడునుంబోలె నతిమాత్రమహాకాయుం డయి పర్వతంబులం దలంగ మీటుచు నడగొండయుంబోలె నభోభాగభూభాగంబుల నాక్రమించియప్పుడు.

ఉ. కాలమునాఁటిమృత్యువుముఖంబునఁ బోలెను విస్ఫులింగముల్
గ్రాలఁగ దేవసంఘములు గంపము నొంద జగంబు లెల్ల నా
హాలుకితారవం బెసఁగ నభ్రగజంబును నాయుధంబుతో
నాలుకఁ జుట్టిపట్టి సురనాథుని మ్రింగె మహాద్భుతాకృతిన్. 423

ఆ. లోక మెల్ల నపుడు చీకాకుపడెఁ దమం
బడరె నుడుగణంబు లవనిమీఁద
సోనవాన గురిసె సూర్యచంద్రాగ్నుల
రశ్ములడఁగె దిశలు రభస మయ్యె. 424

వ. అప్పుడు. 425

ఉ. కందఁడు భీతిఁ గుందఁడు ప్రకంపన మొందఁడు పెద్దనిద్దురం
జెందఁడు తత్తఱింపఁడు విశేషముఁ జొప్పడు వైష్ణవీజయా
నందపరైకవిద్యను మనంబునఁ దాల్చుచు నుండెఁ గాని సం
క్రందనుఁ డానిశాచరుని గర్భములో హరిరక్షితాంగుఁడై. 426

వ. ఇట్లు కవచరూప శ్రీనారాయణ కృపాపాలితుండై యోగబలంబున బలభేది యతని యుదరంబు వజ్రాయుధంబున భేదించి వైరావణసహితుండై వెడలి యతని కంధరంబు తెగ నడువ వజ్రంబుఁ

1 మంధర ... అభీలంబు = మందరమనెడు కవ్వముచే త్రచ్చఁబడుచున్న పాముయొక్క పుట్టినవిషముకలిగినట్టియు నాలుకవలె భయంకరమైన.

ప్రయోగించిన నతినిష్ఠురవేగంబున వృత్రహరణార్థంబుగం దిరు
గుచు సూర్యాదిగ్రహనక్షత్రంబులకు దక్షిణోత్తరగతి రూపం
బయిన సంవత్సరసంధియందు నహోరాత్రమధ్యంబున వృత్రుశిరంబు
పర్వతశిఖరంబునుం బోలెం ద్రుంచి కూలం ద్రోచె నప్పుడు. 427

మ. మొరసెన్ దుందుభు లంబరంబునఁ గడున్ ♦ మోదించి గంధర్వులు
సురలున్ సాధ్యులు సిద్ధులున్ మునివరుల్ ♦ సొంపార వృత్రఘ్ను [1]భీ
కర తేజోవిభవప్రకాశకరవి ♦ ఖ్యాతైకమంత్రంబులం
దిర మొప్పం బఠియించుచుం గురిసి రెం ♦ తేఁ గ్రొత్తపూసోనలన్.

ఆ. ఏమి చెప్ప నప్పు ♦ డింద్రారితనువున
నొక్క దివ్యతేజ ♦ ముబ్బి వెడలి
లోకమెల్లఁ జూడ ♦ లోకులు సూడఁగ
లోకమరసి విష్ణు ♦ లోను సొచ్చె. 429

వ. ఇట్లు లోకభీకరుండైన వృత్రాసురుండు గూలిన నఖిలలోకంబులుఁ
బరితాపంబు లుడిగి సుస్థితిం బొందె దేవర్షి పితృగణంబులు దాన
వులతోడం గూడి యింద్రునకుం జెప్పక తమతమస్థానంబులకుం
జని రనిన విని పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రున కిట్లనియె.

ఆ. ఏమికారణమున ♦ నింద్రుతోఁ బలుకక
సురలు వోయి రట్టి ♦ సురగణంబు
లెందుచేత సుఖముఁ ♦ జెందిరి వజ్రికిఁ
జేటు గలుగుటెట్లు ♦ సెప్పవయ్య. 431

వ. అనిన శుకుం డిట్లనియె. వృత్రపరాక్రమచకితు లయిన నిఖిల దేవ
తలును మహర్షిగణంబులును మున్ను వృత్రవధార్థం బింద్రునిం
బ్రార్థించిన నతండు బ్రహ్మహత్యకుం జాలక తొల్లి విశ్వరూపునిం
జంపినపాపంబు స్త్రీలయందును భూమియందును జలంబులందును
ద్రుమంబులందును విభజించి పెట్టితి నిప్పు డీహత్య యేరీతిం బాపు
కొనువాఁడ నాకశక్యంబనిన మహర్షు లశ్వమేధయజ్ఞంబు సేయించి

---

1 భీకర...మంత్రంబులన్=భయమును కలుగఁజేయునట్టి పరాక్రమాతిశయము
నకు ప్రకాశమును కలుగఁజేయు ప్రశస్తములును, ప్రధానములును నైన మంత్రముల చేత.

యజ్ఞపురుషుండయిన శ్రీనారాయణదేవుని సంతుష్టునిం జేసి యీ హత్యం బాపం గలవారము స్వభావంబున బ్రాహ్మణ పితృ గో మాతృ సజ్జనహంతలైన వార లేదేవునిం గీర్తించి శుద్ధాత్ములగుదు రద్దేవుని నశ్వమేధమహామఖంబున శ్రద్ధాన్వితుండవై సేవించిన నీకు ఖలుండైన యిద్దురాత్ముని హింసించిన హత్య యేమి సేయం గలదని యొడంబఱిచిన నింద్రుండువల్లెయని యవ్విధంబున మార్తునిం బరిమార్చి బ్రహ్మహత్యం బొంది యత్తాపంబు భరియింపనోపక దుర్దశం బొందె నప్పుడు. 432

సీ. పాపంబుఁ జండాల ♦ రూపంబుగలదాని
ముదిమిచే నొడలెల్లఁ ♦ గదలుదాని
క్షయకుష్ఠరోగ సం♦చయకృతం బగుదాని
నురురక్తపూరంబు ♦ దొరఁగుదాని
నరసిన వెంట్రుకల్ ♦ నెరసినతలదాని
నటఁ బోకు పోకుండు ♦ మనెడుదానిఁ
[1]కదురు కంపునఁ బ్రేవు ♦ లదరఁజేసెడుదానిఁ
దా నెందుఁ బాఱినఁ ♦ దఱుముదాని

ఆ. నాగుణంబు లెల్ల ♦ భోగింప కేరీతి
నరుగ నెంతవాఁడ ♦ వనెడుదాని
బిట్టు దిరిగి చూచి ♦ భీతిల్లి సిగ్గుతో
దేవనాయకుండు ♦ దెరలి పఱచె. 433

వ. ఇట్లతివికృతత్వంబుతో బ్రహ్మహత్య వెనుతగుల నింద్రుండు నభోభాగ భూభాగ దిగ్భాగంబులెల్లందిరిగి చొరం దెరువులేక దీర్ఘనిర్ఘాతాటోప నిశ్వాసదూషితుండై యీశాన్యభాగంబునకుం బఱచి యద్దెస నమేయపుణ్యాగణ్యం బయిన మానస సరస్సునం బ్రవేశించి యందొక్క కమలనాళంబు సొచ్చి తంతువులం గలసి రూపంబు లేక యలబ్ధభోగుండై బ్రహ్మహత్యావిమోచనంబుఁ జింతించికొనుచు సహస్రవర్షంబు లుండె నాచండాలియు నది

1 కదురుకంపునన్ = అతిశయించుచున్న చెడువాసనతో.

పరమేశ్వరదిగ్భాగం బగుటం జేసి యుండుం జోరరాక కాచియుండె నంతకాలంబుఁ ద్రిదివంబున నహుషుండు విద్యాబల తపోబల యోగబలంబులం బాలించుచుండి సంపదైశ్వర్య మదాంధుండై యింద్రపత్నిం గోరి యింద్రుండు వచ్చునందాఁక నాకుం బత్నివి గమ్మనిన నా శచీదేవి బృహస్పతి ప్రేరితయై 1బ్రహ్మర్షి వాహ్య శిబిక నెక్కి వచ్చి నన్ను భోగింపుమనిన నతం డట్లుచేసి 2కుంభసంభవశాపహతుండై యజగరయోనియందుఁ బుట్టె నంత నింద్రుండు బ్రహ్మర్షి గణోపహూతుండై త్రిదివంబునకు వచ్చె నంతకాలంబు నారాయణచరణారవింద ధ్యానపరుండై యుండుటం జేసియు దిశాధినాథుండైన శంకరుచేత రక్షింపఁబడినవాఁడై యుండుటం జేసియు దద్దోషబలంబు దఱిఁగి సహస్రాక్షుం బీడింప లేదయ్యె నప్పు డింద్రుండు నిజైశ్వర్యంబునుం బొంది బ్రహ్మర్షి పరివృతుండై మహాపురుషారాధనంబు సేసి హయమేధాధ్వరంబునకు దీక్షఁ గైకొని బ్రహ్మవాదులచేత నాదరింపఁబడుచున్నవాఁడయి సర్వదేవతామయుండైన నారాయణుం బరితృప్తుం జేసి మంచు విరియించు మార్తాండుని చందంబునఁ ద్వాష్ట్రవధరూపపాపంబు నాశంబు నొందించి సకల దివిజయక్షగంధర్వ సిద్ధమునిజనసంస్తూయమానుండయి త్రిభువనైశ్వర్య భోగభాగ్యంబులం గయికొనియె నప్పుడు.

చ. సతతమరీచిముఖ్యముని ♦ సంఘముచేత యథోచితంబుగాఁ
గృతఘనవాజిమేధమునఁ ♦ గేశవు నీశుఁ బురాణపూరుషున్
హితు జగదీశు యజ్ఞపతి ♦ నిష్టఫలప్రదు నంతరంగ సం
గతు భజియించి వజ్రి గత ♦ కల్మషుఁడై నెగడెన్ మహీశ్వరా.

సీ. మఱియుఁ బుట్టింపంగ ♦ మనసు పెట్టినయట్టి
3క్రూరకర్మాంభోధి ♦ కుంభజుండు

1 బ్రహ్మర్షి వాహ్యశిబిక = బ్రహ్మర్షులచే మోయఁదగిన పల్లకి, 2 కుంభసంభవ శాపహతుండై = అగస్త్యునియొక్క శాపముచే చెడినవాఁడై

3 క్రూర ... కుంభజుండు = చెడ్డపనులను సంద్రమునకు అగస్త్యుఁడు

అంగారములు సేయ ♦ నాహుతిఁ గన నోపు
బహుపాపకానన♦పావకుండు
కందక దిగ మ్రింగి ♦ గట్టునఁ ద్రేఁపంగఁ
1కల్మషగరళగం♦గాధరుండు
ఘనగుహాంతరములఁ ♦ గాలూన నియ్యని
కలుషదుస్తరతమో♦గ్రహవిధుండు

ఆ. 2సకలముక్తిలోక♦సామ్రాజ్యసమధిక
సహజభోగభాగ్య♦సంగ్రహైక
కారణాప్రమేయ♦కంజాక్షసర్వేశ
కేశవాదినామకీర్తనంబు. 436

సీ. అఖిలదుఃఖైకసం♦హారాదికారణం
బఖిలార్థసంచయా♦హ్లాదకరము
విమలభక్త్యుద్రేక♦విభవసందర్శనం
3బనుపమభక్తవ♦ర్ణనరతంబు
విబుధహర్షానేక♦విజయ సంయుక్తంబు
4గ్రస్తామరేంద్ర మో♦క్షక్రమంబు
బ్రహ్మహత్యానేక♦పాపనిస్తరణంబు
గమనీయసజ్జన♦కాంక్షితంబు

తే. నైన యీయితిహాసంబు ♦ నధికభక్తి
వినినఁ జదివిన వ్రాసిన ♦ ననుదినంబు
నాయురారోగ్య భాగ్యభో♦గాభివృద్ధి
కర్మనాశము సుగతియుఁ ♦ గల్గు ననఘ. 437

---

1 కల్మష ... ధరుండు = పాపములను విషమునకు ఈశ్వరుఁడు.

2 సకల ... కీర్తనంబు=సమస్తములగు ముక్తిలోకమునందలి రాజ్యమునకు సంబంధించిన యెక్కుడగు సహజానుభవవిశేషములను కూర్చుటయందు ప్రధానకారణమై నిరూపింపరాని కంజాక్ష! సర్వేశ, కేశవ, మొదలగు పేరులపొగడ్త.

3 అనుపమ ... రతంబు = పోలికలేని భక్తుల వర్ణించుటయందు ఆసక్తమైనది.

4 గ్రస్త...క్రమంబు=మ్రింగఁబడినయింద్రునివిడిపించు విధానముకలది.

సీ. నాఁడు యోగీంద్ర ♦ నా మనం బీవృత్రు
వివరంబు నీచేత ♦ విన్న మొదలు
కడు నద్భుతంబునఁ ♦ గళవళం బందెడుఁ
గోరి రజస్తమో ♦ గుణములందు
వర్తించునీపాప ♦ వర్తికి నేరీతి
మాధవపదభక్తి ♦ మది వసించె
సత్త్వస్వభావులై ♦ సమబుద్ధులై తపో
నియమప్రయత్నులై ♦ నిష్ఠచేత
తే. నిర్మలాత్మకులైనట్టి ♦ ధర్మపరుల
కమరులకుఁ బుణ్యమునులకు ♦ నంబుజాక్షు
భూరి కైవల్యసంప్రాప్తి ♦ మూలమైన
భక్తి వీనికిఁబోలె నే♦ర్పాటు గాదు. 438

సీ. భూస్థలిఁ గలరేణు♦వులకన్న దట్టమై
కడు నొప్పుజీవ సం♦ఘములు గలవు
ఆజీవములలోన ♦ నరయ ధర్మాయత్త
మతి వసించినవారు ♦ మనుజజాతి
యామనుష్యులలోనఁ ♦ గామంబుఁ బెడఁబాసి
మోక్షార్థులగువారు ♦ మొదలనరిది
మోక్షమార్గం బాత్మ ♦ మూలంబుగా నుండు
వారిలో ముక్తులు ♦ లేరు తఱచు
తే. ముక్తులైనట్టివారిలో ♦ యుక్తిఁ దలఁపఁ
జాల దుర్లభుఁ డమితప్ర♦శాంతిపరుఁడు
పరమసుజ్ఞాననిరతుండు ♦ భద్రగుణుఁడు
రమణ శ్రీవాసుదేవ ప♦రాయణుండు. 439

తే. సకలలోకాపకారి దు♦స్సంగతుండు
వృత్రుఁ డేక్రియ సుజ్ఞాన♦వేది యయ్యె
సమరమునఁ బౌరుషంబు చే♦నమరవిభుని
నెట్లు మెప్పించె దీని నా♦కెఱుఁగఁజెప్పుమా. 440

—♦ చిత్రకేతూపాఖ్యానము. ♦—

వ. అని పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రు నడిగెనని సూతుండు
శౌనకాది మునులకుం జెప్పి మఱియు నిట్లనియె నట్లు గజపురవల్ల
భుండు సంప్రశ్నంబు సేసిన బాదరాయణి హరిస్మరణశ్రద్ధాపరుం
డయి తొల్లి కృష్ణద్వైపాయననారదదేవల మహర్షులు నాకెఱిం
గించిన యితిహాసంబు గలదు దాని నెఱింగించెద సావధానుండవై
యాకర్ణింపు మని యిట్లనియె 441

చ. అమిత విభూతిఁ జాల నమ♦రాధిపుఁ బోలుచు శూరసేన దే
శములకు భర్తయై ప్రజలు ♦ సంతస మందఁగ సార్వభౌముఁ డై
క్షమ దమ కెల్లకాలమును ♦ [1]గామదుహంబుగఁ జిత్రకేతు నా
మమునఁ బ్రసిద్ధి కెక్కె గుణ ♦ మండనుఁ డంచితకీర్తికాముఁ డై.

సీ. [2]మానితతారుణ్య♦మదనతురంగులు
[3]కందర్పవిజయైక ♦ ఖడ్గలతలు
మదనసమ్మోహన ♦ మంత్రాధిదేవతల్
పంచశిలీముఖు ♦ బారెకత్తె
లసమాస్త్రుఁ డఖిలంబు ♦ నడకించుబొమ్మలు
నాత్మసంభవుని [4]క♦ట్టాయితములు
పుండ్రేక్షుకోదండు♦భూరి తేజంబులు
శంబరవిద్వేషి♦సాయకములు

తే. నాఁగఁబొలుపారు నొకకోటి♦నలినముఖులు
దనకుఁ బత్నులుగాఁగ న♦త్యంతవిమల
కీర్తివైభవ సన్మార్గ♦వర్తి యగుచు
జగతిఁ బాలించు చుండె నా♦జనవిభుండు. 443

తే. కలిమి వేవేలుభార్యలు ♦ గలిగియుండఁ
బరఁగ సంతతియొక్కండుఁ ♦ బడయ లేక

---

1 కామదుహము = కోరికలపిండునది.

2 మానిత ... తురంగులు = ప్రశస్తమగు జవ్వనముగల మన్మథుని యాఁడుగుఱ్ఱములు. 3 కందర్ప ... లతలు = మన్మథునియొక్క లోకజయమునందు ప్రధానములయిన ఖడ్గములు. 4 కట్టాయితములు = తీవ్రసన్నాహములు.

చిత్తమునఁ జాలఁ బాయని ♦ చింత వొడమి
బడలఁ జొచ్చెను వేసవి ♦ మడువుఁ బోలె. 444

ఉ. రూపము సత్ప్రతాపము [1]మ♦రుత్పతిభోగము యౌవనంబు సం
దీపితచారువర్తనము ♦ దిగ్విజయంబును సత్యముఁ జగ
ద్వ్యాపితకీర్తియుఁ సతులు ♦ వైభవముఖ్యము లెల్ల మాన్పఁగా
నోపక యుండె నా నృపతి ♦ నొందిన సంతతిలేని దుఃఖమున్. 445

వ. ఇట్లు సంతతిలేక యతిదుఃఖమానసుం డయిన యా నరేంద్రుని
మందిరంబున కంగిరసమహాముని వచ్చి యతనిచేత నతిథిసత్కారం
బులు వడసి కుశలం బడిగి రాజ్యంబు భవదధీనంబ కదా పృథివ్య
ప్తేజోవాయ్వాకాశ మహదహంకారంబు లనియెడి యేడింటిచేత
రక్షింపంబడ్డ జీవుండునుం బోలె నమాత్యజనపద దుర్గద్రవిణసంచయ
దండమిత్రంబు లనెడి సప్తప్రకృతులచేత రక్షితుండవై ప్రకృతి
పురుషులయందు భారంబు వెట్టి రాజ్యసుఖంబు లనుభవింతువుగదా
మఱియు దార ప్రజామాత్యభృత్యమంత్రిపౌరజానపదభూపాలురు
నీకు వశవర్తులుగదా సర్వంబునుం గలిగి సార్వభౌముండవైన
నీవదనంబున విన్నఁదనంబు గలిగి యున్నయది గతం బేమి యనిన
నా మునిప్రవరునకు నతం డిట్లనియె మీ తపోబలంబున మీకు
నెఱుంగరాని యదియుం గలదే యని తలవంచి యూరకున్న
నతని యభిప్రాయం బెఱింగి యా భగవంతుం డైన యంగిరసుండు
దయాళుండై పుత్రకామేష్టి వేల్చి యజ్ఞశేషం బతని యగ్రమహిషి
యయిన కృతద్యుతి కిచ్చి నీకుం బుత్రుండు గలిగెడి నతనివలన
సుఖదుఃఖంబు లనుభవింపం గలవని చెప్పి యమ్మహాత్ముండు సనియె
నా కృతద్యుతియను దేవి గర్భంబు ధరియించి నవమాసంబులు
నిండినం గుమారునిం గనియె నా కాలంబున రాజును సమస్తభృత్యా
మాత్యజనంబులుఁ బరమానందంబుఁ బొంది రవుడు చిత్రకేతుండు
కృతస్నానుండై సకలభూషణభూషితుండై సుతునకు జాతకర్మంబు
నిర్వర్తించి బ్రాహ్మణులకు నపరిమితహిరణ్యరజతదానంబులును

1 మరుత్పతిభోగములు = యింద్రుని యనుభవము.

వస్త్రాభరణంబులును గ్రామంబులును గజంబులును వాహనంబులును ధేనువులును నాఁజేసియర్బుదంబుల ద్రవ్యంబును దానంబు సేసి ప్రాణిసముదయంబునకుం బర్జన్యుండునుంబోలెఁ దక్షిణవారలకు నిష్టకామంబులు వర్షించి పరమానందహృదయుండై యుండెఁ గుమారుండును మాతృపితృబంధుజనంబులకుసంతోషంబు సేయుచు దినదినప్రవర్ధమానుండై పెరుఁగుచుండె నంతం బుత్రమోహంబునం గృతద్యుతియందు బద్ధానురాగుండై మహీధవుండు వర్తించుచుండం దక్షిణభార్యలు సంతానసంతోషవికలలై యీమోహంబునకుం గారణంబు పుత్రుండ యని యీర్ష్యంజేసి దారుణచిత్తలై కుమారునకు విషం బిడిన సుఖనిద్రితుండునుంబోలె బాలుండు మృతిఁబొందె నప్పుడు వేగుటయు దాది బోధింపంజని యాకుమారుని వికృతాకారంబుఁ జూచి విస్మయశోకభయార్తయై పుడమిం బడి యాక్రందించె నప్పుడు. 446

తరలము. పుడమి నిట్టకనిల్వనం బడి ♦ పొక్కుచుం గడు దీనయై
యడఁకు వేమియు లేనివాక్కుల ♦ నావు రంచు విలాపమం
1దెడరు దోఁప భృశాతురోన్నతి ♦ నేడ్చినన్ విని భీతితోఁ
గడుపు బిట్టవియంగ భూపతి♦కాంత గ్రక్కున నేగుచున్

ఆ. బాలుఁ డొక్కరుండు ♦ పరిణామశీలుండు
వంశకర్త తపసి♦వరమువలనఁ
బుట్టి మిన్నకట్లు ♦ వాలిసి యున్నట్టియా
కొడుకుఁ జూచితల్లి ♦ యడలఁజొచ్చె. 448

ఉ. 2కుంకుమరాగరమ్యకుచ♦కుంభములం గడుఁ గజ్జలంబుతోఁ
బంకిల మైనబాష్పముల♦పాల్పడ మజ్జన మాచరించుచుం
గంకణపాణి పల్లవయు♦గంబున వక్షము మోఁదికొంచు నా
పంకరుహాక్షి యేడ్చెఁ బరి♦భావితపంచమసుస్వరంబునన్. 449

క. ఆయార్తరవమునకు భూ
నాయకుఁడు భయంబు నొంది ♦ నయముడిగి సుతున్

1 ఎడరు=దుఃఖము. 2 కుం...లన్=కుంకుమపూఁతలతోనందములగుస్తనకలశములందు.

ఉ. వృత్రుఁడు మానవాన్వయప ♦ విత్రుఁడు లోకజిఘాంసకక్రియా
సూత్రుఁడు విగ్రహాగ్రహణ సుస్థిరవాక్యవివేకమానచా
రిత్రుఁడు దేవఘోరగద ♦ రీకృతసత్త్రుఁడు రోషదూషితా
మిత్రుఁడు శత్రుఁ రాఁకఁ గని ♦ మిక్కిలి ద్రోసెయుగాంతకాకృతిన్.

క. మెండు గలదనుజనాయక
మండలములు గొల్వ నడచె ♦ మహితోద్ధతి వే
దండములనడుమఁ జనునడ
గొండయునుంబోలె సిబిడ ♦ క్రోధోద్ధతుఁ డై. 359

క. కాలగళుఁ డడిరి కడువడిఁ
గాలునిపైఁ గవయుమాడ్కి ♦ ఖరతరరసనం
చాలితపూర్వదిగంతరుఁ
డై లీల మహేంద్రుమీఁద ♦ నతఁ డరిగె నృపా. 360

వ. ఇట్లు రుద్రగణంబులు మరుద్గణంబులు నాదిత్యగణంబులు నశ్వదేవతలుఁ బితృదేవతలు విశ్వేదేవులు వహ్నియమ నైరృతివరుణ వాయుకుబేరేశానాదులు సిద్ధసాధ్యకిన్నరకింపురుష గరుడగంధర్వ ఖేచరప్రముఖంబులగునింద్ర సైన్యంబులతోడ నముచియు శంబరుండును ననర్వుండును ద్విమూర్ధుండును వృషభుండును నంబరుండును హయగ్రీవుండును శంకుశిరుండును విప్రచిత్తియు నయోముఖుండును బులోముండును వృషపర్వుండును హేతియుఁ బ్రహేతియు నుత్కటుండును ధూమ్రకేశుండును విరూపాక్షుండును గపిలుండును విభావసుండును నిల్వలుండును బల్వలుండును దందశూకుండును వృషధ్వజుండును గాలనాభుండును మహానాభుండును భూతసంతాపనుండును వృకుండును సుమాలియు మాలియు మున్నగు దైతేయదానవయక్షరాక్షసాదుల సంఖ్యాంబు లగువ్యూత్రాసురబలంబు లంతంతం దలపడి సరమంబు సేసిర ప్పుడు. 361

చ. అసురులకుఁ సురావలికి ♦ నయ్యె మహారణ మప్పు డొంతొరుల్
ముసలగదాసికుంతశర ♦ ముద్గర తోమర భిందిపాలప

ట్టినపటుశూలచక్రముల ♦ రేవలు నూపియదల్చి యార్చుచుం
మసలక కప్పి రక్తముల ♦ మార్గొని మంటలుమింట నటుఁగన్.

క. ఒండొరులఁ గడన నేసిన
కాండము లాకాశపథముఁ ♦ గప్పి మహోల్కా
దండంబులొలసి నిష్ఠుర
భండనముఖ మొప్పెఁ జూడ ♦ బ్రళయోచితమై.

చ. సురువరు లేయుబాణములు ♦ నూడ్కి కగోచరమై నభస్స్థలం
బఱిముఱిఁ గప్పి రేసి దివ♦సాంతముఁ జేసినలీల నాసురే
శ్వరబలయూథవీరులను ♦ సాయకపంక్తులచేత వాని రూ
పఱిశతధూళిఁ జేసి పఱ ♦ పైనతమం బొనరించి రార్చుచున్. 364

చ. సమరమదాంధులై సురని♦శాచరవీరులు [1]సైనికాంఘ్రిసం
క్రమితమహీపరాగములు ♦ గ్రమ్మిన నుమ్మలికంపుఁజీకటుల్
దమకనుదోయి కడ్డముగఁ ♦ దార్కొనినం జల మేది పోరి రా
క్రమితనిజాంతరంగపరి♦ఘట్టితరోషమహాగ్ని పెంపునన్. 365

క. అతిగళితర క్తధారా, క్షతములతోఁ గానఁబడిరి♦సైనికులు మహో
ద్ధతరోషవహ్నికీలలు, వితతంబై పెల్లగిల్లి ♦ వెడలెడిభంగిన్. 366

సీ. రనణించు [2]శింజినీ ♦ టంకారరవములు
భటసింహనాదంబుఁ ♦ బరిభవింప
భీషణోత్తమహాయ♦హేషావిఘోషంబు
కరిబృంహితస్ఫూర్తిఁ ♦ గ్రందుకొలుప
సమరనిశ్శంకాంశ♦శంఖనినాదంబు
నేమిస్వనంబుల ♦ [3]నిహ్నవింపఁ
దుముల మై చెలఁగెడు♦దుందుభిధ్వానంబు
లట్టహాసంబుల ♦ నాక్రమింప

తే. ఘటితశస్త్రాస్త్రనిష్ఠుర♦ఘట్టనోత్థ
ఖరకఠోరోరువిస్ఫులిం♦గంబు లడరి

1 సైనికా ... పరాగములు = సైనికులయొక్క పాదముల ఘట్టనచే చేసిన నేలధూళులు. 2 శింజినీ టంకారరవములు=అల్లెత్రాటియొక్క ఝమ్మను సవ్వడులు
3 నిహ్నవింప = మఱుఁగుపఱుపఁగా.

[1]దివ్యకోటీరమణిఘృణి • ధిక్కరింప
సమర మొనరించి రసురులు • నమరవరులు 367

వ. ఇట్లు ప్రళయసంరంభ విజృంభితసముత్తుంగ తరంగితభైరవారావ నిష్ఠ్యూతనిష్ఠుర మహార్ణవంబునుం బోలె [2]యుగాంతసంక్రాంత ఝంఝాపవనపరికంపిత దీర్ఘనిర్ఘాతనిబిడనిష్ఠురనీగదంబులుం బోలె నుభయ సైన్యంబులుం గలసి సరమంబు సలుపుసమయంబున యుగాంతకృతాంతసకలప్రాణిసంహారకారణలీలయుం బోలెం బదాతి రాహుత్తమావంతరథిక మహారథికవీరు లొండొరులు చండగతిం గాండంబులు పఱపుచు గదలం జదుపుచుం గత్తులం గత్తళంబులం జినుగం బొడుచుచు నడిదంబుల నఱకుచుం గుంతంబులం గ్రుచ్చుచుం గుఠారంబుల వ్రచ్చుచు ముసలంబుల మోదుచు ముద్గరంబులం బాదుచుం జక్రంబులం ద్రుంచుచు సబళంబుల నొంచుచు సురియల మెఱముచు శూలంబులం దుఱుముచు వాజుల కుఱికియు వాలంబుల నఱికియుం దొడలు తుండించియుం దొండంబులు ఖండించియు మెడ లెడయించియు మెదళ్లు గెడయించియు నడుములు ద్రుంచియు నాసికలు ద్రెంచియుం బసంబుల విఱిచియుం బార్శ్వంబులం జఱచియు గజంబులం బఱపియు గాత్రంబుల మఱపియుం గుంభంబులం బగిలించియుం గొమ్ములం బెకలించియు హస్తంబులం దుండించియు నంగంబులం జించియు రథంబుల నలియించియు రథికులం బొలియించియు సాహులం జంపియు సైంధవంబులం దంపియు శిరంబు నొగిలించియు సీసకంబు లగిలించియు ఛత్త్రంబుల నుఱుమాడియుం జామరంబులం దునుమాడియు సైన్యంబులం జదిపియు సాహసుల మెదిపియు నడుములు దుంచియు మఱియును బరస్పరగుణవిచ్ఛేదనంబును నన్యోన్యకోదండఖండన

1 దివ్యకోటీరమణిఘృణి = ప్రశస్తములగు కిరీటముల యందలి రత్నాల కాంతిని.
2 యుగాంత ... నీగదంబులు = ప్రళయకాలమునందు చేరిన, పెనుగాలిచే కదల్పబడిన, పెద్దపిడుగులచే నిండి కఠోరములగు మేఘములం.

పటుత్వంబును 1నుభయసైంధవ ధ్వజసారథిరథికరథ వికలనంబును నొం
డొరుల పాదజానుజంఘాహస్తమస్తక నిర్దళనంబును రక్తమాంసమేదః
పంకసంకలితసమరాంగణంబునునై యతిఘోరభంగిం బెనంగిరప్పుడు.

చ. సమజయమున్ సమాపజయ♦సామ్యపరిశ్రమమున్ సమోరువి
క్రమము సమాస్త్రశస్త్రబల♦గర్వము నై కడు ఘోరభంగి నా
2నముచివిరోధిసైన్యగణ♦నాథులతోడ నిశాచరేశ్వరో
త్తములు దురంబు సేసి రొగిఁ♦దార్కొనివృత్తిబలంబు ప్రోపునన్.

వ. అప్పుడు.

లయగ్రాహి. మొత్తముగఁ బొఱిపెను♦నెత్తురుమహానదులఁ
దత్తరముతోనుఱికి♦కుత్తుకలు మోవం
జిత్తముల నుబ్బి వెస♦నెత్తుకొనుభూతముల
నత్తుకొనిశాకినులు ♦ జొత్తిలుచు మాంసం
బుత్తలముతో మెసఁగి♦నృత్తములు సేయుమద
మత్తఘనఢాకినులు ♦ వృత్తగతిఁ బ్రేవుల్
బిత్తరములందిగిచి♦మెత్తమెదడుల్మెనసి
గుత్తగొనుచుండభయ♦వృత్తిఁ గలనొప్పెన్. 371

వ. ఇట్లు దేవదానవులు నర్మదాతీరంబునఁ గృతయుగంబునం దలపడి
త్రేతాయుగంబు సొచ్చునంతకాలంబుఁ బోరు దారుణంబుగాఁ
జేయుచుండ నంత వృత్రాసురుభుజబలంబు పెంపునఁ దెంపుసేసి
కంపింపక నిలింపులపై రక్కసులు గుంపులై పెంపుచూపి మహా
వృక్షపాషాణగిరిశిఖరంబులు వర్షించిన. 372

మ. గిరిపాషాణమహీజముల్ గురియఁగా ♦ ర్వాణు లన్నింటి ని
ష్ఠురనారాచపరంపరల్ వఱుపుచున్ ♦ జూర్ణంబుఁ గావింప ని
ర్భరలీలం దమచేయుసత్త్వములు దో♦ర్భంగంబులై పోవఁగాఁ
దెరలన్ రాక్షసయోధవీరుల మదో♦ద్రేకంబు సంఛిన్నమై. 373

1 ఉభయ...వికలనంబు=ఇరువాగుల యందలి గుఱ్ఱములయొక్కయు, టెక్కెములయొక్కయు, రథచోదకులయొక్కయు, రథమెక్కినశూరులయొక్కయు, అరదములయొక్కయుఖండనము. 2 నముచి ... నాథులతోడ = ఇంద్రునియొక్క సేన నేలుచున్న దండనాయకులతో.

క. ప్రచురముగ రాక్షసావళి
ఖచరులపై నేయునిబిడ♦కాండావళి దు
ర్వచనముఁ బెడనాడుమాటలు
సుచరిత్రునియందుఁబోలెఁ ♦ జొరవయ్యె నృపా. 374

వ. అప్పుడు. 375

వనమయూరము. అంత సురలేయునిబి♦డాస్త్రములపాలై
పంతములు దక్కి హత♦పౌరుషములై ని
శ్చింతగతి రక్కసులు ♦ సిగ్గుడిగి భూమిం
గంతుగొని పాఱిరప♦కారపరులార్వన్.

క. కొండలఁ బోలెడురక్కసు
లొండొరులం గడవఁ బాఱి ♦ [1]రుక్కఱి పటుకో
దండముఖసాధనంబులు
భండనమున వైచి దివిజ♦పతు లార్వంగన్. 377

వ. ఇట్లు సమరతలంబు వాసి తనప్రాపుమాసి తీసి పఱచుచుండు దండ
నాయకులం జూచి యకుటిలమతిం బకపక నగి వృత్రాసురుం డి
ట్లనియె. 278

ఉ. [2]క్షుల్లకవృత్తి మీ కగునె ♦ శూరుల కిమ్మెయిఁ గీర్తిభోగముల్
గొల్లగఁ జేయు చావుమదిఁ ♦ గోరినవారల కైనఁ గల్గునే
తల్లడ మంది నాసమర ♦ ధర్మము మాని తలంగఁ బాడియే
మల్లుఁడు దుర్దమ ప్రధన ♦ మత్తుఁడు వృత్రుని పాలఁబడుఁగరే. 379

క. చావు ధ్రువ మైనప్రాణికిఁ
జావులు రెం డరసికొనుఁడు ♦ [3]సమరమునందుం
భావింప యోగమందును
జావంగా లేని చెడుగు♦చావుం జావే. 380

వ. అని వాసుదేవ తేజోవిశేషవిశేషితుండై దవానలకీలలంబోలె
వెలుంగుచు వెఱచి వెన్నిచ్చి పాఱెడు నసురుల వెనుకొని తఱుము

1 ఉక్కఱి=బలమునశించి. 2 క్షుల్లకవృత్తి=నీచవ్యాపారము. 3సంగ్రామమునందు శత్రునిచే, స్వేచ్ఛమెయి యోగముచేనుగణించుట శ్రేయము. తక్కినవి చెడుచావులని.

సురవీరులం జూచి హుంకరించి స్వర్గానుభవంబున నిచ్ఛలేకుండెనేని మదవలోకనస్పర్శనమాత్రంబు ముందర నిలుతురు గాక యని యేచికల్పాంతానల్పఘనఘనాటోపంబునుంబోలెఁ గఠోర కంఠహుంకారతర్జనంబులఁ గర్జిల్లుచుఁ బ్రళయకాలపవనపరిభావిత మహాశిఖిశిఖావళులఁ ద్రుణీకరించుకుటిలావలోకనంబుల నాలోకించుచుం గాలపరిపక్వలీలాలోలుం డయిన శూలిపోలిక నాభీల మూర్తియై [1]సకలజీవభారభరణదుర్భరభగ్న బ్రహ్మాండభాండ మహాధ్వానంబుభంగి నాస్ఫోటించిన. 381

ఉ. కూడె జగంబు లన్నియును గ్రుంకిరి సూర్యసుధాంశు లద్రు [2]లూటాడె నభస్థలం బగిలె ♦ నంబుధు లింకె నుడుగ్రహాళి ప ట్టూడె వడిం దిశల్ వగిలె ♦ నుర్వర గ్రుంగె నజాండభాండ మ ల్లాడె విధాత బెగ్గడిలె ♦ నార్చుచు వృత్రుఁడు బొబ్బ వెట్టినన్.

లయగ్రాహి. కూలిరి వియచ్చరలు ♦ సోలిరి దిశాధిపులు
వ్రాలిరమరవ్రజము ♦ దూలిరుగరేంద్రుల్
వ్రేలిరి మరుత్తులెద ♦ జాలిగొనిరాశ్వినులు
కాలుడిగి రుద్రులవ ♦ లీలబడిరార్తిన్
వ్రేలిరి దినేశ్వరులు ♦ కీలెడలినట్లు సుర
జాలములు పెన్నిదుర ♦ పాలగుచు ధారా
భీలగతితోడఁ దమ ♦ కేలిధనువుల్ విడిచి
నేలఁబడి మూర్ఛలను ♦ దేలిరి మహాత్మా. 383

వ. ఇట్లు కఠోరకంఠనాదం బొనర్చిన నశనిపాతంబునం గూలుపార్వతి చయంబుభంగి నంగంబు లెఱుంగక రణరంగంబునం బడి బిట్టు మూర్ఛిల్లిన దివిజరాజసైన్యంబుల వృత్రాసురుండు సంగరరంగ దుర్దముండై మహీవలయంబు పదాహతంబుల గడగడ వడంక నిశితశూలంబు కేల నంకించుచు మదించిన భద్రమాతంగంబు కమలవనంబు చొచ్చి మట్టి మల్లాడువిధంబున నిమీలితాక్షుం

1 సవిల... మహాధ్వానంబు=సమస్తజీవులయొక్క బరువును మోయుటచేమిక్కిలి నవసిన బ్రహ్మాండభాండమొనర్చిన గొప్పధ్వని. 2 ఊటాడె = చలించెను.

డయి తనపదతలంబు రూపంబులు మాయం జమురుచు వెక్కసం
బుగఁ గ్రీడించువానిం గని వజ్రి [1]వజ్రశతోపమనిష్ఠుర గదాదండం
బాభీలభంగిఁ బ్రళయకాలమార్తాండచండపరివేషప్రేరితంబుగాఁ
ద్రిప్పి వైచిన. 384

మ. అది మింటం బెనుమంట లంటఁ బఱపై ♦ యాభీలవేగంబునం
గదియన్ వచ్చిన లీల వామకరసం ♦ క్రాంతంబు గావించి పె
ట్టిదుఁడై చేరి సురారి దానిఁ గొని కా ♦ శిన్యోరుపాతంబులం
జదియన్ మోఁదె గజేంద్రమస్తకము ను♦త్సాహైకసాహాయ్యుఁడై.

ఆ. అగ్గజంబు కులిశ హతిఁ గూలుకులమహీ
ధ్రంబుఁబోలె రక్త♦ధార లురల
మస్తకంబు వగిలి ♦ మదమఱి జిరజిరఁ
దిరిగి భీతితోడఁ ♦ దెరలి పఱచె. 386

ఉత్సాహము. గజము దెరలి దాని కొట్టలి ♦ కంప మొంది పాఱఁగా
భజన నింద్రుఁ డంకుశమునఁ ♦ బట్టి ఓట్టు నిల్పుచుం
[2]నిజసుధారసైకపాన ♦ నిర్ణయార్ద్రకరమునన్
బుజత మీఱ నిమిరె నదియు ♦ రీతి మెఱసి క్రమ్మఱన్. 387

వ. ఇవ్విధంబున నైరావతంబును సేద దేర్చుచు నెదుర నిలుచున్న
భిదురపాణిం గని తోఁబుట్టువుఁ జంపిన తెంపుఁ దలంచి మోహ
శోకంబున విపర్యాసంబుగా నవ్వుచు నాహవకామ్యార్థియై
వృత్రుం డిట్లనియె. 388

శా. నాకుం బెద్దయు నీకు సద్గురువు దీ♦నవ్రాతరక్షున్ శుభా
లోకుం జంపితి విట్లు పాపమతివై ♦ లోభంబుతో నియ్యెడన్
లోకుల్ నవ్వఁగ మద్భుజాపటిమకున్ ♦ లోనైతి వీశూలమున్
దాకింపింపఁగ నిన్ను గ్రుచ్చి ఋణము♦క్తాత్ముండనై పేర్చెదన్.

క. ఎట్టితులు వయినఁ గానీ
తనబ్రదుకుకొఱకు ♦ నీవలె గురువుం

1 వజ్ర ... దండంబు = సేయువజ్రాయుధములతో సమానమై కఠినమైనగదను.
2 నిజ ... కరమునన్ = తనదైన అమృతరసమును ముఖ్యముగా పానముచేయు క్రమముచే ఆర్ద్రమైనహస్తమున.

జుట్టమును బుణ్యు బ్రాహ్మణుఁ
బట్టి వధింపంగఁ గలఁడె ♦ పశువుం బోలెన్. 390

చ. దయయును సత్యమున్ విడిచి ♦ ధర్మముమాని యశంబుఁబాసి శ్రీ
జయములఁబారదోలి పురు ♦ షత్వము గానక లోకనిందితా
హ్వాయుఁడగువానిచావునకు ♦ నార్యులు గుందుదురే సృగాలముల్
ప్రియమున నంటునే శవముఁ ♦ బ్రేలక చేరునె కంకగృధ్రముల్.

క. నిక్కమగు పాపములచేఁ
జక్కితివి నిశాతశూల శిఖరాగ్రమునన్
మక్కించి నీదుమాంసము
నక్కలుఁ గుక్కలును జేరి ♦ నమలనొనర్తున్. 392

ఉ. దీకొని నీకు నేఁడిచట ♦ దిక్కని వచ్చినవారు గల్గిరే
నేకమతిం బిశాచముల ♦ కెల్లను దృప్తిగ మన్నిశాత శూ
లైకమహాగ్నికీలల న ♦ నేకవిధంబున సోమయాజినై
మేఁకలజేసి వ్రేల్చెద న ♦ మేయ మదోద్ధతి వ్రాలి యియ్యనిన్.

క కాకననుఁగులిశధారల, దీకొన నిర్జింపఁ గలిగి ♦ తేనిని భూతో
ద్రేకంబు సేసి శూరుల, ప్రాకట పదపద్మధూళి ♦ భాగంబగుదున్.

సీ. సందేహ మేటికి ♦ జంభారి వేవేగ
భిదురంబు వ్రేయుమా ♦ భీలభంగి
నతిలోభి నడిగిన ♦ యర్థరాశియుఁబోలెఁ
గడవలేనిది వృథ ♦ గాదుసుమ్ము
మురమర్దనుని తేజ ♦ మున నాదధీచివీ
ర్యాతిశయంబున ♦ నధిక మయిన
యదిగాన హరిచే ని ♦ యంత్రితోన్నతుఁడవై
గెలువుము శత్రుల ♦ గీటడంచి

ఆ. యెందుఁగలఁడు విష్ణు ♦ డందుజయశ్రీలు
వొందుగాఁగవచ్చి ♦ పొందుచుండు
గాన భక్తవరదు ♦ గమలాక్షు సర్వేశు
పదములందు మనముఁ ♦ బదిలపరతు. 395

న. ఇపుడు వజ్రధారలం ద్రెంపంబడిన విషయభోగంబులు గలవాఁడ
నయిశరీరంబువిడిచి భగవద్ధామంబునొందెద నారాయణునిదాసుం
డనైననాకు స్వర్గమర్త్యపాతాళంబులంగల సంపద్భోగంబులు నిచ్చ
గింపంబడవు త్రైవర్గికాయాస రహితంబయిన మహైశ్వర్యంబు
ప్రసాదించుంగావున ననుపమేయంబైన భగవత్ప్రసాదం బన్యుల
కగోచరంబద్దేవుని పాదైకమూలంబుగానుండు దాసులకు దాసాను
దాసుండ నగుచున్నవాఁడ నని యప్పరమేశ్వరు నుద్దేశించి. 396

చ. అరయఁగ భక్తపాలనము ♦ లైన భవద్గుణజాలమాత్మ సం
స్మరణముసేయవాక్కు నిను ♦ సన్నుతిసేయ శరీరమొల్లఁ గిం
కరపరివృత్తిసేయ మదిఁ ♦ గాంక్షయొనర్చెదఁగాని యొల్ల నే
నరిది ధ్రువోన్నతస్థలము ♦ నబ్జజపట్టణ మింద్రభోగముల్. 397

ఉ. ఆఁకలిగొన్న 1 క్రేపులు ర ♦ యంబున నీఁకలురాని పక్షులున్
దీకొని తల్లికిన్ మఱి వి♦ దేశగతుండగు భర్తకుంగజ
వ్యాకులచిత్తయైన జవ ♦ రాలును దత్తఱ మందుభంగి నో
శ్రీకర పంకజాక్ష నినుఁ ♦ జేరఁగ నామది గోరెడుం గడే. 398

క. నాకునుసఖ్యము పుణ్య, శ్లోకులతోఁగాని తప్పఁ ♦ శూన్యులు సంసా
రైకవిమోహులతోడం, గాకుండనొనర్పుమయ్య ♦ కంజదళాక్షా.

మహా. హరిపై సర్వాత్మునిపై న♦త్యగణితగుణునిపై ♦నంతరంగంబుసర్వన్
సరిమేనుప్పొంగఁజావున్ ♦జయమును సరిగా ♦ సంతసంబందుచున్ భీ
- కరుఁడై కాలాగ్నిపోలెం♦గసలుచుఁగవిసెన్ ♦ గర్వదుర్వారుఁడై దు
ర్భరలీలన్ భూమిగంపిం♦పఁగదిశలద్రువన్ ♦ భండనోద్దండవృత్తిన్.

క. దొరఁకొని ప్రళయోదకమున
హరిపైఁ గైటభుఁడు గవియు ♦ హుంకారమునన్
సురనాథుమీఁద వృత్రా
సురుఁడు మదోద్వృత్తి నడచె ♦ శూలాయుధుఁడై: 401

శా. కల్పాంతాగ్నియుఁబోలె 2 నుల్కలెగయం♦గాఁ ద్రిప్పుచున్ దీసనో
యల్పా చావు మటంచు పూలము రయం♦బారంగఁ బైవైచిసం

1 క్రేపులు = లేగలు. 2 ఉల్కలు=ఆకాశమునుండిపడు రేఖాకారతేజములు.

బోల్పం గోటిరవిప్రకాశత దివిం♦బోవంగ వీక్షించి యా
వేల్పుల్ వొంగఁగ వజ్రధారఁ దునిమెన్♦విన్నాణ మొప్పారఁగన్

ఆ. శూల మప్పుడతఁడు ♦ స్రుక్కక ఖండించి
పూని తోన కదిసి ♦ భుజము ద్రుంచె
నసుర గనలి యేక ♦ హస్తుఁ డైపరిఘంబు
గొని మహేంద్రుఁ గిట్టి ♦ 1హనువు లదిచె.

వ. ఇట్లు ప్రళయకాలభీషణపరివేషపోషంబుగా రోషంబునం బరిఘం
బుఁ ద్రిప్పి కుప్పించి గజకుంభస్థలంబు భగ్నంబు సేసి యింద్రు
హనుప్రదేశంబును నిష్ఠురాహతి నొప్పించిన. 404

క. గజము మద ముడిగి తిరుగుచు
గుజగుజనై గీఁకపెట్ట ♦ గులిశము నేలన్
భుజన చెడి విడిచె నింద్రుఁడు,
గజిబిజితో బెగడెనసుర♦కడిమిజగంబుల్. 405

క. గరుడుఁడు పొదివిననాగము
కరణిన్ వృత్రాసురేంద్రు♦కడిమికి లోనై
తిరుగుడు వడ్డహరిం గని
పురపుర నాహాయటంచుఁ ♦ బొగిలె జగంబుల్. 406

వ. అప్పుడు. 407

ఆ. గజముపాటు సూచి ♦ కడు దీనగతిఁ జూచి
పరికరంబు జాఱి ♦ పడుటఁ జూచి
యుద్ధధర్మ మెఱిఁగి ♦ యున్నశత్రునిఁ జూచి
సిగ్గుతోడ వజ్రి ♦ శిరము వాంచె. 408

వ. ఇట్లు యుద్ధంబున శత్రుసన్నిధిం గరంబు జాఱిపడినవజ్రంబుఁ బుచ్చి
కొనక నివ్వెఱపడి లజ్జించి యున్నపాకశాసనుం జూచి వృత్రుండి
ట్లనియె. 409

క. దురమునఁ గైదువు వదలిన
శరణన్నను వైరిజనులఁ ♦ జంపరు వీరుల్

1 హనువులు = చెక్కిలియొక్క పైభాగములు.

వెఱఁ గంద నేలకులిశము
కర మరుదుగఁ బుచ్చికొనుము ♦ కాచితి నిందా. 410

సీ. వజ్రంబుఁ గైకొని ♦ వైరి నిర్జింపు మి
ట్లడలంగ వేళ గా♦దమరనాథ
యమర దేహాధీను ♦ లైనమూర్తుల కెల్ల
నీశు లక్ష్మీశు స♦ర్వేశుఁ బాసి
కడ తేఱ జయములు ♦ గల్గునె యెంతైనఁ
దలపోసి చూడుమా ♦ తత్త్వబుద్ధి
నీలోకపాలకు ♦ లెవ్వనివశగతి
వలఁ బడ్డపక్షులఁ♦వర్తనమునఁ

తే. జిక్కి చేష్టలు సేయుచుఁ ♦ జింతగాంతు
రట్టిమృత్యుబలంబుల ♦ నాత్మజయము
తమదిగాఁ గోరి యజ్ఞాన♦తంత్రులగుచుఁ
గమలలోచనలీలావి♦కారములను. 411

తే. మెఱయ యంత్రమయం బైన♦మృగముభంగి
దారునిర్మితమైనట్టి♦తరణిపోల్కి
శక్ర యెఱుఁగుము యీభూత♦జాల మెల్ల
దళితపంకేరుహాక్షుతం♦త్రంబుగాఁగ.

వ. మఱియు భూతంబులచేతను నింద్రియంబులచేతను నవశుం డైనపురుషుండు ప్రకృతిచేత వేఱుసేయంబడినయాత్మం బరమేశ్వరానుగ్రహంబు వాసి సుఖియించుచుండు నవిద్వాంసుం డైనవాఁడనవరతంబుఁ దన్నుస్వతంత్రుంగాఁ దలంచుచుండు భూతంబులవలన భూతంబులు వుట్టుచుండు నాభూతంబులు భూతంబులచేత భక్షింపబడుచుండుఁ బురుషునకాయువు శ్రీయును గీర్తియు నైశ్వర్యంబును మొదలయినవి యనుభవింప నెంతగాలంబు ప్రాప్తం బంతగాలంబు నివసించుఁ బ్రాప్తంబు దీఱినఁ బురుషుండు జాలింబొందిన నవియుండక పోవుచుండుం గావున గుణంబును నవగుణంబునుఁ గీర్త్యపకీర్తులను జయాపజయంబులును సుఖదుఃఖంబులును జావుబ్రతుకులునుసమం

బులయి కలుగుచుండు నజ్ఞానియైనవానికి సత్త్వరజస్తమోగుణం
బులు గలిగి యుండునట్టివానికి గుణమయంబులైనయింద్రియాదు
లైయాత్మ యని తోఁచుచుండుం గావున వాఁడాగుణంబులచేత
బద్ధుండగు నాగుణంబులకు సాక్షిమాత్రం బగుశరీరంబు వేఱని
యెవ్వఁ డెఱుంగ నోపు వాఁడాగుణంబులచేత బద్ధుండు గాఁడు
గావున గుణంబులును గుణియును భోక్తయును భోగ్యంబును
జయంబును నపజయంబును హర్తయును హార్యంబును నుత్పత్తిస్థితి
లయకర్తయై సర్వోత్కృష్టుం డైన యప్పరమేశ్వరుండె కాని
యన్యంబులే దిప్పుడొక్క హస్తంబు నాయుధంబునుం బోయినను
భవత్ప్రాణాపహరణంబునకు సమర్థుండ నగుచున్న నన్నుం జూడు
మని వృత్రాసురుండు మఱియు నిట్లనియె. 413

తే. వాహనంబులుసారెలు • వాఁడిశరము
[1]లూర్జితాక్షములనువులె • [2]యొడ్డనములు
గాఁగఁబోరెడునీ [3]ద్యూత•కర్మమందు
నెసఁగజయమునునపజయ•మెవ్వఁడెఱుఁగు. 414

చ. అనవుడు వృత్రుమాటలకు • నద్భుతమంది సురేంద్రుఁ డెంతయుం
దనమదిఁ గుత్సితం బుడిగి • దైవముగా నతనిన్ భజించి కై
కొనియెఁ గరంబునన్ దిగువఁ • గూలినవజ్రము నప్డు డాత్మలోఁ
దనరె జగంబు లన్నియు ము•దంబునఁ బొందిరి ఖేచరావళుల్

క. [4]రాహుగ్రహవక్త్రగుహా
గేహాంతము వాసి వచ్చి • కిరణావళి స
ద్బాహుళ్య మొప్ప వెలిఁగెడు
నాహరిదశ్వుండుఁబోలె•హరియొప్పెన్నృపా. 416

---

1 ఊర్జితాయక్షములు = ప్రశస్తములగుపాచికలు

2 ఒడ్డనములు = పందెములు.

3 ద్యూతకర్మమందు = యుద్ధమనెడు నీ జూదమునందనుట.

4 రాహుగ్రహవక్త్రగుహాగేహాంతము = రాహుగ్రహముయొక్క నోరనెడు గుహాగేహముయొక్క మధ్యమును.

వ. ఇట్లు [1]కరకలితవజ్రాయుధరుచిమండలమండితదిఙ్మండలుం డయినజం
భారి గంభీరవాక్యంబుల విస్మయానందస్మితముఖారవిందుం డయి
వృత్రుని కిట్లనియె. 417

క. ఓదానవేంద్ర నీమతి, వేదాంతముఁబోలెఁదత్త్వవిజ్ఞానకళా
మోదము నీవతిభక్తుఁడ, వాదిమపురుషునకు హరికి♦నబ్జాక్షునకున్

ఉ. లోకము లెల్ల నిండి తన♦లోనుగ సర్వముఁ జేసి ప్రాణులన్
దీకులఁ బెట్టి యెల్లెడలఁ ♦ దీపులు సూపెడివిష్ణుమాయ నేఁ
డేకమతిం దలంచి తిది ♦ యేల మహాసురరూపు మాని సు
శ్లోకుఁ బురాణపూరుషుని ♦ శోభనమూర్తి ధరింపు మింపునన్.

ఉ. ఏనియమంబు సల్పితివొ ♦ యెట్టిమహాతప మాచరించితో
పూనిరజోగుణాభిరతిఁ ♦ బొందిననీమతి శాంతిదాంతిస
మ్మాననమానసానుభవ♦మత్తమరాళిఁ గరోషభావస
మ్మానుఁ డమేయుఁ డాదనుజ♦మర్దనుభక్తి పొసంగె నెంతయున్.

క. నారాయణరూపామృత, పారావారమునఁ దేలు♦భక్తుఁడు దా భూ
దారకరఖాతకోదక, పూరంబులు నేలకృప్తిఁ ♦ బొందుమహాత్మా

వ. ఇట్లు పలుకుచున్న యింద్రు నుపలక్షించి వృత్రాసురుం డాయో
ధనదుర్మర్షణ సంఘర్షమానమానసుండై వైరిం బు[illegible]కొల్పుకొని
వామహస్తంబునం బరిఘంబుఁ ద్రిప్పుచు నుప్పరంబునం గుప్పిం
చుచు [2]బ్రహ్మాండకర్పరంబు నిష్ఠురభైరవారావంబునం బగి
లించుచు సముత్తుంగమత్తమాతంగ పుంగవంబు వృషభంబుపైఁ
గవియుభంగి సురవృషభు పేరురం బుపలక్షించి భీషణాశని నిపాత
వేగంబునం గొట్టిన నింద్రుండు కులిశధార నప్పరిఘంబుఁ దునిమి
తోడన [3]శేషఫణావిశేషభాసురం బయిన బాహుదండంబు
ఖండించె నప్పుడు వృత్రుండు భిన్నబాహుద్వయమూలుండై
రక్తధారలం దోఁగుచు వజ్రిచేతఁ బక్షహతంబైన దివంబుననుండి

---

1 శ్రీకర ... మండలుండయి = చేతఁగీలింపఁబడిన వజ్రాయుధముయొక్క కాంతిసమూహముచే నలంకరింపఁబడిన దిక్సమూహముకలవాఁడు.

2 బ్రహ్మాండకర్పరంబు = బ్రహ్మాండముయొక్క పైపెంకు.

3 శేష ... భాసురంబు = ఆదిశేషునిపడగవలెమిగుల ప్రకాశించునది.

జాఱుచున్న కులపర్వతంబునుం బోలెఁ జూపట్టి ప్రళయకాల
సంహారనిటలచ్ఛటచ్ఛటార్చటకఠోరకీలాభీలాగ్నిసమానక్రూరకు
టిలనిరీక్షదుర్నిరీక్షుం డయి భూనభోమండలంబులఁ గ్రిందిమీఁది
దౌడల హత్తించి నభోమండలంబునుంబోలెఁ దుదిమొదలెఱుంగ
రాక వికృతంబుగా వక్త్రంబు దెఱచి [1]మందరమథనమథ్యమాన
విషమజిహ్వాభీలం బగునాలుక నభంబు నాకుచుఁ గాలసంహార
కారణుం డయిన కాలునిభుజదండమండితంబగు దండంబునుంబోని
దంష్ట్రలచేత జగత్త్రయంబును మ్రింగెడువాఁడునుంబోలె నతి
మాత్రమహాకాయుం డయి పర్వతంబులం దలంగ మీటుచు నడ
గొండయుంబోలె నభోభాగభూభాగంబుల నాక్రమించియప్పుడు.

ఉ. కాలమునాఁటిమృత్యువుము♦ఖంబునఁ బోలెను విస్ఫులింగముల్
గ్రాలఁగ దేవసంఘములు ♦ గంపము నొంద జగంబు లెల్ల నా
హాలుతితారవం బెసఁగ ♦ నభ్రగజంబును నాయుధంబుతో
నాలుకఁ జుట్టిపట్టి సుర♦నాథుని మ్రింగె మహాద్భుతాకృతిన్. 423

ఆ. లోక మెల్ల నపుడు ♦ చీకాకుపడెఁ దమం
బడరె నుడుగణంబు ♦ లవనిమీఁద
సోనవాన గురిసె ♦ సూర్యచంద్రాగ్నుల
రశ్ములడఁగె దిశలు ♦ రభస మయ్యె. 424

వ. అప్పుడు. 425

ఉ. కందఁడు భీతిఁ గుందఁడు ప్ర♦కంపన మొందఁడు పెద్దనిద్దురం
జెందఁడు తత్తఱింపఁడు వి♦శేషముఁ జొప్పడు వైష్ణవీజయా
నందపరైకవిద్యను మ♦నంబునఁ దాల్చుచు నుండెఁ గాని సం
క్రందనుఁ డానిశాచరుని ♦ గర్భములో హరిరక్షితాంగుఁడై. 426

వ. ఇట్లు కవచరూప శ్రీనారాయణ కృపాపాలితుండై యోగబలం
బున బలభేది యతని యుదరంబు వజ్రాయుధంబున భేదించి వై
రావణసహితుండై వెడలి యతని కంధరంబు తెగ నడువ వజ్రంబుఁ

---

1 మంధర ... అభీలంబు = మందరమనెడు కవ్వముచే త్రచ్చఁబడుచున్న పాముయొక్క పుట్టినవిషముకలిగినట్టియు నాలుకవలె భయంకరమైన.

ప్రయోగించిన నతినిష్ఠురవేగంబున వృత్రహరణార్థంబుగం దిరు
గుచు సూర్యాదిగ్రహనక్షత్రంబులకు దక్షిణోత్తరగతి రూపం
బయిన సంవత్సరసంధియందు నహోరాత్రమధ్యంబున వృత్రుశిరంబు
పర్వతశిఖరంబునుంబోలెఁ ద్రుంచి కూలంద్రోచె నప్పుడు. 427

సీ. మొరసె దుందుభు లంబరంబునఁ గడున్ ♦ మోదించి గంధర్వులు
సురలున్ సాధ్యులు సిద్ధులున్ మునివరుల్ ♦ సొంపార వృత్రఘ్ను [1]భీ
కర తేజోవిభవప్రకాశకరవి♦ఖ్యాతైకమంత్రంబులం
దిర మొప్పం బఠియించుచుం గురిసి రెం♦తేఁ గ్రొత్తపూసోనలన్.

ఆ. ఏమి సెప్ప నప్పు ♦ డింద్రారితనువున
నొక్క దివ్యతేజ ♦ ముబ్బి వెడలి
లోకమెల్లఁ జూడ ♦ లోకులు సూడఁగ
లోకమరసి విష్ణు ♦ లోను సొచ్చె. 429

వ. ఇట్లు లోకభీకరుండైన వృత్రాసురుండు గూలిన నఖిలలోకంబులుఁ
బరితాపంబు లుడిగి సుస్థితిం బొందె దేవర్షి పితృగణంబులు దాన
వులతోడం గూడి యింద్రునకుం జెప్పక తమతమస్థానంబులకుం
జని రనిన విని పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రున కిట్లనియె.

ఆ. ఏమికారణమున ♦ నింద్రుతోఁ బలుకక
సురలు వోయి రట్టి ♦ సురగణంబు
లెందుచేత సుఖముఁ ♦ జెందిరి వజ్రికిఁ
జేటు గలుగు టెట్లు ♦ సెప్పవయ్య. 431

వ. అనిన శుకుం డిట్లనియె. వృత్రపరాక్రమచకితు లయిన నిఖిల దేవ
తలును మహర్షిగణంబులును మున్ను వృత్రవధార్థం బింద్రునిం
బ్రార్థించిన నతండు బ్రహ్మహత్యకుం జాలక తొల్లి విశ్వరూపునిం
జంపినపాపంబు స్త్రీలయందును భూమియందును జలంబులందును
ద్రుమంబులందును విభజించి పెట్టితి నిపు డీహత్య యేరీతిం బాపు
కొనువాఁడ నా కశక్యంబనిన మహర్షు లశ్వమేధయజ్ఞంబు సేయించి

1 భీకర...మంత్రంబులన్=భయమును కలుగఁజేయునట్టి పరాక్రమాతిశయము
నకు ప్రకాశమును కలుగఁజేయు ప్రశస్తములును, ప్రధానములును నైన మంత్రముల చేత.

యజ్ఞపురుషుండయిన శ్రీనారాయణదేవుని సంతుష్టునిం జేసి యీ హత్యం బాపం గలవారము స్వభావంబున బ్రాహ్మణ పితృ గో మాతృ సజ్జనహంతలైన వార లేదేవునిం గీర్తించి శుద్ధాత్ములగుదు రద్దేవుని నశ్వమేధమహామఖంబున శ్రద్ధాన్వితుండవై సేవించిన నీకు ఖలుండైన యిద్దురాత్ముని హింసించిన హత్య యేమి సేయం గలదని యొడంబఱిచిన నింద్రుండువల్లెయని యవ్విధంబున మార్తునిం బరిమార్చి బ్రహ్మహత్యం బొంది యత్తాపంబు భరియింపనోపక దుర్దశం బొందె నప్పుడు. 432

సీ. పాపంబుఁ జండాల ♦ రూపంబుగలదాని
ముదిమిచే నొడలెల్లఁ ♦ గదలుదాని
క్షయకుష్ఠరోగ సం♦చయయుక్తం బగుదాని
నురురక్తపూరంబు ♦ దొరఁగుదాని
నరసిన వెంట్రుకల్ ♦ నెరసినతలదాని
నటఁ బోకు పో కుండు ♦ మనెడుదానిఁ
[1]గదురు కంపునఁ బ్రేవు ♦ లదరఁజేసెడుదానిఁ
దా నెందుఁ బాఱినఁ ♦ దఱుముదాని

ఆ. నాగుణంబు లెల్ల ♦ భోగింప కేరీతి
నరుగ నెంతవాఁడ ♦ వనెడుదాని
బిట్టు దిరిగి చూచి ♦ భీతిల్లి సిగ్గుతో
దేవనాయకుండు ♦ దెరలి పఱచె. 433

వ. ఇట్లతివికృతత్వంబుతో బ్రహ్మహత్య వెనుతగుల నింద్రుండు నభోభాగ భూభాగ దిగ్భాగంబులెల్లందిరిగి చొరం దెరువులేక దీర్ఘనిర్ఘాతాటోప నిశ్వాసదూషితుండై యీశాన్యభాగంబునకుం బఱచి యద్దెస నమేయపుణ్యగణ్యం బయిన మానస సరస్సునం బ్రవేశించి యందొక్క కమలనాళంబు సొచ్చి తంతువులం గలసి రూపంబు లేక యలబ్ధభోగుండై బ్రహ్మహత్యావిమోచనంబుఁ జింతించికొనుచు సహస్రవర్షంబు లుండె నాచండాలియు నది

1 కదురుకంపునన్ = అతిశయించుచున్న చెడువాసనతో..

పరమేశ్వరదిగ్భాగం బగుటం జేసి యందుం జోరరాక కాచియుండె
నంతకాలంబుఁ ద్రిదివంబున నహుషుండు విద్యాబల తపోబల
యోగబలంబులం బాలించుచుండి సంపదైశ్వర్య మదాంధుండై
యింద్రపత్నిం గోరి యింద్రుండు వచ్చునందాఁక నాకుం బత్నివి
గమ్మనిన నా శచీదేవి బృహస్పతి ప్రేరితయై 1బ్రహ్మర్షి వాహ్య
శిబిక నెక్కి వచ్చి నన్ను భోగింపుమనిన నతం డట్లచేసి 2కుంభసం
భవశాపహతుండై యజగరయోనియందుఁ బుట్టె నంత నింద్రుండు
బ్రహ్మర్షి గణోపహూతుండై త్రిదివంబునకు వచ్చె నంతగాలంబు
నారాయణచరణారవింద ధ్యానపరుండై యుండుటం జేసియు దిశాధి
నాథుండైన శంకరుచేత రక్షింపఁబడ్డవాఁడై యుండుటం జేసియు
దద్దోషబలంబు దఱిఁగి సహస్రాక్షుం బీడింప లేదయ్యె నప్పు
డింద్రుండు నిజైశ్వర్యంబునుం బొంది బ్రహ్మర్షి పరివృతుండై మహా
పురుషారాధనంబు సేసి హయమేధాధ్వరంబునకు దీక్షఁ గైకొని
బ్రహ్మవాదులచేత నాదరింపఁబడుచున్న వాఁడయి సర్వదేవతా
మయుండైన నారాయణుం బరితృప్తుం జేసి మంచు విరియించు
మార్తాండుని చందంబునఁ ద్వాష్ట్రవధరూపపాపంబు నాశంబు
నొందించి సకల దివిజయక్షగంధర్వ సిద్ధమునిజనసంస్తూయమానుం
డయి త్రిభువనైశ్వర్య భోగభాగ్యంబులం గయికొనియె నప్పుడు.

చ. సతతమరీచిముఖ్యముని ♦ సంఘముచేత యథోచితంబుగాఁ
గృతఘనవాజిమేధమునఁ ♦ గేశవు నీశుఁ బురాణపూరుషున్
హితు జగదీశు యజ్ఞపతి ♦ నిష్టఫలప్రదు నంతరంగ సం
గతు భజియించి వజ్రి గత ♦ కల్మషుఁడై నెగడెన్ మహీశ్వరా!

సీ. నుఱియుఁ బుట్టింపంగ ♦ మనసు వెట్టినయట్టి
3క్రూరకర్మాంబోధి ♦ కుంభజుండు

---

1 బ్రహ్మర్షివాహ్యశిబిక = బ్రహ్మర్షులచే మోయఁదగిన పల్లకి. 2 కుంభసంభవశాపహతుండై = అగస్త్యునియొక్క శాపముచే చెడినవాఁడై
3 క్రూర ... కుంభజుండు = చెడ్డపనులను సంద్రమునకు అగస్త్యుఁడు

అంగారములు సేయ ♦ నాహుతిఁ గన నోపు
బహుపాపకానన♦పావకుండు
కందక దిగ మ్రింగి ♦ గక్కునఁ ద్రేఁపంగఁ
1కల్మషగరళగం♦గాధరుండు
ఘనగుహాంతరములఁ ♦ గాలూన నియ్యని
కలుషదుస్తరతమో♦గ్రహవిధుండు
ఆ. 2సకలముక్తిలోక♦సామ్రాజ్యసమధిక
సహజభోగభాగ్య♦సంగ్రహైక
కారణాప్రమేయ♦కంజాక్షసర్వేశ
కేశవాదినామకీర్తనంబు. 436

సీ. అఖిలదుఃఖైకసం♦హారాదికారణం
బఖిలార్థసంచయా♦హ్లాదకరము
విమలభక్త్యుద్రేక♦విభవసందర్శనం
3బనుపమభక్తవ♦ర్ణనరతంబు
విబుధహర్షానేక♦విజయ సంయుక్తంబు
4గ్రస్తామరేంద్ర మో♦క్షక్రమంబు
బ్రహ్మహత్యానేక♦పాపనిస్తరణంబు
కమనీయసజ్జన♦కాంక్షితంబు
తే. నైన యీయితిహాసంబు ♦ నధికభక్తి
వినినఁ జదివిన వ్రాసిన ♦ ననుదినంబు
నాయురారోగ్య భాగ్యభో♦గాభివృద్ధి
కర్మనాశము సుగతియుఁ ♦ గల్గు ననఘ. 437

---

1 కల్మష ... ధరుండు = పాపములను విషమునకు ఈశ్వరుఁడు.

2 సకల ... కీర్తనంబు=సమస్తములగు ముక్తిలోకమునందలిరాజ్యమునకు సంబంధించిన గొప్పదగు సహజానుభవవిశేషములను కూర్చుటయందు ప్రధానకారణమై నిరూపింపరాని కంజాక్ష! సర్వేశ, కేశవ, మొదలగు పేరులపొగడ్త.

3 అనుపమ ... రతంబు = పోలికలేని భక్తుల వర్ణించుటయందు ఆసక్తమైనది.

4 గ్రస్త...క్రమంబు=మ్రింగఁబడినయింద్రునివిడిపించు విధానముకలది.

సీ. నాపుడు యోగీంద్ర ♦ నామనం బీవృత్రు
వివరంబు నీచేత ♦ విన్న మొదలుఁ
కడు నద్భుతంబునఁ ♦ గళవళం బందెడుఁ
గౌరి రజస్తమో ♦ గుణములందు
వర్తించునీపాప ♦ వర్తికి నేరీతి
మాధవపదభక్తి ♦ మది వసించె
సత్త్వస్వభావులై ♦ సమబుద్ధులై తపో
నియమప్రయత్నులై ♦ నిష్ఠచేత
తే. నిర్మలాత్మకులైనట్టి ♦ ధర్మపరుల
కమరులకుఁ బుణ్యమునులకు ♦ నంబుజాక్షు
భూరి కైవల్యసంప్రాప్తి ♦ మూలమైన
భక్తి వీనికిఁబోలె నే♦ర్మాటు గాదు. 438

సీ. భూస్థలిఁ గల రేణు♦వులకన్న దట్టమై
కడు నొప్పుజీవ సం♦ఘములు గలవు
ఆజీవములలోన ♦ నరయ ధర్మాయత
మతి వసించినవారు ♦ మనుజజాతి
యామనుష్యులలోనఁ ♦ గామంబుఁ బెడఁబాసి
మోక్షార్థులగువారు ♦ మొదలనరిది
మోక్షమార్గం బాత్మ ♦ మూలంబుగా నుండు
వారిలో ముక్తులు ♦ లేరు తఱచు
తే. ముక్తులైనట్టివారిలో ♦ యుక్తిఁ దలఁపఁ
జాల దుర్లభుఁ డమిత ప్ర♦శాంతిపరుఁడు
పరమసుజ్ఞాననిరతుండు ♦ భద్రగుణుఁడు
రమణ శ్రీవాసుదేవ ప♦రాయణుండు. 439

తే. సకలలోకాపకారి దు♦స్సంగతుండు
వృత్రుఁ డేక్రియ సుజ్ఞాన♦వేది యయ్యె
సమరమునఁ బౌరుషంబు చే♦నమరవిభుని
నెట్లు మెప్పించె దీనినా♦కెఱుఁగఁ జెప్పుమా. 440

—♦ చిత్రకేతూపాఖ్యానము. ♦—

వ. అని పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రు నడిగెనని సూతుండు శౌనకాది మునులకుం జెప్పి మఱియు నిట్లనియె నట్లు గజపురవల్లభుండు సంప్రశ్నంబు సేసిన బాదరాయణి హరిస్మరణశ్రద్ధాపరుండయి తొల్లి కృష్ణద్వైపాయననారదదేవల మహర్షులు నా కెఱింగించిన యితిహాసంబు గలదు దాని నెఱింగించెద సావధానుండవై యాకర్ణింపు మని యిట్లనియె 441

చ. అమిత విభూతిఁ జాల సమ♦రాధిపుఁ బోలుచు శూరసేన దే
శములకు భర్తయై ప్రజలు ♦ సంతస మందఁగ సార్వభౌముఁ డై
క్షమ దమ కెల్లకాలమును ♦ [1]గామదుహంబుగఁ జిత్రకేతు నా
మమునఁ బ్రసిద్ధి కెక్కె గుణ ♦ మండనుఁ డంచితకీర్తికాముఁ డై.

సీ. [2]మానితతారుణ్య♦మదనతురంగులు
[3]కందర్పవిజయైక ♦ ఖడ్గలతలు
మదనసమ్మోహన ♦ మంత్రాధిదేవతల్
పంచశిలీముఖు ♦ బందెకత్తె
లసమాస్త్రుఁ డఖిలంబు ♦ నడకించుబొమ్మలు
నాత్మసంభవుని [4]క♦ట్టాయితములు
పుండ్రేక్షుకోదండు♦భూరితేజంబులు
శంబరవిద్వేషి♦సాయకములు
తే. నాఁగఁబొలుపారు నొకకోటి♦నలినముఖులు
దనకుఁ బత్నులుగాఁగ న♦త్యంతవిమల
కీర్తివైభవ సన్మార్గ♦వర్తి యగుచు
జగతిఁ బాలించు చుండె నా♦జనవిభుండు. 443

తే. కలిమి వేవేలుభార్యలు ♦ గలిగియుండఁ
బరఁగ సంతతియొక్కండుఁ ♦ బడయ లేక

---

1 కామదుహము = కోరికలపిండునది.

2 మానిత ... తురంగులు = ప్రశస్తమగు జవ్వనముగల మన్మథుని ఆఁడు గుఱ్ఱములు. 3 కందర్ప ... లతలు = మన్మథునియొక్క లోకజయమునందు ప్రధానములయిన ఖడ్గములు. 4 కట్టాయితములు = తీవ్రసన్నాహములు.

చిత్తమునఁ జాలఁ బొరయని ♦ చింత వొడమి
బడలఁ జొచ్చెను వేసవి ♦ మడువుఁబోలె. 444

ఉ. రూపము సత్ప్రతాపము [1]మ♦రుత్పతిభోగము యౌవనంబు సం
దీపితచారువర్తనము ♦ దిగ్విజయంబును సత్యముఁ జగ
ద్వ్యాపితకీర్తియుఁ సతులు ♦ వైభవముఖ్యము లెల్ల మాన్పఁగా
నోపక యుండె నానృపతి ♦ నొందిన సంతతిలేని దుఃఖమున్. 445

వ. ఇట్లు సంతతిలేక యతిదుఃఖమానసుం డయిన యా నరేంద్రుని మందిరంబున కంగిరసమహామునివచ్చి యతనిచేత సతిథిసత్కారంబులు వడసి కుశలం బడిగి రాజ్యంబు భవదధీనంబ కదా పృథివ్యప్తేజోవాయ్వాకాశ మహదహంకారంబు లనియెడి యేడింటిచేత రక్షింపంబడ్డ జీవుండునుంబోలె నమాత్యజనపద దుర్గద్రవిణసంచయ దండమిత్రంబు లనెడి సప్తప్రకృతులచేత రక్షితుండవై ప్రకృతి పురుషులయందు భారంబు వెట్టి రాజ్యసుఖంబు లనుభవింతువుగదా మఱియు దార ప్రజామాత్యభృత్యమంత్రిపౌరజానపదభూపాలురు నీకు వశవర్తులుగదా సర్వంబునుం గలిగి సార్వభౌముండవైన నీవదనంబున విన్నఁదనంబు గలిగి యున్నయది కతం బేమి యనిన నామునిప్రవరునకు నతం డిట్లనియె మీ తపోబలంబున మీకు నెఱుంగరాని యదియుం గలదే యని తలవంచి యూరకున్న నతని యభిప్రాయం బెఱింగి యాభగవంతుం డైన యంగిరసుండు దయాళుండై పుత్రకామేష్టి వేల్చి యజ్ఞశేషం బతని యగ్రమహిషి యయిన కృతద్యుతి కిచ్చి నీకుం బుత్త్రుండు గలిగెడి నతనివలన సుఖదుఃఖంబు లనుభవింపంగలవని చెప్పి యమ్మహాత్ముండు సనియె నాకృతద్యుతియును దేవి గర్భంబు ధరియించి నవమాసంబులు నిండినం గుమారునిం గనియె నాకాలంబున రాజును సమస్తభృత్యామాత్యజనంబులుఁ బరమానందంబుఁ బొంది రపుడు చిత్రకేతుండు కృతస్నానుండై సకలభూషణభూషితుండై సుతునకు జాతకర్మంబు నిర్వర్తించి బ్రాహ్మణులకు నపరిమితహిరణ్యరజతదానంబులును

1 మరుత్పతిభోగములు = యింద్రుని యనుభవము.

వస్త్రాభరణంబులును గ్రామంబులును గజంబులును వాహనంబులును ధేనువులును నాఱేసియర్బుదంబుల ద్రవ్యంబును దానంబు సేసి ప్రాణిసముదయంబునకుం బర్జన్యుండునుంబోలెఁ దక్షిణవారలకు నిష్టకామంబులు వర్షించి పరమానందహృదయుండై యుండెఁ గుమారుండును మాతృపితృబంధుజనంబులకుసంతోషంబు సేయుచు దినదినప్రవర్ధమానుండై పెరుఁగుచుండె నంతం బుత్రమోహంబునం గృతద్యుతియందు బద్ధానురాగుండై మహీధవుండు వర్తించుచుండఁ దక్షిణభార్యలు సంతానసంతోషవికలలై యీమోహంబునకుం గారణంబు పుత్రుండ యని యీర్ష్యంజేసి దారుణచిత్తలై కుమారునకు విషం బిడిన సుఖనిద్రితుండునుంబోలె బాలుండు మృతిఁబొందె నప్పుడు వేగుటయు దాది బోధింపంజని యాకుమారుని వికృతాకారంబుఁ జూచి విస్మయశోకభయార్తయై పుడమిం బడి యాక్రందించె నప్పుడు. 446

తరలము. పుడమి నిట్టకనిల్వనం బడి ♦ పొక్కుచుం గడు దీనయై
యుడుఁకు వేమియు లేనివాక్కుల ♦ నావు రంచు విలాపమం
[1]దెడరు దోఁప భృశాతురోన్నతి ♦ నేడ్చినన్ విని భీతితోఁ
గడుపు బిట్టవియంగ భూపతి♦కాంత గ్రక్కున నేగుచున్

ఆ. బాలుఁ డొక్కరుండు ♦ పరిణామశీలుండు
వంశకర్త తపసి♦వరమువలనఁ
బుట్టి మిన్నకట్లు ♦ వ్రాలిసి యున్నట్టియా
కొడుకుఁ జూచితల్లి ♦ యడలఁజొచ్చె. 448

ఉ. [2]కుంకుమరాగరమ్యకుచ♦కుంభములం గడుఁ గజ్జలంబుతోఁ
బంకిలమైనబాష్పముల♦పాల్పడ మజ్జన మాచరించుచుం
గంకణపాణి పల్లవయు♦గంబున వక్షము మోఁదికొంచు నా
పంకరుహాక్షి యేడ్చెఁ బరి♦భావితపంచమసుస్వరంబునన్. 449

క. ఆయార్తరవమునకు భూ
నాయకుఁడు భయంబు నొంది ♦ నయముడిగి సుతున్

---

1 ఎడరు=దుఃఖము. 2 కుం...లన్=కుంకుమపూఁతతోనందములగుస్తనకలశములందు.

డాయఁగ వేగంబునఁ జని
పాయనిమోహంబుతోడ ♦ బాలునిమీఁదన్. 450

స్రగ్విణి. వ్రాలి యోపుత్ర నీ♦వార్తదంభోళి యై
కూలఁగా వ్రేయ కీ♦కొల్దినన్నేటికే
జాలి నొందించె నా♦జాడ యింకెట్టిదో
తూలుమీతల్లికే♦దుఃఖమెట్లాఱునో. 451

వ. అని తల మొలమెఱుంగక పలవించుచు భృత్యామాత్యబంధుజనంబులం గూడి యడలుచు నున్నయారాజదుఃఖం బెఱింగి యంగిరసుండు నారదునితోడంగూడి చనుదెంచి మృతుండైనపుత్రుని పదతలంబున మృతుండునుంబోలెఁ బడియున్న యారాజుం గనుంగొని యిట్లనియె. 453

సీ. నీకు వీఁడెవ్వఁడు ♦ నీవెవ్వనికి శోక
సంతాప మందెదు ♦ సార్వభౌమ
పుత్రమిత్రాదులు ♦ పూర్వజన్మంబున
నెవ్వనివారలో ♦ యెఱుఁగ గలవె
మొదల నదీవేగ♦మున నాడ కాడకు
1సికతంబు గూడుచుఁ ♦ జెదరుచుండు
నారీతిఁ బ్రాణుల ♦ కతికాలగతిచేతఁ
బుట్టుట చచ్చుట ♦ పోసఁగుచుండుఁ

ఆ. గాన భూతములకుఁ ♦ గలుగు భూతంబులు
మమతతోడ విష్ణు♦మాయఁజేసి
దీని కడల నేల ♦ ధృతిఁ దూలఁగా నేల
బుద్ధిఁ దలఁప వలదె ♦ భూతసృష్టి.

వ. మఱియు నేము నీవును దక్కినవారలును బ్రవర్తమానకాలంబునం గలిగినజన్మంబు నొంది మృత్యువువలన విరామంబు నొందంగలవారమై యిపుడ లేక పోవుదము చావుపుట్టువులకు నిక్కువంబు లే దీశ్వరుండు దనమాయచేత భూతజాలంబులవలన భూతంబులం

1 సికతంబు = ఇసుక.

బుట్టించు వాని నాభూతంబులచేతన రక్షించు వాని నాభూతంబులచేతన హరించు స్వతంత్రంబు లేనితనసృష్టిచేత బాలుండునుం బోలె నపేక్ష లేక యుండు దేహి యైన పితృదేహంబుచేత దేహియైన పుత్రదేహంబు మాతృదేహంబువలనం గలుగుచుండు నాప్రకారంబున బీజంబువలన బీజంబుపుట్టుచుండ దేహికినివిశాశ్వతంబై జరుగుచునుండుఁ బూర్వకాలంబున సామాన్యవిశేషంబులు సన్మాత్రంబైన వస్తువులం దేవిధంబునం గల్పింపంబడియె నాప్రకారంబున దేహంబునకు జీవునకు నన్యోన్యవిభాగంబు పూర్వకాలంబున నజ్ఞానకల్పితంబయ్యె జన్మఫలంబులను జూచుచున్నవారికి దహనక్రియల నగ్ని పెక్కురూపంబులం గానంబడుభంగి నొక్కండైన జీవుండు పెక్కుభంగుల వెలుంగుచుండు నివియన్నియు నాత్మజ్ఞానంబు సాలక దేహి దేహసంయోగంబు స్వప్నంబునందు భయావహంబైన ప్రయోజనంబునడుపుచుండి మేల్కాంచి యాస్వప్నార్థంబైన ప్రయోజనంబు తనదిగాదనియెఱుంగుభంగి జీవుండే తానని జ్ఞానగోచరుండైనవాఁడెఱుంగుంగావున నన్నియును మనోమాత్రంబని తెలిసి మోహతమంబు వాసి భగవంతుండైన వాసుదేవుని యందుఁ జిత్తంబు వెట్టి నిర్మలాత్మకుండవగుమని బోధించినఁ జిత్రకేతుండు లేచి వారలకిట్లనియె. 455

సీ. యతివేషములువూని ♦ యతిగూఢగతినిందు
నేతెంచినట్టిమీ ♦ రెవ్వరయ్య
కడఁగినఁ బోలిన ♦ గ్రామ్యబుద్ధులనెల్ల
బోధింపవచ్చిన ♦ పుణ్యమతులో
రమణఁగుమారనా ♦ రదఋషభాదులో
దేవలాసితులను ♦ ధీరమతులో
వ్యాసవసిష్ఠ దూర్వాసోమృకండుజ
గౌతమ శుక రామ ♦ కపిల మునులో
తే. యాజ్ఞ్యవల్క్యుండఁ దరణియు ♦ నారుణియును
చ్యవన రోమశులాసురి ♦ జాతుకర్ణ

దత్తమైత్రేయవర భర ♦ ద్వాజబోధ్య
పంచశిఖులో పరాశర ♦ ప్రభృతిమునులో.

క. వీరలలో నెవ్వరు సుర
చారణ గంధర్వ సిద్ధ సంఘంబులలో
వారలో యీసుజ్ఞానము
కారణమై యెవరియందు గలదు తలంపన్. 425

క. పొందుగ గ్రామ్యపశుత్వముఁ
బొంది మహాశోకతమముఁ ♦ బొందిన నాకున్
ముందఱ దివ్యజ్ఞానముఁ
జెందించినవారి మిమ్ముఁ ♦ జెప్పుడు తెలియన్. 457

వ. అనిన నంగిరసుం డిట్లనియె. నేను బుత్రకాంక్షివైన నీకుఁ బుత్రుం బ్రసాదించిన యంగిరసుండ నితఁడు బ్రహ్మపుత్రుండయిన నారద భగవంతుండు దుస్తరంబైన పుత్రశోకంబున మగ్నుండవైన నిను ననుగ్రహించి పరమజ్ఞానం బుపదేశింప వచ్చితిమి. నీదుఃఖం బెఱింగి పుత్రు నిచ్చితి మేనిఁ బుత్రవంతులైనవారి తాపంబు నీచేత ననుభవింపంబడు నీప్రకారంబున లోకంబున సతులును గృహంబులును సంపదలును శబ్దాదులయిన విషయంబులును రాజ్యవైభవంబును జంచలంబులు మఱియు రాజ్యంబును భూమియును బలంబును ధనంబును భృత్యామాత్యసుహృజ్జనంబులును మొదలైనవి శోక మోహాభయపీడలం జేయుచుండుఁ గాని సుఖంబుల నీ నేరవు గంధర్వనగరంబునుంబోలె స్వప్నలబ్ధమనోరథంబునుంబోని యర్థంబుఁ బాసి కానంబడుచు మనోభవంబు లయిన యర్థంబులం గూడి స్వార్థంబులై కానంబడనేరవు కర్మంబులచేత ధ్యానంబులు సేయుచుండుమనంబులు నానాకర్మంబు లగుచు నుండు నీదేహి దేహంబు ద్రవ్యజ్ఞానక్రియాత్మకంబై దేహికి వివిధక్లేశసంతాపంబులం జేయుచుండుం గావున నీవు నిర్మలంబయిన మనంబుచేత నాత్మగతి వెదకి ధ్రువంబయిన పదవి నొందుమనియె. అప్పుడు నారదుం డిట్లనియె నుపనిషద్గోప్యం బగు నే నిచ్చు మంత్రం బెవ్వండేని సప్తరాత్రం

బులు పఠియించు నతండు సంకర్షణుండైన భగవంతునిం జూచు
నెవ్వనిపాదమూలంబు సర్వాశ్రయంబై యుండు నట్టి శ్రీమన్నారా
యణుని పాదంబులు సేవించి యీమోహంబు వదలి యతిశీఘ్రం
బున నుత్తమపదంబు నొందు మిప్పు డీకుమారునకును నీకును
బ్రయోజనంబు గలదేనిం జూడుమని నారదుండు మృతబాలకుని
కళేబరంబుఁజూచి యోజీవుండ నీకు శుభం బయ్యెడు మిందుఁ
బ్రవేశించి మీతల్లిదండ్రుల బంధుజనులం జూచి వీరలదుఃఖంబు
లార్చి యీకళేబరంబునందుఁ బ్రవేశించి యాయుశ్శేషంబు నను
భవించి పితృధీనంబైన రాజ్యాసనంబునఁ గూర్చుండు మనిన
నబ్బాలుం డిట్లనియె. 458

తే. కర్మవశమున నెందు సుఖంబు లేక
దేవతిర్యఙ్నృయోనులఁ దిరుగునాకు
వెలయ నేజన్మమందునో వీరు తల్లి
దండ్రులయినారు చెప్పవే తాపసేంద్ర 459

తే. బాంధవజ్ఞాతి సుతులును బగతురాత్మ
వరులుదాసీన మధ్యస్థ వర్గములును
సరవిఁగనుచుందురొక్కొక్క జన్మమునను
నెఱయఁబ్రాణికినొకవావి నిజముగలదె.

తే. రత్నములు హేమములు నను రాగలీల
నలరునమ్మక నీవల నావల నగు
భంగి నరులందు జీవుండు ప్రాప్తుఁడగుచు
నెలమిఁ దిరుగుచునుండుఁ దా నెందుఁ జెడఁడు. 461

సీ. ఒక్కఁడై నిత్యుఁడై యొక్కెడఁ గడలేక
పొరిది జన్మాదుల శూన్యుఁడగుచు
సర్వంబునందుండి సర్వంబుఁ దనయందు
నుండంగ సర్వాశ్ర యుండనంగ
సూక్ష్మమైస్థూలమై సూక్ష్మాధికములకు
సామ్యమై స్వప్రకా శమున వెలిఁగి

యఖిలంబుఁజూచుచు ♦ నఖిల ప్రభావుఁడై
యఖిలంబుఁదనయందు ♦ నడఁచికొనుచు
తే. నాత్మ మాయాగుణంబుల ♦ నాత్మమయము
గాఁగ విశ్వంబుఁదనసృష్టి ♦ ఘనతఁజెందఁ
జేయుచుండును సర్వసం ♦ జీవనుండు
రమణ విశ్వాత్ముఁడయిన నా ♦ రాయణుండు. 462

క. సతులెవ్వరు సుతులెవ్వరు,
పతు లెవ్వరు మిత్రశత్రు ♦ బంధుప్రియసం
గతు లెవ్వరు సర్వాత్మక
గతుఁడై గుణసాక్షి యైన ♦ ఘనుఁ డొక్కనికిన్. 463

—♦ చిత్రకేతుండు తపం బాచరించి భగవత్ప్రసాదంబు నొందుట. ♦—

వ. మఱియు సుఖదుఃఖంబులం బొందక సర్వోదాసీనుండై పరమాత్మయై యుండు నప్పరమేశ్వరరూపుండు నయిన నాకును మీకు నెక్కడిసంబంధంబుమీకుదుఃఖంబునకుంబనిలేదనిపలికియాజీవుండు వోయినం జిత్రకేతుండును బంధువులు నతివిస్మితచిత్తులై శోకంబులు విడిచి మోహంబులం బాసి యమునానదియందు నక్కుమారునకు నుత్తరకర్మంబులు నిర్వర్తించి చిత్రకేతుండు గాఢపంకంబునం బడినయేనుంగునుం బోలె గృహాంధకూపంబునందుండి వెడలి కాళిందీనదికిం బోయి యందు విధిపూర్వంబుగఁ గృతస్నానుండై మౌనంబు తోడ నారదునకు నమస్కరించిన నతండు ప్రసన్నుండై భగవన్మంత్రంబు విధిపూర్వకంబుగా నతనికి నుపదేశించి యంగిరసుతోడం గూడి బ్రహ్మలోకంబునకుం జనియె, జిత్రకేతుండును నారదోపదేశమార్గంబున నిరాహారుండై సమాధి నియతుండై నారాయణరూపం బయిన యావిద్య నారాధించి సప్తరాత్రాంతంబున నప్రతిహతం బయినవిద్యాధరాధిపత్యంబును భాస్వద్రత్న దివ్యవిమానంబునుం బడసి నారాయణానుగ్రహంబునుం బొంది మనోగమనంబునం ద్రిజగంబులం జరియించుచుండఁ గొన్నిదినంబులకు నొక్కచోట. 464

సీ. 1తారహారపటీర ♦ ధవళ దేహమువాని
2రమణీయనీలాంబ ♦ రంబువాని
మణికిరీటస్ఫుర ♦ న్మస్తకంబులవానిఁ
గంకణకేయూర ♦ కరమువానిఁ
గర్బురమయదీప్త ♦ కటిసూత్రములవానిఁ
దరళయజ్ఞోపవీ ♦ తములవాని
నతిసుప్రసన్నవ ♦ క్త్రాంబుజంబులవానిఁ
దరుణవిస్ఫూర్తనే ♦ త్రములవాని

ఆ. సిద్ధమండలంబు ♦ సేవింపఁ బుణ్యప్ర
సిద్ధి వెలసినట్టి ♦ యిద్ధచరితుఁ
బద్మలోచనునకుఁ ♦ బాదపీఠంబైన
ఘనునిఁ బన్నగేంద్రుఁ ♦ గాంచె నతఁడు. 465

ఆ. కన్నమాత్ర నతఁడు ♦ కల్మషంబులఁ బాసి
విమలచిత్తుఁడగుచు ♦ విశదభక్తి
నిట్టరోమములకుఁ ♦ బట్టగు చానంద
బాష్పనేత్రుఁ డగుచుఁ ♦ బ్రణుతిసేసె. 466

క. సంతోషాశ్రులచేత న
నంతునిఁ బరిషిక్తుఁ జేసి ♦ యతఁడు ప్రమోదం
బెంతయు నరికట్టిన నొక
కొంతయుఁ బలుకంగ లేక ♦ కొండొకవడికిన్. 467

చ. మది నొకయింతమాత్రనస ♦ మంబుగఁ జేయుచు బాహ్యవర్తనం
గదిసినయింద్రియంబుల నొ ♦ కంతకుఁ దెచ్చి మనంబు వాక్కునుం
గుదురుగఁ ద్రోచి తత్త్వమునఁ ♦ గూర్చుచు శాశ్వతవిగ్రహంబు నా
సదయుఁ బ్రశాంతు లోకగురు♦సన్నుతి సేయఁ దొడంగె నిమ్ములన్.

క. అజితుఁడ వై భక్తులచే
విజితుఁడ వైనాఁడ విపుడు ♦ వేడుక వారిన్

1 తార...దేహమువాని=నక్షత్రములు, ముత్తెపుసరులు, మంచిగంధమువలె తెల్లనైన దేహముకలవానిని. రమణీయ...అంబరంబువాని=అందమగు నల్లనిపట్టుకలవానిని.

విజితులు నీచేఁ గోర్కులు
భజియింపనివారు నిన్నుఁ • బడయుదురె హరీ. 469

ఉ. నీవిభవంబు లీజగము•నిండుట యొండుట నాశ మొందుటల్
నీవిమలాంశజాతములు • నెమ్మి జగంబు సృజించువారలో
దేవ భవద్గుణాంబుధుల•తీరముఁ గానక యీశ బుద్ధితో
వావిరిఁ జర్చ సేయుదురు • వారికి వారలు నొద్దనారలై. 470

క. పరమాణువు మొదలుగఁ గొని
పరమను దుదిగాఁగ మధ్య•పరికీర్తనచే
స్థిరుఁడవు త్రయీవిదుఁడ వై
సరిసత్త్వాద్యంతమధ్య•సద్వశగతుఁడ వై. 471

తే. ఉర్వి మొదలైననేడు నొండొకటికంటె
దశగుణాధికమై యుండు దాని నండ
కోశమందురునాయండ•కోటియెవ్వఁ
డందు నణుమాత్రమగు ననంతాఖ్యుఁడతఁడు. 472

వ. మఱియు నొక్కచోట విషయతృష్ణాపరులైన నరపశువులు పర తత్త్వంబవైన నిన్ను మాని యైశ్వర్యకాము లై తక్కినదేవతల భజియింపుదురు, వారిచ్చు సంపదలు రాజకులంబునుంబోలె వారలంగూడి నాశంబునం బొందుచుండు విషయకామ లేని నిన్ను సేవించినవారు వేఁచిన విత్తనంబునుంబోలె దేహాంతరోత్పత్తి నొందకుండుదురు నిర్గుణుండవై జ్ఞానవిజ్ఞానరూపంబు నొందియున్న నిన్ను గుణసమేతునింగా జ్ఞానులు భావింపుదురు నీభజనం బేరూపున నయిన మోక్షంబు ప్రసాదించు జితమతి వైననీవు భాగవతధర్మం బేప్రకారంబున నిర్ణయించితి వాప్రకారంబున సర్వోత్కృష్టుండ వయిననిన్ను సనత్కుమారాదులు మోక్షంబుకొఱకు సేవించుచున్నారీభాగవతధర్మంబునందు జ్ఞానహీనుండొక్కండును లేఁడన్య కామ్యధర్మంబులందు విషమబుద్ధిచేత నేను నీవు నాకు నీకు నని నచియించు చున్నవాఁ డధర్మనిరతుండై క్షయించుచుండు స్థావరజంగమప్రాణిసమూహంబునందు సమం బైనభాగవతధర్మంబుల

వర్తించుచున్న మనుజునికి భవద్దర్శనంబువలనఁ బాపంబు క్షయింపుట యేమిచిత్రం బిపుడు భవత్పాదావలోకనంబున 1నిరస్తాశుండ నైతి మూఢుండ నయిననాకుఁ బూర్వకాలంబున నారదుం డనుగ్రహించి భగవద్ధర్మంబు దయసేసె నది నేఁడు నాకు వరదుండ వైన నీకతంబున దృష్టంబయ్యె 2ఖద్యోతంబులచేత సూర్యుండు గోచరుండు గానిమాడ్కి జగదాత్మకుండ వైననీమహత్త్వంబు మనుజులచేత నాచరింపంబడి ప్రసిద్ధం బైనదిగా దుత్పత్తిస్థితిలయకారణుండవై భగవంతుండ వైన నీకు నమస్కరించెద నని మఱియును.

తే. అరయ బ్రహ్మాదు లెవ్వని ♦ ననునయించి
భక్తియుక్తుల మనమునఁ ♦ బ్రస్తుతింతు
రవని యెవ్వనితలమీఁద ♦ నావగింజఁ
బోలు నావేయుశిరముల♦భోగిఁ గొల్తు. 474

క. ఈవిధమున వినుతింపఁగ, నావిద్యాధరులభర్త ♦ కనియె ననంతుం
డోవిమలబుద్ధి నీదగు, ధీవిభవంబునకు మెచ్చి♦తిం బ్రియమారన్.

ఆ. అరయ నారదుండు ♦ నంగిరసుండును
దత్త్వ మొసఁగినారు ♦ దానికతన
నన్నుఁ జూడఁ గల్గె ♦ నాభక్తి మదిఁ గల్గె
నాపథంబు నీకు ♦ నమ్మఁ గలిగె. 476

సీ. పూని నారూపంబు ♦ భూతజాలంబులు
భూతభావనుఁడ నేఁ ♦ బొందువడఁగ
బ్రహ్మంబు మఱియు 3శబ్ద♦బ్రహ్మమును శాశ్వ
తం బైన తనువులు ♦ దగిలె నాకు
నఖిలలోకంబులు ♦ ననుగతం బై యుండు
లోకంబు నాయందు ♦ జోకఁ జెందు
నుభయంబు నాయందు ♦ నభిగతం బై యుండు
నభిలీనమయ్యెన ♦ య్యుభయమందు

1 నిరస్తాశుండను=పోఁగొట్టుకొనఁబడిన మానసికమలము కలవాఁడును.
2 ఖద్యోతంబులు=మిణుగురుపుర్వులు. 3 శబ్దబ్రహ్మము=నాదబ్రహ్మము (స్ఫోటమే బ్రహ్మమని వైయాకరణులు)

తే. వెలయ నిద్రించువాఁడాత్మ • విశ్వమెల్లఁ
జూచి మేల్కాంచి తానొక్క • చోటివానిఁ
గా వివేకించుమాడ్కి నీ • జీవితేశ
మాయ దిగనాడి పరమ ధ•ర్మంబుఁ దెలియు. 477

ఆ. నిద్రవోవువేళ • నిరతుఁడై దేహి దా
నెట్టిగుణముచేత • నింద్రియములఁ
గడచినట్టి సుఖముఁ • గనునట్టి బ్రహ్మంబుఁ
గడిమి నెఱయ నన్నుఁ•గా నెఱుంగు. 478

ఆ. స్వప్నమందు నెట్లు • సంచార మొసరించు
మేలుకాంచి దృష్ట • మోలి నెఱుఁగు
నుభయ మెఱుఁగునట్టి • యుత్తమ [1]జ్ఞానంబు
తత్త్వమట్టిదైన • తలఁపు నేను. 479

సీ. అరయంగ నెవ్వని • కలవిగా నట్టియీ
సలలిత మానుష • జాతిఁ బుట్టి
యాత్మ తత్త్వజ్ఞాన•మాతుఁడైనవానికిఁ
గలుగునె యెందు సు•ఖం బొకింత
వెలయఁ బ్రవృత్తిని • వృత్తిమార్గంబుల
సుఖదుఃఖచయముల • సొరిదిఁ దెలిసి
పని చెడి సంకల్ప • ఫలమూలమునఁ బొఱు
కదు సుఖదుఃఖమో • క్షములకొఱకు

ఆ. దంపతిక్రియామ • తంబు వర్తింతురు
దాన మోక్షమేల • దక్కి యుండు
నఖిలదుఃఖహేతు • వయిన యాకర్మంబు
నెఱిఁగి నన్నుఁ దలఁప • రిచ్ఛలోన.

వ. మఱియు విజ్ఞానాభిమాను లయిన మనుష్యులకు నతిసూక్ష్మంబయిన యాత్మగతి నిజస్థానత్రయలక్షణంబునఁ జతుర్థాంశంబు నెఱింగి యైహికాముష్మిక విషయంబులచేతను వివేక బలంబులచేతను

1 జ్ఞానము = మోక్షవిషయికమగు జ్ఞానము.

నియుక్తుండై జ్ఞానవిజ్ఞానసంతృప్తుండైన పురుషుండు నాకుభక్తుం డగు నీవిధంబులు గలవారలు యోగనైపుణబుద్ధిగలవారలు నై స్వార్థం బయినయాత్మచేతం బరమాత్మను దెలియుచుందురు నీవు నీక్రమంబున మద్భక్తి శ్రద్ధాపరుండవై 1విజ్ఞానసంపన్నంబు లైన వాక్యంబులచేత నన్ను స్తోత్రంబుసేసి ముక్తుండ వైతివని యాశేష భగవంతుండు విద్యాధరపతియైన చిత్రకేతుం బలికి యతని కదృశ్యుండై పోయె నేదిక్కున సర్వాత్మకుండైన యనంతుం డంతర్ధానంబు నొందె. నాదిక్కునకు విద్యాధరభర్త నమస్కరించి గగనచరుండై చని లక్షలసంఖ్యలైన దివ్యవర్షంబు లవ్యాహత బలేంద్రియుండై పరమయోగి పురుషులును దివ్యమునీంద్రులును సిద్ధచారణగంధర్వులును వినుతిసేయం గులద్రోణాదిశైలంబులను రమ్య ప్రదేశంబులను సంకల్పసిద్ధ ప్రదేశంబులను వినోదించుచు శ్రీనారాయణదత్తంబగు దివ్యవిమానంబు నందుఁ జరియించుచు నుండె. 481

శా. ఆడించున్ హరిదివ్యనాటకగుణ♦వ్యాపారనృత్యంబులం
బాడించున్ జలజాతనేత్రబిరుద ♦ ప్రఖ్యాతగీతంబులం
గూడించున్ సతతంబు జిహ్వలతుదిన్ ♦ గోవిందనామావళుల్
క్రీడం గిన్నరయక్షకామినులచేఁ ♦ గృష్ణార్పితస్వాంతుఁడై. 482

సీ. వాసించు నాత్మఁ బో♦వైష్ణవజ్ఞానంబు
నాశించు భాగవ♦తార్చనంబు
భూషించు నేత్రపద్ధుఁ ♦ బుండరీకాక్షుని
భాషించు హరికథా♦ప్రౌఢి మెఱసి
ఘోషించు హరినామ ♦ గుణనికాయంబులు
పోషించుఁ బరతత్త్వ♦బోధ మరసి
సేవించు శ్రీకృష్ణ ♦ సేవక నికరంబు
సుఖమునఁ జేయు నీ ♦ శునకు బలులు

1 విజ్ఞానము = శాస్త్రాదిజ్ఞానము.

తే. పాడఁ బాడించు [1]వైకుంఠ ♦ భర్తసటన
రూపవర్తన గుణనామ ♦ దీపితోరు
గీతజాతప్రబంధ సం ♦ గీతవిధులఁ
గేశవప్రీతిగాఁ జిత్ర ♦ కేతుఁ డపుడు. 483

—♦ చిత్రకేతుం డీశ్వర ధిక్కారంబున గౌరిచే శాప మొందుట. ♦—

మ. హరిఁ గీర్తించుచు నల్లనల్ల మదిలో ♦ నబ్జాక్షు సేవించుచుం
బరమానందము నొందుచుం జగములం ♦ బ్రఖ్యాతి వర్తించుచుం
సురరాజోపమమూర్తి యక్షగణముల్ ♦ సొంపార విద్యాధరా
ప్సరసల్ గొల్వఁగఁ బాడఁగా సితగిరి ♦ ప్రాంతంబున న్వేఁగుచున్.

శా. ఆవిద్యాధరభర్త గాంచె హరనీ ♦ హారామృతాహాసమున్
శ్రీవిభ్రాజితమున్ [2]నిరస్తగిరిజా ♦ సేవాగతాయాసమున్
దేవానీకవికాసమున్ శుభమహా ♦ దేవాంఘ్రిసంవాసమున్
భూవిఖ్యాతవిలాసముం ద్రిభువనీ ♦ పూతంబుఁ గైలాసమున్. 485

క. ఆరజతభూధరంబున
నీరేజభవామరాది ♦ నికరము గొల్వం
బేరోలగమున నుండిన
గౌరీయుతుఁ డయిన హరునిఁ ♦ గనియె నరేంద్రా. 486

సీ. తననిజరూప మిం ♦ తయునుని దెలియక
వాదంబు సేసెడు ♦ వేదరవముఁ
గరుణావలోకనా ♦ కాంక్షితులై యున్న
బ్రహ్మాదిసనకసం ♦ ప్రణుతిరవము
సారశివానంద ♦ సల్లాపముల నొప్పు
ప్రమథగణాళి యా ♦ ర్భటరవంబు
డమరు మృదంగాది ♦ ఢమఢమధ్వనితోడి
పటుభృంగి నాట్య వి ♦ స్ఫారరవము

1 వైకుంఠ...విధులన్ = నారాయణుని సాట్యము, రూపప్రవర్తనములు గుణనామములు, వీనిచే పెంపెక్కఁ జేయఁబడిన గొప్పగీతముల సమూహము, కావ్యములు, సంగీతములయొక్క విధానములచే (క్రమము గానన్వయము). 2 నిరస్త...ఆయాసమున్ = పోఁగొట్టఁబడిన పార్వతిని సేవించుటకో జకు వచ్చినవారి యలసట కలదానిని.

తే. మానుగాఁ జామరలు వీచు♦మాతృకాది
కామినీజనమహితకం♦కణరవంబు
మెండుఁ జెలఁగంగఁ గన్నుల ♦ పండువయ్యెఁ
[1]గొండరాచూలి పెనిమిటి ♦ నిండుకొల్వు. 487

వ. ఇట్లు బ్రహ్మాదిసురనికరసేవితుండై యూరుపీఠంబున నున్న భవానిం గౌఁగిటం జేర్చికొని యొడ్డోలగంబున నున్న పరమేశ్వరుం జూచి చిత్రకేతుండు పకపకనగి యద్దేవి వినుచుండ నిట్లనియె. 488

సీ. కొమరొప్పఁగా లోక♦గురుఁడును గడలేని
ధర్మస్వరూపంబుఁ ♦ దాన యగుచు
జడలు ధరించియు ♦ సరిలేనితపమునఁ
బొడవైన యీ యోగి ♦ పుంగవులును
బ్రహ్మవాదులుఁ గొల్వ ♦ భాసిల్లు కొల్వులో
మిథునరూపంబున ♦ మెలఁతతోడఁ
బ్రాకృతుండును బోలె ♦ బద్ధానురాగుఁడై
లాలితుండయ్యె ని♦ర్లజ్జత నిట

ఆ. నకట ప్రకృతిపురుషుఁ♦డైనఁ దా నేకాంత
మందు సతులతోడ ♦ నలరుఁ గాని
యిట్లు ధర్మసభల ♦ నింతులతోఁ గూడి
పరిఢవింపలేఁడు ♦ భ్రాంతి నొంది. 489

క. అన విని సర్వేశ్వరుఁ డా
తని నేమియు ననక నవ్వెఁ ♦ దత్సభవారుం
గనుఁగొని యూరక యుండిరి
మనుజేశ్వర యీశుధైర్య♦మహి మెట్టిదియో. 490

వ. ఇట్లు దన పూర్వకర్మశేషంబున నింద్రియజయుండనని పుట్టిన యహంకారంబున జగద్గురువుం బెక్కు ప్రల్లదంబు లాడుచున్న చిత్రకేతుంజూచి భవాని యిట్లనియె. 491

---

1 కొండరా ... కొల్వు = పరమేశ్వరునియొక్క నిండుసభ.

క. మముబోఁటిలజ్జలుడిగిన, కుమతులకుం గర్తయగుచుఁ ♦ గోపప్రసంగా
సమితాజ్ఞానిపుణుండగు, శమనుండా నేఁడు వీఁడు ♦ జగములు గెల్చెన్.

క. భృగునారదకపిలాదులు,
నిగమాంతజ్ఞులును యోగ ♦ నిర్ణయనిపుణుల్
త్రిగుణాతీతు మహేశ్వరు
నగ రెన్నఁడు వారు ధర్మ ♦ నయము గొలుఁగ రాకో. 493

సీ. ఎవ్వనిపదపద్మ ♦ మింద్రాదివిబుధుల
చూడాగ్రపంక్తుల ♦ నీడఁ జూచు
నెవ్వనితత్త్వంబ ♦ దెనయంగ [1]బ్రహ్మాది
యోగిమానసపంక్తి ♦ నోలలాడు
నెవ్వనిరూపంబు ♦ నేర్పాటు గానక
వేదంబు లందంద ♦ వాదమడుచు
నెవ్వనికారుణ్య ♦ మీలోకముల నెల్లఁ
దనిపి యెంతయు ధన్య ♦ తములఁ జేయు

తే. నట్టిసర్వేశుఁ బాపసం ♦ హారు ధీరు
శాశ్వతైశ్వర్యు నాత్మసం ♦ సారు నీశు
నెగ్గు వల్కినపాపాత్ముఁ ♦ డెల్లభంగి
దండనార్హుండుగా కెట్లు ♦ దలఁగఁగలఁడు. 494

తే. నిఖిలలోకాశ్రయంబు సన్నిహితసుఖము
సకలభద్రైకమూలంబు ♦ సాధుసేవ్య
మైనకంజాక్షుపాదప ♦ ద్మార్చనంబు
ననుసరింపంగ ఖలుఁడు వీఁ ♦ డర్హుఁడగునె. 495

వ. కావున నోరిదురాత్మక యీపాపంబునం బాపస్వరూపం బైన రాక్షసయోనిం బుట్టు మని శపియించి యింతనుండి మహాత్ము లకు నవజ్ఞ సేయకుండు మని పలికినఁ జిత్రకేతుండు విమానంబు డిగ్గి వచ్చి యద్దేవికి దండప్రణామంబు లాచరించి కరకమలంబులు దోయిలించి యిట్లనియె నోజగన్మాతా భవచ్ఛాపవాక్యంబు లట్ల

1 బ్రహ్మాది...పంక్తులు=బ్రహ్మ మొదలగు యోగులయొక్క డెందముల బారులయందు.

నై కొంటేఁ బ్రాచీనకర్మంబులం బ్రాప్తంబైనసంసారచక్రంబుచేత నజ్ఞానమోహితులై తిరుగుచున్న జంతువులకు సుఖ దుఃఖంబులు సహజంబులై ప్రవర్తిల్లుచుండు నట్టియాత్మ సుఖదుఃఖంబులకు నెవ్వరు కర్తలీగుణంబులనిమిత్తమై శాపానుగ్రహంబులును స్వర్గ నరకంబులును సుఖదుఃఖంబులును సమంబులు భగవంతుం డొక్కండ తనమాయచేత జగంబులుసృజియించుచు వారివారికిబద్ధానురాగంబులు గలుగం జేయుచుఁ దాను వానికి లోనుగాక నిష్కర్ముండై యుండు నీవిధంబునంబుట్టుచున్న నరునకుం బత్నీ బంధు శత్రుమిత్రోదాసీనత్వంబు లెక్కడివి వారివారికర్మవశంబునంబరమేశ్వరుండుసర్వసముండై యుండు నప్పరమేశ్వరునకు సుఖదుఃఖంబులచేత రాగంబు లేదు రాగానుబంధంబై నరోషంబును లేదతని మాయాగుణవిసర్గంబు జంతువులకు సుఖదుఃఖంబులను బంధమోక్షంబులను గల్పించుచుండుం గావున నీకు నమస్కరించుచున్న నన్ను ననుగ్రహింపుము శాపభయశంకితుండం గాను జగన్మాతవైన నిన్నుఁ బలికిన దోషంబునకు శంకించుచున్నవాఁడ ననిదండప్రణామంబు లాచరించి పార్వతీపరమేశ్వరులం బ్రసన్నులం జేసి తనవిమానం బెక్కి చనియె నప్పుడు పరమేశ్వరుండు బ్రహ్మాదిదేవర్షిదైత్యదానవ ప్రమథగణంబులు వినుచుండఁ బార్వతికి నిట్లనియె నీకు నిప్పుడు దృష్టం బయ్యెఁగదా నారాయణదాసదాసానుచరుల నిస్స్పృహభావంబు హరితుల్యార్థదర్శనులై [1]నిస్స్పృహులైనభాగవతులకు స్వర్గాపవర్గనరకభేదభావంబులు లేవు ప్రాణులకు దేహసంయోగంబువలన నారాయణలీలంజేసియుండి ద్వంద్వాదిసుఖదుఃఖంబులాత్మయందు నజ్ఞానంబున భేదంబు సేయంబడియె నిట్టివిపర్యయంబులు భగవంతుం డయినవాసుదేవునిభక్తిగలవారిం జెందవు మఱియును. 496

ఉ. నేనుఁ గుమారనారదులు ♦ నీరజగర్భుఁడు దేవసంఘముల్
మానితయోగివర్యముని♦మండల మిట్లగువార మందఱుల్

1 నిస్స్పృహులయి = కోర్కెలేనివారై

దానవవిద్వేషంబె జని•తంబుల మయ్యెఁ దదీయతత్త్వము
గానఁగ నేర మీ మహా ఘన•గర్వమునం దలపోసి చూడుమనున్.

క. అతనికిం బ్రియుఁ డప్రియుఁ
డే తెఱఁగున లేఁడు నిఖిల • మెల్లను దానై
భూతముల కాత్మ యగుటయు
భూతప్రియుఁ డొక్కఁడాది•పురుషుఁడు తలఁప. 498

ఆ. అరయఁ జిత్రకేతుఁ•డతిశాంతుఁ డతిలోక
సముఁడు విష్ణుభక్తి•సంగతుండు
నితని నేమి సెప్ప • నీశుండ నగు నేను
నువిద యచ్యుతప్రి•యుండఁ జుమ్మి. 499

క. కావున భగవద్భక్తుల, భావమునకు విస్మయంబు • పనిలేదుమహా
ధీవిభవశాంతచిత్తులు, పావనపరతత్త్వనిపుణ•భవ్యులు వారల్.

వ. అనిన విని యద్రినందన విస్మయంబు మాని శాంతచిత్త యయ్యె నట్లు పరమ భాగవతుం డయినచిత్రకేతుం డద్దేవికిం బ్రతిశాపం బియ్యసమర్థుం డయ్యును మరల శపింపక యతిశాంతరూపంబున శాపంబు శిరంబున ధరియించె నిట్టి సాధులక్షణంబులు నారాయణపరాయణు లయినవారలకుం గాక యొరులకుం గలుగనేర్చునే యట్లు శాపహతుం డయినచిత్రకేతుండు త్వష్ట సేయుయజ్ఞంబున దక్షిణాగ్నియందు దానవయోనిం బుట్టి వృత్రాసురుండన విఖ్యాతుం డయి భగవజ్జ్ఞానపరిణతుం డయ్యెం గావున. 501

సీ. నరనాథ యీవృత్రు•నకు రాక్షసాకృతి
గలిగినయీపూర్వ•కారణంబు
చిరపుణ్యుఁ డయినట్టి చిత్రకేతుమహాను
భావంబు భక్తితోఁ • బరఁగ విన్న
చదివినవారికి • సకలదుష్కర్మముల్
శిథిలంబులై కడుఁ • జెదరి పోవు
సకలవైభవములు • సమకూరుఁ దనయంతఁ
దొల్కడుకోర్కుల•తోడఁ గూడి

ఆ. నిర్మలాత్ములగుచు ♦ నిత్యసత్యజ్ఞాన
నిరతు లగుచు విగత♦దురితు లగుచు
బంధుమిత్రపుత్ర♦పౌత్రాదులను గూడి
యనుభవించు చుందు ♦ రధికసుఖము.

—♦ సవితృవంశ ప్రవచనాది కథ. ♦—

సీ. వినవయ్య నరనాథ ♦ విశదంబుగాఁ ద్వష్ట్ర
వంశంబు సెప్పితి ♦ వాని వెనుక
సవితృండు పృశ్నియు ♦ సావిత్రి వ్యాహృతి
యనుభార్యలందు నింపారువేడ్క
నగ్నిహోత్రంబుల ♦ నరయంగఁ బశుసోమ
పంచయజ్ఞంబులఁ ♦ బరఁగఁ గనియె
భగుఁడు సిద్ధికయను♦భార్యకుమహిమాను
భవులవిభువులఁదాఁ ♦ బడసెమువురఁ

ఆ. దనయ నొకతెఁ గాంచెఁ ♦ దదనంతరముననా
తరళనేత్రి సద్వ్రి♦తస్వధామ
పుణ్యశీల సుగుణ♦పూరితచారిత్ర
యఖిలలోకపూజ్య ♦ యాశిషాఖ్య. 503

వ. మఱియు ధాతకుఁ గల కుహూసినీవాలీ రాకానుమతు లనియెడు నలువురు భార్యలలోఁ గుహూదేవి సాయ మనుసుతునుం గాంచె సినీవాలి దర్శాఖ్యునిం బడసె రాక ప్రాతిరాఖ్యునిఁ గాంచె ననుమతి పూర్ణిమాఖ్యునిఁ గనె విధాత క్రియయను భార్యయందు నగ్నిపురీష్యాదులం గనియె వరుణునకుఁ జర్షి యనుభార్యయందుఁ బూర్వకాలంబున బ్రహ్మపుత్రుం డయిన భృగువును వల్మీకంబునం జనియించినవాల్మీకియు నుదయించిరి మిత్రావరుణులకు నూర్వసియందు రేత ఉద్గమంబైనదానిఁ గుంభంబునం బ్రవేశింపం జేయ నందు నగస్త్యుండును వసిష్ఠుండును జనియించిరి ప్రత్యేకంబ మిత్రునకు రేవతియందు నుత్సర్గసంభవులైనయరిష్టయుఁ బిప్పలుండును ననువారలు జనియించిరి శక్రునకుఁ బౌలోమియందు జయం

తఋషభ విదుషు లన ముగ్గురు పుట్టిరి వామనుం డయిన యురుక్ర
మదేవునకుఁ గీర్తియనుభార్యయందు బృహచ్ఛ్లోకుండు పుట్టె. నా
బృహచ్ఛ్లోకునకు సౌభగాదులు పుట్టిరి మఱియు మహానుభావుం
డయినకశ్యపప్రజాపతికి నదితియందు శ్రీమన్నారాయణుం డవ
తరించినప్రకారంబు వెనుక వివరించెద దితిసుతు లైన దైతేయుల
వంశంబు సెప్పెద నేదైతేయవంశంబునం దైనను బ్రహ్లాదబలులు
పరమభాగవతులై దైత్యదానవవందితులై వెలసిరి దితికొడుకులు
హిరణ్యకశిపుహిరణ్యాక్షు లనఁ బ్రసిద్ధిఁ బొంది రందు హిరణ్యకశి
పునకు జంభాసురతనయ యైనదత్తికిఁ బ్రహ్లాదానుహ్లాదసంహ్లాద
హ్లాదు లను నలుగురు గొడుకులును సింహిక యను కన్యకయు జ
న్మించిరాసింహికకు రాహువు జనియించె నా రాహువు నమృత
పానంబు సేయ హరి దనచక్రంబున ద్రుంచె సంహ్లాదునకు గతి
యనుభార్యయందుఁ బంచజనుండు పుట్టె హ్లాదునకు ధమని యను
భార్యయందుఁ వాతాపీల్వలులు పుట్టిరి వారల నగస్త్యుండు భక్షిం
చె ననుహ్లాదునకు సూర్మి యనుభార్యయందు బాష్కలమహిషులు
గలిగిరి ప్రహ్లాదునకు దేవి యనుభార్యయందు విరోచనుండు పుట్టె
నతనికి బలి జన్మించె నా బలికి నశన యనుభార్యయందు బాణుండు
జ్యేష్ఠుండుగా నూర్వురుగొడుకులు పుట్టి రాబలిప్రభావంబు వెనుక
వివరించెద బాణాసురుండు పరమేశ్వరు నారాధించి ప్రమథగణం
బులకు ముఖ్యుండయ్యె మఱియు నాదితి సంతానంబువలన నేకోన
పంచదశకంబు లుదయించె వారలందఱు ననపత్యులై యింద్రు
తోఁ గూడి దేవత్వంబు నొందిరి యనిన విని పరీక్షిన్నరేంద్రుండు శుక
యోగీంద్రున కిట్లనియె. 504

ఆ. ఏమికారణమున ♦ నింద్రునిఁ బెని మరు
చ్చయము లాప్తు లగుచు ♦ శాంతి నొంది
రరయఁ దత్సమాను ♦ లగుచు వర్తించిరి
దీని వినఁగ వలయుఁ ♦ దెలుప వయ్య. 505

వ. అనిన శుకుం డిట్లనియె. 506

సీ. నరనాథ విను తన ♦ నందను లందఱు
నమరేంద్రుచే హతు♦లగుచు నుండఁ
గోపశోకంబులఁ ♦ గ్రుళ్లుచుఁ దనలోన
మండుచు దితి సాల ♦ మఱుఁగఁ దొడఁగె
భ్రాతృహంతకుఁ డతి ♦ పాతకుం డీ యింద్రుఁ
జంపక నా కేల ♦ సొంపు గలుగు
వీని భస్మము సేయు♦వానిఁగా నొకసుతుఁ
బడసెద నని చాల ♦ భర్తఁ గోరి
ఆ. ప్రియము సేయఁ దొడఁగెఁ ♦ బెక్కు భావంబుల
భాషణముల నధిక ♦ పోషణముల
భక్తి యుక్తిచేతఁ ♦ బరిచర్యగతిచేత
నుతులచేత నతుల ♦ రతులచేత. 507
చ. కలికికటాక్షవీక్షణ వి♦కారములన్ 1హృదయానురాగసం
కలిత విశేష వాఙ్మధుర ♦ గర్జనలన్ 2లలితాననేందుమం
డల పరిశోభితామృత. వి♦డంబితసస్మిత సుప్రసన్నతా
ఫలరుచిరప్రధానముల ♦ భామిని భర్తమనంబు లోఁగొనెన్. 508
తే. అఖిల మెఱిఁగిన కశ్యపు ♦ నంతవాని
హితవు తలకెక్క రతుల సం♦గతులచేత
నవశుఁ గావించె 3ప్రేల్మిడి ♦ నబ్జవదన
పతుల భ్రమియింప నేరని ♦ సతులు గలరె. 509
క. ఏతలఁ పెఱుఁగక నిలిచెడు
భూతంబులఁ జూచి యాత్మ ♦ పురుషుల మనముల్
భీతి గొలుపంగ యువతి
వ్రాతంబు సృజించెఁ బతులు ♦ వారల కరుదే. 510

1 హృదయ ... గర్జనలన్ = డెందమునందలి ప్రేముడితోఁ గూడిన యొప్పిదములగు పలుకులచే తతితీపులయిన జంకెనల చేత.

2 లలిత ...... ప్రధానములన్ = అందమగు మోముచందురునియందు అంద గించుచు నమృతము ననుకరించు చిర్నగవుగల ప్రసన్నత్వముచే కలిగిన ఫలములచే చెలువొందు ప్రధానకృత్యములచేత. 3 ప్రేల్మిడి = చిటిక.

వ. ఇట్లు నిజసతిచేత నుపలాలితుండై కశ్యపప్రజాపతి యాసతికిం బరమ ప్రీతుండై యిట్లనియె నో తన్వీ నీకుఁ బ్రసన్నుండ నైతి వరంబు గోరు మిచ్చెద నాథుండు ప్రసన్నుండైన స్త్రీలకుం గోరిక సంభవించుట కేమి గొఱంత సతికిం బతియె దైవంబు సర్వభూతంబుల మానసంబులకు వాసుదేవుండె భర్త నామరూపకల్పితుండైన సకల దేవతామూర్తులచేతను ఋషులచేతను భర్తృరూపధరుం డయిన భగవంతుండు సేవింపంబడుచుండు స్త్రీలచేతఁ బతిరూపంబున భజియింపంబడుఁ గావునం బతివ్రత లైన సుందరులు శ్రేయస్కామ లై యేకచిత్తంబున నాత్మేశ్వరుం డయిన యప్పరమేశ్వరుని భర్తృభావంబున సేవించుచుండుదు రేనును నీదుభావంబున వరదుండ నైతి దుశ్శీలలయిన వనితలకుం బొందరాని వరంబు నీ కిచ్చెద వేఁడు మనిన నాకశ్యపునకు దితి యిట్లనియె. 511

ఆ. వరము గోర నాకు ♦ వరదుండ వేనిని
నింద్రుఁ ద్రుంచునట్టి ♦ యుద్ధబలుని
నమిత తేజుఁ దనయు ♦ నమరత్వసంప్రాప్తు
నెందుఁ జెడనివాని ♦ నిమ్ము నాథ. 512

వ. అనవుడు. 513

క. ఉట్టిపడునట్టి వరమిం, కెట్టేఁడి న న్నిట్లు వేఁడెఁ♦గటకట యనుచు౯
మిట్టిపడియతఁడుమదిలోఁ,బుట్టినతల్లడముతోడఁ♦బొక్కుచునుండెన్.

చ. ప్రకృతిని గర్మపాశముల బద్ధుఁడ నైతిఁ గదయ్య నేఁడు నే
వికటనదీస్వభావమున ♦ వేఁదుఱు గొల్పినమాయ నింద్రియా
ధికమతియైనవాఁడు దన ♦ తెంపునఁ జిత్తము వెచ్చపెట్టి పా
తకములఁ గూలకున్నె నను ♦ దైవము నవ్వదె లోలితాత్మునిన్.

సీ. ఖండశర్కరతోడఁ ♦ గలహించు పలుకులుఁ
బద్మవిలాస మే♦ర్పఱచు మోముఁ
మహినాంశుకళలతోఁ ♦ మలఁదూఁగు చెయ్వులుఁ
జెమటఁ గ్రొన్నెత్తురు♦సేయుమేను

నిలువెల్లఁ గరఁగించు ♦ నేర్పులయింపులుఁ
బువ్వుల కరువైన ♦ ప్రోదిసేఁత
తమకంబు రెట్టించు♦తరితీపులతఁపులు
నెనసిన మదిలోని ♦ యిచ్చగింత

ఆ. గలిగి కఱవ నున్న ♦ కాలాహిపోలికిఁ
జెలఁగుచున్న సతుల ♦ చిత్తవృత్తిఁ
దెలియ వశమె యెంత♦ధృతి గలవారికి
నాక కాదు నిఖల ♦ లోకములకు. 516

ఆ. కోరి సతుల కెల్లఁ ♦ గూర్చువా రెవ్వరు
పతుల నైన సతుల ♦ హితుల నైన
బలిమిఁ జెలిమి నైనఁ ♦ బరహస్తమున నైన
హింస పఱతు రాత్మ♦హితముకొఱకు. 517

వ. అని చింతించి దీనికి నేమని ప్రతివాక్యం బిచ్చువాఁడ మద్వచనం బెందు నమోఘంబు త్రిలోకపరిపాలనశీలుం డయిన భిదురపాణి వధార్హుండె యేను దీనికి నైనది యొకటి గల్పించెద నని దితిం జూచి యోతనుమధ్య నీకు నట్లు దేవబాంధవుండయిన యింద్ర హంతయగు పుత్రుండు గలిగెడు నొక్కసంవత్సరంబు వ్రతంబునం జరియింపుము దాని ప్రకారంబెల్ల నేను జెప్పెద విను మెల్లజీవుల వలన హింసాభావంబు లేక యతిధ్వనివాక్యంబు లుడిగి కోపంబు మాని యనృతంబులు వలుకక నఖరోమచ్ఛేదనంబు సేయక యస్థికపాలాదు లయిన యమంగళంబుల నంటక నదీతటాకాదులన కాని ఘటోదకకూపోదకంబుల స్నానంబు సేయక దుర్జనసంభాష ణంబు వర్జించి కట్టినకోకను ముడిచిన పువ్వులను గ్రమ్మఱ ధరి యింపక భోజనంబులయందు నుచ్ఛిష్టాన్నంబును జండికానివేదితా న్నంబును గేశశునకమార్జారకంకక్రిమిపిపీలికాదివిదూషితాన్నంబు ను నామిషాన్నంబును వృషలాహితాన్నంబును నను నీపంచవిధనిషి ద్ధాన్నంబులు వర్జించి దోయిట నీళ్లు ద్రావక సంధ్యాకాలంబుల ముక్తకేశిగాక మితభాషిణి వై యలంకారవిహీనగాక వెలుపలం

దిరుగక పాదప్రక్షాళనంబు సేసికొని కాని శయనింపక యార్ద్ర పాదయై పవ్వళింపక పశ్చిమశిరస్క యయ్యును నగ్నయయ్యును సంధ్యాకాలంబుల నిద్రింపక నిత్యంబును ధౌతవస్త్రంబులు గట్టి శుచియై సర్వమంగళ సంయుక్తయై ప్రాతఃకాలంబున లక్ష్మీనారాయణుల నారాధించి యావాహనార్ఘ్యపాద్యోపస్పర్శన సుస్నాన వాసఉపవీతభూషణపుష్ప ధూపదీపోపహారాద్యుపచారంబుల నర్చించి హవిశ్శేషంబు ద్వాదశాహుతుల వేల్చి దండప్రణామంబు లాచరించి భగవన్మంత్రంబును [1]దశవారంబు లను సంధించి స్తోత్రంబు సేసి గంధపుష్పాక్షతంబుల ముత్తైదువలం బూజించి పతిని సేవించి పుత్రుం గుక్షిగతుంగా భావించి యివ్విధంబున మార్గశీర్ష శుద్ధ [2]ప్రతిపదారంభంబుగా నొక్క సంవత్సరంబు సలిపి యాద్వాదశమాసాంత్యదివసంబున విధ్యుక్తంబుగా నుద్యాపనంబు సేయవలయు నీవీ పుంసవనం బనియెడి వ్రతంబు ద్వాదశమాసపర్యంతం బేమఱక సల్పిన నీవు గోరినకుమారుండు గలిగెడు ననిన దితి యా వ్రతంబు తోడనె గర్భంబుధరియించి వ్రతంబు సలుపుచునుండ నింద్రుండు మాతృభిప్రాయం బెఱింగి యాయమ్మనహరహంబును రహస్యంబున సేవించుచు వ్రతంబునకుందగిన పుష్పఫలసమిత్కుశ పత్త్రాంకురంబులు మొదలయిన వస్తువితతిం ద్రికాలంబులం దెచ్చియిచ్చుచుం బుండరీకంబు హరిణికిం బొంచియున్నభంగి నాయమ్మ వ్రతభంగంబునకై కాచి శుశ్రూష సేయుచు నాయమ్మ ధరియించిన తేజో విశేషంబునకు బెగ్గలించుచుం గృశించుచునుండె నంత నొక్కనాఁడు.

సీ. వామాక్షి యనుదిన ♦ వ్రతధారణోన్నత
పరిచర్యవిధులచే ♦ బడలి యలసి
యొంటి సంధ్యావేళ ♦ నుచ్ఛిష్టయై పద
ప్రక్షాళనాదులఁ ♦ బాసి మఱచి
తనకర్మమోహంబు ♦ దవిలి నిద్రింపంగ
నింద్రుండు సయ్యన ♦ నెడరు గాంచి

---

1 దశవారంబులు = పదిమారులు. 2 ప్రతిపత్తు = పాడ్యమి.

యోగమాయా బలో ♦ ద్వ్యక్తుఁడై యాయింతి
యుదరంబుఁజొరఁబడి ♦ యుగ్రుఁడగుచుఁ

తే. దివిరి దేదీప్యమానమై ♦ తేజరిల్లు
నర్భకుని వజ్రధారల ♦ నడిచె నేడు
దునుకలుగ వాఁడు [1]దునిసియుఁ ♦ దునుక దునుక
చెడక యొక్కొక్క బాలుఁడై ♦ చెలఁగుచున్న

క. వారేడ్వరగుచుఁ గుయ్యిడ
నోరి యఱవకనుచు ద్రుంచె ♦ నొక్కొక్కని నా
శూరుం డేడ్గురఁ దునుకలు
గా రయమున వారు సెడక ♦ ఖండితులయ్యున్ 520

క. ఖండము లన్నియు నందఱుఁ
జండాంశు సమప్రకాశ ♦ శాశ్వతులగుచున్
మెండుకొని నిల్చియని రా
ఖండలునకుఁ గరుణపుట్టు ♦ గతి మతిదోఁపన్ 521

వ. అందఱు ముకుళితకరకమలులై నీకుం దోఁబుట్టువులము మమ్ము హింసింపం బనిలేదు. నీకుం బారిషదులమై మరుద్గణములమై నిన్ను సేవించెదము. మమ్ము రక్షింపుమనిన నారాయణప్రసాదంబునం జెడని మరుద్గణంబుల పలుకులకుం గృపాళుండై యింద్రుండు వారల సహోదరులంగాఁ గైకొని మఱి హింసింపక మానె నశ్వత్థామ శరాగ్నివలన నారాయణ రక్షితుండవయిన నీవునుంబోలెఁ గులిశధారలశకలంబులయిన కుమారుం డన్నిరూపంబులై సంవత్సరంబునకు నొక్కింత కడమగా హరిం బూజించినవారు గావున నింద్రుతోడంగూడఁ బంచాశద్దేవత లయిన మరుద్గణంబులు దితిగర్భంబు వెలువడి రంత దితి మేల్కాంచి యనలప్రకాశులై యింద్రుతోడంగూడి వెలుంగుచున్న కుమారులం జూచి సంతోషింపక యింద్రుం జూచి నీకు మృత్యురూపంబయిన పుత్రుంగోరి దుస్తరంబయిన వ్రతంబు నలిపితి సంకల్పించిన పుత్రుం డొక్కరుం

1 తునిసియు = ఖండితుఁడయ్యె.

డీ సప్తసంఖ్యగల కుమారులగుట కేమికతంబు నీ వెఱింగినభంగిన
తథ్యంబు వలుకు మనిన నింద్రుం డిట్లనియెఁ దల్లీ భగవద్వ్రతంబుఁ
జింతించి 1సమయవిచ్ఛేదనంబున గర్భంబుఁ జొచ్చి పాపచిత్తుండనై
వజ్రధారల గర్భంబు పదశకలంబు సేసిన నా శకలంబులు సెడక
మహాశ్చర్యంబుగా నివ్విధంబునం గుమారకులైరి మహాపురుష
పూజాసంసిద్ధి కార్యానుషంగి గాకుండునే భగవదారాధనంబు
గోరికలఁ బాపి యెవ్వరు గావింతురు వా రిహపరంబుల స్వార్థ
కుశలు లగుదు రమ్మహాపురుష ప్రసాదసముత్పన్న తేజంబు నడంప
నెవ్వండోపుఁ గావున దుర్మదంబున బాలిశస్వభావుండనై ద్రోహంబు
సేసిన నా దౌర్జన్యకర్మంబు సహింపఁ దగినన్న నెవ్వరు సమర్థులు
పాపాత్ముండ నగు నన్నుం గావుము నేను వీరల తోడివాఁడనని
నిష్కపటంబుగాఁ బ్రార్థించిన సద్దేవి యట్లగాక యని శాంతచిత్త
యయ్యె నింద్రుండును వారలంగూడి త్రిదివంబునకుం బోయి సోమ
పాన హవిర్భాగంబులు వారలకుం బంచిపెట్టి కూడి సుఖంబుండె
నని చెప్పి పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుండు వెండియు
నిట్లనియె. 522

క. హరివరదుఁడయిన వ్రతమునఁ
హరియంశజులగుచు నెగడు ♦ నమరుల జన్మ
స్ఫురణంబఁట పఠియించిన
నరయుఁగ నురుదీర్ఘపాప ♦ నారముగుటరు దే. 523

వ. అని విష్ణుకథాశ్రవణ కుతూహలాయమాన మానసులైన శౌన
కాది మహామునులకు సూతుండు సెప్పెనని శుకయోగీంద్రుండు
పరీక్షిన్నరేంద్రునకుఁ జెప్పెననుటయు. 524

క. రాజీవ రాజపూజ్య, శ్రీజితగోపీకటాక్ష ♦ సేవాంతర వి
భ్రాజితమూర్తిమదోద్ధత, రాజకులోత్సాహ రామ ♦ రాజాఖ్యనిధీ.

తరలము. మురవిదారణ ముఖ్యకారణ ♦ మూలతత్త్వ విచారణా
దురితతారణ దుఃఖవారణ ♦ దుర్మదాసురమారణా

1 సమయవిచ్ఛేదనము = ప్రతిజ్ఞాభంగము.

గిరివిషహరణా కీర్తిపూరణా ♦ కీర్తనీయ మహాకరణా
ధరణీధారణ ధర్మతారణా ♦ తాపసస్తుతిపారణా

తోటకము. కరుణాకర శ్రీకర ♦ కంబుకరా, [1]శరణాగతసంగత ♦ జాడ్యహరా
పరిరక్షిత శిక్షిత ♦ భక్తమురా, కరిరాజ శుభప్రద ♦ కాంతిధరా.

గద్యము. ఇది శ్రీసకలసుకవిజనమిత్ర శ్రీవత్సగోత్రపవిత్ర కసువయామాత్యపుత్ర బుధజనప్రసంగానుషంగ సింగయనామధేయప్రణీతంబైన శ్రీమహాభాగవతపురాణంబునందు నజామిళోపాఖ్యానంబును బ్రచేతసులఁ జంద్రుఁడామంత్రణంబు సేయుటయు దక్షోత్పత్తియుఁ బ్రజాసర్గంబును దక్షుండు శ్రీహరిం గూర్చి తపంబు సేయుటయు నతనికి నప్పరమేశ్వరుండు ప్రత్యక్షం బగుటయు హర్యశ్వశబళాశ్వుల జన్మంబును వారలకు నారదుండు బోధించుటయు నారదువచనప్రకారంబున వారు మోక్షంబునొందుటయుఁ దద్వృత్తాంతంబు నారదు వలన విని దక్షుండు దుఃఖాక్రాంతుం డగుటయుఁ దదనంతరంబ బ్రహ్మవరంబున దక్షుండు శబళాశ్వసంజ్ఞుల సహస్రసంఖ్యాకులగు పుత్రులం గాంచుటయును సృష్టినిర్మాణేచ్ఛానిమిత్తంబున దక్షుపంపున వారలగ్రజన్ములు సిద్ధిం బొందినతీర్థరాజంబైన నారాయణసరస్సునకుం జనుటయు వారికి నారదభగవంతుండు బ్రహ్మజ్ఞానంబు నుపదేశించుటయు వారు పూర్వజులేఁగినప్రకారంబున మోక్షంబు నొందుటయుఁ దద్వృత్తాంతంబును దక్షుండు దివ్యజ్ఞానంబున నెఱింగి నారదోపదిష్టం బని తెలిసి నారదుని శపించుటయు నారదుండు దక్షుశాపంబు ప్రతిగ్రహించుటయు దక్షునకు మరల బ్రహ్మవరంబున సృష్టివిస్తారంబుకొఱకుఁ గూఁతు లఱువండ్రు జనియించుటయు నందుఁ గశ్యపునకు నిచ్చినపదుమువ్వురవలన సకలలోకంబులు నిండుటయు దేవాసురనరతిర్యఙ్మృగ ఖగాదులజన్మంబులును దేవేంద్రతిరస్కారంబున బృహస్పతియధ్యాత్మమాయచేతం గానరాకుండుటయుఁ దద్వృత్తాంతంబు రాక్షసులు విని శుక్రోపదిష్టులై దేవతలపై నెత్తివచ్చుటయు దేవాసురయుద్ధంబును నాచార్యతిరస్కా

1 శరణు...హరా=శరణమును పొందినవారియందున్న యజ్ఞానమును పోగొట్టువాఁడా.

రంబున దివిజరాజపలాయనంబును బలారిగురుమానమును దెలిసి దేవతలు బ్రహ్మసన్నిధికిం జనుటయును బ్రహ్మసాంత్వనంబునఁ ద్వష్టృకుమారుండయిన విశ్వరూపు నాచార్యునిఁగా దేవతలు వరించుటయును విశ్వరూపుప్రసాదంబున నింద్రుండు నారాయణాఖ్యం బగు మంత్రకవచంబు ధరియించి రాక్షసుల జయించుటయుఁ బరోక్షంబున రాక్షసులకు ననుకూలుండగుచున్న విశ్వరూపు నింద్రుండు వధియించుటయు విశ్వరూపువధానంతరంబున నింద్రునకు బ్రహ్మహత్య సంప్రాప్తం బయిన నింద్రుండు స్త్రీభూజలద్రుమంబులయందుఁ బంచి పెట్టుటయు విశ్వరూపుండు హతుండగుటకుఁ ద్వష్ట కోపించి యింద్రవధార్థంబు మారణహోమంబు సేయ వృత్రాసురుండు జనించుటయు వృత్రాసురుని యుద్ధంబునకు భయపడి యింద్రసహితు లయిన దేవతలు శ్వేతద్వీపంబునకుం జనుటయు నందు శ్రీహరి ప్రసన్నుండయి దధీచివలన భిదురంబు గైకొను నుపదేశించుటయు నింద్రుండు వజ్రాయుధంబున వృత్రాసురుని సంహరించుటయు నింద్రుండు బ్రహ్మహత్యాపీడితుండయి మానససరస్సు ప్రవేశించుటయును నహుషుండు శతాశ్వమేధంబులం జేసి యింద్రాధిపత్యంబు వడయుటయు నహుషుండగస్త్యశాపంబున సురరాజ్యచ్యుతుండై యజగరయోనిం బుట్టుటయు నింద్రాగమనంబును నశ్వమేధంబును నింద్రుండు మరలఁ ద్రిలోకాధిపత్యంబు వడయుటయును జిత్రకేతూపాఖ్యానంబును మరుద్గణంబుల జన్మప్రకారంబును నను కథలుం గల షష్ఠస్కంధము. 528

సంపూర్ణము.

ఓం తత్సద్బ్రహ్మార్పణమస్తు.

రామకృష్ణ ప్రింటింగు వర్క్సు, తెనాలి.